# వరదాన్

ప్రేమచంద్

జనతా బుక్ హౌస్
విజయవాడ.

# వరదాన్



మాతృక:

ప్రేమచంద్

అనుసరణ:

అల్లిన్.
సాహిత్యరత్న. బి. ఏ.



జనత బుక్ హౌస్
బకింగ్‌హామ్‌పేట P. O. విజయవాడ.

వత్సరాలయింది. నీపాద - పద్మములపై శిరస్సునుంచని మంగళవార మొక్కటీలేదు. నీ చరణార విందములను స్మరించని నిమిషంలేదు. నువ్వు జగన్మాతవు; విశ్వతారిణివి, మహాదేవివి. ఇంత సేవచేసినా నా మనోరథం నేటివరకు నెరవేరలేదు. నీవేదిక్కు. నీవుతప్ప అన్యశరణ్యంలేదు. నిన్నువదలి ఇంకెవ్వరిని ఆశ్రయించను?

"జగజ్జననీ! వందలనోములు నోచా. అసంఖ్యాక వ్రతాలు ఆచరించా. ఎందరో దేవతల్ని పూజించా. పుణ్యతీర్థములన్నీ దర్శించా. కాని మనోభిలాష ఫలించలేదు. చివరకు నీ చరణసన్నిధి శరణుజొచ్చా. ఇప్పుడిక నువ్వుతప్ప ఇంకెవ్వరుదిక్కు నాకు? నువ్వు సదా నీభక్తులకోర్కెలు తీర్చావు. నీ దర్బారులో నామొర ఆలకించబడదా? నిరాశతో తిరిగి పోమంటావా?

ఈ విధంగా చాలాసేపు విన్న పాలూ, ప్రార్థనలూ చేస్తూనిల్చుంది సుహాసు. స్పృహలేకుండా చేసే అనురాగమయ భావమొకటి హఠాత్తుగా మనస్సులో ప్రవేశించింది. కళ్లు మూతబడ్డాయి. చెవుల్లో శబ్దమొకటి ప్రతిధ్వనించింది.

"సుహాసూ! నీ భక్తికి మెచ్చుకున్నా. అడుగు, ఏం కావాలో అడుగు."

సుహాసు ఒళ్ళు జలదరించింది. రోమములు గగుర్పొడిచాయి. గుండెలు దడదడ కొట్టుకోసాగాయి. ఇరవై ఏళ్ల ఘోరతపస్సు అనంతరం నేడు మహాదేవి ప్రత్యక్షమయింది"

నేనేంకోరితే అది ప్రసాదిస్తావా మహాదేవి? అని ప్రశ్నించింది.

ఔను తప్పక ప్రసాదిస్తా.

గొప్ప తపమాచరించా. అందువల్ల వరం కూడా గొప్పదే అడుగుతా.

ఏం అడుగుతావు? కుబేరుని ఐశ్వర్యమా?

కాదు.

ఇంద్రుని ప్రతాపమా?

కాదు.

సరస్వతీదేవి పాండిత్యమా?

కాదు

మరి ఇంకేమిటి?

జగచ్ఛ్రేష్ఠవస్తువు

ఏమిటది?

సుగుణ సంపన్నుడైన పుత్రుడు.

వంశ యశోజ్యోతిని ప్రకాశింపచేసేవాడా?

కాదు.

తలిదండ్రులకు పరిచర్యలు చేసేవాడా?

కాదు.

సకల విద్యాపారంగతుడూ, శౌర్యప్రతాపుడూనా?

కాదు.

ఐతేమరి సుగుణసంపన్నుడైన పుత్రుడంటే ఎటువంటివాడు?

మాతృదేశ సేవాతత్పరుడు.

నీ బుద్ధికి మెచ్చుకున్నా. వెళ్ళు. నీ కోర్కె తప్పక ఫలిస్తుంది వెళ్లు.

# 2

మున్షీ శాలిగ్రాం కాశీవాస్తవ్యుడు. గొప్ప ధనవంతుడు. ప్లీడరువృత్తి తాతముత్తాతలు సంపాదించిన ఆస్తిబాగా ఉంది. దశాశ్వమేధ్‌ఘట్టం. (రేవు) ఒడ్డున ఆకాశాన్ని అంటుకునే గొప్పమేడ ఒకటిఉంది. గొప్ప ఉదారస్వభావుడు. విశాలహృదయుడూను. ఏడాదికి ఇరవై ఐదువేల రూపాయల ఆదాయం వస్తుంది. ఐనా ఖర్చుకు సరిపోదు. భక్తులు, సన్యాసులు, బ్రాహ్మణులపట్ల మంచిశ్రద్ధాభక్తులుగల మనిషి. సంపాదనంతా భక్తుల,సన్యాసుల సత్కారాలకు, బ్రాహ్మణ సంతర్పణలకే వ్యయమైపోతుంటుంది. పట్నంలోకిఅడుగుపెట్టిన ప్రతిభక్తుడూ, ప్రతిసన్యాసీ, మున్షీగారి అతిథిఅన్నమాటే. సంస్కృతభాషలో మంచి ప్రావీణ్యముంది. ప్రఖ్యాత విద్వాంస శిరోమణులుసైతం అతని పాండిత్యాన్ని అంగీకరించితీరేవాళ్ళు. వేదాంతశాస్త్ర అనుయాయి. చిత్తవృత్తి వైరాగ్యంవేపుకు మొగ్గుచూపుతుంటుంది.

పిల్లలంటే అమితప్రేమ. మున్షీగారికి సహజంగా పేటలోని బాలబాలికలంతా అతని ప్రేమ - తీర్థంలో అభిషిక్తులౌతుంటారు. గుమ్మందాటి వీధిలో కొస్తేచాలు, వెంట పిల్లల వానరసైన్యమొకటి సిద్ధమవుతుంది. ఒకరోజున ఎవ్వరో

ఒక రాత్రిగుండె తల్లి తనబిడ్డను పట్టుకుని చావచితక కొడుతోంది. పిల్లవాడు లబోలిబోమని కేకలుపెట్టి పెద్దగా ఏడుస్తున్నాడు. ఆ దృశ్యం చూడలేకపోయాడు మున్షీజీ. గబగబా పరుగెత్తుకెళ్ళి ఏడ్చేపిల్లవాణ్ణి చంకనెత్తుకున్నాడు. ఆవిడఎదుట తను తలవంచి నిల్చొన్నాడు. ముందెన్నడూ ఇక తన బిడ్డను దండించనని ఒట్టుపెట్టుకుంది ఆతల్లి. పరాయివాళ్ళ పిల్లలంటేనే ఇంత గాఢమైన ప్రేమవున్న వ్యక్తి. తన సొంత బిడ్డలంటే ఎంతప్రేమగా వుంటాడో అన్న విషయం వూహాతీతం. మున్షీజీకి కొడుకుపుట్టాడు. ఇక ప్రపంచం గొడవేలేదు. ప్రపంచవిషయమే మరచిపోయాడు. కొడుకుని ఉయ్యాల్లో పడుకోబెట్టి వూపుతూ కూర్చుంటాడు. ఆయన పడే సంబరానికి అంతువుండదు. ఇంకొకప్పుడు మంచి అందమైన షికారుబండిలో కూర్చోబెట్టి స్వయంగా తాను బండి లాగుతుంటాడు. ఒక్క క్షణంకూడ పిల్లవాణ్ణి వదిలివుండలేడు. సంతానప్రేమలో తన్ను తాను మరచిపోయాడు

పుత్రునికి ప్రతాపచంద్ర్ అని నామకరణ చేసింది తల్లి సువామ సార్థకనామం. పేరుకు తగిన గుణగణాలన్నీ ఉన్నాయి. గొప్ప మేధావంతుడు. మంచి అందగాడు. ముద్దులొలికే పలుకులు పలుకుతుంటే వినేవాళ్ళు ముగ్ధులైపోతుంటారు ధగధగలాడే భవ్యలలాటం. మంచి దేహదార్ఢ్యం గలవాడు. ఈ చిన్నవయస్సులోనే అతని ముఖమండలంలో గొప్ప తేజస్సు, గొప్ప ప్రతిభ గోచరిస్తున్నాయి. ఎవరికివాడెప్పుడైనా వచ్చి అకస్మాత్తుగా చూస్తే విస్మయంతో స్తంభించిపోతాం.

ఈ విధంగా ఆశలూ - పాశాలూ ఆరేళ్లు గడచి పోయాయి. సుఖ - సౌఖ్యాల రోజులైతే గాలిలా ఇట్టేఎగిరి పోతాయి. అసలెలాగడచాయో కూడ తెలియదు. ఇక దుఃఖ దారిద్ర్యాల రోజులంటారా, ఎంతగడిపినాగడవవు ప్రతాప్ పుట్టి అప్పుడే ఎన్నిరోజులయ్యాయేమిటి? అభినందనాలు, ధన్యవాదాలన్నీ ఇంకా చెవుల్లో ప్రతిధ్వనిస్తూనేవుంది. అప్పుడే ఆరోజు జన్మదినోత్సవం వచ్చింది. ఆరోపకు ఆఖరురోజులు కష్టాలను, కడగండ్లనుతోలిరోజులు. మున్షీగారి పుత్రప్రేమ-వాత్సల్యాలు బహిఃప్రదర్శనలు మాత్రమే. నిజంచెప్పాలంటే అతనికి సాంసారిక జీవితంపట్ల పెద్దగా అనురాగాభిమానాలు లేవు. నిష్కామ నిస్సంబంధ జీవితం. పైకిమాత్రం సామాన్య ప్రాపంచిక వ్యక్తులవలె సంసారబాధలతో బాధపడుతున్నట్లుగానూ, సుఖసౌఖ్యాలుచూచి సంతోషపడుతున్నట్లుగానూ పైకి కనబడుతుంటాడు. కాని కష్టపరంపరల తుఫానుల, సుఖసౌఖ్యాల మలయమారుతాల ప్రభావం రవ్వంతకూడ పడని బ్రహ్మానంద సుఖాన్ని చూరగొంటోంది అతని హృదయం.

మాఘమాసం. ప్రయాగలో కుంభఉత్సవాలు బ్రహ్మాండంగా జరుగుతున్నాయి. దూదిగోనెల్లా కిక్కిరిసి యాత్రికుల్ని ప్రయాగచేరవేస్తున్నాయి రైలుబళ్లు. ఎన్నోపల్లెనుండి కూర్చుంటే లేవలేని ముదుసళ్లు,ఎనభైఏళ్ళ ముదుసళ్లు కుంటుకుంటూ, కర్రపోట్లు పొడుచుకుంటూ, మజిలీలు మజిలీలుగా ప్రయాగచేరుకుంటున్నారు. ఎందరోమహాత్ములు, భిక్షులు, సన్యాసులు ఆ సమయంలో గంగా యమునా జల పవిత్ర తరంగాలలో మునిగి, తమ్ము పవిత్రం చేసుకోడానికి వేంచేసి

యున్నారు. మున్షీశాలిగ్రాంగారికి కూడా ప్రయాగ వెళ్ళాలని కోరిక కలిగింది, "రేపున్నానాలు ప్రయాగలో" అన్నాడు భార్యతో.

సువాసు :- పేటలో చూస్తామన్నా ఒక మనిషి లేడు అంతా వెళ్ళిపోయారు.

మున్షీ:- నువ్వేమో ఇల్లు కదలనంటావు. ఇద్దరమూ వెళ్ళితే ఎంత ఆనందంగా ఉంటుంది. ఇటువంటి ఉత్సవాలు ఎన్నడూ చూడలేదనుకుంటా.

సువాసు :- ఇటువంటి ఉత్సవాలంటే నా కమితభయం.

మున్షీ:- నా మనస్సేమో ఆగదు. పరమానందస్వాముల వారి శుభాగమనవార్త చెవినిబడింది. ఆ ఘడియనుంచి వారి నెప్పుడు దర్శిస్తానా అని మనస్సు ఆరాటపడుతోంది.

మొదట్లో ఐతే మున్షీగారి ప్రయాణానికి అంగీకరించలేదు సువాసు. కాని వద్దన్నా ప్రయోజనం లేదు కప్పుక త్పి తీర్తాడు. అని గ్రహించిన వెంటనే గత్యంతరంలేక సరేనని ఒప్పుకుంది ఆ రాత్రి పదకొండు గంటల బండికి ప్రయాణమయ్యాడు మున్షీ. తెల్లవారేటప్పటికి ప్రయాగ చేరుకున్నాడు. వెళ్ళబోయేముందు ప్రతాపుని ముఖాన్నింద మొకసారి ముద్దుపెట్టుకున్నాడు. భార్యను ప్రేమపూర్వకంగా ఆలింగనం చేసుకున్నాడు. ఆ సమయంలో అతని నేత్రాలు అశ్రుబిందువుల్ని జలజలరాల్చుతున్నాయి. అదిచూచింది సువాసు. గుండెలు గుభేలుమన్నాయి-చైత్రమాసంలో కాదు

మేఘాలు చూస్తే కృషీవలుని గుండెలు దడదడలాడిపోయిన విధంగా సుహాసు గుండెలు భర్త అశ్రుపూరిత నేత్రాలు చూచి దడదడలాడిపోతున్నాయి. ఆ అశ్రుధారలు అగాధ వైరాగ్య త్యాగసాగరాలు. చూపులకెంత చిన్న జలకణాలు! కాని ఎంత గంభీరంగా, ఎంత విస్తృతంగా వున్నాయో!

అటు ముంషీ గడపదాటి అవతలకి అడుగుపెట్టాడు. ఇటు సుహాసు 'అమ్మ' అని ఒక నిట్టూర్పు నిట్టూర్చింది. 'ఇక నీ భర్త దర్శనం దుర్లభం' అని ఎవ్వరో తన హృదయంలో ప్రవేశించి అంటున్నట్టుగా అనుభవమయింది. ఒక రోజు గడిచింది, రెండురోజులు గడిచాయి. మూడోరోజు గడచి నాలుగోరోజుకూడ వచ్చింది. వెళ్ళిపోయిందికూడ. ఇంతేదేనికి, చివరకు ఒకవారంకూడ గడచిపోయింది. కాని ముంషీజీ తిరిగి రాలేదు. అప్పుడిక వ్యాకులపడసాగింది సుహాసు. టెలిగ్రాములు ఇచ్చింది. మనుష్యుల్ని పంపింది. కాని ఎక్కడా అంతూపంతూ లేదు. ఈ ప్రయత్నాల్లోనే రెండోవారంకూడ గడచిపోయింది. ముంషీజీ తిరిగి వస్తాడన్న ఆశ అడుగంటిపోయింది. ముంషీజీ కనపడకుండా పోవడం తన ఒక్క కుటుంబానికేగాక సమస్తపట్టణానికే ఒక విషాద సంఘటన. ఎక్కడచూచినా, ఏమూలచూచినా — దుకాణాల్లో, సందుల్లో, గొందుల్లో — ఇదేచర్చ. ఈ విషాదవార్త విన్నవాడల్లా విచారపడుతున్నాడు. ధనవంతుడుగానీ, దరిద్రుడుగానీ ప్రతివాడూ 'అయ్యో! పాపం' అనేవాడే. అందరికీ విచారంగానేవుంది. అతనుంటే నలువేపులా సందడిగావుంటూ ఉండేది. ఇప్పుడెక్కడ చూచినా నిరుత్సాహమే కొండ

పిస్తోంది. పిల్లల రాగాదండొకటి వెంటబెట్టుకొని వెళ్లుతుండే సాగేగొంతుల్లో ఇప్పుడు దుమ్ముమాత్రమే ఎగురుతోంది. అతని దగ్గర కెప్పుడు వెళ్తామాఅని పిల్లలు మారాం చేస్తుండేవాళ్ళు. ఆ వినోదసభ ముగిసిపోయిందని ఆ పసి బిడ్డల కేం తెలుసు. వాళ్ళ తల్లులు పైటకొంగులతో కన్నీళ్లు తుడుచుకుంటూ మొగాలను కప్పుకుని విలపించుతున్నారు. తమవాళ్ళే చనిపోయారన్నట్లుగా.

స్వామీజీ అంతర్ధానమై పోవడం సామాన్యంగా అంద రికీ విచారంగా నేఉంది. కాని అప్పులుపెట్టిన కోమట్లూ, షావు కార్లూ తాటికాయంత కన్నీటిబొట్లు కారుస్తున్నారు. కాదు, నెత్తుటిబొట్లులే కారుస్తున్నారు. పదిపన్నెండురోజులు ఏదో రకంగా ఓపికపట్టారు. తర్వాత ఒక్కొక్కడేవచ్చి అప్పుల ఖాతాలు ముందుపెట్టసాగారు. ఏదోఒక బ్రాహ్మణ సంత ర్పణ సందర్భంలో వెయ్యిరూపాయిల నేతిడబ్బాలు తెచ్చారు అందులో ఒకరాగిదమ్మిడీకూడ చెల్లించలేదు. ఇంకోచోట రెండువందల రూపాయల మైదాపిండివచ్చింది. మరో వర్తకని కొట్లో వేలరూపాయల ఖాతావుంది. దేవాలయం కట్టించే నిమిత్తం ఇంకో వ్యాపారిదగ్గర ఇరవై వేలు-అక్షరాలా ఇరవై వేలు అప్పుతెచ్చారు. అదీ చెల్లించకుండా అలాగేఉంది. అప్పులపరిస్థితి చూస్తే ఇలాఉంది. అటు తనకున్న ఆస్తిపాస్తు లేమో ఒక పెద్దమేడ, దానికి సంబంధించినసామానూ మినహా అంటే పెద్ద విలువచేసే సామాన్లేమీలేవు. ఇకపోతే భూమి ఉంది అదొక్కటేఉంది అమ్మితేనాల్గుడబ్బులొచ్చేది. ఋణం తీర్చడానికి మరోఉపాయ మేమీలేదు.

తలవంచుకుని చాపమీాద కూర్చుని ఉంది దిగాలుగా పాపం సుహాసు. తనకో య్యాగుర్రంమీాదకూర్చుని ముందు వాలో టకటకమనిపిస్తున్నాడు ప్రతాప్. ఇంతలో కులపురోహితుడు మోటేరామశాస్త్రి ఇంట్లో కడుగుపెట్టాడు ముసిముసిగా నవ్వుకుంటూ. అతని ప్రసన్నముఖంచూచి ఏమీాతోచక మనోవ్యధతో కుమిలిపోతున్న సుహాసు గభాలున లేచి నిలబడింది. ఏదైనా శుభవార్త తెచ్చాడేమోనన్న ఆశతో. కూర్చోమని పీటవేసింది. ఆశాపూర్ణ దృష్టితో శాస్త్రిగారి ముఖంకేసి రెప్పవాల్చకుండా చూస్తోంది. శాస్త్రిగారు చల్లగా చతికిలపడ్డారు నశ్యంపట్టిస్తూ. "వ్యాపారస్థుల ఖాతాపుస్తకాలు చూశారా?" అని ప్రశ్నించాడు.

ఔను, చూశాను.

మోటే :- తలమునిగే అంత లోతుగాఉంది. వెనకాముందు ఆలోచించ నేలేదనుకుంటూ మున్షీగారు. తనదగ్గర లెఖ్ఖ - పత్రం అంటూ ఏమీావ్రాసి వుంచుకోలేదు.

సుహాసు .- ఔను, చూస్తే తలమునిగే లోతుగానే వుంది. ఇంత డబ్బేమిటి? ఒక్కొక్క సంతర్పణకు ఖర్చుకావడమే?

మోటే :- కాలం ఎప్పుడూ ఒకటిగా వుంటుందా?

సుహాసు :- ఇప్పుడిక చేసేదేముంది? అన్నిటికీ ఆభగవంతుడే ఉన్నాడు.

మోటే :- ఔను నిజమే. అన్నిటికీ ఆసర్వేశ్వరుడే ఉన్నాడు. ఐనా నువ్వుకూడ ఏమన్నా ఆలోచించావా లేదా?

సువాము :- ఆ, ఆలోచించా. ఒకగ్రామంఅమ్మదలచుకొన్నా.

మోాటే :- రామ! రామ!! అదేంమాటలమ్మా? భూమి కాస్తా అమ్మకుకూర్చుంటే ఇంకా పరువు ప్రతిష్ఠలేమన్నా ఉంటాయా?

సువాము :- అది మినహా మరోవుపాయం మాత్రం ఏముంది?

మోాటే :- చాలు చాలు, ఇక వూరుకోవమ్మా! ఆ కొంచెం కాస్తాపోతే జీవించేమార్గ మింకేముంది?

సువాము :- ఆ భగవంతుడే దిక్కు. వాడే ఏదోఒక దరి జేరుస్తాడు. పుట్టించినవాడు పెట్టక చంపుతాడా?

మోాటే :- అలాగైతే ఇది చాలా విచారకరవిషయం. అలాంటి పరోపకార పురుషుని సంతానం చివరికీవిధంగా కష్టాలుపాలు కావడమా?

సువాము :- భగవంతునికిదే ఇష్టంకాబోలు. అలాంటప్పుడు ఎవ్వడేం చేయగలడు?

మోాటే :- సరేగాని కర్రవిరకుండ పాము చచ్చేవిధంగా నన్నొక ఉపాయం చెప్పమంటారా?

సువాము:-ఆఁ ఆఁ చెప్పండి. ఎంతో మేలుచేసినవాళ్లవు తారు.

మోాటే:-ఓం ప్రథమంగా చేయవలసిన పనేమంటే శిస్తు పూర్తిగా రద్దుచేయుమని కలెక్టరుగారి కొక అర్జీపెట్టుకో. ఇక బాకీలవిషయమంటావా, ఆ బరువుభారమంతా నా కప్ప

గించు. నాకు తోచినవిధంగా చేస్తా. దీనివల్ల ఎస్టేటువారి కేమీ ఎసరు రాకుండా పోతుంది.

సువాము:-తమరింత డబ్బు ఎక్కడనుంచి తెస్తారూ? అతెచ్చే ఉపాయమేమిటో కాస్త తెలియచెప్పండి ముందు.

మోహే:-మీకు డబ్బుకొరత లేమిటమ్మా? మున్షీగారి పేరు చెబితే రాతకోతలు లేకుండానే యాభైవేలు తేవడ మొక లెక్కలోని విషయంకాదు. నిజం చెప్పాలంటే డబ్బుసిద్ధంగా ఉంది. నీ నోటినుండి 'సరే - అలాగే' అన్నమాట రావడమే ఇక ఆలస్యం.

సువాము:-పట్నంలోని పెద్దమనుష్యులంతా కూడి చందాలు వేసుకుంటున్నారా ఏమిటి?

మోహే:-ఔనౌను. చిటికవేసినంత సేపటిలో డబ్బంతా వసూలై పోయింది. దొరగారి కనుసంజ్ఞ చేయడమే తడవుగా పనంతా జరిగిపోయింది.

సువాము:-శిస్తు రద్దుకోసం నాచేత అర్జీ పెట్టించనూవద్దు; నా భర్తగారి పేరుమీద అప్పులూ, చందాలూవద్దు. గ్రామాలమీద వచ్చేరాబడితోనే అందరి బాకీలూ దమ్మిడీలతోసహా చెల్లిస్తా.

ఇలాఅని ముఖం త్రిప్పుకుంది కోపంగా సువాము. ఆ శోకాన్వితవదన మండలంలో క్రోధాభాసం స్పష్టంగా కనపడు తోంది. వ్యవహారం శ్రుతిమించి రాగాన పడిందని గ్రహించాడు పురోహితుడు. వెంటనే సంబాళించుకుని - 'సరే మీ

యిష్టం ప్రకారమే కానీయండి. ఇందులో బలవంతమేమీ లేదు. కాని మీకేమైనా కష్టాలు కలిగితేమాత్రం ఆ రోజు ప్రళయంగా వుంటుంది. ఇదొక్కటిమాత్రం గుర్తుంచుకోండి. ఇంతకన్న నే చెప్పేదేమీ లేదు." అన్నాడు.

సుబ్బమ్మ:—ఐతే మరి నా భర్త పేరుమీద లోకుల కృతజ్ఞతా భారం నెత్తినవేసుకుని నన్ను మోయమనే మీ అభిప్రాయమా? కూడదూ — నీళ్ళు దొరక్కపోతే ఈ కొంపలోనే మలమలమాడి చచ్చిపోనన్నాపోతా కానిఒకడిచేత ఉపకారం మాత్రం చేయించుకోను.

మోక్షే:—మీమీద కృతజ్ఞతాభారం వేసేవాడెవ్వడమ్మా? ఎంతమాట అన్నావంటే అప్పుతీసుకోవడంలో సిగ్గేముంది? ఒకటి రెండు లక్షలు ఋణంలేని భాగ్యవంతు డెవ్వడమ్మా?

సుబ్బమ్మ:—ఈరకమైన ఋణంలో కృతజ్ఞతలేదని నాకు నమ్మకంలేదు,

మోక్షే—సుబ్బమ్మా! అలా మాట్లాడుతా వేమిటి? నీ తెలివితేటలన్నీ ఎక్కడ బుగ్గయిపోయాయమ్మా? ఎన్నికష్టాలొచ్చినా భరిస్తానంటావా? ఈ పిల్లవాణ్ణి చూచైనా దయరావడంలా?

మోక్షేరామశాస్త్రులుగారి ఈ చివరివాక్యం ఆమెనెంతో కదలించివేసింది. వెంటనే కళ్ళు చెమ్మగిల్లాయి. కొడుకుకేసి కరుణాపూర్ణ దృష్టితో చూచింది. ఈ బిడ్డకోసం నను చేయని కఠోరవ్రతనియమా లేమున్నాయి? వీడినొసటన కష్టాల రాతే రాసిపెట్టివుందా?

"చాలా సేపు ఈ ఎడతెగని ఆలోచనల్లోనే మునిగి పోయింది సుహాసు. మోతీరామశాస్త్రిమో లోలోపల సంతోషపడుతున్నాడు. తన అమోఘ అస్త్రం వృధాపోలేదు కదా, కృతార్థుడనైతికదా అని ఉబ్బితబ్బిబ్బులౌతున్నాడు. ఇంతలో తల్లి 'లక్షలమందిని పోషించి, ఆదరించిన తండ్రిగర్భాన జన్మించిన పుత్రుడు పరాశ్రితుడు కాజాలడు. తండ్రిచేసిన పుణ్యం వృధాగాకుండ ఫలించితే అతని కొడుకూ పదిమందికి పెట్టగలవాడవుతాడు అంది.' (కొడుకుని పిలుస్తూ) నాన్నా! కొంచెం ఇలారా. రేపటినుంచి నీకు పాలూ-పెరుగులూ-మిఠాయిలూ ఏవీదొరకవు కాబోలు. ఏడ్వవుకదూ?" అంటూ పిల్లవాణ్ణిముద్దుగా ఒడిలోకి తీసుకుంది. వాడి గులాబి రంగు చెక్కిళ్ళపైని చెమట బిందువులు తుడిచి ముద్దు పెట్టుకుంది.

ప్రతాప్:- ఏంటిఅన్నావూ? రేపటినుండి మిఠాయిదొరకదా? ఏం? ఎందుకని? మిఠాయివాడి అంగడివట్టి పోయిందా?

సుహాసు:- మిఠాయిలేకేం? కానిడబ్బేది?

ప్రతాప్:- నేను పెద్దవాడినయ్యాక వాడికి కావలసినంతడబ్బిస్తాగా. చల్, చల్, చూడవేఅమ్మా. నా గుర్రం ఎంత వడిగా పరుగెత్తుతోందో చూడు.

సుహాసు కళ్ళల్లో మళ్ళీ ఒకసారి కన్నీళ్ళు గిర్రున క్రమ్ముకొచ్చాయి. "అయ్యో! దైవమా!! ఈ సౌందర్య సౌకుమార్యాలమూర్తి ఇప్పటినుండే దారిద్ర్యదేవతకు బలి అవుతాడా? కాదు, కాదు. అన్ని బాధలూ నేనే అనుభ

విస్తా. కాని నా ప్రియపుత్రునిపై విపదలనీడకూడ పడ నీయను. "ఇటు ఈ విధంగా ఆలోచిస్తోంది తల్లి. అటు తన పెంకి గుర్రంపై ఎక్కడానికి తనశక్తినంతా ధారవోస్తున్నాడు పుత్రుడు ప్రతాప్. పిల్లలు మనోచక్రవర్తులు.

సారాంశమేమంటే మోతీరామ్ ఏదో గొప్ప పన్నాగంతో వచ్చాడు. అనేక విధాలుగా వాక్చాతుర్యం ప్రదర్శించాడు. తెలివితేటలన్నీ ఉపయోగించాడు. కాని సువామ చీమతలకాయ దూరేఅంత సందైనా ఇవ్వలేదు. "కాదు" అని మళ్ళీ "ఔను" అనలేదు. ఆవిడ ఈ ఆత్మాభిమానం వార్త విన్నవాడల్లా "భళీభళీ" అన్నాడు. ప్రజల హృదయాల్లో ఆమెపట్ల గౌరవం ఇనుమడించింది. ఒక ఉదారహృదయుని భార్య, ఒక పరమసంతోషి భార్య చేయతగినపనే సువామా చేసింది.

తర్వాత పదిహేనురోజులకు ఎస్టేటు వేలంపెట్టబడింది. యాభై వేలు వచ్చాయి. ఋణమంతా దమ్మిడీలతో సహా చెల్లించబడింది. ఇంట్లో అనావశ్యక సామాన్లన్నీ అమ్మి వేయబడ్డాయి. మధ్యలో గోడలుపెట్టించి ఇల్లూ రెండు భాగాలుగా చేయబడింది. ఒకభాగంలో తానుంటూ రెండో భాగం అద్దెకిచ్చింది.

## 3

మున్షీసంజీవనలాల్ మంచిగుణవంతుడు, సహృదయుడూను. సువామగారింట్లో అద్దెకుంటున్నాడు. మొదట్లో చాలా

గొప్పఉద్యోగంలో వున్నాడు. కాని స్వతంత్రభావాల కారణంగా ఆఫీసర్ల అడుగులకు మడుగులొత్తలేకపోయాడు. అంతే కాదు, వాళ్ళ అసూయా ధూమాలు, వాళ్ళ కన్నెర్రలు, సహించలేక ఉద్యోగానికి తిలోదకాలిచ్చాడు. ఉద్యోగకాలంలో కొద్దిగా ఆర్జించాడు. ఆ కొద్దిపాటి పెట్టుబడితో ఉద్యోగంలో నుండి విరమించుకోగానే కంట్రాక్టు పనుల్లోకి దిగాడు. కొద్ది కాలంలోనే తన పరిశ్రమమూలంగా బాగా గడించాడు. ఇప్పుడు నెలకు నాలుగైదువందలకు తక్కువలేకుండ రాబడి వస్తోంది. మంచి అనుభవమూ సంపాదించాడు. అసాధారణమైన తెలివితేటలుగలవాడు. దేనిలో వేలుపెడితే అది బంగారం అవుతోంది. అసఫలత అనేదెలావుంటుందో తెలియని వ్యక్తి.

ముంషీసంజీవనలాల్ పెద్దకుటుంబీకుడు. ఈశ్వరుని కటాక్షంవల్ల ఇంటినిండాసంతానంఉండేది. ఐనా ఇప్పుడు తలిదండ్రులకు గారాబుపట్టి ఒక కన్యారత్నం మాత్రమే. ఆ కన్యకు వ్రజరాణి అని పేరుపెట్టుకున్నారు. ఆ పిల్లయే వాళ్ళకు ప్రాణాధారం.

ఇంట్లోకి ప్రవేశించిన రోజునే ప్రతాప్ - వ్రజరాణీల మధ్య స్నేహం ఏర్పడింది. ఒక్క అరగంటలో పక్షుల జోడులా కలకలమని ఆడుకోసాగారు. తన ఆటబొమ్మలూ, ఆటవస్తువులూ, బూరలూ తెచ్చి చూపించింది. వ్రజరాణి. తన పుస్తకాలూ, కలాలూ, బలపాలూ తెచ్చి చూపించాడు ప్రతాప్. వ్రజరాణి తల్లి సుశీల ప్రతాపుని ఎత్తుకుని ముద్దాడింది. ఆ రోజులగాయితు వాడూ నిత్యం సాయంకాలం వాళ్ళ ఇంటకొస్తున్నాడు. ఇద్దరూ జతగా ఆడు

కుతే వాళ్ళు. అన్న చెల్లెలులా కనపడేవాళ్ళు. వాళ్ళిద్దర్నీ ఎత్తుకొని ముద్దుపెట్టుకుండేది సుశీల. వాళ్ళకేసి రెప్ప వాల్చకుండ గంటలతరబడి చూసేది. విరజనూ ప్రతాప్ ఇంటికి వెళ్తుండేది. ఆ పిల్లను చూస్తే సువామకు తన కష్టాలు మరపుకొస్తుండేవి. రొమ్మున హత్తుకుని ముద్దుల వర్షం కురిపించేది. దాని ముద్దులొలికే చిలుక పలుకులువిని ఆనందంగా కాలం వెళ్ళబుచ్చేది.

ఒకరోజున సంజీవన్‌లాల్ ఎక్కడికో వెళ్ళి వచ్చాడు. గదిలో కెళ్ళి చూస్తే ప్రతాప్ - విరజను లిద్దరూ కుర్చీలపై కూర్చున్నారు ప్రతాప్ ఏదో పుస్తకం చదువుతున్నాడు. విరజన్ చెవులు నిక్కపొడుచుకుని ఎంతో ధ్యానపూర్వకంగా వింటోంది. మున్షీగార్ని చూడగానే ఉభయులూ లేచి నిల్చొన్నారు. విరజన్ పరుగున వెళ్ళి నాన్న చంక నెక్కికూర్చుంది ప్రతాప్ తలకాయ వంచుకుని నిల్చొన్నాడు. ఎంత బుద్ధిమంతుడైన పిల్లవాడు! సరిగ్గా ఇంకా ఎనిమిదేళ్ళన్నా వెళ్ళలేదు. కాని లక్షణాలు చూస్తే భవిష్యత్తులో గొప్ప ప్రతిభాశాలి అవుతాడని స్పష్టంగా బోధపడుతోంది. సుందర ముఖమండలం. ఉల్లిపొరలవంటి పల్చని ఎర్రని పెదవులు. జ్యోతులవంటి నేత్రాలు తుమ్మెదలను బోలిన నల్లని కేశములు. ఆపైన పరిశుభ్రమైన దుస్తులు. "ఇలా రా బాబు ప్రతాప్ ఇలారా!" అని పిలిచాడు ముద్దుగా మున్షీజీ.

సంకోచిస్తూ సంకోచిస్తూ నెమ్మదిగా దగ్గరకొచ్చాడు ప్రతాప్. పితృవత్ ప్రేమతో చంక నెత్తుకున్నాడు మున్షీజీ.

"నేనువచ్చినప్పుడు నువ్వు చదువుతున్న పుస్తకమేమిటి బాబూ ?" అని ప్రశ్నించాడు.

ఏదో చెప్పబోతున్నాడు ప్రతాప్. ఇంతలో విరజన్ "నాన్నా! బలే బలే కథలు చదివాడు. ఏం నాన్నా! మొదట పక్షులుకూడ మన మాదిరిగా మాట్లాడేవేనా?" అంది.

"ఔనమ్మా! మాట్లాడేవే." అన్నాడు మున్షీ చిరు మోముతో.

వాళ్ళసంభాషణలు సాగుతుండగనే ప్రతాప్ అందుకుని కాదు విరజన్! నీకు మాయమాటలు చెబుతున్నారు. పక్షులు మాట్లాడవు. ఇవన్నీ కల్పించిరాసిన కథలే" అన్నాడు. ఈ జంకుగొంకులేని మాటలువిని పకపకా నవ్వాడు మున్షీజీ.

ఇప్పుడిక రామచిలుకలా కేరింతలుకొడుతూ కబుర్లు దంచసాగాడు ప్రతాప్. "మా బడి ఎంతపెద్ద దనుకున్నావు. పట్నంలో వాళ్ళంతావచ్చినా కూర్చోవచ్చు. తాటిచెట్టంత గోడలున్నాయి. బలదేవప్రసాద్ బంతిని తన్నితే చుక్కలంటు కొచ్చింది. హెడ్మాష్టరుగారి డ్రాయరుమీంద మంచి ఉన్ని బట్టొకటి పరచివుంటుంది. దానిమీద గ్లాసులనిండా పువ్వులు పెట్టి ఉంచుతారు. గంగానదినీళ్ళు నీలంరంగుగా వుంటాయి. ఎంత వడిగా పరుగెత్తుతాయో తెలుసా. మధ్యలో పెద్ద పెద్దకొండలు అడ్డంవచ్చినాసరే కొట్టుకుపోవాల్సిందే. అక్కడొక స్వాములవారున్నాడు. రైళ్ళు గప్‌గప్‌మంటూ పరుగులు తీస్తుంటాయి. దీని ఇంజన్ భగ్‌భగ్‌మని అంటుంది.

ఇంజనులో ఆవిరి వుంటుంది. దాని ఒత్తిడివల్ల బండి పరుగెత్తుతుంది. బండితో పాటు చెట్లూ చేమలూ కూడ పరుగెత్తుతున్నట్టు కనపడతాయి.

ఈ రకమైన మాటలెన్నో ముచ్చటగా, ముద్దుగా చెప్పాడు ప్రతాప్. నిశ్శబ్దంగా నిల్చొనివింటోంది విరజన్. రెండుమూడుసార్లు తానూ రైలుబండి ఎక్కి వూరికెళ్ళింది. కాని రైలుబండి నెవ్వరుచేశారు? అదెలానడుస్తుంది? అన్న సంగతి నేటివరకు తెలియదు. రెండుసార్లు అడిగిచూచింది మాష్టరుగార్ని. కాని ఆ గురువుగారు "బిడ్డా! ఈశ్వరుని మహిమ" అని మాత్రమే చెప్పి వూరుకున్నాడు. 'ఈశ్వరుని మహిమ అనేదేదో ఒక పెద్దగుర్రం కాబోలు, మంచిబలంగా కూడ వుండొచ్చు. లేకపోతే ఇన్ని పెట్టెల్ని చరచరమని ఎలా లాక్కుపోగలదు? అని అర్థంచేసుకుంది విరజన్. ప్రతాప్ చెప్పడం చాలించగానే నాన్నమెడలో చెయ్యివేసి నాన్నా! ప్రతాప్ చదివేపుస్తకం నేనూ చదువుతానే" అంది.

మున్షీ:-అమ్మా! నువ్వు చదివేది సంస్కృతంగా. ఇదేమో వట్టి భాషేనయ్యే.

విరజన్:-ఐతే మరి నేనూ భాషే చదువుకుంటా. ఇందులో ఎంత మంచిమంచి కథలున్నా యనుకున్నావు. నా పుస్తకంలో ఒక్క కథన్నాలేందే. ఏం నాన్నా! చదవడం అంటే ఏమిటి?

మున్షీజీ దిక్కులు చూస్తున్నాడు. 'చదవడం' అనే దేంజంతువో, ఎలావుంటుందో అతనికే ఇంతవరకు తెలియదు.

బుర్రగోక్కుంటూనే ఉన్నాడు. ఇంతలో "నేను చదువుతుం డగా చూశావుకదూ. దాన్నే చదువుతూను" అన్నాడు ప్రతాప్.

విరజన్:-అలా నేనూ చదువుతున్నాగా అమ్మా! మరిదాన్ని చదవడం అనరా?

విరజన్ సిద్ధాంతకౌముది చదువుతోంది. నువ్వు చది వేది చదువేమిటి? చిలుకమాదిరిగా అన్నమాటే పదిసార్లు అంటూవుంటూ వేమ్మరి అన్నాడు ప్రతాప్.

# 4

కొంతకాలం నుండీ డబ్బు ఇబ్బందికారణంగా ఒక వంటమనిషినీ, ఒక నీళ్ళమనిషినీ, ఇద్దరు పరిచారికల్నీ తగ్గించి వేసింది సువామ. ఇప్పుడు వాళ్ళ అవసరమూలేదు, జీత భత్యాలు యివ్వవడమూ కష్టంగానేఉంది. ఇప్పుడిక ఒక్క ముసలి పనిమనిషి మిగిలింది. బైటపనంతా అది చేసుకు పోతుంది. ఇంట్లో పనేమో స్వయంగా సువామే చేసుకుం టోంది. ఇంతకష్టం చేయడం ఎన్నడూ అలవాటులేదు. అందు వల్ల కొద్దిరోజుల్లోనే శ్రమ ఎక్కువై అలసటగా ఉండడం ప్రారంభమయింది. తర్వాత కొన్నాళ్ళకు రాత్రిళ్ళు జ్వరము రాసాగింది. క్రమంగా అది శ్రుతిమించింది. అసలు ఎప్పుడూ తీయకుండానే జ్వరండుంటోంది. ఒళ్ళంతా వేలాపురిగిజల్లా మాడిపోతూంటోంది. అన్నం రుచించదు. ఏ పనిచేయటానికి మనస్కరించదు. ఐనా క్రమం తప్పకుండ నిత్యం చేయవలసిన

పనులన్నీ చేస్తూనేవుంటోంది. ప్రతాప్ ఇట్లో ఉన్నంతసేపూ ముఖంలో జబ్బుమనిషి ఆకారం కనపడనివ్వదు. కాని అతను బడికి వెళ్ళిపోగానే దుప్పటి కప్పుకుని మూల్గుతూ పడి ఉంటుంది. మళ్ళీ అతను తిరిగి వచ్చేవేళదాకా అలాగే పడి ఉంటుంది,

ప్రతాప్ గొప్ప తెలివితేటలు గల పిల్లవాడు. సూక్ష్మగ్రాహి. తల్లి పరిస్థితి నానాటికీ అధ్వాన్నంకావడం చూచి అసలు విషయమేమిటో వెంటనే గ్రహించాడు. ఒకరోజున బడి వదలిపెట్టగానే తిన్నగా ఇంటికొచ్చాడు. కొడుకును చూచి లేచి నిలబడ్డానికి ప్రయత్నించింది తల్లి. కాని ఓపిక లేక లేవబోతూ మూర్ఛిల్లిపడిపోయింది. కాళ్లూ - చేతులూ బండ పారి పోయాయి. తల్లిని పట్టుకున్నాడు ప్రతాప్. ఆమె ముఖంలోకి సూటిగా, తీవ్రంగా చూస్తూ "అమ్మా! నీవు ఏమన్నా జబ్బుగా వుంటున్నావా? ఏమిటి, ఇంత చిక్కిపోయావేమిటి? చూడు, అమ్మా! నీ ఒళ్ళెంత వేడిగా ఉందో చూడు. అబ్బ ఒంటిమీద చెయ్యివేస్తే భగ్గుమని కాలిపోతోంది. అన్నాడు.

నవ్వు తెచ్చుకోవాలని ప్రయత్నించింది సువామ. తన రోగం విషయంచెప్పి కొడుకును కష్టపెట్టడం సుశీరాం ఇష్టం లేదు. ఈ భావం నిస్వార్థ, నిష్కామ ప్రేమకు పరాకాష్ట. కంఠం సంభాళించుకుని "లేదు నాన్నా, జబ్బా గిబ్బా ఏమీ లేదు బాబు. ఇవ్వాళే కాస్తజ్వరం తగిలింది. సాయంత్రానికి అదే పోతుంది. శుభ్రంగా లేచి కూర్చుంటాను. ఆ గోడపలా వుంచు. ఇదిగో, బీరువాలో హల్వా చేసిపెట్టా. తీసుకుని

నాయనా. వద్దులే, నువ్వు వెళ్ళొద్దులే, నేనేవెళ్ళి తీసు కొస్తాలే. నువ్విక్కడే కూర్చో.

ప్రతాప్:- అమ్మా! నాతోనువ్వు నిజంచెప్పడంలేదు. ఏవో మాయమాటలు చెబుతున్నావు. నిజంగా నీకేదోజబ్బు ఏర్ప డింది. లేకపోతే ఒక్కరోజు జ్వరంతో ఇంతచిక్కిపోయే వాడెవ్వడన్నా ఉన్నాడా?

సునామః- (నవ్వి) నీ కళ్ళకు చిక్కిపోయినట్టుగా కన్పడు తున్నానా? నా కలాంటిదేమీ కన్పడడంలేదే.

ప్రతాప్:- డాక్టరుగారి దగ్గరకెళ్లొస్తా.

సునామః- (ప్రతాపుని చెయ్యిపట్టుకొని) ఆయనెక్కడుం టాడో నీకేం తెలుసు?

ప్రతాప్:- అడుగుతూ అడుగుతూ వెళ్తాలే.

ఇంకేదో చెప్పబోయిందితల్లి. కాని మళ్ళీ కళ్ళుతిరిగి పడిపోయింది. గుడ్లు తేలిపోయాయి. ఈ దృశ్యం చూచే టప్పటికి భయకంపితుడయ్యాడు ప్రతాప్. ఇంకేమీ తోచలా ఒక పరుగునవెళ్ళి విరజన్ ఇంటిముందువాలాడు. నిల్చొని వూరికే ఏడుస్తున్నాడు.

ప్రతిరోజూ ఈ వేళప్పుడే విరజన్‌గారింటికి వస్తుండే వాడు. ఇవ్వాళ కాస్త ఆలస్యమయ్యేటప్పటికి కాలు కాలిన పిల్లిలా పచార్లు చేస్తూ నలువేపులా చూస్తోంది. తటాలున గుమ్మంలోనుండి బైటకు తొంగిచూచింది. ముఖంమీద అర చేతులుమూసుకుని నిల్చొని ఉన్నాడు. ఏదో వేళాకోళానికలా

మూసుకున్నాడని అనుకుంది మొదట విరజన్. కాని దగ్గర కెళ్ళి చేతులులాగి చూస్తే బొటబొటమని కన్నీటిధారలు కారు తున్నాయి. త్రుళ్ళిపడింది. కంగారుగా "లల్లూ! దేనికేడుస్తు న్నావు? ఏమిటో చెప్పుబాబు" అంది.

ప్రతాప్‌నుండి జవాబు శూన్యం. పైపెచ్చు వెక్కి వెక్కి ఏడ్పులు మరింత ఎక్కువయ్యాయి.

—నాతో చెప్పవా? పిన్నేమన్నా అందా? ఊరు కోవా?" అంది.

—అదేమీకాదు విరజన్! అమ్మకు జబ్బుగాఉంది. అన్నాడు ప్రతాప్. ఈమాట నోట్లోనుంచి యింకా సరిగా వచ్చిందో లేదో వెంటనే ఒక్క పరుగున వెళ్ళిపోయి సువాము మంచందగ్గర నిలబడింది. చూస్తే స్పృహలేకుండ పడిఉంది. కళ్ళు మూతబడిఉన్నాయి. ఎగరొప్పుగా ఉంది. ఆమెచేతులు పట్టుకుని వూపుతూ "పిన్ని! ఎలాగుంది? కళ్ళు తెరచిచూడండి" అంది విరజన్ ఆతురతతో.

కాని పిన్ని కళ్ళు తెరవలేదు. అప్పుడు బల్లమీదనుంచి నూనెసీసా ఒకటి తెచ్చి తలకు నూనెరాచి చల్లగా మర్దన చేసింది. ఎన్ని నెలలయిందో తలకు నూనెరాచుకుని పాపం. అసలు తీరికఉంటేనా? మెదడుకు కాస్త చల్లదనం కల్గేటప్ప టికి కనురెప్పలు వాటంతటవే విడిపోయాయి.

విరజన్:—పిన్ని! ఎలావుంది? ఎక్కడన్నా నొప్పిగా ఉందా?
సువాము:—లేదు నా చిట్టితల్లీ! నొప్పేమీలేదు. చూడు ఇప్పుడు నేను బాగానే ఉన్నాను కదూ? సరిగాని నీ అన్నగా రెక్కడ?

విరజన్:-మా ఇంటిదగ్గరున్నాడు. అబ్బో, ఎంతగానో ఏడుస్తున్నాడు.

సుహాసు:-వెళ్ళమ్మా - నువ్వువెళ్లి వాడితో ఆడుకోతల్లీ. ఇప్పుడింక నా కేరోగమూ లేదు. బాగానేఉన్నా.

ఈ సంభాషణ లిలా జరుగుతూనేఉన్నాయి. ఇంతలో సుశీలవచ్చింది. సుహాసనుచూడాలని ఎన్నాళ్ళనుంచో కోరికగాఉంది. కాని అలాంటి సదవకాశం ఎన్నడూ లభించడంలా. ఇప్పుడేదో కాస్తచూచి, ధైర్యంచెప్పి పోవాలన్న వంకతో వచ్చింది. తన తల్లిని చూడగానే ఎగిరి గంతువేసింది విరజన్. చప్పట్లు కొట్టుకుంటూ '- అదిగో మా అమ్మవచ్చింది, మా అమ్మ వచ్చింది.' అని పదేపదే అనసాగింది.

ఇద్దరూ పరస్పరం కుశల ప్రశ్నలు ప్రశ్నించుకున్నారు. తదనంతరం ఏవో లోకాభిరామాయణం చెప్పుకోసాగారు. దీపాలు పెట్టే వేళయింది. ఆ ముచ్చట్ల సందట్లో ప్రొద్దుగూకింది కూడా తెలియలా. ప్రతాప్ ఏమయ్యాడో, ఎక్కడున్నాడో, ఎవ్వరికీ అంతుపట్టలా. కొంచెంసేపు వాకిట్లో ఏడుస్తూ నిల్చొన్నాడు. తర్వాత వెంటనే కన్నీరుతుడుచుకుని డాక్టరు కిట్లూగారింటిముఖంగా సాగిపోయాడు. డాక్టరుగారు మున్షీశాలిగ్రాంగారి ఘనిష్టమిత్రులలో ఒకడు. కాకితో కబురంపితే ఇంటికొచ్చివాలేమనిషి. ఎప్పుడవసరమొచ్చినా ఆయన్నే పిలుస్తుంటారు వర్ణనది ఒడ్డున ఒకబంగళాలో కాపురముంటున్నాడని మాత్రమే తెలుసు ప్రతాపుకు. ఇంతవరకెన్నడూ తనపేటదాటి అవతలకు పోయి ఎరుగడు. అసలలాంటి అవసరమూ కల్గలా. కాని ఆ రోజున మాతృభక్తి - ప్రేమలతో

విశ్వాసంగా ఉన్నాడు. అందువల్ల ఈ అవరోధాలూ - ఆటం కాలవి అసలు దృష్టిలోనే లేవు. ఇంటినుంచి బయలుదేరి తిన్నగా బజారులోకొచ్చాడు. "ఎర్రబంగళా కొస్తావా ?" అని అడిగాడు గుర్రం బండివాడొకణ్ణి. ఎర్రబంగళా అందరికీ తెలిసినచోటు. వస్తాను బాబు అన్నాడు బండివాడు. ఎనిమిది గంటలు కొట్టకమునుపే సువామగారింటిముందు కొచ్చి ఆగింది డాక్టరుగారి బండి. ఇక్కడ ప్రతాప్ కోసం ఇల్లిల్లూ, వీధి వీధి గాలిస్తున్నారు. ఇంతలో పెద్దపెద్ద అంగలేసుకుంటూ గబగబా లోపలికొచ్చి ప్రత్యక్షమయ్యాడు. 'చాటుకుపొండి; డాక్టరు గారొస్తున్నారు." అన్నాడు.

ఈమాట వినగానే ఉలిక్కిపడ్డారు. సుశీల సువాములు. వీడు డాక్టరుగారికోసం వెళ్ళాడని గ్రహించారు. ప్రేమాను రాగం పొర్లుకొచ్చింది తల్లి హృదయంలో. దగ్గరకుతీసి ఒళ్లో కూర్చోబెట్టుకుంది. కళ్లనిండా నీళ్ళు తెచ్చుకుని- "ఒక్కడవే వెళ్ళావా నాన్నా ? దారెలా తెలిసిందిరా నా చిట్టితండ్రీ. భయమేయలా ? నాకు మాటమాత్రమన్నా చెప్పలేదెందు కని ? నీ అంతటికి నివే వెళ్ళిపోయావా? ఎక్కడన్నా దారి తప్పిపోతే నా గతేమయ్యేది ? ఇలా అని కొడుకు నెన్నో సార్లు ముద్దుపెట్టుకుంది. పరీక్షలో నెగ్గిన విద్యార్థిలా సంతోష పడిపోతున్నాడు ప్రతాప్. కాస్సేపటిలో మధ్యలో తెరవకటి అడ్డంగా వేసారు. డాక్టరు లోపలికొచ్చి ఆసీనుడయ్యాడు. సువాము నాడిని పరీక్షించి 'మరేం ఫర్వాలేదు' అని ధైర్యం చెప్పాడు. ప్రతాపుని ఒడిలోకి తీసుకుని ముద్దులాడాడు. వచ్చే టప్పుడు మందు వెంటతీసుకొచ్చాడు. అవి త్రాగించమని

చెప్పి తొమ్మిదింటికల్లా మళ్ళీ బంగళాకు చేరుకున్నాడు. జ్వరం ఎన్నాళ్ళనుంచో ఒంట్లో జీర్ణించివుంది. అందువల్ల సరిగ్గా నెలరోజులు ఆ చేదుమందులు త్రాగవలసి వచ్చింది. డాక్టరు గారు రెండుపూటలూ వచ్చి చూచిపోతున్నాడు. తన సొంత చెల్లాయిని చూచినవిధంగా, జాగ్రత్తగా చూస్తున్నాడు సువామను. ఒకరోజు నఫీజు డబ్బు ఒకపళ్ళెరంలో పోసి ముందుంచింది, దాన్ని ముట్టుకోనన్నా ముట్టుకోలేదు డాక్టరు పైగా ఈడబ్బు నా తరఫున ప్రతాపున కివ్వండి. పాపం బడికి నడచిపోతున్నాడు. సైకిలు కొనుక్కుంటాడు” అన్నాడు.

తల్లీ బిడ్డలిద్దరూ సువామ సేవాశుశ్రూషలకు ఇరవైనాల్గుగంటలూ చేతులు కట్టుకు నిలబడి ఉంటుండేవాళ్లు. తల్లైనా కాస్త ఆలస్యంగా వస్తే వచ్చేదేమో, కాని విరజన్ మాత్రం ఒక్కనిమిషంకూడ మంచందగ్గరనుంచి అసలు కదలనే కదిలేదికాదు. మందు త్రాగిస్తుంది. కాస్త తేలిగ్గా, కులాసాగా వున్నప్పుడు అమృతముట్టిపడే కబుర్లు చెప్పి సువామనెంతో ఆనందపరుస్తుండేది. ఆటలూ-పాటలూ అన్నీ బందయ్యాయి. వెళ్ళి ఆడుకోమని సువామ బలవంతపెట్టినప్పుడుమాత్రం తోటలోకెళ్లి ప్రతాపుని జతనుఆడుకునేది. దీపాలు పెట్టగానే మళ్లీ మంచందగ్గరకొచ్చేది. నిద్రవచ్చే వరకూ అక్కడే కూర్చొనిఉండేది. తరచుగా అక్కడే క్రింద పడి నిద్రపోయేది. రాత్రిళ్ళు నౌకరొచ్చి ఎత్తుకుని ఇంటికి తీసుకుపోయేవాడు. మరిదేంపిచ్చో, మరెందుకు పట్టుకుందో దేవుని కెరుక.

ఒకరోజున సువామ తలదగ్గర కూర్చుని విసరుతోంది వ్రజరాణి. ఏదో పరద్యానలో ఉంది. కళ్ళుమాత్రం గోడకేసి చూస్తున్నాయి. మరి పెదవులపై చిరునవ్వు అలరారుతోంది. వృక్షాగ్రములపై వెన్నెల ప్రకాశిస్తున్నట్టుగా. పిన్ని తన్ను చూస్తున్నదేమో అన్న ద్యాసకూడ లేదు. చేతిలోంచి జారి క్రిందపడింది విసనకర్ర హఠాత్తుగా. దాన్ని తీయడానికి వంగింది. తటాలున కౌగిటచేర్చుకుంది సువామ. ముఖ మండలం నిమేరుతూ "విరజన్! నిజంచెప్పు ఇప్పుడు నువ్వు ఆలోచిస్తున్నదేమిటో చెప్పు." అని అడిగింది ముద్దుగా.

సిగ్గేసి తలవంచుకుంది విరజన్. ఏమీలేదు. నీకు చెప్పను" అంది సంకోచంగా.

సువామ:- నాతల్లి కదూ. నా విరజన్ ఎంతమంచిదో. ఏం ఆలోచిస్తున్నావో చెప్పు కాస్తవింటాను.

విరజన్:- (సిగ్గుపడుతూ) ఏం ఆలోచిస్తున్నానంటే, నవ్వు కూడదమ్మాయి, పో, నే చెప్పను పో.

సువామ:- సరే అలాగే, నవ్వను లేచెప్పు. అదిగో అందుకే నాకు బాగుండదు. ఇదిగో ఈసారి చెప్పకపోయావా అంటే మళ్ళీ కళ్ళుమూసుకుంటా నమ్మాయి

విరజన్:- ఎవ్వరితోనూ చెప్పనని ఒట్టుపెట్టుకోమరి.

సువామ:- నిజం, ఒట్టు, ఎవ్వరితోనన్నా చెప్పితే ఒట్టు.

విరజన్:- ప్రతాపుకూ నాకూ.. పెళ్ళి..జరిగితే ఎంతహాయిగా వుంటానోగదా,' అని...

సువాము విరజచుని రొమ్మున చేర్చుకొని ముద్దు పెట్టు కుంది.—"బిడ్డా! వీడుసీకు అన్నయ్య అవుతాడమ్మా" అంది.

విరజన్:- ఔను; అన్నయ్య అవుతాడన్న సంగతి నాకూ తెలుసు. కాని నన్ను కోడలిగా చేసుకోవడం ఇష్టం లేదా?

సువాము:- సరే. బాబునురానీ వాడినడిగిచూస్తా. ఏం అంటాడో తెలుసుకుందాం.

విరజన్:- వద్దువద్దు, వద్దు. అతనికీమాట చెప్పొదు. నీ కాళ్లు మొక్కుతా. అతనికిచెప్పొద్దు.

సువాము:- చెప్పకుండా నేను మాత్రం వూరుకోనమ్మాయి.

విరజన్:- చెప్పితే నన్ను చంపినంత ఒట్టు. ఏమీ చెప్పొద్దు.

# 5

కాలచక్రం గిరున తిరిగిపోతుంటుంది. చూస్తూచూస్తూనే అప్పుడే రెండేళ్లు గడచిపోయాయి. శాస్త్రిగారు నిత్యం ప్రొద్దుటవచ్చి సిద్ధాంత కౌముదిపాఠాలు చెప్పిపోతుంటాడు. ఇప్పుడు అతను రావడం కేవలం నియమపాలన కోసమే, అంతకన్న మరే ప్రయోజనంలేదు, ఎందుకంటే ఆ గ్రంథం చదవటానికిప్పుడు విరజన్‌కు ఇష్టంగా వుండడంలా. ఒకరోజున ముంషీజీ ఇంజనియరు ఆఫీసునుండివచ్చి గదిలో కూర్చొని ఉన్నాడు. నౌకరు బూట్లు విప్పుతున్నాడు. ఇంతలో ముసిముసినవ్వులతో ఇంట్లోనుంచి గదిలోకొచ్చింది రధియు. పరి

చారిక. ముద్రవేసిన కవరొకటి పట్టుకొచ్చి మున్షీచేతి కం దించింది. తర్వాత ముఖంవెనక్కి త్రిప్పుకుని నవ్వుతోంది. పైన చిరునామా చూస్తే "శ్రీయుత నాన్నగారి పాదపద్మ ముల సన్నిధికి" అని వ్రాసిఉంది.

మున్షీ:-ఏమే! ఎవ్వరి దీకవరు? నాదిమాత్రంకాదే.

రధియా:-దొరగారిదేనండీ. కాస్త విప్పిచూడండి ముందు.

మున్షీ:-ఎవ్వరిచ్చారు? బైటమనుష్యు లెవ్వరన్నా ఇచ్చి పోయారా? "విప్పిచూచుకుంటే మీకే తెలుస్తుందిగా. తిన బోతూ రుచులడుగుతారేం?"అంది రధియా చిరుమోముతో.

విస్మితుడై కవరు చించాడు మున్షీ. అందులోవున్న కాగితంలో ఇలా వ్రాసిఉంది.

మహారాజశ్రీ పూజనీయులైన నాన్నగారికి,

మీ కుమార్తె విరజన్ కోటి నమస్కారములుచేసి వ్రాయునదేమనగా, మీ దయవల్ల నే నిక్కడ క్షేమంగానే ఉన్నాను. మీరూ క్షేమంగా ఉండాలని విశ్వనాధస్వామిని సదా ప్రార్థిస్తుంటూ ప్రతాప్ దగ్గర భాష నేర్చుకుంటున్నా. బడివదలిపెట్టగానే వచ్చి రోజూ పాఠాలు చెప్పిపోతుంటాడు. నాకు మంచి మంచి పుస్తకాలు కావాలి. వెంటనే తెప్పిం చండి. ఎందుకంటే చదువులోనే జీవితసుఖం ఉంది. విద్య అమూల్యరత్నం. వేదపురాణేతిహాసాల్లో దీని మాహాత్మ్యం వేనోళ్ళ వర్ణించబడింది. ఈ విద్యాధనాన్ని మనోవాక్కాయ కర్మలలో అర్జించడం ప్రతిమనుష్యుని కర్తవ్యం. విద్యమూల

కంగా దుఃఖదరిద్రదుఃఖలన్నీ మాసిపోతాయి. నిన్న బైతాల్ పచ్చీసీ (భేతాలుడు చెప్పిన ఇరవై ఐదు కథలు) చదివి పిన్నికి వినిపించా ఆమె నాకొక సంచీబొమ్మ బహుమతిగా యిచ్చింది. ఎంత అందమైన బొమ్మా! దానికి పెళ్ళిచేయా లనుకుంటున్నా. అప్పుడు మిమ్మల్ని డబ్బు అడుగుతా. ఇక శాస్త్రిగారి చదువు నాకొద్దు. నేను భాష నేర్చుకుంటున్నా నని అమ్మకు తెలియదనుకుంటా.

ఇట్లు
మీ ప్రియకుమార్తె
విజరన్

ఉత్తరం చూడగానే మున్షీజీ అంతఃకరణంలో చక్కిలిగింతలు పెట్టినట్లయింది. చరచరా ఉత్తరమంతా ఒక్క గుక్కలో చదివేశాడు. ఆ ఆనందంలో చెప్పులుకూడ వేసుకోకుండ ముసిముసిగా నవ్వుకుంటూ గబగబా లోపలికెళ్ళాడు. ముందు ప్రతాపుని చంకనెత్తుకున్నాడు తర్వాత ఇద్దర్నీ చేతులు పట్టుకొని సుశీల వద్దకు వచ్చాడు. ఆమెకు ఉత్తరంచూపిస్తూ "ఇదిగో, ఇదెవరి ఉత్తరమో తెలుసా? కనుక్కో చూద్దాం." అన్నాడు.

సుశీల :- ఏదీ, ఇలా ఇవ్వండి. నాచేతిలో పెట్టండి చూస్తా.

మున్షీ :- అలా ఇవ్వనుటే. అక్కడనుండే చెప్పు. ఉం, త్వరగా.

సుశీల .- కనుక్కుంటె ఏం ఇస్తారు?

మున్షీ:- ఎవరిదో చెప్పితే యాభైరూపాయలు.

సుశీల:- ముందు రూపాయలు తీసి అక్కడ పెట్టండి. లేకపోతే తర్వాత తిరిగి పోతారు. మిమ్మల్ని నమ్మేం దెవరు ?
మున్షీ:- తిరిగిపోవడమా ! అలాంటిది మా వంశంలో నే లేదు. ఇదిగో రూపాయలిప్పుడే తీసుకో. ఏం అనుకున్నావేమిటి, మేమేమీ దివాళాకోరు షావుకార్లంకాదు లే.

ఇలాఅని చంగున పదిరూపాయల నోటొకటి జేబులోంచిలాగి చూపించాడు.

సుశీల:- ఎంతదేమిటి నోటు ?
మున్షీ:- పేభై రూపాయలనోటు. ఇదిగో చూసుకో.
సుశీల:- కాజేస్తానండోయ్. ముందుగానే చెబుతున్నా.
మున్షీ:- సరే, అలాగే కాజేద్దువుగాని, ముందు కనుక్కోమరి.
సుశీల:- లల్లాది, ఉం, రానివ్వండి. ఇక నేనొప్పుకోను తెండి ఇలా (అని లేచి మున్షీజీ చెయ్యి గట్టిగా పట్టుకుంది.
మున్షీ:- బందిపోటేమున్నానా ఏమిటిది ? అలా మీదబడి లాకుంటావేమిటి ?
సుశీల:- ఇస్తానని అనలేదా? ఇంతలోనే మాటతప్పిపోవాలా?
మున్షీ:- అసలు నువ్వు సరిగా కనుక్కుంటేగా. భ్రమపడుతున్నావు.
సుశీల:- చాలుచాల్లే పెద్దమున్షీని. పైగా భ్రమలు గిమలు అని కబుర్లు చెబుతున్నారా ? ఇంతకూ నోటుకాజేయాలని వుందిలెండి. ఏం లల్లూ! ఇది రాసింది నువ్వుగాదూ !

ముఖంవంచుకుని ప్రక్కగా మున్షీ వేపుకు చూచి "నేనెందుకు వ్రాశాను ?" అన్నాడు వినీవినపడనట్లుగా.

ముంషీ:- సిగ్గు, సిగ్గు, ఇకతగ్గు ఇకతగ్గు.

సుశీల:- అబద్ధాలాడుతున్నాడు. వాడుగాక ఇంకెవ్వడు రాశాడు? మీరంతా ఏకమై, కూడబలుక్కుని వచ్చారు లెండి.

ప్రతాప్:- నేను వ్రాయలా, నిజం. విరజన్ రాసింది.

"విరజన్ రాసిందా? నిజంగానా?" అంది సుశీల ఆశ్చర్యంగా. వెంటనే రెండంగలువేసి భర్త చేతిలోంచి ఆ వుత్తరం లాక్కుంది. సంతోషంతో రెప్పవాల్చకుండ ఉత్తరం చూస్తోంది. ఇప్పటికే నమ్మకం కల్గక "ఏం అమ్మా! నువ్వేనా రాసిందిది?" అని కుమార్తెను ప్రశ్నించింది.

"ఔను" అంది విరజన్ తల ఎత్తకుండానే. తల్లి ఆనందంతో చంగున విరజనుని కౌగిలించుకుంది.

ఆ రోజునుండి విరజన్ పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఎప్పుడు చూచినాసరే, కలంతీసుకుని కూర్చుంటుంది. తెల్లకాగితాలన్నీ ఏదో నలుపుచేస్తూంటుంది. ఇంటిపనుల గొడవ మొదటనుంచీలేదు. ఇప్పుడు కాస్త చదువుసంధ్యలు అబ్బటం అంటే పువ్వునకు తావు అబ్బినట్టుగా ఉంది. విద్య పట్ల దాని శ్రద్ధాశక్తులుచూచి సుశీల విపరీతంగా మురిసిపోతోంది. ఇక తండ్రిపడే ఆనందం వర్ణించడం తరమేకాదు. నిత్యం ఏదోఒక కొత్తపుస్తకం కొనుక్కొస్తుంటాడు - పెద్దదైనప్పుడు కూతురు చదువుకుంటుందన్న ఆశతో. ఇక తల్లి తన కూతుర్ని ఇటుపుల్ల తీసి అటు పెట్టనివ్వదు. స్వయంగా కాళ్లూ చేతులు కడుక్కోవడం చూచినా, లేక అన్నం తిన్న

చెయ్యి కడుక్కుంటూ వుండడం కంటబడినా ఆ రోజు ఇక పనివారికలసి మూసిందన్నమాటే. అమాంతంగా మ్రింగి వేస్తుందా అన్నట్టు విరుచుకుపడేది—"ఏం, కళ్ళల్లో జిల్లేడు పాలు పోసుకువచ్చారా ఏమిటే? లేక కొవ్వెక్కి కళ్ళు కనపడకుండా పూడిపోయాయా? దాని మానానికది కాళ్లు కడుక్కుంటుంటే, నువ్వెక్కడ దెయ్యంలానిల్చొనివున్నావ్?"

ఈ రకంగా రోజులు గిర్రుగిర్రున తిరిగి వస్తున్నాయి. అప్పుడే పన్నెండేళ్ళు వచ్చాయి విరజన్‌కు. కాని ఇంతవరకు వంటచేయడమంటే ఏమిటోకూడ తెలియదు. పొయ్యిదగ్గర కూర్చునే అవసరమే కల్గలా. ఒకరోజున సువామ

"చెల్లీ! విరజన్‌కు ఈడొస్తోంది. ఇకనన్నా పనిపాటలు నేర్పవా ఏమిటి? అని ప్రశ్నించింది సుశీలను.

సుశీల:-ఏమని చెప్పను అక్కయ్యా? ఏదో ఒక మెలిక పెట్టి పనిలోకి దించాలని అనుకుంటా. కాని మళ్ళీ ఏదో ఆలోచించి మొదలుకొండ వూరుకుంటూఉంటా.

సుదాము:-ఏమిటేమిటి ఆ ఆలోచన?

సుశీల:- ఆలోచనా లేదు వల్లకాదూ లేదు. ఒంటిబద్ధకమే కారణం.

సుదాము:-ఐతే ఆపని నా కప్పగించు. వంటచేయడం స్త్రీకి సహజావశ్యకం.

సుశీల:-ఇంకా పొయ్యిదగ్గర కూర్చునే ఈడు రాలేదు.

సుదాము:-పని చేస్తుంటేనే పనిఅబ్బుతుంది.

సుశీల:-(సంకోచంగా) పువ్వుల్లాంటి బుగ్గలు కందిపోవూ?

సుహాసు:-(నవ్వి) పువ్వులనేవి కందకుండ, వాడకుండ ఎక్కడైనా కాయలు కాస్తాయా?

మర్నాటినుంచి వంటపని నేర్చుకోటం ప్రారంభించింది విరజన్. మొదట్లో పని - పదిహేను రోజులు పొయ్యిసెగను కూర్చోవడమంటే చాలా కష్టంగావుండేది. పొయ్యిమండదు. ఫూ ఫూ అని వూదితే కళ్ళల్లోకి పొగపోయి కన్నీళ్లుకారేవి. కందగడ్డలా ఎర్రబడిపోయేవికళ్లు. రవ్వలుపడి ఎన్ని పట్టుచీరెలు ఎందుకూ పనికిరాకుండ పోయాయో తెలియదు. చేతులుబొబ్బలెక్కేవి. కాని క్రమంగా ఈకష్టాలనుండి గట్టెక్కింది. సుహాస గొప్పగుణవంతురాలు. కోపమనేదెలా వుంటుందో ఎరుగని మనిషి. ప్రతిరోజూ చక్కగా బుజ్జగించి, నచ్చజెప్పి ముద్దుగా పనిచేయించుతుంది విరజన్ చేత.

విరజన్ వంటచేయుడం ప్రారంభించి ఇంకా రెండునెలలన్నా నిండాకాలేదు. ఐనా ఒకనాడు లల్లూ! నాకు వంట చేయడం వచ్చేసింది" అంది ప్రతాప్‌తో.

ప్రతాప్:- నిజంగానా?

విరజన్:- నిన్న నేచేసినవంట రుచిచూచింది పిన్ని. ఎంతో మెచ్చుకుంది.

ప్రతాప్:- ఐతే, నన్నుకూడ ఒకరోజున ఆహ్వానించుమరి?

సరే, ఐతే రేపు. అంది సంతోషంగా.

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలకల్లా వంట తయారుచేసింది. భోజనానికి రమ్మనమని కబురుచేసింది ప్రతాపుకు. వెళ్ళిచూస్తే భోజనశాల చక్కగా అలికిఉంది. కొత్త

పుట్టమట్టితో అలికింది. కమ్మటిసువాసన కొడుతోంది. పరి శుభ్రమైన చాప ఒకటి చక్కగా వేసింది ఒకపళ్ళెంలో రొట్టెలూ, అన్నమూ, మరి రెండుగిన్నెల్లో పప్పూ, కూర వడ్డించింది. చెంబూ, గ్లాసూనిండా మంచినీళ్లు పెట్టింది. ఈ స్వచ్ఛత. ఈ పడ్డన పద్ధతి చూచి గభాలున వెనక్కి తిరిగి మున్షీ సంజీవనలాల్ గారి దగ్గరకు పరుగెత్తుకుపోయాడు ప్రతాప్ ఆయన్ని వెంట బెట్టుకొచ్చి వంటఇంట్లో నిలబెట్టాడు. మున్షీ గారి ఆనందానికీ, సంతోషానికీ అంతులేదు. వెంటనే చొక్కా విప్పి వంకెన తగిలించాడు, గబగబా చేతులూ కాళ్లూ కడుక్కు న్నాడు. తైమంటూ వెళ్ళి ప్రతాపుని జతెను కూర్చున్నాడు. పిలువని పేరంటానికి ఈ మహాశయుడూ తయారవుతాడని పాపం ఆపిల్లకేం తెలుసు. ప్రతాపునికొక్కడి కోసమే వంట చేసింది. పాపం ఎంతో సిగ్గుపడింది. కనురెప్పలు వాల్చి తల్లి కేసి చూచింది. ఆవిడ వెంటనే అర్థంచేసుకుని, నవ్వుతూ "మీకోసం వేరేవంటచేశానుగా. చంటిపిల్లవాళ్ళలా పిల్లల మధ్యకొచ్చి కూర్చున్నారేమిటి?" అంది భర్తతో.

రెండు పళ్లెల్లో కొద్దికొద్దిగా వడ్డించింది సంకోచ బిడి యములతో.

మున్షీ:- రొట్టెలు బలేబాగాచేసిందే. మెత్తగా, తెల్లగా, తియ్యగా ఉన్నాయి.

ప్రతాప్:- ఇదిగో అన్నం చూడండి ఎంత పొడిగావుందో. విరజిమ్మి మళ్ళీ ఏరుకోవచ్చు.

మున్షీ:- ఇలాంటి రొట్టెలు నా జీవితంలో తినలేదంటేనమ్ము. అబ్బ, పులుసుకూర ఎంతరుచిగా వుందంటే.

"విజరన్ ! పెద్దనాన్న గారికి బంగాళాదుంపల పులుసు మరోసారి వడ్డించు." అని నవ్వుతున్నాడు ప్రతాప్. పాపం సిగ్గుపడిపోయి తలకాయవంచుకుంది విరజన్.

సుశీల:- (భర్తతో) ఇకనన్నా లేస్తారా లేదా? వండినదంతా ఎగరేశారు. ఐనా ఇంకా కదలకుండ అక్కడే కూర్చున్నారా?

మున్షీ:- నీకూనోరూరుతోందా ఏమిటి?

ఇద్దరూ కలిసి వండినదికాస్తా ఒక్క మెతుకు దిగడకుండా సుష్టుగా ఆరగించి మరీ లేచారు. అప్పటికప్పుడు ఒక నవరసు తీసి బహూకరించాడు మున్షీజీ.

# 6

పట్నంలో మంచి పలుకుబడిగల వ్యక్తుల్లో ఒకడు డిప్టీశ్యామాచరణ్. ప్రజలచే ఇంతగా గౌరవించబడే వ్యక్తి పట్నం మొత్తంలో ఇంకెవ్వరూ లేరనేచెప్పొచ్చు. దీనికెన్నో కారణాలున్నాయి. మంచి సరళస్వభావుడు; కలుపుగోలు మనిషి. గొప్ప సహనశీలుడు. అన్నిటికంటె ఎక్కువ చెప్ప తగిన విషయమేమంటే లంచాలంటే ఒళ్ళుమంట. న్యాయా న్యాయాలు బాగా లోతుకుపోయి ఆలోచించే వ్యక్తి. ఇటు పది పన్నెండేళ్లు ఉద్యోగం చేశాడు ఈ కాలంలో అతను చెప్పిన తీర్పుల్లో అప్పీళ్ళకుపోయిన కేసులు మహాఉంటే ఒకటి రెండు ఉంటాయేమో. పొట్టపొడిచినా ఇంగ్లీషు ముక్కలురావు. కాని మంచి సూక్ష్మగ్రాహి. గొప్ప నైతిక దృష్టిగలవాడు ఈ లక్షణాలు చూసి బారిస్టర్లు, ప్లీడర్లు

సైతం ముక్కుమీద వేలువేసుకుంటూఉంటారు స్వాతంత్ర్య ప్రియుడు. తన ఇల్లేమో, తన కొట్టేమో, తానేమో. అంతకుమించి ఇంకోచోటికి వెళ్ళడు. మున్షీ శాలిగ్రాంగారు బ్రతికివున్నప్పుడు, వెళ్ళుతుండేవాడు ఏమీతోచనప్పుడు. అది కూడ అడపాదడపాసాగానే, ఆయన ఊరొదిలి వెళ్ళిపోయాడు. తర్వాత ఈయన తన ఇల్లొదిలి ఇంకోచోటికి వెళ్ళిఎరుగడు. చాలా సంవత్సరాలక్రితం సంగతి. ఒకసారి కలెక్టరుగారి దర్శనార్థంవెళ్ళాడు. దొరగారు స్నానంచేస్తున్నారని చెప్పాడు వంటవాడు. వరండాలో ఒక ముక్కాలిపీటవుంటే దానిమీద కూర్చున్నాడు. సరిగ్గా రెండుగంటలు ప్రతీక్షించాడు. అప్పుడు దొరగారు చేతిలో టెన్నిస్‌బ్యాట్ ఒకటి పుచ్చుకుని బైట కొచ్చారు. “ఏమయ్యా! నాకోసం వేచి ఇంతసేపు కూర్చో వలసి వచ్చినందుకు విచారం. ఇవ్వాళ బొత్తిగా తీరికలేదు. క్లబ్బుకెళ్ళాల్సిన పనిఉంది. మరోసారి దయచేయండి” అని చావుకబురు చల్లగాచెప్పాడు.

ఈ కబురు విని దొరగారి కొకసలాంకొట్టి వచ్చినదారి పట్టాడు. ఈమాత్రం దానికి మరింకెప్పుడూ ఏ ఇంగ్లీషువాడి గుమ్మమూ తొక్కలేదు వంశమర్యాదలు, ఆత్మగౌరవంపట్ల ఎంతో అభిమానంగల వ్యక్తి. వీటితోపాటు మంచి సర్దా పురుషుడుకూడ. వారిమాటల్లో హాస్యరసం తొణికిసలాడు తుంది. సాయంకాలంపూట చల్లగాలికి వాకిట్లో పడివుండి ఇష్టమిత్రుల్ని పోగుచేసుకుని సభతీర్చి కూర్చుంటాడు. ఆ సభలో ఆయన పకపకమని నవ్వినప్పుడు, ‘హాహాహా’అని చేసే వికటాట్టహాసాలు తోటదాకా వినిపిస్తుంటాయి సాకర్ల-

చాకరపట్ల చాలా దయగా ఉంటాడు. కలిసిమెలిసి సర్దాగా ఉంటాడు, దీనికొక్క ఉదాహరణచాలు. వాళ్ళ సరసన కూర్చుని చలిమంటకాగడంలో సంకోచమూడడు. అతని ప్రభావం సర్వత్ర వ్యాపించిఉంది. ఆ కారణంగానే అతని సరళత సజ్జనతలను దురుపయోగంచేసి వినియోగించుకోటాని కెవ్వడికి దమ్ములుండేవి కావు. వేషభూషలూ అతిసామాన్యం గానే ఉంటాయి. కోటు - బూటు - సూటు లంటే ముక్కు విరుస్తాడు. పొడుగాటి గుటన్‌దారు బనియన్, దానిపైన ఒక అంగరఖా తొడుగుతాడు. పైన ఇంకో నల్లటి జాకీటువేస్తాడు వదులైన పొడుగాలాగులు, కాళ్ళకు మొనతేలిన ఢిల్లీ చెప్పులు ఇవీ అతని డ్రస్సు. పుష్టిగలదేహం; గులాబిరంగు ముఖం; మధ్యరకం ఎత్తు. దేహంమీద ఈ దుస్తులున్నంత అందంగా కోటు - బూట్ల డ్రస్సువుండదు. యావత్తు పట్నంలో పలుకుబడివున్నమాట వాస్తవమే. కాని ఇంట్లోమాత్రం సున్న. ఏమాటసాగదు. ఇంటి సామ్రాజ్యాధికారం అంతా భార్యదే. ఆమెది స్వేచ్ఛాపరిపాలన. చాలాఏళ్ళక్రితం సంగతి. భార్య కిష్టంలేకుండ వంటదాన్ని వంటకు పెట్టాడు. ఆమె కాస్త ఎర్ర ఎర్రగా ఫుల్ల ఫుల్లగా ఉంటుంది. భర్తగారి ఈ రకమైన అనుచిత వ్యవహారం చూచి మూతి బిగించుకుని, కొన్ని వారాలవరకూ మాట్లాడనే మాట్లాడలేదు చివరకు వివశుడై ఆమెను చల్లగా సాగనంపాడు. అదేమొదలు, మళ్ళీ సంసార గొడవల్లో తలదూర్చటానికి సాహసించలా పాపం.

ముంషీజీకి ముగ్గురు సంతానం. ఇద్దరు కుమార్లు, ఒక కుమార్తె. పెద్దవాడిపేరు రాధాచరణ్. క్రిందటిపడే పట్ట

భద్రుడయ్యాడు. ఈ సంవత్సరం రుడకీ ఇంజనీరింగు కాలేజీలో ప్రవేశించాడు. ఫతహాపుర్ సీకరి (యు. పి లో ఒక జిల్లా) లో ఒక శ్రీమంతుని కుమార్తెను వివాహం చేసుకున్నాడు. రెండో సంతానం ఆడకూతురు పేరు సేవతి. ప్రయాగపట్నంలో ఒక భాగ్యవంతుని గృహంలో ఆ అమ్మాయికి పెళ్ళి చేశారు. కడసారి కొడుకు కమలాచరణ్ ఇంకా పెళ్ళికాలేదు. తల్లి ప్రేమవతికి గారాబుబిడ్డ. ఆవిడగారాబమే వాడిజీవితానికి విషమూలికగా రుజువయింది. చదువుసంధ్యలంటే ఒళ్ళుమంట. పదిహేనేళ్ళకు పైబడ్డాయి కాని ఇంతవరకు ఉత్తరం వ్రాయటం చేతకాదు. ఒక మహమ్మదీయ పంతుల్ని పెట్టారు ట్యూషన్ చెప్పటానికి. ఆ మియాగార్ని నెలతిరిగేరాకముందే ఒక సలాం కొట్టి చల్లగా సాగనంపాడు. ఇక గత్యంతరం లేక అప్పుడు బళ్ళో కూర్చోపెట్టారు. బళ్ళో కడుగుపెడితే జ్వరం ఎగేసుకొచ్చేది. తలకాయ బద్దలయ్యే పిచ్చితలనొప్పి వచ్చేది. అందువల్ల ఆ బడీ మాన్పించారు. తర్వాత ఒక మాష్టరుగార్ని పెట్టారు. అతనూ మూడుమాసాలకంటె ఎక్కువ ఉండలేదు. ఈ తొంభై రోజుల్లో ఈ గారాబుపట్టి చదివిందల్లా మూడుపాఠాలే. అదికూడ అతికష్టంమీద. నాల్గో నెలలో గురువులవారికి స్వస్తిచెప్పబడింది. అప్పటికిక డిప్టీగారే స్వయంగా చదువుచెప్పపూనుకున్నాడు. కాని తొలిరోజునే పుత్రుని తెలివితేటలు అర్థమయ్యాయి. ఎన్నో దెబ్బలుకొట్టి తిట్టికూడ ఏమీ ప్రయోజనం లేకపోయింది. సాధులసాధ్యాలు వకీళ్ళు, బారిస్టర్ల సూక్ష్మ విమర్శలు గూఢార్థమున్నా తేలిగ్గా

అర్థ చేసుకోవచ్చుగాని ఒక శ్రద్ధాశక్తి లేని విద్యార్థి మనస్సులో విద్యాభిలాష రేకెత్తించడం మాత్రం అంత తేలిక గాదు.

ఈ తిట్లూ, ఈ దెబ్బలూ స్వయంగా చూచింది తల్లి. ఇంకేముంది? కొంప ఎగిరిపోయేటటువంటి గలిబుమారం లేపింది. చివరకు ఈపోరు పడలేక విసుగెత్తి చదువు చెప్పడం విరమించుకున్నాడు తండ్రి. ముగ్గురిలో కమలాచరణ్ అందమైనవాడు; సుకుమారుడు, మధురభాషి. అందువల్ల వాడంటే తల్లికి తగని గారాబం. ఈ అతిగారాబం వాడినెన్నో దురలవాట్లకు గురిచేసింది. గాలిపటాలెగురవేస్తాడు. పావురాల పందేలు వేస్తాడు. ఇంకా ఎన్నో చేయరానిపనులు చేస్తాడు. ప్రొద్దుపొడవడం ఆలస్యం. పావురాల్లోకెళ్లి కూర్చుంటాడు. కౌజుపిట్టల పందేలు జరుగుతాయి. ఇక కాస్త ప్రొద్దువాలితే చాలు, గాలిపటాల చిక్కుల్లో సతమతమవుతుంటాడు. కొద్దిరోజులనుండి జూదంకూడ అలవాటయింది. అద్దం, దువ్వెన, ఎప్పుడూ జేబులోవుంటాయి. తలనిండా అగరునూనె పట్టిస్తాడు: ఆ రాసుకున్న విధంచూస్తే వీడసలు అగరునూనెలోనే మునిగివుంటున్నాడా అని అనిపిస్తుంది.

ఒకనాడు సునామగరింటికి వెళ్ళింది ప్రేమలత. ఆ సమయంలో అక్కడ వ్రజరాణి కంటి కగపడింది. ఆ పిల్లను చూడగానే తన కోడలిగా చేసుకోవాలన్న అభిలాష కల్గింది. ఆ కన్యారత్నం తన ఇంట్లో కాలుపెట్టితే గృహలక్ష్మి తాండవం చేయదా? ఏదో సందర్భంలో తన మనోభిలాషను వ్రజరాణి తల్లిదగ్గర వెల్లడించింది. పిల్లకు పదమూడో ఏడు జొరబడింది. తల్లిదండ్రులు కూతురు పెళ్ళికి సమయం

ఎక్కించుకుంటున్నారు. ప్రేమవతి వెల్లడించిన అభిప్రాయం ఉభయుల్ని సంతోషసాగరంలో ముంచితేవనెత్తింది. మొదటి విషయం బాగా తెలిసిన కుటుంబం. రెండు పరువు-ప్రతిష్టలు గల కుటుంబం. పిల్లవాడు చూస్తే చాలా బుద్ధిమంతుడులా కన్పిస్తున్నాడు. పైగా చదువుకుంటున్నాడుకూడ. ఇక ఆస్తి-పాస్తులంటారా, తాతముత్తాతలు సంపాదించిన ముల్లె పెట్టెల్లో మూలుగుతోంది. భూమికీ కొరతలేదు. అటువంటి వారితో వియ్యం పొందే విషయంలో ఇంకా అడగవలసినదీ, వెనకాముందు ఆలోచించవలసినదీ ఏముంది? ఆచారంప్రకారం మాట్లాడటానికి రావలసిందని వెంటనే కబురుచేశారు.
ఆరకమైన ఆకస్మిక సమ్మేళనమే నేడు భావిజీవిత విధ్వంసక విష బీజానికినాంది. ఆ విషబీజం మొలకెత్తి-పెద్దదై వేరూని మూడే ళ్ళలో కుటుంబమంతా ముక్క-చెక్కలు చేసిపారేసింది. ఆహా! భావిగర్భనిహిత రహస్యం మనకెంత అమగ్యగోచరమోకదా!

కబురురాగానే అత్త - కోడలు, కూతురు కూర్చుని ముచ్చటలు ప్రారంభించారు.

"ఏం అత్తయా! ఈ సంవత్సరమే చేస్తారా?" అని ప్రశ్నించింది కోడలు చంద్రావతి.

ప్రేమవతి:- ఔను. మీ మామగారు తలఎగరవేయడమే ఆలస్యం.

చంద్రా:- లగ్నం, పెళ్ళికట్నాల విషయం తేల్చుకున్నారా?

ప్రేమవతి:- అవన్నీ ఇలాంటి అమ్మాయిలకు వర్తించవు. ఏ పక్షూవరులు సరిసమానంగా తూగరో అటువంటివాళ్ళకే ఈ తిప్పలు ఈ మార్పులూనూ. అప్పుడే కట్నం అనే పడిరాయి

వేసి సమానంగా చూస్తుంటారు. మాత్రజరాణి కమలాచరణ్ కంటె ఎన్నోరెట్లు బరువైనది.

సేవతి:—కొన్నాళ్ళు ఇల్లంతా సందడి సందడిగా వుంటుందిలే. వదినేమో పాటపాడుతుంది. నేనేమో మద్దెల వాయిస్తా. కాదువదినా?

చంద్రా:—పాటలూరావు నాకు గీటలూరావు.

చంద్రావతి కంఠస్వరం వినసొంపుగాఉండదు. పాటలో జీరవస్తుంది. అందువల్ల పాటలంటే తగని చికాకు.

సేవతి:—కొంచెం సరసానికి నవ్వినా నీకు గంపెడుకోపంవస్తుంది ఇదిగో వదినా! "తుమ్‌తో శ్యామ్ బడే బేఖబర్ హో" అన్న పాట మరోసారి పాడు. వినాలని కోర్కెగాఉంది. ఎన్నినెల లయిందో నీపాటవిని.

చంద్రా:—నువ్వు పాడరాదూ! కోకిలకంఠివిగా.

సేవతి:—అదిగో అందుకే మరి ఒళ్ళుమండేది. ఈ కుంటిసాకులే పనికిరావు. అబ్బో - మావదినెంత మంచిదో. ఇదిగో వదినా, రవ్వంతంటే రవ్వంతపాడు.

చంద్రా:—నేనిప్పుడు పాడను. మాలముండ ననుకున్నారా ఏమిటి?

సేవతి:—నీపాట వినకుండ ఇవ్వాళ నిన్ను నే వదలిపెట్టకే.

సేవతి కంఠం చాలా బాగుంటుంది. పాడుతుంటే పక్షు లాలకిస్తుంటాయి. రూపరేఖావిలాసాలూ అందమైనవే. బంగారు చాయ, విలాసమయ నేత్రాలు, ఉల్లిపాయ రంగు చీర ధరిస్తే ఎంతో అందంగా కనపడుతుంది తనలోతానే కూనిరాగం తీయసాగింది.

"తుమ్‌తో శ్యామ్ బడేడేఖబర్ హో"
ఆప్‌తో శ్యామ్ పీయో దూధ్ కే కుల్హాడ్
మేరీతో పానీపై గుజర్ ॥తుమ్‌తో॥

(కృష్ణా! నీకు మా అంతేమీ పట్టదు. నువ్వేమో పాలముంతలు త్రాగు నాకేమో మంచినీళ్ళేగతి)

" పాలముంత మాటమీద ఫక్కున నవ్వింది సేవతి. కాని కోపం వచ్చింది చంద్రావతికి. " ఏమిటది! ఈ మాటల్లో ఏముంది నవ్వటానికి? ఏమీ లేకుండా నే ఇట్లా పళ్ళికిలించడం చూస్తేనే ఒళ్ళుమండేది. సరే నువ్వేచెప్పు, ఇందులో నవ్వ తగిన మాటేముందో?" అంది ముఖం చిట్లించుకుంటూ.

సేవతి:- రా, మనం ఇద్దరం కలిసిపాడ్తాంరా.

చంద్రా:- కాకికి కోకిలకు సంబంధంఏమిటి!

సేవతి:- కోపమంతా ముక్కుమీదే ఉంటుందినీకు.

చంద్రా:- ఐతే మరినన్ను కదలించడందేనికి? నాకు పాడడం చేతగానిమాటనిజమే అనుకో. ఐనా నీకువంకలు పెట్టడానికి ఇక్కడెవ్వడూ నీ మాదిరిగా తైమని రావడంలేదుగా.

'ఎవ్వడూ' అన్నపదం రాధాచరణ్‌ని నిర్దేశించేపదం. చంద్రావతిలో ఇంకేగుణాలున్నా లేకపోయినా భర్తంటే మాత్రం పడిచస్తుంది. హృదయపూర్వకంగా సేవచేస్తుంది. ఆయనకు కాస్త తలకాయనొప్పిగావుంటే చాలు ఈవిడ ప్రాణం ఎగిరిపోతుంది. ఇంటికి రావడం ఒక్కక్షణం ఆలస్యమైతే కాలు కాలిన పిల్లిలా ఇంట్లోకి బైటకీ తిరుగుతుంది, భర్త రుడకి కాలేజీకి వెళ్ళిన తర్వాత చంద్రావతి ఆటలూ,

పాటలూ అన్నీ బందయిపోయాయి. ఆవిడ వినోద-విహారా లన్నీ అతనివెంటే వెళ్ళిపోయాయి. ఈ కారణాలమూలంగానే భార్యాలోలుడై వుంటున్నాడు రాధాచరణ్. ప్రేమ, రూపం, గుణంవుంటే తతిమ్మా లోటులెన్నివున్నా కమ్ముకు పోతుం టాయి.

సేవతి:- వంకలెందుకుపెడ్తారేమిటి? ఆ 'ఎవ్వడో' అన్న వాడు నువ్వంటే ప్రాణాలు విడిచేవాడేగా.

చంద్రా:- ఇటుచాలారోజుల్నుంచి ఉత్తరం రాయలేదు.

సేవతి:- మూడునాలుగు రోజులయిందేమో!

చంద్రా:- ఎన్నోసార్లు దణ్ణలుపెట్టి, చేతులు, గడ్డం పట్టుకుని బ్రతిమాలా ప్రాణంఅన్నా విసిగెత్తిందికాని, నువ్వుమాత్రం ఉత్తరం రాసిపెట్టకనే పోతివయ్యె.

సేవతి:-పాడిందేపాడరా పాచిపళ్ళదాసుడా అన్నట్టు రోజూ ఒకే విషయం ఎవ్వడు రాస్తాడూ! ఏదైనా కొత్తసమాచారం ఉంటే చెప్పు, రాసిపెడ్తా. మరి రాయటానికి సర్దాగానే వుంటుంది.

చంద్రా:-ఇవ్వాళ పెళ్ళివిషయంరాయి తీసుకురానా కలమూ సిరాబుడ్డీ!

సేవతి:-అలాగే కాని ఒకషరతు.

చంద్రా:-ఏమిటది ?

సేవతి:-'శ్యామతుమ్‌తో' అన్నపాట పాడాలి.

చంద్రా:-సరే, అలాగే పాడ్తానులే. పరిహాసించాలని కోర్కె గావుందికదూ ? సరే మీా యిష్టమొచ్చినట్టు నవ్వుకోండి,

సేవతి:-ముందుపాడు, తర్వాత రాస్తా.
చంద్రా:-ముందు రాసిపెట్టు. లేకపోతే తర్వాత మళ్ళీ ఏవో మాయమాటలు చెబుతావు.
సేవతి:-ఒట్టు. తప్పక రాస్తా. పాడుమరి.

చంద్రావతి పాడుతుంది "తుమ్‌తో శ్యామ్" అన్న పాట చివరిమాటల్లో జీరవచ్చింది. వినటానికెంతో అసహ్యంగా ఉంది. నవ్వు ఎంత ఆపినా ఆగలా. క్రిందపడిదొర్లుతూ కడుపుబ్బేటట్లుగా నవ్వింది సేవతి. చంద్రావతి మళ్లీ రెండో చరణం పాడింది.

"అప్‌తో శ్యామ్ రఖో దోదో లుగాయియాఁ"

(కృష్ణా ! నువ్వేమో ఇద్దరు ఇద్దరు స్త్రీలను ఉంచుకో)

"లుగాయియాఁ" (స్త్రీలు) అన్నపదం వినగానే నవ్వుతూ క్రిందపడి దొర్లింది సేవతి. కంట తడిపెట్టుకుని "కనివిటీర నవ్వావుగా. ఇక ఇప్పుడు కాగితం కలం తీసుకురానా" అంది.
సేవతి:-ఇప్పుడప్పుడే వద్దు. ఇంకా కాస్త నవ్వుకోనీ.

సేవతి నవ్వుతూనే ఉంది. ఇంతలో ఎక్కడో తిరిగి తిరిగి కమలాచరణ్ ఇంటికి చేరాడు. పది పదిహేనేళ్ళొచ్చాయి ఎర్రటి ఛాయ. నవ్వుముఖం. తళతళ మెరసిపోయే తెల్లటి దుస్తులు వేస్తాడు. అత్తరులో మునిగి తేలుతుంటాడు, కళ్ళకు కాటుక దిద్దుతాడు. ముసిముసిగా నవ్వుతూ బుల్ బుల్ పిట్ట నొకటి చేత్తో పట్టుకుని మంచానికి చేరబడ్డాడు. "తమ్ముడూ! మిఠాయి పెడ్తానంటే మంచి మాటొకటి చెబుతా. వింటేచాలు ఎగిరెగిరి గంతులేస్తావు"అంది. సేవతి

కమలా:-ఆ సుభవార్తేమిటో చెప్పినాసరే చెప్పకపోయినా సరే. మిఠాయి ఇవ్వాళ నీకు ఎలాగూ పెడ్తానులే. ఎటువంటి గొప్పపందెం కొట్టిందో తెలుసా నా బుల్ బుల్. దానిపందెం చూచి అంతా ఆశ్చర్యపోయారు. ఇది బుల్ బుల్ అంటే బుల్ బుల్ కాదు. పైలుమానంటే నమ్ము.

ఇలా అంటూ దాన్ని తన బొటనవ్రేలిపై కూర్చోబెట్టుకున్నాడు.

సేవతి:-ఆ శుభవార్త వింటే అసలు నాట్యమే చేస్తావు.
కమ:-అలాగైతే వినిపించకపోవడమే మంచిది. ఇప్పుడే నాట్యంచేస్తున్నా. ఇంక అదికూడ ఎందుకులే. అక్కా ! ఈ పైలువాను ఇవ్వాళ నా పరువునిల్పాడు. పట్నంలోవాళ్లంతా సెబాస్ అన్నారు. నవాబు మున్నేఖాన్ ఎన్నాళ్ళనుండో నా బుర్రలో మెదలుతున్నాడు. ఒక నెలయింది. వాళ్ల ఇంటి మీదిగా వస్తున్నా. నన్నుపిలిచి "ఏదైనా మంచి బుల్ బుల్ ఉంటే తీసుకురా. రెండుతన్నులు విడిపించిచూద్దాం" అన్నాడు. ఇలాఅంటూ తన పాతపిట్టను చూపించాడు. దానిమీదట కృపానిధీ ! ఇప్పుడేమీలేదు. కాని దేవుడు తిన్నగాచూస్తే ఒక నెలరోజుల లోపల తప్పక మీతో పందెంవేస్తా." అని అన్నా. ఇవ్వాళ ఆగాషేర్ అలీగారి అఖాడాలో పందెం వేయటానికి నిర్ణయం జరిగింది. యాభై యాభై రూపాయలు పైపందెం. అంతులేని జనంవచ్చారు. చెప్పితే నమ్మవుగాని అక్కా, వాడిపిట్ట నిజంగా పావురమంతవుంది, ఐనా నా పైలువాను బర్రెలోకిదిగి మెడ పైకెత్తి మత్తగజంలా నడచి ముందుకు

పోతుంటేచూచి అంతా "సెబాస్" "సెబాస్" అన్నారు. వెళ్ల వెళ్లడంతోనే ఎగిరి కుత్తుక లంకించుకుంది. అదిమాత్రం సామాన్యం పిట్టా? పట్నంలో పిట్టలన్నిటినీ ఓడించిన మొన గాడు. లాగిపెట్టి తన్నడం మొదలెట్టింది. ఇదేమో ప్రతిసారీ తప్పించుకుపోయేది. తర్వాత కాస్సేపటికి దానిమీద కురికి, జుట్టుపట్టుకుని నొక్కింది ఇది. అప్పుడది మళ్ళీతన్నింది. ఇది క్రిందకొచ్చింది. ఇంకేముంది, కేకలూ, బొబ్బలూ మిన్నుముట్టాయి. "గెల్చింది గెల్చింది" అన్నారు అంతా. నేనిక కోపం పట్టలేకపోయా. 'ఛీ నీ బ్రతుకు తగలడ' అని బిగ్గరగా అన్నా ఛాలెంజి చేశా. చూస్తే ఇదేమో పైన అదేమో క్రిందఉంది. పైకిరావాలని ఎంతో పెనగులాడింది. కాని ఈ బెబ్బులిపైకి రానిస్తేనా: గట్టిగా నొక్కిపట్టికూర్చుంది. నవాబూ అక్కడే ఉన్నాడు. గొంతంత చించుకున్నాడు. అనేక రకాలుగా హుషారుచేశాడు. కాని వృథా. డేగమాదిరిగా నొక్కిపట్టింది. చివరకు జుట్టుపూడి అవతిలపడింది; ఇక దాని పరుగుచూడు, మళ్ళీ వెనక్కితిరిగి చూస్తె ఒట్టు. బద్దిదాటేవరకు ఇది వెంటాడింది, కాని అందలా. చూచినవాళ్ళంతా విస్మితులయ్యారు. ఖాన్‌గారిముఖాన నెత్తురుచుక్కలేదు. చెమటలు క్రమ్మాయి డబ్బుపోయినందుకు విచారపడడంలేదు. సంపాదించినపేరంతా బూడిదలో కల్సిపోతున్నదే అన్నదొక్కటే విచారం. ఏడ్పు ముఖంతో ఇంటికెళ్లాడు. అక్కడ తనపిట్టను ప్రాణాలతోనే పాతిపెట్టాడని విన్నా. ఇలా అంటూ జేబు గలగలమని మ్రోగించాడు.

సేవతి:- ఐతేమరి ఆలస్యండేనికి? ఆగ్రావాళ్ళ జుకాణానికి మనుష్యుల్ని త్వరగా పంపవేం?
కమ:- మరినీకేం తెప్పించమంటావు వదినా?
సేవతి:- పాలముంతలు
కమ:- అన్నయ్యకోమరి?
సేవతి:- రెండేసి రెండేసి లుగాయిచూం (స్త్రీలు) ఇలా అని అంతా పకపకా నవ్వారు.

# 7

పెళ్ళిపనుల మూలకంగా సుహాసు కెక్కడా తీరికలేదు. ప్రొద్దస్తమానమూ ఆ కార్యకలాపాల్లో నేమునిగి తేలుతోంది. ఆవిడ చెప్పిందల్లా తు. చ. తప్పకుండ దాసిమాదిరిగా చేస్తుం టుంది సుశీల. మున్షీసంజీవన్‌లాల్ ప్రొద్దుపొడిచింది మొదలు ప్రొద్దుగూకేవరకు షాపులన్నీ కలియతిరిగొస్తుంటాడు. ఇక ఈ సన్నాహాలన్నీ ఎవ్వరికోసం జరుగుతున్నాయో ఆ విరజన్ సంగతి. గదివదలకుండ కూర్చుని కన్నీరు కాల్వలు గట్టేటట్టు విలపిస్తోంది. దగ్గరకెళ్ళి వూరడించేంత తీరికెవ్వరికీలేదు. చివరకు ప్రతాపూ పాషాణ హృదయుడుగానే కన్పడుతున్నాడు. అతని మనస్సులోనూ కుళ్ళు ఏర్పడింది. చీకటిముఖాన వెళ్ళి మళ్ళీ చీకటిపడ్డాకనే ఇంటికొస్తాడు. పిట్టగోడెక్కి దిగులుగా కూర్చుంటాడు. విరజన్ ఇంటికెళ్ళకని ఒట్టుపెట్టుకున్నాడా అన్నట్టుగా వుంటున్నాడు. దైవవశాత్తు ఎప్పుడైనా విరజనే వాళ్ళింటికి రావడంచూస్తే పిల్లిలా మెల్లగా జారుకుంటాడు.

బ్రతిమాలగా బ్రతిమాలగా అంతగా కూర్చున్నా పెడముఖం పెట్టి కూర్చుంటాడు విరజన్. కళ్ళనీళ్ళ పర్యంతమయ్యేటంత కఠోరంగా ప్రవర్తిస్తుంటాడు. అది చూచి "పిన్నీ! చూచావా లల్లూ నామీదెంతకోపంగా వున్నాడో, పలకరించినా పలకడు నువ్వెళ్ళి చెప్పు" అంటుంది సువామతో. వెళ్ళి చెప్పేదాకా వూరుకోదు. మారాం చేస్తుంది. ఆమె పైటకొంగు పట్టుకొని లాక్కొస్తుంది. కాని వాళ్ళిద్దరూ వస్తూండడం చూడగానే లేచి ఉడాయిస్తాడు ప్రతాప్ "లల్లూ! ఇదిగో ఒక్కమాట. రాక పోతేనా ఒట్టు. ఒక్కసారి మాటవినిపో" అంటూ వెనకాల గుమ్మందాకా వస్తుంది విరజన్. కాని తిరిగన్నా చూడకపోతే అప్పుడు నేలమీదపడి వెక్కివెక్కి ఏడుస్తుంది.— "నామీద ఇంతకోపం దేనికి? ఎన్నడూ ఒక్కమాటన్నా అని ఎరగనే" అంటుంది. సువామ తన ఒళ్ళో కూర్చోబెట్టుకుని "తల్లీ! ఏడ్వకు. లల్లూకి పిచ్చెక్కిందిలే" అని వూరడిస్తుంది. తన పుత్రుని కాఠిన్యానికి కారణమేమిటో కొద్దికొద్దిగా అవగాహ నౌతోంది.

పెళ్ళికి ఐదురోజులుంది. దగ్గరగా దూరంగావున్న బంధు బాంధవులంతా ఒక్కొక్కరే అప్పుడే దిగసాగారు. మండువాలో పెళ్ళిమంటపం చక్కగా అలంకరించారు. చేతికి నూలుకంకణం కట్టారు. ఈ వడిలేనిదారం ఒక పవిత్రధార్మిక సంకెలి. ఇది ఎప్పుడూ జారిపోనిసంకెలి. పెళ్ళిమంటపం ప్రేమకు ప్రతిబింబం, స్మృతిచిహ్నం. జీవితపర్యంతం తలమీదినుండి దిగదు. ఇవ్వాళ సంధ్యాసమయంలో సువామ, సుశీల, వంటావిడ, వగైరాలంతా దేవీపూజ నిమిత్తం గుడికెళ్ళారు.

పరిచారికలంతా తమతమ పనుల్లో మునిగివున్నారు. వ్యాకు లతతో గదిలోంచి బైటకొచ్చింది విరజన్. తిన్నగా ప్రతాప్ గదిలోకెళ్ళింది. ఎక్కడా చీమ చిటుక్కుమనడంలేదు. ప్రతా పునిగదిలో మాత్రమే కాస్త వెలుగ్గావుంది. లోపలికెళ్ళి చూస్తే డ్రాయరుమీద లాంతరొకటి వెల్గుతోంది. ఒక మం చంమీద నిద్రపోతున్నాడు ప్రతాప్. ఆ కనపడీకనపడని వెల్తురులోచూస్తే అతనిదేహమంతా పాలిపోయినట్టుగా కన పడింది. పుస్తకాలన్నీ చెల్లాచెదురుగా పడివున్నాయి. గదిలో చాలా దుమ్ము పేరుకొని వుంది. ఎన్నాళ్ళనుంచో గది తలు పులు తెరవలేదన్నట్టుగా. పరిశుభ్రతను ప్రాణంకంటె మిన్నగా భావించే ఆ ప్రతాపుడేనా ఈ ప్రతాపుడు! లేపా లనుకుంది. కాని ఇంకేదో ఆలోచించి మెదలకుండా వూరు కుంది. క్రిందపడివున్న పుస్తకాలన్నీ తీసి బీరువాలో జాగ్ర త్తగా సర్దిపెట్టింది. డ్రాయరుమీది దుమ్మంతా దులిపింది. పటాలన్నీ శుభ్రంగా తుడిచింది. ఇంతలో అకస్మాత్తుగా పక్క మార్చాడు ప్రతాప్. నోటినుండి "విరజన్! నిన్ను మరవ జాలను" అన్నమాటలు వెలువడ్డాయి. తిరిగి కొంతసేపటికి- 'విరజన్! విరజన్!! ఎక్కడికి వెళ్తున్నావు? రా కూర్చో.' అన్నమాటలు వినపడ్డాయి. మళ్ళీ పక్కమార్చి "కూర్చోవా? సరే అయితే వెళ్ళు. నేనూ మాట్లాడనులే." అన్నాడు. కాస్త ఆగి మళ్ళీ —"ఐతే వెళ్ళుచూద్దాం, ఎక్కడికెళ్తావోగా." అని కలవరించుతూ అమాంతంగా లేచాడు. పారిపోయేవాణ్ణి పట్టు కోబోతున్న వాడిలా. విరజన్ చెయ్యి చేతికిచిక్కింది. వెంటనే కళ్ళు తెరచాడు. ఒక నిమిషంవరకు అతని భావశూన్యదృష్టి

అంతా విరజన్ ముఖంవైపే లగ్నమైఉంది. త్రుళ్ళిపడి లేచి కూర్చున్నాడు. విరజన్ చేయివదలి "ఎప్పుడొచ్చావు విరజన్ ఇంతకుముందు నిన్నే కలలో చూచాను." అన్నాడు.

ఏదో చెప్పాలనుకుంది విరజన్. కాని గద్గదకంఠంతో నోట మాటరాలేదు. కళ్ళలో నీళ్లు గిరున తిరిగాయి. నలువేపులా పరికించి చూచి "ఇదంతా శుభ్రంచేసింది నువ్వేనా ? అనవసరంగా శ్రమపడ్డావు." అన్నాడు ప్రతాప్ మళ్ళీ. కాని దీనికీ జవాబు లేదు.

ప్రతాప్:-విరజన్ ! నన్ను మరచేపోరాదా ?

"నీవు నన్ను మరచిపోయావా ?" అంది విరజన్ కన్నీళ్లుతుడుచుకుంటూ.

లజ్జా వదనుడై తలవంచాడు ప్రతాప్. భావగర్భితులై ఇద్దరూ కొంచెంసేపు నేలకేసిచూస్తూ నిలబడ్డారు. తర్వాత "నా మీ ది కో పా ని కి కారణంఏమిటి ? నే చేసిన తప్పేమిటి ?" అని ప్రశ్నించింది విరజన్.

ప్రతాప్:-కారణమేమిటో నాకే తెలియదు. కాని ప్రస్తుతం నిన్నుచూస్తే ఎక్కడికైనా లేచి వెళ్ళిపోవా లనిపిస్తోంటుంది.

విరజన్:-నన్ను జూస్తే నీకు కాస్తన్నా జాలివేయుడంలా. ప్రొద్దస్తమానమూ ఒకటే ఏప్పుగా ఏడుస్తున్నానే. నామీాద దయరావడంలేదా ? నాతో మాట్లాడటమే మానేశావుగా. ఇంతకోసం వచ్చేమాట నే నేమన్నానో కాస్తచెప్పు.

ప్రతాప్:-నీమీాద అసలు కోపముంటేగా ఏదన్నా చెప్పటానికి.

విరజన్:-ఐతే మరి నాతో ఎందుకు మాట్లాడటంలేదు ?
ప్రతాప్:-నిన్ను మరచిపోవాలని. నువ్వు భాగ్యవంతురాలివి. నీ తల్లిదండ్రులు గొప్ప శ్రీమంతులు. మరి నేను ఒక అనాధను. తిండికి గతిలేనివాడిని. అలాంటప్పుడు మన ఇద్దరికూ స్నేహమెలా సంభవం ?
విరజన్:-ఇదివరకెన్నడూ ఇలాంటి సాకులు చెప్పలేదే. ఇప్పుడు వెనకటికంటె ఎక్కువ ధనికురాలి నైపోయానా ?

ఇలా అని ఏడ్వసాగింది. ప్రతాపూ కరగి నీరైపోయాడు. "విరజన్ ! నువ్వూ. నేనూ చాలా కాలంనుంచి స్నేహంగా ఉన్నాం. ఇప్పుడిక ఎడబాటైపోయే రోజులొచ్చాయి. కొద్దిరోజుల్లో ఇచ్చటివాళ్ళందర్నీ వదలి అత్తగారింటికి వెళ్ళబోతున్నావు. అప్పుడైనా నన్ను తప్పక మరచిపోతావు అందుకనే నేనూ నిన్ను మరచిపోవాలని ఆలోచిస్తుంటా. కాని నీమాటలు జ్ఞప్తికిరాకుండ వుండాలని ఎంత ప్రయత్నించినా లాభం లేకుండా వుంటోంది. ఇంతకుముందు కలలోకూడ నిన్నే చూస్తున్నా."

# 8

ఇవ్వాళ శ్యామాచరణ్‌గారి భవనం సుందర యువతీ మణులతో క్రిక్కిరిసి ఇంద్రభవనంలా కళకళలాడుతోంది. సేవతికి నల్గురు స్నేహితురాండ్రున్నారు. రుక్మిణి, సీత, రామదేవి, చంద్రకుమారి, షోడశ శృంగారములతో శృంగా

రించుకుని టక్కు-టిక్కు-మంటూ ఇల్లంతా కలియతిరుగుతు న్నారు. డిప్టీగారి చెల్లెలూ తన ఇద్దరు కూతుళ్ళతో సహా ఇటావాజిల్లా నుండివచ్చింది. ఆ కూతుళ్ళపేర్లు కమల, ఉమా దేవి కమలకు వివాహమయింది. ఉమా ఇంకా కుమారియే. ఇద్దరూ సూర్య - చంద్రుల్లా ఉంటారు. పెళ్లి మంటపందగ్గర చేరి పాటకత్తెలు పెళ్లిపాటలు పాడుతున్నారు. గులబియా మంగలావిడ జమునీ నీళ్ళావిడ షోకు ఇక అడగాలి? మల్లె పూవుల్లాంటి చీరెలు కట్టారు; పాపటలో కుంకం దిద్దారు. గిల్టుకడియాలు పెట్టుకున్నారు. టంగుటింగుమంటూ ఇం ట్లోంచి బైటికీ, బైటనుంచీ ఇంట్లోకీ తిరిగే తిరుగుడి కంతు లేదు. గులబియా చలాకైన యువతి. జమునీ వయస్సుమళ్లిన స్త్రీ. ఇక సేవతిదేవిగారున్నారు. ఆవిడ షోకు వర్ణించ తరం కాదు. ఆనందాని కంతులేదు. సంతోషసాగరం కట్టలుతెగి ప్రవహిస్తోంది. ఉన్మాదంతో కూడిన వగలాడిచూపులు. గులాబీ రంగు చీరమెరుపులో చేమంతిరంగుకూడ గులాబీ రంగుగానే కనపడుతోంది. లేత ఆకుపచ్చని మల్లుజాకీటు ఆ చీరెమీా దెంతో అందంగా ఉంది. ఇప్పుడే తలంటుకొచ్చింది. నల్ల త్రాచువంటి ముంగురులు మెడపై వ్రేలాడుతున్నాయి. సర సాలు, సల్లాపాలూ, హాస-పరిహాసాలతో నే తీరికలేదామె. మరి తలదువ్వుకుని జడవేసుకోటానికి టైమేది? వంటబావ నమ్మకూతురు మాధవీకుమారి. అద్దకంగుడ్డ పరికిణీ దిగేసింది. కళ్లకు కాటుక దిద్దింది. లోపలికి బైటికి ఓ పరుగులు తీస్తోంది.

"సినో్న ! మీ వదినగారెక్కడ ? దర్శనమే లేదే. మా ఎదుటకూడ ఘోషాయేనా ఏమిటి?" అంది రుక్మిణి సేవతితో.

రామదేవి:- (చిరుమోముతో) ఘోషా కాదేమిటి మరి ? మనంచూస్తే దిష్టితగలదూ మరి ?

సేవతి:-గదిలో ఏమూలో పడుకుని నిద్రపోతుంటుంది. ఐతే ఉండండి. ఇక్కడున్నదాన్ని ఇక్కడున్నట్టుగా పరుగెత్తుకు పోయి లాక్కొస్తా.

ఇలా అని చంద్రావతి గదికెళ్ళింది. మాసిపోయిన మాసిపోయిన చీరెకట్టుకునిమంచంమీద పడుకునివుందిచంద్రా గుమ్మంకేసి చూస్తూ. సేవతిని చూడగానే లేచి నిలబడింది. "ఇక్కడపడి వున్నావేమిటి? ఒంటరిగా ఎలాతోస్తుందే నీకు?" అని ప్రశ్నించింది సేవతి.

చంద్రా:-ఉం; ఎక్కడి కెళ్ళమంటావూ? ఇంతవరకు చీరన్నా కట్టుకోందే.

సేవతి:-ఐతే మరి కట్టుకోవే? స్నేహితురాండ్రంతా నీ కోసం ఎదురుచూస్తున్నారు.

చంద్రా:-ఇప్పుడప్పుడే కట్టుకోను.

సేవతి:-ఇదిగో ఈ మొండితనమే నాకు బాగుండదు. వాళ్ళందరూ ఏమనుకుంటారూ ?

చంద్రా:-ఉత్తరం నువ్వేగా చదివావు. ఇవ్వాళ వచ్చేమాటలు కదూ ?

సేవతి:-అదా అసలు విషయం. మరి ఆమాట చెప్పవేం? ఐతే ఈ అలకంతా వారి రాకకోసం కాబోలు. అందుకే నేమిటి? ఈ యోగసాధనమంతానూ?

చంద్రా:-పొద్దు నెత్తిమీాది కొచ్చింది. ఇంకేం వస్తారూ! ఇవ్వాళకిక రారనుకుంటా.

ఇంతలో కమల, ఉమాదేవికూడ అక్కడకుచేరారు. నెత్తిమీాద ముసుగు వేసుకుని మంచందిగి క్రిందకొచ్చి కూర్చుంది. కమల చంద్రాకు పెద్దఆడబిడ్డ.

కమల:-అబ్బో! ఇంతవరకు ఈవిడ బట్టలే విడువలేదేమిటి?

సేవతి:-మా అన్నయ్యకోసం ఎదురు చూస్తోందిలే. అందు కని ఈ వేషం వేసింది.

కమల:-తెలివి తక్కువా ఆక లెక్కవానూ. వాడికి గర్జుగా వుంటే వాడేవస్తాడు.

సేవతి:-అందరి దొకదారైతే ఉలిపికట్టె దొక దారన్నట్టుగా ఈ బెడదారి వేరులే.

కమల:-మగవాళ్ళపట్లలోపల ఎంత ప్రేమగానైనాడుండొచ్చు కాని బైటికిమాత్రం అలాంటిదేమీా కనపడకూడదు. లేక పోతే అనవసరంగా వేధించుకుతింటారు. ఉపేక్షాభావంతో ఉండు. తిన్నగా మాట్లాడకు. అప్పుడు నీకు అన్నివిధాలా ఆదరణ లభించిందన్నమాటే. నీవంటే ప్రాణాలర్పిస్తారు. కాని నీ హృదయంలో తనపట్ల ప్రేమానురాగాలు వేరూని వున్న వని తెలిసిందా, ఇక ఆరోజునుండే దృష్టి మారిపోతుంది. షికారుకెళ్ళితే త్వరగా కొంపకు చేరరు. భోజనందగ్గర

కూర్చుంటే ఎంగిలిచేసి చేయి కడుక్కుంటారు. చీటికీమాటికీ అలిగి కూర్చుంటారు. ఏడిస్తేమాత్రం వచ్చి వూరడించుతారు. తర్వాత బలేవల వేసానులే అని చంకలెగరేస్తారు. నీ ఎదుట పరాయి స్త్రీలను పొగుడుతారు. సారాంశం, నిన్ను ఉడికించడంలో వాళ్ళకెంతో ఆనందంగా వుంటుంది. ఎవ్వరి విషయమో దేనికి! నేనే అందుకు ప్రత్యక్షప్రమాణం. మొదట్లో ఎంతగౌరవంగా చూచేవారో చెప్పలేను. ఎప్పుడుచూచినా నౌకరుమాదిరిగా చేతులు కట్టుకుని ఎదురుగా నిలబడి వుండేవారు. విసనకర్ర పుచ్చుకుని విసరటానికీ సంకోచించేవారు కాదు. స్వయంగా కలిపి తినిపించేవారు. ఇంతెందుకు నోట్లో నుండి మాట రావడమే తడవు కోరినకోర్కెలన్నీ నిమిషాల మీద తీర్చేవాళ్లు. అప్పుడు నే నింకా అబోధ స్త్రీని. మగవాళ్ళ కపటనాటకాల సంగతి నాకేం ఎరుక? ఆయనచెప్పే మాయమాటల్లో పడిపోయాను. ఇదిగో సేవతీ! చెప్పితే నమ్మవుగానీ, ఆరోజునుండే ఆయనదృష్టిమారిపోయిందనుకో. ఇక ప్రారంభమయ్యాయి షికార్లు ఒకరోజున అలిగికూడ వెళ్ళిపోయారు. తిరిగి రాత్రి రెండుజాములప్పుడు ఇంటికి చేరుకున్నాడు. ఇవ్వాళ చేతులు జోడించి ఎదురొస్తుందనుకునివచ్చారు. కాని ఇక్కడమాత్రం తక్కువ తిన్నదెవ్వరు? నిండా ముసుగుపెట్టి నిగడతన్నుకు పడుకున్నా, అసలు ప్రక్కన్నా మార్చలేదంటే నమ్ము. మర్నాడూ పలకరించలేను. కడకు దారికొచ్చాడు మహాశయులు. కాళ్లూగడ్డం పట్టుకుని బతిమాలాడు. ఆరోజునే పురుషులపట్ల ప్రేమ-ప్రదర్శనం పనికిరాదని గట్టిగా నిర్ణయించుకున్నా.

సేవతి:- బావగారినిచూచాను. అన్నయ్యపెళ్లికొచ్చారుగా. బలేనవ్వుముఖం మనిషి.

కమల:- ఆ సమయంలో పార్వతికడుపులోఉంది. అందువల్ల నే రాలేను. ఇక్కడనుంచి తిరిగొచ్చారు. నిన్నుపొగడే పొగడలు వినలేక చచ్చిపోయాను. ఎప్పుడన్నా తాంబూలం ఇవ్వటానికి వెళ్లావా? నీ చెయ్యి లంకించుకున్నాడటగా. కూర్చోపెట్టి తనివితీర సర్దాగా మాట్లాడారటగా?

సేవతి:- వట్టి అబద్ధాలకోరు లాగున్నాడేమూస్తే. అసలు జరిగిన విషయమిది. గులబిరూ జముసి లిద్దరూ ఏదో పని మీాద ఎక్కడికో వెళ్లారు. బావగా రప్పుడే భోంచేసివెళ్లారు. తాంబూలమిచ్చిరావే అంది అమ్మ. తాంబూలమివ్వటాని కెళ్లా. మంచంమీాద పడుకునివున్నాడు. నన్నుచూచి లేచి కూర్చున్నారు, తాంబూలం చేతికందించబోయా. గభాలున మణికట్టు పట్టుకున్నాడు. "ఇదిగో ఒక్కమాటవినిపో, ఒక్క మాటంటే ఒక్కమాట వినిపో" అని అనడం సాగించాడు, మాటాలేదూ గీటాలేదంటూ చెయ్యివిదిలించుకుని ఒక్క పరుగుతీశా.

కమల:- అబద్ధాలకోరని నేనన్నమాట రుజువయిందాలేదా? నేనూ బాగానే సాగతీసిఅడిగా. పది పన్నెండేళ్ళన్నా నిండా లేవే పిల్లకి, దాంతో ఏం మాట్లాడారు? అని అన్నా. కాని తాబట్టిన కుందేలుకి మూడేకాళ్ళంటాడే. మగవాళ్లు వట్టి బడాయికోరులు. 'నేను ఇలా అన్నా, నేనలాఅన్నా' అని ఏమేమో కోతలు కోస్తుంటారు. ఇలాంటి మాటలువింటే

అరికాలి మంట నెత్తికెక్కుతుంది నాకు. ఇలా అబద్ధాలు చెప్పుకోవడంలో - ఆ సర్దాపాడుగాను, అదేం సర్దాయో నా కర్థంకాదు. అందువల్ల ఒరిగి ఒళ్లోపడేదేమిటో తెలియదు. చెడుగానీ, మంచిగానీ, ఏదిచేసినా దాన్ని గుట్టుగా వుంచుకోవడం మానవుని లక్షణం. కాని ఈమగవాళ్ళు అలాంటి మానవులుకాదే. కాస్తంత ఏమో చేస్తారు. కొండంతేమో చెప్పుకుంటారు. అదే మొదలు, మగవాళ్ళు చెప్పేమాటల్లో రవ్వంతకూడ నమ్మకం లేకుండా పోయింది.

ఇంతలో గులబియావచ్చి "మీరంతా ఇక్కడకూర్చుని ముచ్చట్లు చెప్పుకుంటున్నారా? అక్కడ మీ స్నేహితురాలేమో మిమ్మల్ని త్వరగా లోపలికి పిలుచుకు రమ్మనమని తొందరపెడుతోంది.

సేవతి:- ఇదిగో వదినా! ఇక ఆలస్యంచేయకు. ఏమే గులబియా! ఈవిడపెట్టెతీసి కాస్త బట్టలు తీసుకురావే.

చంద్రావతికి బట్టలు కట్టి సింగారిస్తోంది కమల. సేవతేమో స్నేహితురాండ్ర దగ్గరకెళ్ళిపోయింది. "మా దొడ్డ అక్కడే దొరికావా. వెళ్ళిఅక్కడే కూర్చున్నావుకదా, ఇక్కడ మానసంగతేమిటి? ఎవ్వరితో మాట్లాడాలి? గోడలతోనా?" అంది రుక్మిణి

సేవతి:- కమలక్కయ్య వచ్చింది. ఆవిడతో ఏదో మాట్లాడుతూ కూర్చున్నా. ఇద్దరూ వస్తున్నారు.

రుక్మిణి:- పిల్లలావున్నా ?

సేవతి:- ముగ్గురు పిల్లలు.

రామదేవి:- చాలామంచి పుట్టకగలవాళ్లు.

చంద్రకుమారి:- వాళ్ళముక్కులు ముద్దొస్తుంటాయి. లాక్కో వాలనిపిస్తుంది.

సీత:- అక్క, చెల్లెలూ ఇద్దరూ ఒకరికి మించిన వాళ్లొకళ్ళు.

సేవతి:- సీతకు మంచి అందగాడు దొరికాడు. ఏనాడో బంగారు వినాయకుణ్ణి పూజించిపుట్టింది.

రుక్మిణి:- ( ఈర్ష్యగా ) ఎర్రతోలుపిల్ల వచ్చిపడేదేమీలేదులే.

సీత:- ఔనులే, నీకు నల్లతోలే బాగుంటుందికాబోల్లే.

సేవతి:- నాకుగనక నల్లమొగుణ్ణి కట్టిపుంటేనా, విషంత్రాగి చావకపోయానూ.

రుక్మిణి:- ఎట్టి కబుర్లెన్నైనా చెప్పొచ్చు. కాని నిజం చెప్పా లనుకుంటేమాత్రం నల్లమొగుడువల్లే ఎక్కువసుఖముంటుందని చెప్పాలి.

సేవతి:- సుఖంకాదు, బూడిదవుంటుంది. గ్రహణం పట్టినట్టుగా పడుతోండొచ్చు.

రుక్మిణి:-అవే తెలిసీ తెలియని మాటలంటే. దీన్నిబట్టిచూస్తే ఈ విషయంలో నీ కేమీ తెలియదనుకుంటున్నా. కాస్త అందంగా వుండే మగవాళ్ళు తమ షోకుల్లో, తమ సింగారా ల్లోనే మునిగివుంటారు. వాళ్ళ దృష్టిలో వుండనేవుండదు భార్య. ఒక వేళ ఆపిడ అందకత్తె గనక ఐతే ఫర్వాలేదు. లేకపోతే కొద్దిరోజుల తర్వాత ఇద్దరిమధ్యా ఆమడదూరం

ఉంటుందన్నమాట. ఇలాంటివాళ్ళెందరినో తన్ను చూచి తహతహలాడేటట్లు చేయగలను గదాఅనిఅనుకోసాగుతాడు. కాని నల్లటివాడికో లేక కురూపికోగనక మంచి అందమైన భార్య లభిస్తే తనకు వజ్రాలగని దొరికినట్లుగా భావిస్తాడు. తన అందవికారం లోటును ప్రేమ, ఆదరణలద్వారా భర్తీ చేస్తాడు. కాస్త బెడిసిందంటే ఎక్కడ అసహ్యించుకుంటుందో నని గుండెలెప్పుడూ కొట్టుకుంటుంటాయి.

చంద్రకుమారి:-మాటనోట్లోంచి రావడమే తడవుగా పూర్తి చేసే భర్తయే నిజంగా ఉత్తమ భర్త.

రామదేవి:-నీ విషయమే చెప్పావ్, మంచిమంచి నగలుంటే చాలు, నీకు, వరుడెలా వున్నా సరే ఫర్వాలేదు.

సీత:-నాకది కావాలి, నాకిది కావాలి అని తన పెనిమటి కెలా ఆర్డరు వేస్తారో తెలియదు. సిగ్గూ - సంకోచమూ ఏమీ వుండవాఏమిటి ?

రుక్మిణి:-నీ కళకు తోడు ఆర్డరు ఇవ్వడం కూడానా ? అసలు ముందు పలకరించేవా డున్నాడా అని.

సీత:-అలాగా ? ఆయన్ని చూస్తేనేచాలు, కడుపు నిండి పోతుంది నాకు. ఇంక నగలూ నాణ్యాలూ ఎవ్వరికి కావాలి? వాటిమీా దసలు నాకు దృష్టేవుండదు.

ఇంతలో ఇంకో ఆవిడవచ్చి చేరింది. ఒంటినిండానగలు దిగేసుకుంది పచ్చ పొడిపించుకున్నట్లుగా కాళ్లకు బూటేసింది అత్తరులో ఓలలాడుతోంది. కళ్లల్లో చాంచల్యం నాట్యం చేస్తోంది.

రామదేవి:-రండి, రాణిగారూరండి నీదే కొరతగా ఉంది.

రాణి:-ఏంచేయను? ఆ మంగలిముండ వూపిరాడనిస్తేనా? ఎప్పుడూ ఏదోఒకటి తెమ్మనమన్న మాటేనయ్యె. మరి కది లేదెట్లా? కుసుమ తల్లి వచ్చింతర్వాతగాని కాస్త తిలదువ్వు కోటానికి అవకాశం చిక్క లేదు.

సీత:-మీ జాకీ ఎంతఅందంగా వుందండీ.

రాణి:-దీని కథ అడక్కు. కుట్టమని ఇచ్చి సరిగ్గా నెలయింది. దర్జీ పది పన్నెండు సార్లన్నా కుట్టుకొని తెచ్చివుంటాడు. ప్రతిసారీ ఏదో ఒక లోటుచేసి తెచ్చేవాడు. చేతులుపొడవో వదలో, కుట్టు బాగా లేకపోవడమో, కుచ్చీళ్లు సరిగా లేక పోవడమో ఏదో ఒక లోటువుండేది. ఇంతకు ముందే సరిగ్గా బయలుదేరే సమయంలో తీసుకొచ్చి ఇచ్చిపోయాడు.

ఈ విధంగా మాట్లాడు కుంటూండగా ఇంతలో "అన్నయ్య వచ్చాడు, అన్నయ్య వచ్చాడు. వెంట బావ కూడా వచ్చాడు. అహాహ!" అని కేరింతలు కొట్టుకుంటూ వచ్చింది మాధవి.

రాణి:-రాధాచరణ్ వచ్చాడాఏమిటి?

సేవతి:-ఔను. పరుగెత్తికెళ్లి ఈ శుభవార్త వదినగారి చెవిని పడేసివస్తా. ఏమమ్మా వదినగారూ; ఎక్కడేమిటి?

మాధవి:-ఆ పెద్దగదిలోవుంది. బావేమో తలగుడ్డ చుట్టు కున్నాడు. అన్నయ్యేమో కోటుతొడుక్కున్నాడు. బావ నాకు రూపాయలిచ్చాడు.

ఇలాఅంటూ గుప్పిట తెరచి చూపించింది మాధవి.

రాణి:- సిత్తో! మిఠాయిపంచిపెట్టు.

సేవతి:- నేనేమీ మొక్కు మొక్కలేదే.

ఇలాఅంటూ చంద్రావతి గదిలోకెళ్ళి "ఇదిగోనదినా! నీ తారాబలం చంద్రబలం బాగా వుంది." అంది సేవతి

చంద్రా:- వచ్చారా ఏమిటి? కాస్తలోపలికి పిలుచుకురా.

సేవతి:- ఔను వచ్చారు. అక్కడంతా మగవాళ్ళున్నారు. నేనెలావెళ్తా? మీ అన్నగారూ వచ్చారట.

చంద్రా:- అక్కడ టైంచేస్తున్నారూ? ఇంకెవ్వరినన్నా పంపి పిలిపించరాదూ. లేకపోతే మళ్ళీ ఇంకో పుల్లయ్యతో మాట్లాడుతూ కూర్చుంటారు.

ఇంతలో పాముకోళ్ళ చప్పుడు వినవచ్చింది. రాధాచరణ్ వస్తున్నట్టుగా కన్పడ్డాడు. ఇరవై నాలుగో ఇరవై ఐదో వెళ్ళుంటాయి. నవ్వుముఖం. ఎర్రనిఛాయ. క్రాపు, క్రింది కటింగు మీసాలు, చూస్తే ధగధగమెరసి పోతున్నాడు. పల్చటి చొక్కా తొడిగాడు. వచ్చిమంచంమీద ఆసీనుడయ్యాడు — 'ఏం సిత్తో! వారం రోజులనుంచి వుత్తరం ముక్కన్నా వ్రాయలేదెందుకని? అని ప్రశ్నించాడు సేవతిని.

సేవతి:- ఇప్పుడిక ఇంటికే వస్తున్నావుగదా, ఇంకా వుత్తరం దేనికిలే అని అనుకున్నా.

ఇలాఅని అక్కడినుంచి వెళ్ళిపోయింది.

"అక్కడికెళ్ళితే మేం జ్ఞాపకమే వుండమా ఏమిటి?" అని అడిగింది చంద్రావతి నెత్తిమీది ముసుగు కాస్త తొలగించి.

రాధాచరణ్:- (కౌగిటచేర్చుకొని) షాను, జ్ఞాపకంలేకేమరి వందలమైళ్ళదూరాన్నుండి ఈ పరుగెత్తుకు రావడం.

# 9

వివాహానికి కొన్నాళ్ళు పూర్వంనుండే విరజన్ ఇంటికి వెళ్ళడం మానేశాడు ప్రతాప్. పెళ్ళిపనుల్లో ఏ ఒక్కదాని లోనూ పాల్గొనలేదు. చివరకు పెళ్ళినాడు మేజువాణీ దగ్గర కూర్చోడ వెళ్ళలేదు. లోపలేదో ద్వేషం పెట్టుకుని, ముఖం వేలాడేసుకుని ఇంట్లోనే కూర్చున్నాడు. మున్షీ సంజీవన లాల్, సువామ, సుశీల మొదలైనవాళ్ళంతా చెప్పిచూచారు బ్రతిమాలారు. కాని ససేమిరా కాదన్నాడు. అసలు పెళ్ళిపందిరి కేసి కన్నెత్తిచూస్తే ఒట్టు. చెప్పిచెప్పి చివరకు మున్షీకీ విరక్తి కల్గింది. తర్వాత మళ్ళీ పలకరించు ఎరుగడు. ఇదంతా వివాహానికి పూర్వం స్థితి. వివాహానంతరం ఆ వీధినిగూడ నడవడం మానేశాడు. స్కూలుకు బయలుదేరితే పక్కదారిన పోతాడు. దారి మధ్యలో ఏదో పెద్దపులి కూర్చున్నట్టుగా; లేదా అప్పులమొఖణ్ణి చూచి బాకీదారుడు ముఖం తప్పించి పోయినట్టుగా పోతాడు. విరజన్ నీడచూస్తేనే ఆమడదూరం ఎడంగా తప్పుకుంటాడు. ఖర్మంచాలక ఎప్పుడన్నా ఆవిడ తనఇంట్లో కడుగుపెట్టిందా అంటేచాలు తాను లోపలికిరాడు. తల్లి ఎన్నోవిధాలుగా చెప్పిచూచింది. "ఒరేబాబూ! ఆపిల్ల

మీాద ఇంతకోపం దేనికిరా ? దాంతో మాట్లాడక పోవటానికి కారణమేమిటి ? నే నేం తప్పుచేశానని ప్రతాప్ ఇంతకోపంగా వున్నాడని చెప్పి పాపం గంటలతరబడి ఏడుస్తోంటుందిరా. ఇదిగో ఇలా చూడు, మీా రిద్దరూ ఎంతోకాలంనుండి స్నేహంగా ఉన్నారు. అదంటే నువ్వెంత ప్రేమగా వుండే వాడివి ! ఇంతలోనే ఏం వచ్చింది ఇంతగా మారిపోటానికి ? ఇలాగే ఇంకా కొన్నాళ్ళు అలిగి కూర్చున్నావంటే పాపం దాని ప్రాణానికొస్తుంది. ఇప్పటికే ఎండి గోగుపుల్లయి పోయింది. దైవసాక్షిగా చెబుతున్నా. దాన్నిచూస్తే జాలే స్తుంటుంది. నీ చర్చమినహా ఇంకోమాట చెబితే దానికిష్టం గా నేవుండదు."

తలవంచుకుని తల్లి బోధనలన్నీ వింటాడు మెదలకుండా ప్రతాప్. తర్వాత చల్లగా జారుకుంటాడు. జ్ఞానం తెలియని పసిబాలుడు కాదు ఇప్పుడు ప్రతాప్. అతని జీవితవృక్షానికి యౌవ్వన చిగురుటాకులు చిగుర్చుతున్నాయి. తనకు కాస్త వూహా వచ్చినప్పటినుండే విరజన్ జీవితాన్ని తన జీవితంలో మధు - క్షీరములవలె కల్పివేసుకున్నాడు. ఏవేవో కలలు గన్నాడు. ఆ మనోహర, సుఖదస్వప్నాలన్నీ బూడిదపాలై పోవటం చూంచి కఠోర, కాఠిన్యాలను సాక్షాత్ మూర్తిలా తయారయ్యాడు. అతని కోమల హృదయాన్ని విదీర్ణం చేయ టానికి ఈ పరిస్థితేచాలు. విరజనే తన సర్వస్వం అని భావించే వ్యక్తి ఎందుకూ కొరగాకుండా పోయాడు. కాని విరజన్ ముఖమెలా వుంటుందో ఎరుగని వ్యక్తికి ఆమె సర్వస్వమై పోయింది ! ఈ ఆలోచన హృదయాన్ని కలవరపెడుతోంది.

తన సుఖదస్వప్నసౌధం కూల్చ్రోసిన పాపాత్ముసికి, తన జీవితాశలు గంగలోకలిపిన అధమునికి ప్రతీకారంచేసి, తీరాలనే వాంఛ మనస్సులో కల్గింది. ఈ ప్రతీకార జ్వాలలకు ఆహుతి చేయతగిన ప్రథమవ్యక్తి సుశీలయేనని తోచింది.

కాలక్రమేణ ఈర్ష్యా-ద్వేషాల మూర్తిగా తయారయ్యాడు. స్కూలునుంచి వస్తాడు. కమలాచరణ్‌గురించి రోజూ ఏదో ఒక కొత్త వింతవార్త మోసుకొచ్చి వర్ణిస్తుంటాడు. అందులోను సుశీలవున్నపుడు మరీ విడ్డూరంగా అసహ్యంగా వర్ణిస్తాడు పాపం. ఆ పిల్లను మానసికంగా బాధపెట్టడంఅంటే ఎంతో మజాగా వుంటుంది. అబద్ధాలు చెప్పడంఅంటే నైజంగా అసహ్యించుకునే వ్యక్తి ప్రతాప్. ఆ చెప్పేదానిలో పెద్దగా అబద్ధాలేమీ వుండవు ఐనా అతను వర్ణించే పద్ధతీ, చెప్పేవరుసా చూస్తే సుశీల హృదయం దహించుకు పోతోంటుంది, ఆవిడ కోమలహృదయాన్ని ఖేదించుకుని పోయే బాణాలులా గుచ్చుకుంటూఉంటాయి. "కమలామహోదయుడు ఇవ్వాళ బెంచీమీద తాడిలానుంచున్నాడు. తలవెళ్ళి చుక్కల్ని అంటుకుంటోంది. ఐనా ఎంత సిగ్గులేనివాడో చూడు. బెంచీమీద నిల్చొని పళ్ళికిలిస్తున్నాడు. ఇవ్వాళ మా బళ్లో జరిగినవింత అసలెక్కడా, ఎప్పుడూ జరగలేదనుకో ఎవ్వరో ఒక అబ్బాయి గడియారం మాయంచేశాడు కమలాచరణ్ సాహుకారుగారు వాడెళ్ళి మాష్టరుగారితో మొరపెట్టుకున్నాడు. ఈ మహానుభావుడే వాడిపక్కన కూర్చున్నాడు. మాస్టరుగారొచ్చి తనిఖీచేశాడు. అన్నీ తడిమి చూచాడు. ఈయనగారి బెల్టులోఉంది. ఇంకేంకావాలి?

దొంగదొరకనే దొరికాడు. వెంటనే హెడ్మాస్టరుగారికి రిపోర్టు చేయబడింది. ఇక ఆయన పేనుబెత్తం పుచ్చుకుని చిందులు తొక్కుకుంటూ పరశురాముడిలా వచ్చిపడ్డాడు. వచ్చీ రావడంతోనే 'ఫెడీఫెడీ' మని లెక్కపెట్టి మూడు డజన్లు వడ్డించాడు. బడిఅంతా విరగబడి తమాషా చూచింది. దెబ్బలు కొట్టినంతసేపూ 'అమ్మో, నాయనో' అని కప్పెగిరి పోయేటట్లుగా కేకలు పెట్టాడు. కాని బైటికడుగు పెట్టాడు, మరి ఆ కేకలన్నీ ఏమైపోయాయో, పకపకానవ్వుతున్నాడు; మీసాలు దువ్వుకుంటూ పోతున్నాడు. "ఇదిగో పిన్నీ! ఇంకా విన్నావా లేదా? ఇవ్వాళ బావగార్ని స్కూల్లో గేటు దగ్గర పట్టుకుని బాగా నలుగుపెట్టారు విద్యార్థులు" ఈ వర్ణనలు విని లోలోపల కుమిలిపోయేది సుశీల. కాని ఒక విషయం. ఇలాంటిమాటలు విరజన్ ఎదుటమాత్రం ఎన్నడూ చెప్పేవాడు కాదు. దైవవశాత్తు విరజన్ ఎప్పుడన్నా ఇంట్లో వుండడం తటస్థిస్తే ఆమె వెళ్ళిపోయేవరకు అలాంటి ప్రసంగం తెచ్చేవాడు కాదు. తన మాటలూ - వర్ణనలూ ద్వారా ఆమెకు బాధ కల్గించడం ఇష్టంలేదు.

మున్షీ సంజీవన్‌లాల్ కూడ అనేకసార్లు ప్రతాప్ చెప్పే మాటల్ని సమర్థించాడు. ఒకరోజున వీధుల్లో గాలిపటాలెగురవేస్తూ కనపడతాడు. ఇంకోరోజున రౌడీలతో చేరి సిగరెట్లు త్రాగుతూ, కిళ్ళీలు నములుతూ కానవస్తాడు. అల్లుడుగారి ఈ పద్ధతులు చూచి ఒళ్ళు మండిపోయి చరాచరా యింటికొస్తాడు. ఆ కోపమంతా పాపం సుశీలమీద చూపిస్తుంటాడు. ఇదంతా నువ్వు చేసిన ఘనకార్యమే. గొప్పవంశమనీ, సుగు

కొలగననీ, అంత సాంప్రదాయకులు అసలీ పట్నంలోనే లేరని చెప్పింది నువ్వుకాదూ. భూమిమీద నడచావా?" ఈ విధంగా నేరమంతా భార్యనెత్తిన రుద్దిపారేస్తాడు. కాని ఇందులో తనకూ సగంభాధ్యత వుందన్నమాటమాత్రం దృష్టిలో ఉంచుకోడు. పాపం ఆవిడ చేసుంది? గడపదాటి బైటకురాదు కదా. మరి పెళ్ళికొడుకెలాంటివాడో ఎలా తెలుస్తుంది? జ్యోతిషం చదవలేదుగదా. పిల్లవాడి తలిదండ్రులు మంచి మర్యాదస్తులుగా కనపడ్డారు. అటూ భాగ్యానికీ లోటులేదు. సరే మంచి సంబంధమేకదా అని వూహించి తలకాయ ఎగ రేసింది. ఇదే ఆమె నేరమంతా. కాని మున్షీమహాశయుడు తన ఒంటిబద్ధకం, అకర్మణ్యతా కారణంగా ఇల్లు కదలలేదు. వెళ్ళి మంచిచెడ్డలు విచారించలేదు. వెళ్లిచూచుకునే, మాట్లాడేసదవకాశం ఎన్నోసార్లు లభించింది. కాని ఇంట్లోనుండి బయలుదేరితేనా! ఇక్కోవిషయముంకూడ వుంది. తమ ముద్దుబిడ్డల్ని తీసుకెళ్ళి ఈ రకంగా కళ్ళుమూసుకుని నూతిలో పారవేసే తన కులస్థు లెందరో ఈ దేశంలోనే ఉన్నారు. మరి కులమర్యాద ఎక్కడికి పోతుంది?

విరజన్‌కన్న మించిన ప్రియతమవస్తువు ప్రపంచంలో సుశీలకు మరొకటిలేదు. విరజన్ ఆవిడకు ప్రాణం; విరజనే ఆవిడకు మర్మం; విరజనే ఆవిడకు పణ్యం. విరజనే ప్రాణాధారం, నేత్రజ్యోతి, హృదయోల్లాసం. తన ప్రియపుత్రిక మంచి కుటుంబంలో కెళ్ళాలి. అన్నదొక్కటే ఆమె భౌతికాభిలాష. దానికి దైవస్వరూపులైన అత్తమామలు లభించాలి.

శ్రీరామచంద్రునివంటి సుశీలుడైన భర్త లభించాలి. దాని మీద కష్టాల ఛాయ సైతం పడకూడదు. ఎన్నో నోములు నోచి, ముడుపులు చెల్లించి ఈ పుత్రికారత్నాన్ని పొందింది. ఈ అందాల బరిణి, ఈ హరిణాక్షి యావజ్జీవితం తన కళ్ళ ఎదుటనే ఉండాలని ఆమె హృదయాభిలాష. అల్లుణ్ణి తెచ్చుకుని తన ఇంట్లోనే వుంచుకోవాలని కోర్కె. విరజన్‌కు సంతానం కల్గితే వాళ్ళను పెంచి పెద్దవాళ్ళను చేయాలని కుతూహలం. అల్లుడు తన్ను 'అమ్మ' అని పిలుస్తుంటే తాను అతన్ని కొడుకులా చూచుకుంటుంది. ఇటువంటి అభిలాషలతో నిండిన హృదయంపై ఇలాంటి హృదయ విదీర్ణవర్ణనల ప్రభావం ఎలా వుంటుందో వేరే చెప్పనవసరం లేదు.

అయ్యో! పాపం సుశీల మనోవాంఛలన్నీ బూడిదలో కల్సిపోయాయి. ఆశలన్నీ అడియాసలయ్యాయి. ఏమేం కలలు కన్నది? ఏమేం జరిగింది? 'ఇప్పుడప్పుడే ఏపాటి వయస్సులే; ఇంకా రెండేళ్ళు పోతే దురలవాట్లన్నీ తనంతట తానే వదలిపెడ్తాడు.' అని తన్ను ఓదార్చుకుని సంతృప్తి పడి వూరుకుండేది. ఒక నేరారోపణ ద్వారా తగిలిన గాయం మానకముందే ఇంకో కొత్తగాయం తగులుతోంది. 'అయ్యో! విరజన్ నొసటన ఏంరాసిపెట్టాడోకదా దైవం! నా సుగుణాలబరిణి, నా వంశజ్యోతి, నా శరీరప్రాణం ఈ దుర్గుణ మూర్తితో కలిసి కాపరం ఎలాచేస్తుంది? నా గారాబు కపోతం ఈ డేగవాతనే పడుతుందా?' ఈ విధంగా ఆలోచిస్తూ విలపిస్తుంది. గంటలతరబడి కన్నీరు మున్నీరుగా ఏడుస్తుంది. మొదట కూతుర్ని అప్పుడప్పుడు కాస్తమందలిస్తూ

ఉండేది. కాని ఇప్పుడు పొరపాటునకూడ నోరెత్తి ఒకమాట అనదు. కూతురు ముఖం చూడగానే ఇవన్నీ జ్ఞప్తికొస్తాయి. ఒక్క నిమిషమైనా ఎడంగా వుండనివ్వదు. కొంచెంసేపు సువాముగారింటికెళ్ళి కూర్చుంటే వెంటనే స్వయంగా వెళ్లి పిలుచుకొచ్చేది. తన బిడ్డను ఎవ్వడో బలవంతంగా ఎత్తుకు పారిపోతున్నట్లుగా కనపడుతుంటుంది. తన బిడ్డ మెడపై కసాయివాడి కత్తిచూచి వలవలవిలపించే గోమాతలా తన బిడ్డ దుఃఖంచూచి విలపిస్తుంటుంది మాత సుశీల. జగత్తే సార హీనంగా, శూన్యంగా, కన్పడుతుంది. ఇప్పుడు కూతుర్ని వదలి ఒకరెప్పపాటుకాలంకూడ ఒంటరిగా వుండలేకపోతోంది. ఎప్పుడన్నా అలాంటిదిసంభవిస్తే గూటిలోనిపిల్లలు మాయమై పోయిన తల్లిపక్షిలా వ్యాకులపడిపోతుంది.

సుశీల అసలే రోగిష్టిమనిషి, దానికితోడయ్యాయి భావిచింతలూ, వర్తమాన ఈర్ష్యాగ్నులూనూ ఇవన్నీ కలిసి ఆమెను మరింత పీల్చిపిప్పిచేసేశాయి. నిందారోపణలు గుండె కాయను తూట్లుపొడిచాయి. ఆరుమాసాలన్నా గడవకముందే క్షయరోగ లక్షణాలు పొడ చూపాయి. మొదట్లో కొన్నాళ్ల వరకూ ధైర్యం చేసి, జబ్బుసంగతి తెలియనీయకుండా కాలం గడిపింది. కాని ఎన్నాళ్లుదాచగలదు? రోగం చూస్తే రోజు రోజుకీ ఎక్కువై పోతోంది. తత్ఫలితంగా శరీరమూ క్షీణించి పోసాగింది. కడకు మంచంమీదనుంచి లేవలేనిస్థితికూడ వచ్చింది. వైద్యులూ, డాక్టర్లూ మందుల మీద మందులు పోస్తున్నారు. విరజన్ సువాము లిద్దరూ తెల్లవార్లూ మంచం దగ్గరే వుంటున్నారు. ఒక్కనిమిషంకూడ విరజన్ ఎడబాటు

సహించలేకుండావుంది సుశీల. కాస్త ఎక్కడికన్నా వెళ్ళితే స్పృహలేనిదానిలా అయిపోయేది. వెక్కి వెక్కి ఏడ్చేది. మొదట్లో కొన్నాళ్ళు మంచిధైర్యంతోనే మందులిప్పించాడు మున్షీసంజీవనలాల్. కాని ప్రయత్నాలన్నీ వృథాఅయ్యాయి. ఆరోజు కారోజుకి స్థితిమరీ విషమిస్తోంది. ఈ దశ చూచి అధైర్యం చెందిపోయాడు. అందువల్ల పెద్దగా ప్రయత్నించడమూ విరమించుకున్నాడు. చాలా ఏళ్ళక్రితం ఒకసారి సుహాసా ఇలాగే జబ్బుపడింది. అప్పుడు ఆమెకెంతో సేవచేసింది సుశీల. ఇప్పుడు సుశీలజబ్బుపడితే సేవచేయవలసినవంతు సుహాసకొచ్చింది. ఇరుగుపొరుగమ్మగా, చెల్లెలుగా తన విధ్యుక్తధర్మం నెరవేర్చింది. ఆవిడపరిచర్యల్లో తన సంసారం గొడవ కూడమరచి పోయింది. ఒక్కొక్కసారి రెండేసి మూడేసి రోజులవరకూ కన్నకొడుకుముఖం సైతం చూచుకునే అవకాశంకూడ లభించేదికాదు. తరచుగా భోంచేయకుండానే బడికిపోయేవాడు ప్రతాప్. ఐనా మనస్సుకు కష్టం తగిలే మాట అని ఎరుగడు. సుశీల రోగపరిస్థితి అతనిద్వేషాగ్నిని చాలావరకు చల్లార్చింది. ద్వేషింపబడేవాడు కొంచెం బాగుపడుతుంటే ద్వేషించేవాడి ద్వేషాగ్ని పెరుగుతుంది. వాడి జీవిత దీపం ఆరిపోతే వీడి ద్వేషమూ ఆరిపోతుంది.

ఇవ్వాళ భోంచేయకుండానే ప్రతాప్ స్కూలు కెళ్ళిపోయాడని తెలిస్తే చాలు, వెంటనే పనులన్నీ వదలి ముందు వాళ్ళింటికి వెళ్లేది విరజన్. అన్నం తినమని బలవంతపెట్టేది. కాని ప్రతాప్మాత్రం పలకరించడం దేవుడికెరుక, అసలు కన్నెత్తిచూచేవాడు కాడు. అంతగా ఏడ్వడం ప్రారంభిస్తే

చల్లగా జారుకునేవాడు. విరజన్ నిర్దోషురాలని అతనికి తెలుసు. కాని ఎలాగైనా ఎడబాబు తప్పదుకదా, కనుక ముందుగానే ఎడబాబు చేసుకోవడం మంచిదనే నిర్ణయానికొచ్చాడు. ఒంటరిగా కూర్చుని కన్నీరు కారుస్తాడు. ఐనా ప్రేమోద్వేగాన్ని మాత్రం హద్దులు దాటిపోనిచ్చేవాడు కాదు.

ఒకరోజున స్కూల్లోంచి వచ్చి తనగదిలోకూర్చొని ఉన్నాడు. ఇంతలో విరజన్‌వచ్చి ఎదుట నిలబడింది. ఆమె చెక్కిళ్ళపై అశ్రుకణాలు జలజలరాలుతున్నాయి. ముక్కోళ్లు ఎగరవేస్తూ వెక్కివెక్కి ఏడుస్తోంది. ముఖంపై నిరాశా వాతావరణం వ్యాపించివుంది. ఆ స్థితిచూచి తన్ను ఆపుకోలేకపోయాడు. "ఏం విరజన్' దేనికి ఏడుస్తున్నావు?" అని ప్రశ్నించాడు, కంటతడిపెట్టుతూ. విరజన్‌నుండి జవాబు రాలేదు. పైగా ఏడ్పు మరింత ఎక్కువయింది. ప్రతాపుని గాంభీర్యం చలించిపోయింది. లేచి నిలబడ్డాడు. నిస్సంకోచంగా విరజన్ కన్నీళ్ళు తుడువసాగాడు. కాస్త గొంతు సవరించుకుని "లల్లూ" అమ్మ ఇక జీవించదు," అంది వెవస్త్రెడిగా. ఇలా అని ఒక్కసారి ఆవురుమంది

ఈ పిడుగువంటివార్త విని స్తభించిపోయాడు ప్రతాప్. ఒక్క పరుగునవెళ్ళి వాళ్ల ఇంట్లో వ్రాలాడు. సుశీల మంచం వద్ద నిల్చొని ఏడుస్తున్నాడు. ఆహా! మానవుని అంతిమ సమయం ఎంత అభివందనీయమోగదా! ఎంతోకాలంనుండి మన ముఖం చూడరాదనుకున్న వాళ్ళను మనకళ్ల ఎదుటికి లాక్కొచ్చి నిలబెడుతుంది. ఈ సమయమొక మహాశక్తి. దీన్ని జయించటం వాళ్ళ తరంకాదు. మహా పరాక్రమశాలి

రైన బద్ధశత్రువుకు సైతం మనముందు మోకరింపచేస్తుంది. అజేయ శత్రువులపై విజయదుందుభి మ్రోగిస్తుంది. అస్త్ర శస్త్రాల కభేద్యమైనవాళ్ళకు సైతం మనమెంత దుర్బలకాయులమైనా మన అధీనం చేస్తుంది. ఈ ఇంటిలో కడుగుపెట్టి సరిగా సంవత్సరమయింది. సుశీల కళ్ళు మూతబడివున్నాయి. ముఖంమాత్రం పద్మంలా వికసించివుంది "లల్లూ నొక్కసారి చూపించండి." అని ప్రొద్దుటినుంచి ఒకే కలవరించడం. ఆ కారణంచేతనే వ్రజరాణి నంపింది సువామ.

"అక్కా! అక్కా!! కళ్ళుతెరువు. ఇదిగో లల్లూ వచ్చాడు" అంది సువామ.

కళ్లు తెరచి చూచింది సుశీల. అత్యంత ప్రేమాతురతతో చేతులు చాపింది. ప్రతాపుని హృదయంలో దాగి మిగిలివున్న ద్వేషాగ్నికణంకూడ చల్లారిపోయింది. ఇలాంటి సమయంలోకూడ తన మనస్సులో మాలిన్యం వుంచుకునే అభాగ్యుడెవ్వడుంటాడు? ఒకవేళ ఎవ్వడన్నా వుంటేవాడికి మానవుణ్ణనిపించుకునే హక్కులేదు. యదార్థ పుత్రభావంతో ముందుకెళ్లాడు ప్రతాప్. ఆవిడ ప్రేమాంకస్థలంలో కెళ్ళి ఆసీనుడయ్యాడు. ఒకరిమొఖం ఒకరు చూచుకుంటూ ఉభయులూ ఒక అరగంటసేపు విలపించారు. ప్రతాపుని తన బాహువుల మధ్య గట్టిగా నొక్కి పట్టుకుంది. అతను విదలించుకుని పారిపోబోతున్నాడన్నట్టుగా. తన్ను విపరీతంగా దూషించుకుంటున్నాడు. "ఈ దుఃఖితురాలి ప్రాణా లపహరించిన పాపాత్ముణ్ణి నేనే. ఈర్ష్యా - ద్వేషాలనులోనై ఈవిడ నీ స్థితికతెచ్చిన దుర్మార్గుణ్ణి నేనే. ఈ ప్రేమమూర్తి వినాశ

నానికి కారకుడను నేనే. "ఇలాంటి భావాలు రేకెత్తినకొద్దీ కన్నీటిధార ఎక్కువై పోతున్నాయి. చివరకు "లల్లూ! నేనిక రెండుమూడు రోజుల అతిధిని మాత్రమే. తప్పులుంటే క్షమించు." అంది కన్నీళ్లు కారుస్తూ సుశీల.

ప్రతాపుని కంఠస్వరం వశం తప్పిపోయింది. అందు వల్ల సమాధానమేమీ ఇవ్వలేకపోయాడు.

"నామీద ఇంతకోపంగా దేనికున్నావో నాకు తెలి యదు. మా ఇంటికిరావు; మాతో మాట్లాడవు. నిన్ను చూడాలనీ, ముద్దుగా పలకరించాలనీ మనస్సెంతో తహతహ లాడిపోతుంటుంది. కాని నా ధ్యాసే నీకు లేదు. చెప్పు! ఈ అనాథ పిన్నిపై కోపందేనికో చెప్పు. దైవసాక్షిగా చెబుతున్నా, సదా నిన్ను కన్న కుమారునిగానే భావించా. నిన్నుచూస్తే ప్రాణం లేచివచ్చేది. ఆనందానికి హద్దులుండేవికావు." అని అంది మళ్లీ సుశీల. ఇలా అంటూఅంటూనే బలహీనతవల్ల మాట ఆగిపోయింది. విశాల గగనాంతరాళంలో ఎగిరిపోయే పక్షి కంఠస్వరం ప్రతిక్షణమూ మందగిస్తూ పోతుంటుంది. చివరకు దాని శబ్దం ధ్వానమాత్రమే మిగిలిపోతుంది. అదే విధంగా సుశీల కంఠస్వరం క్రమక్రమంగా తగ్గుతూ చివరకు 'ఇస్, ఇస్' అనేది మాత్రమే మిగిలిపోయింది.

# 10

మరో మూడురోజులు గడిచాయి. సుశీల జీవించడం అసంభవంగా కనపడింది. ఆ మూడురోజులూ దగ్గరకూర్చుని

మరేం ఫర్వాలేదని ధైర్యం చెప్పాడు మున్షీ సంజీవనలాల్. మంచందగ్గర ఒక్కనిమిషం కనపడకపోయినా ఎంతో వ్యాకులపడేది. కంటతడిపెట్టుకుని "నన్ను వదలిపెట్టి పోయాడు" అని అనేది. ఎదురుగా కనపడుతున్నా సంతృప్తిగా వుండేదికాదు. పిచ్చిదానివలె చెయ్యి పట్టుకునేది. "నన్నొదిలిపోవుగదా?" అని ప్రశ్నించేది నిరాశాభావంతో. మున్షీ మంచి గుండెగల మనిషి. ఐనా ఆ మాటలకు గుండె నీరైపోయేది. తెరలు తెరలుగా మూర్ఛ వచ్చేది సుశీలకు. మళ్ళీ కాస్త తెలివిరాగానే త్రుళ్ళిపడి బిత్తర బిత్తరగా దిక్కులుచూచేది. "ఆయనేడీ? నన్ను వదలివెళ్ళిపోయాడా?" అని మళ్ళీ అనేది. ఒకొక్కసారి ఆ మూర్ఛతెర ప్రమాదంగా వచ్చేది. "నేనెక్కడికీ వెళ్ళడంలేదు. ఇక్కడేవున్నా. మరేం భయంలేదు." అని పదేపదే మున్షీకి చెప్పవలసిన అవసరం కల్గేది. ఐనా సుశీలకు నమ్మకం కల్గేదికాదు. అతనికేసి రెప్పవాల్చకుండ చూస్తూ "ఇక్కడలేరే, ఎక్కడికెళ్లారు?" అని అడిగేది. కాస్సేపటికి మళ్లీ ఆమైకం విడిపోతే మెదలకుండా పడుకుని విపరీతంగా ఏడ్చేది. ఆమూడురోజుల్లో ఒక్కసారైనా విరజన్, సువామ, ప్రతాపులలో ఏ ఒక్కరి సంగతి ఎత్తలేదు. వాళ్లంతా అక్కడేవున్నా, ఒక్క మున్షీజీని మాత్రమే అడిగేది. అతన్ని మినహా ఇంకెవ్వర్నీ ఎరగదన్నట్టుగా. సంక్షుబ్ధురాలై విరజన్ ఆమెను కౌగిలించుకుని ఏడ్చినప్పుడు మాత్రం కొద్దిగా కళ్ళువిప్పి "ఎవ్వరు? విరజనా?" అని అనేది. మృత్యువు సమీపించినపుడు పిసినిగొట్టుదృష్టి ధ్యాసలన్నీ పాతిపెట్టిన ధనంమీదనే వున్నట్టుగా హిందూస్త్రీ

దృష్టి - ధ్యాసలన్నీ మృత్యుపుకాలంలో భర్తమీదనే వుంటాయి.

మధ్యమధ్యలో త్రుళ్ళిపడి లేస్తుంది సుశీల. విస్మితురాలై "అరే! ఈ నిల్చొన్నదెవరు? ఆపరుగెత్తేవాడెవ్వడు? వాణ్ణి ఎందుకు లాక్కుపోతున్నారు? అదేంకాదు, నేవెళ్ల నివ్వను" అని ప్రలాపిస్తుంది. ఇలా అంటూ మున్షీగారి చేతులు రెండూ గట్టిగా పట్టుకుంటుంది. కొంచెం ఆగి కొద్దిగా తెలివిరాగానే "మిమ్మల్ని ఎవ్వరో లాక్కుపోతున్నట్టుగా కలలో చూచాను. ఇదిగో, నాతోడు, ఎక్కడికీ వెళ్ళకండి. ఏమో ఎక్కడికి లాక్కుపోతాడో వాడు. మళ్లీ మిమ్మల్ని చూడగలనో లేదో?" అని అంటుంది సిగ్గుపడుతూ. ఈ మాటలువిని మున్షీకి బేజారెత్తేది. భార్యకేసి అతి దీనంగాచూస్తూ "లేదు. ఎక్కడికీ వెళ్ళను. నిన్నొదిలి ఎక్కడికపోతాను?" అని అనేవాడు, ఈ పరిస్థితి చూచి ఈ దీపం ఆరిపోనున్నదని గ్రహించి ఏడ్చేది సువామ. పరిస్థితుల ముందు సిగ్గెగ్గులు లేకుండా పోయాయి. మున్షీగారి ఎదుట గంటలతరబడి ఘోషా లేకుండానే వుండేది సువామ.

నాల్గోరోజున సుశీల స్థితి కొంచెం బాగుపడింది. ఇది అంతిమసమయమని గ్రహించాడు మున్షీ. దీపం ఆరిపోయే ముందు ఒక్కసారి గప్పుగప్పుమంటుంది. ప్రొద్దుట ముఖార్జనంచేసి లోపలికిరాగానే చేతితో సైగచేసి మంచందగ్గరకు పిలిచి "మీ చేత్తో కాసిని మంచినీళ్లు త్రాగించండి. అని అడిగింది. ఇవ్వాళ బాగా తెలివిగావుంది, విరజన్, ప్రతాప్,

సువామ వగైరాలందర్నీ గుర్తుపడుతోంది. విరజనుని చాలా సేపు కౌగిటచేర్చుకుని ఏడ్చింది. మంచినీళ్లు త్రాగిన తర్వాత సువామతో "అక్కా! కాస్తలేచి కూర్చోబెట్టు. ఆయన చరణకమలములను కడసారిగా కళ్ళకద్దుకుంటా. ఏమో, మళ్ళీ ఎన్నాళ్ళకీ చరణయుగదర్శన సౌభాగ్యం సంప్రాప్తిస్తుందో ఎవ్వడికెరుక.' అంది. ఈమాటలువిని కన్నీరుకారుస్తూ చేతులమీద లేపి కూర్చోబెట్టింది. విరజన్ ప్రతాపులూ అక్కడ ఎదురుగా వున్నారు. భర్తనుచూచి "దగ్గరకు రండి" అంది. కరుణతో విహ్వాలుడై భార్యను కౌగిట చేర్చుకుని గద్గదకంఠంతో "మరేం ఫర్వాలేదు. దేవుని దయవల్ల శుభ్రంగా నయమైపోతుంది." అన్నాడు. "ఔను, ఇవ్వాళ తప్పక నయమైపోతుంది. కాస్త మీ కాళ్ళిటు అందించండి. కాస్త కళ్ళకద్దుకుంటాను." అంది నిరాశాభావంతో సుశీల. మున్షీజీ సంకోచిస్తున్నాడు. ఇంతలో "ఆమె కోర్కెను కాదనడం దేనికి కాళ్లు అందించండి" అంది సువామ ఏడుస్తూ. మున్షీకాళ్లు చాపడంతోనే రెండుచేతులతో పట్టుకుని ఎన్నోసార్లు ముద్దిడుకుంది. తర్వాత చరణములపై చేతులుంచి ఏడ్వసాగింది. కాస్సేపటిలోనే చరణద్వయం ఉష్ణాశ్రుజలరాశితో తడిసిపోయింది. పతివ్రతాస్త్రీ తన ప్రేమ ముత్యాన్ని పతిదేవుని చరణాల కర్పించింది. కంఠస్వరం కాస్తదారికి రాగానే విరజన్ హస్తం పట్టుకుని భర్త హస్తంలో వుంచింది. అత్యంత క్షీణ కంఠస్వరంతో "స్వామీ! చాలాకాలం మీతో కలిసి కాపరంచేశా. జీవిత సౌఖ్యానందం అనుభవించా. ఇప్పుడు ఆ ప్రేమ - బంధం తెగిపోనున్నది. ఇంకొక నిమిషం అతిథిని

మాత్రమే. ప్రియ విరజనుని మీ హస్తాలలో ఉంచిపోతున్నా. నా స్మృతిచిహ్నం ఇదే. దీనిపట్ల సదా దయార్ద్ర హృదయంతో వుండండి. నా ప్రియకుమార్తె సుఖ - సౌఖ్యాలు కళ్ళతో చూచుకునే అదృష్టం నాకు లేదు. ఎన్నడూ పల్లెత్తి ఒక్క మాట అనలేదు. కఠోరంగా చూడలేదు. ఇది నా జీవిత ఫలం. ఈశ్వరసాక్షిగా దీన్ని మరచిపోకండి." అని అంటోంది. ఇంతలో చాలీ, ఎక్కిళ్లొవచ్చాయి, మూర్ఛలావచ్చింది.

ఎక్కిళ్లు కాస్తతగ్గాయి. కొద్దిగా చాలితీర్చుకుని సువామకు చేతులు జోడించి నమస్కరిస్తూ "అక్కా! విరజనుని నీ కప్పగిస్తున్నా. నీవే దానికి తల్లివి." అంది ఏడుస్తూ. తర్వాత ప్రతాపు నుద్దేశించి "లల్లూ! ఈశ్వరుడు నిన్ను చిరాయువునిగా చేయుగాక. నీ విరజనుని మరచిపోవద్దు. ఇది అనాథ. మాతృహీన చెల్లాయి. దాని ప్రాణమంతా నీమీదనే ఉంటోంది. దాన్ని ఏడ్పించవద్దు; దానిమనస్సును బాధపెట్టవద్దు; ఎన్నడూ కటోక్తులాడవద్దు; దానిపై కోపించవద్దు; ఒక్క క్షణమాత్రమైనా మర్వవద్దు. లేకపోతే ఏడ్చిఏడ్చి ప్రాణంకోల్పోతుంది. దాని నొసటన బ్రహ్మదేవుడేం రాసిపెట్టాడో ఎవ్వడికి తెలుసు. కాని నీ సొంతసోదరినిగా మాత్రం భావించు. సదా ధైర్యంచెబుతుండు. కొద్దిరోజుల్లోనే మిమ్మల్ని ఎడబాసి పోతున్నా. కాని నామీదబట్టు, దానియెడ మనస్సులో కల్మష మేమీ వుంచుకోవద్దు. దాన్నొకదరికి చేర్చ గల్గినవాడవు నీ వొక్కడవే. నా హృదయంలో ఏమేమో అసంఖ్యాక అభిలాషలుండేవి. నీ వివాహం చేయాలని, నీ పిల్లల్ని సాకాలనీ

అనుకున్నా. కాని బుద్ధి భూములేలుతుంటే రాత గాడిదల్ని కాస్తున్న చందమయింది.

ఇలా అంటూ అంటూ మళ్ళీ తెలివితప్పిపోయింది. ఇల్లంతా ఘొల్లుమంటోంది. దాసదాసీలూ, పంటవాళ్లూ "ఆడదికాదు, సాక్షాత్ దేవత" అని పొగడుతున్నారు.

రథియా:- ఇన్నాళ్లనుంచి చాకిరి చేస్తున్నా. కాని ఒక్క-నాడైనా పల్లెత్తుమాట అనలేదు.

వంటావిడ:- నన్ను సొంతకూతురుగా చూచేది. ఎలావండినా, ఏం వండినా అదేమన్న పాపాన పోలేదు. ఎప్పుడు మాట్లాడినా నవ్వుతూ మాట్లాడేది. ఎప్పుడన్నా మా ఆయనొస్తే ఇన్ని బియ్యం, ఇంత పప్పూ మూటకట్టకుండా పోనిచ్చేది కాదు.

అందరూ ఈ విధంగా చెప్పుకుంటున్నారు. ఇంతలో మధ్యాహ్నమయింది. చకచకా వెళ్లి వంట తయారుచేసింది. కాని తినేనాథుడేడీ? ఆగ్రహపెట్టగా పెట్టగా మున్షీజీ వెళ్లి తిన్నాననిపించివచ్చాడు. ప్రతాప్ వంటశాలగుమ్మమేచూడలేదు. విరజన్ సువామలల కసలు ఆకలే చచ్చిపోయింది. సుశీల ఒకసారి కుమార్తెను ముద్దుగా పలకరించుతుంది. ఇంకోసారి సువామను కౌగిలించుకుంటుంది. మరోసారి ప్రతాపునిముద్దుపెట్టుకుంటుంది. అప్పుడప్పుడు తన జీవితగాథ వర్ణించి విలపిస్తుంది. మూడో జామున నౌకర్లందరినీ పిలిపించింది. అందరికీ అప్పగింతలు చెప్పుతూ ఎప్పుడన్నా ఏమైనా అనివుంటే మరోవిధంగా భావించవద్దని చెప్పింది. వాళ్ళంతా వెళ్ళిపోయిన

తర్వాత "అక్కా! బాగా దాహంగా ఉంది. తమ చేతులతో కాసిని మంచినీళ్లు త్రాగించమని ఆయనను చెప్పు" అంది. మున్షీజీ మంచినీళ్ళు తెచ్చి పట్టించాడు. ఎంతో కష్టంమీద ఒక గుక్కెడు గొంతుకలోకి దిగాయి. ఎవ్వడన్నా అమృతం త్రాగించాడా అన్నట్టుగా ప్రతీతమయింది. ముఖం వికసించింది. కన్నీళ్లు ముంచుకొచ్చాయి. భర్త మెడమీద చేయివేసి "మీ అంకస్థలంపై మహావిశ్రాంతి తీసుకుంటున్నా. ఎంత పుణ్యం చేసుకున్నానోగదా." అని అంటూ ఆగిపోయింది. ఏదో చెప్పాలని వున్నట్టూ కాని సంకోచ పడుతున్నట్టుగా కొంచెం ఆగి తిరిగి భర్తహస్తం పట్టుకుని "మిమ్మల్ని ఏదైనా అడిగితే తప్పక ఇస్తారా?" అని ప్రశ్నించింది.

"నువ్వుకూడ అడగాలా? నిస్సంకోచ భావంతో చెప్పు" అన్నాడు మున్షీజీ విస్మయంగా.

సుశీల:–ఎన్నడూ నామాట కాదనలేదు.

మున్షీ:–ఇప్పుడూ అంతే.

సుశీల:–భయంగావుంది; ఎక్కడన్నా కాదంటారేమో.

మున్షీ:–నువ్వు చెప్పడమూ, నేను కాదనటము కూడానా?

సుశీల:–ఒక్కమాట అడుగుతా చెప్పండి. అందాక చెయ్యి వదలను. సిల్లీ (సుశీల) మరణిస్తే దాన్ని మరచిపోతారా?

మున్షీ:–ఇలాంటి మాటలు రానీయకు. అటుమూడు విరజన్ ఏడుస్తోంది.

సుశీల:–ఐతే చెప్పండి, నన్ను మరచిపోరుగదా?

మున్షీ:–కలలోకూడ అలాంటిది జరగదు.

సుశీల తన కపోలములను చల్లగా మున్షీజీ అధరములపై ఆనించింది. రెండు చేతులూ ఎత్తి మెడకు పెనవేసింది. కుమార్తెను దగ్గిరికిపిలిచి క్షీణస్వరంతో ఏవో నీతులు బోధించసాగింది–" ఇదిగో తల్లీ ! నాన్నగారిమాట జవదాటకు. వారిని శ్రద్ధగా చూడు. సంసారభారమంతా ఇక నీదే. నిన్ను చూచేవాళ్ళెవ్వరూ లేరిక. ఇలాఅంటూ భర్తకేసి కరుణామయదృష్టితో చూచి "మనస్సు లోనిమాట చెప్పనేలేను. ప్రాణంపోతోంది," అంది.

మున్షీ :- అనవసరంగా సంకోచంలోపడి ఉన్నావు.

సుశీల:- మీరు నా వాళ్ళునా కాదా ?

మున్షీ:- ముమ్మాటికీ నీవాడినే. జన్మజన్మాంతరం నీవాడినే.

సుశీల:-నన్ను మరచిపోతారేమో. ఈ నా వస్తువు పరహస్తగతమవుతుందేమో.

మున్షీ – (గ్రహించి) అనవసరచర్చ ఆజన్మం నీవాడిగానే వుంటా

సుశీల కుమార్తెను మళ్ళీ పిలిచింది. కౌగిట చేర్చుకోవాలను కుంటూండగానే ఇంతలో మూర్ఛతెర వచ్చింది. విరజన్ ప్రతాపులిద్దరూ ఒక్కసారి ఘొల్లుమన్నారు. వణికిపోతూ పోతూ ఆవిడ గుండెపై చెయ్యిపెట్టి చూచాడు మున్షీజీ. అతి మందగతితో శ్వాస ఆడుతోంది. వంట బాపనమ్మను పిలిచాడు. నేలమీద పెట్టండి. అంటూ విపరీతంగా ఏడ్వసాగాడు. బాపనమ్మ సువాములు కలిసి నేలమీద పడుకోబెట్టారు. క్షయరోగం ఎముకల్ని సైతం తినేసింది.

చీకటిపడుతోంది. ఇల్లంతటా భయావహ శోకమయ వాతావరణం వ్యాపించిఉంది. ఏడ్చేవాళ్ళు ఏడుస్తున్నారు పైకి వినబడకుండా. మాటలు చెప్పుకునేవాళ్లు చెప్పు కుంటున్నారు. కాని వినపడీ వినపడనట్టుగా అటు సుశీల భూమాత అంకస్థలంపై పడివుంది. ఒకప్పుడు స్వమాత అంక స్థలంపై ఆడుతూ పెరిగిన దేహం, ఒకరోజున ప్రేమాంకంపై పవ్వళించిన దేహం, ఒకనాడు పుష్పపాన్పుపై శయనించిన దేహం నేడు కటికి నేలమీద పడివుంది. మందంగా ఇంకా నాడి ఆడుతూనేవుంది. శోకసాగరంలో మునిగి తలదగ్గర కూర్చొని ఉన్నారు బంధుబాంధవులంతా. హఠాత్తుగా తల పైకెత్తింది. రెండుచేతులతో భర్తచరణారవిందాలను పట్టు కుంది, జీవ పక్షి ఎగిరిపోయింది. చేతులురెండూ భర్తపాదా లను మెలివేసుకునే ఉన్నాయి. ఇది ఆవిడ కడసారి శారీరక క్రియ.

ఓ ఏడ్చే సోదరులారా! ఏడ్వండి; తనివితీర ఏడ్వండి. ఎంచేతంటే ఏడ్వడం మినహా మీరింకేం చేయగలరు? ఈసమ యంలో మిమ్మల్ని ఎవరెంత ఓదార్చినావృథా. మీ నేత్రాలు అశ్రుప్రవాహానికి అడ్డుకట్టవేయలేవు ఏడ్వటం మీ కర్తవ్యం జీవితంలో ఏడ్చే అవకాశాలు చాలా అరుదుగా వస్తుంటాయి. ఈ సమయంలో మీ అశ్రునదం ఎండిపోదు; ఏకధారగ ప్రవహిస్తోంది కన్నీటి ప్రవాహం. వెక్కి-వెక్కి ఏడ్పులధ్వని వినవస్తూనే ఉంది. ఇంతలో వంటమనిషి దీపంవెలిగించి లోపలికి తీసుకొనుకొచ్చింది. అటు కొన్నిక్షణాల పూర్వమే సుశీల జీవితదీపం ఆరిపోయింది.

# 11

రుడకీ ఇంజనీరింగు కాలేజీలో కోర్సుపూర్తి చేశాడు రాధాచరణ్. వెంటనే మురాదాబాద్‌లో ఇంజనీరుగా నియమించబడ్డాడు. భార్య చంద్రావతి వెంట బయలుదేరింది. వెళ్ళకుండా ఆపాలని అత్తగారెంతో ప్రయత్నించింది. కాని పోయేవాళ్లను ఆపగలవాడెవ్వడు? సేవతి ఎప్పుడో వెళ్లి పోయింది అత్తవారింటికి. ఇప్పుడిక ఇంట్లో ప్రేమవతి ఒక్కర్తే ఉంది. ఇంట్లో పనిపాటల బరువంతా ఆమె ఒక్కర్తెమీదనే పడింది. అందుచేత చిన్నకోడల్ని కాపరానికి తీసుకొస్తే బాగా వుంటుందనుకున్నారు. మామగారికి మాత్రం ఇష్టంలేదు. కాని గృహ వ్యవహారాల్లో అతనిమాట వినేవాడెవ్వడు? పెత్తనమంతా ప్రేమవతిదేనయ్యె.

మున్షీ సంజీవనలాల్ కూతుర్ని పంపటానికి వెంటనే అంగీకరించాడు. ఆయనా కొన్నాళ్ళనుండీ తీర్థయాత్రల కెళ్లాలని ఆలోచిస్తున్నాడు. ఆ దృష్టితోనే క్రమక్రమంగా సంసారబంధనమూ, భౌతిక సంబంధాలూ సడలించుకుంటూ వస్తున్నాడు. ప్రొద్దస్తమానమూ గదిలోనే పీఠం వేసుకుని కూర్చుంటాడు. భగవద్గీత, యోగవాసిష్ట మొదలైన ఆధ్యాత్మిక గ్రంథాల పఠనలో తల్లీనుడై ఉంటాడు. సాయంత్రం కాగానే గంగకు స్నానానికెళ్లిపోతాడు. చాలా ప్రొద్దుపోయి ఇంటికి చేరతాడు. ఏదో స్వల్పంగా ఫలహారంచేసి పండుకుంటాడు. ప్రొద్దుటపూట ప్రతాపు ఆయనవెంట స్నానానికెళ్తుంటాడు. పదిహేను, పదహారు ఏళ్ళకన్న ఎక్కువ వయస్సు

ఉండదు. ఐనా కొంతస్వభావం, కొంత తల్లిదండ్రుల శిక్షణ, కొంత సత్సాంగత్యం మొదలైన కారణాలవల్ల ఈ లేత వయస్సులోనే ఆధ్యాత్మిక విషయాలపట్ల శ్రద్ధాసక్తులు ఏర్పడ్డాయి. తత్సంబంధమైన గ్రంథాలు చదవడం, చర్చించడం అంటే ఎంతో ఇష్టంగానూ, ఆనందంగానూఉంటుంది. ఆధ్యాత్మిక విషయాలు చర్చిస్తూ, వింటూఉంటే అతని ప్రవృత్తి భక్తి వైరాగ్యాల వేపుకుమరలింది. ఒక్కొక్కసారి సూక్ష్మాతిసూక్ష్మ విషయాలపై వాదోపవాదాలు చేస్తుండేవాడు. అది చూచి మున్షీజీసైతం ఆశ్చర్య చకితుడౌతుండేవాడు.

ప్రతాపునిపై పడిన మున్షీగారి బోధనల ప్రభావం కంటె ఎక్కువగా సువామ నీతిబోధల ప్రభావం పడింది వ్రజరాణిపై. ఇప్పుడు పదిహేనో సంవత్సరం. వివిధకోర్కెలు, అనేకాభిలాషలూ అలలు అలలుగా లేస్తూ చిత్తాన్ని చలింపచేసే వయస్సిది. చూపుల్లో సరళత్వ, చంచలత్వాలకు బదులు మనోహర విలాసం తొణికసలాడుతుండే వయస్సిది. కాని వ్రజరాణి ఇంకా ఏమీ తెలియని అబోధ బాలికయే. అశుభమూ శుభమూ తెలియని కన్యయే. ముఖంలో హృద్గత పవిత్ర భావాలు ప్రతిబింబిస్తున్నాయి. సంభాషణల్లో మాధుర్యం ఉత్పన్నమయింది, చీకటితోనే లేస్తుంది. అన్నిటికంటె ముందు మున్షీగారి గది ఊడుస్తుంది. ఆయన పూజాద్రవ్యాలన్నీ యథాస్థానంలో వుంచుతుంది. అప్పుడు వంటపని ప్రారంభిస్తుంది. మధ్యాహ్నంపూట మాత్రం ఒకగంట సమయం చదువు సంధ్యలకోసం వినియోగిస్తుంది. సువామపట్ల వున్నంత ప్రేమా, భక్తీ తన కన్నతల్లిపట్ల కూడ ఉండి

ఉండవు. సువామనూట విరజన్‌కు ఆజ్ఞఅని చెప్పినా అతిశయో_క్తేమీ లేదు.

ప్రజరాణిని ఇప్పుడప్పుడే కాపరానికి పంపటం సువామ కిష్టంలేదు. కాని ముంషీగారి పట్టుదల కారణంగా పంపటాని కేర్పాట్లు జరుగుతున్నాయి. ఆ ఆపద గడియలు సమీపించిన కొద్దీ విరజన్ వ్యాకులత మితిమీరిపోతోంది. అహర్నిశం కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది. ఒకసారి వెళ్లి తండ్రి కాళ్ళపై బడి వలవల ఏడుస్తుంది. ఇంకోసారి వెళ్ళి సువామ ఒడిలో కూర్చుని కన్నీరుకారుస్తుంది. కాని వివాహితకుమార్తె పరాయి ఇంటిదైపోతుంది. దానిమీద ఇతరులకేం అధికారముంది ?

ఎంతోకాలం అన్న - చెల్లెలు మాదిరిగా కలిసిమెలిసి వున్నారు. విరజన్ ప్రతాపచంద్రులు. కాని విరజనుని నేత్రాలు అతని కేసి చూడలేకపోతున్నాయి. ప్రతాపూ ఇదే పరిస్థితిలో వున్నాడు. ఇంటికి రావడమే తగ్గిపోయింది. పెద్దగా అవసరమున్నప్పుడే వస్తాడు. అప్పుడు క్రిందికే చూస్తూ చల్లచల్లగా వస్తాడు. పెళ్ళికూతురులా. అతనిచూపుల్లో ఏదో ఒక ప్రేమ-రహస్యం దాగివుంది. దాన్ని ఎవ్వరిముందూ - చివరకు విరజన్ ముందుకూడ, వ్య_క్తీకరించడం ఇష్టంలేదు.

ఒకానొక రోజున సంధ్యాసమయం. అప్పటికింకా మూడు రోజులు మాత్రమే వున్నాయి అత్తగారింటి కెళ్ళటానికి. ఏదో పనిమీద తనగదిలోకెళ్ళి లాంతరు వెలిగిస్తున్నాడు ప్రతాప్. ఇంతలో విరజన్ వచ్చింది. పమిటకొంగు కన్నీటి ధారలతో తడిసి ముద్దయిఉంది. అశ్రుపూరిత నేత్రా

లతో ప్రతాపుని కేసి చూడడం రెండు సంవత్సరాల అనంతరం ఇదే మొదటిసారి. "లల్లూ! ఎలాసహించగలను? ఎలా వుండగలను?" అంది.

ప్రతాపుని కళ్ళు కన్నీరు కార్చలేదు. కంఠస్వరమూ గద్గదం కాలేదు. గంభీరభావంతో "ఈశ్వరుడు నీకు ధైర్యధారణశక్తి ప్రసాదించుగాక" అన్నాడు.

విరజనుని శిరస్సు క్రిందికి వాలిపోయింది. మాటలో వర్ణించలేని హృదయావేదన గాధను వర్ణించి పారేసింది ఒకే ఒక వెక్కి-వెక్కి రోదనం.

కన్యలకు ఎడబాటురోజు ఎంతకష్టమయంగాఉంటుందో కదా! బాల్యస్నేహితులు, జననీజనకులు, బంధు బాంధవులు - అందరితోనూ సంబంధం విచ్ఛేదమై పోతుంది. వదలిపోతున్న ఈ గృహంలోకి మళ్ళీ అడుగుపెట్టే అవకాశంవున్నదీ అన్న ఆలోచనకూడ వాళ్ళను సంతృప్తి పరచలేక పోతుంది. కారణం, ఇక రావడమంటే అతిధిగా, చుట్టంగా మాత్రమే. జీవిత - ఉద్యానవనంలో కలిసిమెలిసి ఆడుకున్న వాళ్ళను, స్వాతంత్ర్య - వాటికలో జతిగా విహరించిన వాళ్ళను ఎడబాసి పోవటం అన్నమాట తలంపుకు వస్తేనే గుండెలు బ్రద్దలై పోతాయి. ఆరోజునుండి చచ్చేదాకా మోయవలసిన సంసారభారం నెత్తినవచ్చి పడుతుంది.

విరజనుని సింగారిస్తున్నారు. కాళ్ళకూ - చేతులకూ గోరింటాకు పెడుతోంది పరిచారిక. తలదువ్వి జడవేస్తోంది ఇంకో ఇల్లాలు. నవరానికి అత్తరుపూసి నవరిస్తోంది మరో

స్నేహితురాలు. కాని ఇవన్నీ ఎవరికోసం చేస్తున్నారో ఆవిడ మాత్రం నేత్రాలనుండి అశ్రు - ముత్యాలు వెదజల్లుతోంది భూమిమీద. "ప్రయాణ ముహూర్తం తప్పిపోతోంది. త్వర త్వరగా కానీయండి" అని వారింట్లోంచి కబురొచ్చింది. సుహాము అక్కడే నిల్చొనివుంది. విరజన్ గభాలునవెళ్లి సుహాము వక్షస్థలంలో అంటుకుపోయింది. ఇంతవరకు నివురు కప్పిన నిప్పులా రాజుతున్న అశ్రు - ప్రవాహాగ్ని ఒక్కసారి భగ్గుమంది. ఎవ్వడో హఠాత్తుగా అగ్నిలో కిరసనాయిలు పోసాడన్నట్టుగా.

కాస్సేపటికి మీనావచ్చి దిగింది వాకిటిముందు. ఇరుగుపొరుగు స్నేహితురాండ్రను వరుసగా కౌగిలించుకుంటూ నమస్కరించుకుంటూ పోతోంది విరజన్. ఆఖరున సుహాము కాళ్ళకు నమస్కరించి కళ్ళకద్దుకుంది. అప్పుడు ఇద్దరు ముగ్గురు స్త్రీలు చెయ్యిపట్టుకుని తీసుకెళ్ళి మేనాలో కూర్చోబెట్టారు. అటు మేనా ఎత్తుకున్నారు బోయీలు. ఇటు స్పృహతప్పి పడిపోయింది సుహాము - బ్రతికుండగానే తన ప్రాణమెవ్వడో తీసుకుపోతున్నట్టుగా. ఇల్లు పాడుపడిపోయిన కొంపలా అయిపోయింది. ఉండడానికి వందల స్త్రీలు ప్రోగై వున్నారు. కాని ఒక్క విరజన్ లేకపోయేటప్పటికి ఇల్లు కరవ వస్తోంది.

## 12

విరజన్ శుభాగమనంతో ప్రేమవతి గృహశోభ ఇనుమడించింది. సుహాము ఆ పిల్లకు నేర్పిన మంచిలక్షణాలు వర్ణించ

తరంకాదు. ఆమెను చూచినవారల్లా ముగ్ధులైపోతున్నారు. కడకు సేవతీదేవి స్నేహితురాలు రాణీకూడ "మీ చిన్న కోడలు ముందు మేమంతా బలాదూరే" అని ప్రేమవతి ఎదుట ఒప్పుకుంది. ప్రొద్దస్తమానమూ ఆవిడదగ్గరే కూర్చుని ముచ్చట్లతో కాలక్షేపం చేస్తుంటుంది సేవతి. ఎంతసేపు కూర్చున్నా విసుగుపుట్టేదికాదు. తానెంతో సంగీతం వచ్చిన దాన్నని ఇంతకు పూర్వం గర్వపడుతుండేది. కాని ఆ రంగం లోనూ విరజన్‌దే ముందడుగు.

"ఏరా! కొత్తపెళ్ళాన్ని తీసుకొచ్చావు. మరి మాబోటి స్నేహితుల సంగతికూడా చూడు. గొప్ప అందాల బరిణె అని విన్నాం" అన్నీ అనసాగారు. కమలాచరణ్ మిత్రులు అత్తగారింటిదగ్గర ఏదోకొంత ముట్టనే ముట్టింది. ఇంకేం, జేబు గలగలలాడిస్తూ "ఓస్! ఇదెంత భాగ్యమోయ్? విందుకూడ వెనక్కితీస్తానా ఏమిటి? సరే అలాగే కానీయండి సారాసీసాలు ఎగరేయండి. కాని ఒరేయ్! ఒక్క సంగతిరా, పెద్దగా అల్లరిమాత్రం చేయవద్దు. లేకపోతే ఖర్మంచాలక ఇంట్లో ఎక్కడన్నా తెలిసిందా అంటే మిమ్మల్ని పచ్చి కాడీలనుకుంటారు. ఆవిడ ఇంట్లోకి అడుగుపెట్టిన నిమిషం నుంచీ ప్రాణాలు గుప్పిట్లోపెట్టుకు తిరుగుతున్నానంటే నమ్మండిరా. ఇంగ్లీషు, ఫార్సీ, సంస్కృతం, వల్లకాదు-వసన కాదు- అంతా దిగమ్రింగి కూర్చున్నదట. ఇంగ్లీషులో ఏమన్నా అడుగుతుండేమో, లేక ఫార్సీలో మాట్లాడటం మొదలెడుతుండేమోనని గుండెల్లో రైళ్లు పరుగెత్తుతుంటాయి.

అలాంటి దేమన్నా జరిగితేమాత్రం గ్రుడ్డుఅప్పగించి చూడ డం మినహా చేయగల్గిందేముంది? అంచేత ప్రస్తుతం ఎడ మెడంగా, అఘోరిస్తున్నా.

చెప్పాలంటే కమలాచరణుని స్నేహితుల సంఖ్యకంతు లేదు. పట్నంలో వుండే పావురాల పందెగాళ్లూ, గాలిపటా లెగురవేసే రౌడీలూ అంతా అతని స్నేహితులే. కాని వాళ్ళంద రిలో ముఖ్యమైన మిత్రులు ఒక్క ఐదుగురుమాత్రమే. అదొక దుష్టపంచకం. అందరిలోకీ నాలుగు అక్షరం ముక్క లెక్కువ గావున్నవాడు మజీద్ ఒక్కడే. కోర్టులో అర్జీలు, నకళ్లు వగైరాలు రాస్తుంటాడు. ప్రొద్దుగూకులూ సంపాదించినది కాస్తా కోర్టులోంచి ఇవతలకు రాగానే సారాబుడ్లకు సరిపో తుంటుంది. రెండోవాడు హమీద్ ఖాన్ - తాతముత్తాతల ఆస్తి చాలా వచ్చింది. కాని పంచుకున్న మూడేళ్ళలో అంతా ముక్కచెక్కలు చేశాడు భోగవిలాసాల్లో. ఆస్తి పోయింతర్వాత ఇంకో చావుతెలివి మొదలెట్టాడు. సాయం త్రంకాగానే సబ్బుతో ముఖం రుద్దుతాడు అగరునూనె పట్టి స్తాడు. ఇస్త్రీగుడ్డలు వేస్తాడు. తర్వాత ఇక పట్నంలోని వీధులూ, సందుగొందులూ అన్నీ వాడివే. మూడో వాడు సయ్యద్ హుస్సేన్‌గారు ఒకటోరకం జూదరి. బ్రతెలో ఒక వంద కాయడముంటే వాడి కదొక కానీలావుంటుంది. పెళ్ళాం ఒంటిమీది నగలు ఒల్చుకుపోవడం నిత్యకృత్యా లలో ఒకటి తతిమ్మా మహానుభావులు - రామసేవకలాల్, చందూ. ఇద్దరూ కోర్టు బంట్రోతులు. జీతం ఆటే పెద్దదికాదు

గాని పై రాబడి మాత్రం బాగావుంటుంది. దానిలో సగం సురాపానానికి పోతుంది. తతిమ్మా సగం భోగవిలాసాల్లో నలిగిపోతుంటుంది. ఇట్లా వాళ్లు తిండిలేక చచ్చినాసరే బ్రతికినాసరే. వాళ్లకేమీ పట్టదు. వాళ్ళకల్లా కావలసింది జలసా జీవితం గడపటం ఒక్కటే.

నిర్ణయమేమిటో ఇదివరకే చేసుకున్నారు. దాని ప్రకారం ఇవ్వాళ డిప్టీ గారు పడుకోగానే దుష్టపంచకం ఒకచోటికి పోగయింది. సీసాలకు సీసాలు ఎగిరిపోతున్నాయి. అందులో అంతా అరితేరిన మొనగాళ్లే. కాస్త తినరంగు చూపిందిసారా. ఇకచూడు, ఒళ్లు తెలియకుండా ప్రేలిపోతున్నారు.

మజీద్:-ఏరా తమ్ముడూ కమలా: నిజం చెప్పరా; పెళ్ళాన్ని చూస్తే సంబరంగా వుందా లేదా ?

కమలా:-అదిగో, మొదలెట్టావు అప్పుడే వాగుడు ?

రామసే:-చెప్పరాదేంటిరా; ఇందులో సిగ్గేంటిరా ?

కమలా:-ఏంటిరా చెప్పేది ? నా బొందా ? ఒక్కనాడన్నా కళ్ళతో చూచినపాపాన పోతేనా ? నిన్నమాత్రం తలుపు సందులోనుండి కాస్తచూచా. అబ్బ ! ఆ రూపం కళ్లఎదుటే తిరుగుతోందిరా.

చందూ:-ఓరి మిత్రమా ! బలే అదృష్టవంతుడివిలే నువ్వు.

కమలా:-అబ్బ ! ఎంత కంపరమెత్తిపోయిందిరా ? తాళలేక క్రిందపడి పోతూపోతూ నిలదొక్కుకున్నాసురా. ఎందుకురా. ఇన్నమాటలు, అసలు అప్సరసంటే నమ్ము.

మజీద్:- అయితే తమ్ముడూ ! మరి మనస్నేహం ఇంకేపోతా

కోసంరా? ఒక్కసారంటే ఒక్కసారి చూడనివ్వరా.
సైయద్:- అసలు స్నేహమంటే అర్థమేంటిరా? ఇదేగా. మనలోమనకు దాపరికమనేది వుండ నేవుండగూడదు.
చందూ:- స్నేహంలో మళ్ళీ దాపరికమా? ఇంగ్లీషు వాళ్ళను చూడు, పెళ్లాండాలోలోంచి జరిగిందో లేదో, స్నేహితులంతా షేక్‌హేండ్సు యిస్తారు.
రామసే:- ఒకరిసంగతి నా కెందుకు? చూడకపోతే నాకు మాత్రం నిద్రపట్టేదొట్టిది.
మజీద్:- ఒరేయ్ తమ్ముడూ! ఇందులో తప్పేముందోయ్? నీ స్నేహితుల కోర్కెలు తీర్చడం ఇప్పుడు నీ విధి
కమలా:- అయితే నేనుమాత్రం 'కాద'ని ఎప్పుడన్నానురా?
చందూ:- సెబాష్! మూతిమీద మీసం ఉన్న మగవాడి మాటలంటే ఇవేరా. అయితే మరి మమ్మల్ని వెళ్ళి మొస్తాబై రమ్మంటావా?
కమలా:- ఔను, కాని ముఖానికి కాస్త బూడిద పూసుకు రండి. ఆ మాత్రంచాలే.
సైయద్:- అయితే మరి ఇవ్వాళేగా?

ఇటు ఈ రకంగా సారాబుడ్లు ఎగిరి పోతున్నాయి. అటులోపల పందిరిమంచం మీద పడుకుని ఎడతెగని ఆలోచనల్లోపడి కొట్టుకుంటోంది విరజన్. చిన్నతనంరోజులు ఎంత హాయిగావుంటాయో! ఆహా! ఆ రోజులు మళ్ళీ ఒకసారి తిరిగి వస్తే! ఓహో! ఎంత మనోహర, సుఖప్రద జీవితం! జగత్తు ప్రేమ-ప్రీతుల గనిలా కనపడుతుండేది. ఆ రోజుల్లో ప్రపంచ వస్తువులన్నీ ఎంత అందంగా ఉండేవి?" ఇలా ఆలోచిస్తూ

ఆలోచిస్తూ కూర్చొన్న ట్లొచ్చాయి సుఖద స్వప్నమొకటి చూచింది. చిన్నప్పటి సంఘటనొకటి ప్రత్యక్షంగా కనపడు తోంది. ‘ఒకరోజున లల్లూ తనఆటబొమ్మొకటి నలిపి వేశాడు. తానేమో అతని పుస్తకములో రెండుకాగితాలు చింపేసింది. అప్పుడు లల్లూ తన వీపుమీద గంట్లుపడేటట్లు గిచ్చాడు. తా నేడుస్తూ తిడుతోంది. ఇంతలో సుమామ లల్లూను చెయ్యిపట్టుకు తీసుకొచ్చి “ఏం పాప! నిన్ను కొట్టి పారిపోయాడుకదూ వీడు? ఇవ్వాళ వీడి అంతుతేల్చుకుంటా ఏదీ చూడనీ, ఎక్కడ కొట్టాడు” అని తన్ను అడిగింది. లల్లూ కళ్ళనీళ్ళ పర్యంతమై ఆనకేసిచూచాడు. అప్పుడు తాను చిఱుమోముతో “ఇతను నన్నెందుకు కొట్టాడు? అసలెప్పుడూ నాజోలికిరాడే? అని అంటూ అతనిచెయ్యి పట్టుకుంది. తన మిఠాయీ అతనికేపెట్టింది. తర్వాత ఇద్దరూ మళ్ళీ కలిసి ఆటలకు పోయారు” ఆరోజు లిప్పుడెక్కడ?

రాత్రి చాలా ప్రొద్దుపోయింది. ఢమఢమమని ఎవ్వడో గోడను తట్టుతున్నట్లు ధ్వని వినవచ్చింది. చెవి గోడదగ్గర చేర్చి జాగ్రత్తగా వింది నిరజన్. ధ్వని తీయకుండ వస్తోంది. ఒకప్పుడు ఆగిపోయినట్లుగావున్నా మళ్ళీ వెంటనే వినపడు తోంది మరికాస్సేపటికి మట్టిబెడ్డలు రాలసాగాయి. భయంతో కాళ్లూచేతులు గజగజ వణకిపోతున్నాయి. గుండె కొట్టుకుం టోంది. ఐనా కాస్త ధైర్యం తెచ్చుకుని లేచి నిలబడింది. వంటబాపనమ్మ మంచందగ్గర కెళ్ళింది. నెమ్మదిగా చేత్తో తట్టిలేపుతోంది. నోట్లోంచి మాటరావడంలేదు. ఇంతలో పెద్దపెల్లొకటి వచ్చి ముందుపడింది. వంటమనిషి త్రుళ్ళిపడిలేచి

కూర్చుంది. దొంగలని ఉభయులకూ నమ్మకం కల్గింది. వంట బాపనమ్మ తెలివితేటలుగల మనిషి. అరిస్తే అంతా లేస్తా రనుకుంది. దొంగలు కన్నంలో ముందు కాళ్ళు దూరుస్తారని చిన్నప్పుడు వింది. ఒక దుడ్డుకర్ర తీసుకొచ్చి గోడకుచేరి నిల్చొంది కాళ్ళు కనపడగానే కాళ్ళు విరిగిపోయే విధంగా కొట్టాలనుకుంది. కాని దొంగ ముందు తలదూర్చాడు. కాచు కుకూర్చునేఉందిగా. వెంటనేలాగి సత్తువకొద్దీ ఒకటి జబురు కుంది, ఏదో పెద్ద చప్పుడైనట్టుగా వినవచ్చింది. దొంగ వెం టనే తల వెనక్కి లాక్కున్నాడు. 'అబ్బ! చచ్చానురా. తల దిమ్మెక్కిపోయిందిరా." అన్నమాటలు వినవచ్చాయి. తర్వాత ఎవ్వరో చాలామంది నవ్వినట్టుగా వినపడింది. తద నంతరం పూర్తిగా నిశ్శబ్దం. ఇంతలో ఇంకా చాలామంది మేల్కొన్నారు. తతిమ్మా రాత్రంతా కబుర్లతో వెళ్ళమారి పోయింది.

ప్రొద్దున్నే ఇంటికి చేరాడు కమలాచరణ్. కళ్ళు ఎర్రగా ఉన్నాయి. నెత్తిన బొప్పితేలిఉంది. వంటమనిషిదగ్గర కెళ్ళి పరిశీలించి చూసింది. వెంటనే విరజన్‌వద్దకు తిరిగొచ్చి "అమ్మగారూ! ఒకమాట చెప్పనా? మరోవిధంగా భావిం చవుకదా? కోపంరాదుకదా?" అంది.

విరజన్:-కోపందేనికి? నిస్సంకోచంగా చెప్పు.

బాపనమ్మ:-రాత్రి జరిగిన పని దొంగలు చేసిందికాదు.

విరజన్:-మరింకెవ్వరు?

బాపనమ్మ:-ఇంట్లోవాళ్ళే.

విరజన్:-నీళ్ళవా డెవ్వడన్నా చేసిన కొంటెపనా?

బాపనమ్మ:- వాళ్ళల్లో అలాంటివా డెవ్వడూ లేడు.
విరజన్:- అయితే మరెవ్వడు ? తిన్నగా చెప్పవద్వ రాదూ.
బాపమ్మ:- నా దృష్టిలో చిన్నబాబుగారని. నేనుకొట్టిన కర్ర దెబ్బ అతని తలమీద తగిలింది. బాగా బొప్పి తేలిఉంది.

ఈ మాత్రం వినగానే వ్రజరాణి కను బొమ్మలు గభా లున పైకి చూచాయి. కందగడ్డలా ముఖం కందిపోయింది. "ఓ వంటలమ్మా! కాస్త ఒళ్లుదగ్గర పెట్టుకు మరీ మాట్లాడు. నా ఎదుట ఇలాంటి మాటలు మాట్లాడటానికి నీకు గుండె లెక్కడినుంచి వచ్చాయ్. పండు ముసలిదాని వని జాలి వేస్తోంది. లేకపోతే ఒక్కక్షణంలో నిల్చున్నదానిని నిల్చున్నట్టుగా బైటకు గెంటించేసేదాన్ని. నోరు అదుపులో వుంచుకోకపోతే ఎలాంటి పరిణామాలు కల్గుతుంటాయో స్వయంగా రుచిచూచేదానివి. ఛీఛీ వెధవముండ నీ ముఖం చూస్తేనే జ్వరం ఎగేసుకొస్తోంది. ఏం మాట్లాడుతున్నానో, ఎవ్వరి ముందు చెబుతున్నానో అన్న జ్ఞానమన్నా కాస్తవుండొద్దూ? దేవుని దయవల్ల ఆయన కేంతక్కువ? అన్నీవున్నాయి. ఈ ఇల్లంతా ఆయనదే. నాదగ్గరేమైనావుంటే అవీ ఆయనవే. నేను స్వయంగా ఆయన దాసిని. అలాంటి వ్యక్తినిగురించి ఇలాంటిమాటలు అనేశావుగా ?" అంది మండిపడుతూ.

కాని ఏ విషయంలో విరజన్ ఇంతకోపగించుకుందో దానిలో తతిమ్మా వాళ్ళందరికీ నమ్మకమే డిప్టీగారి చెవిలో పడిందీవార్త. స్వభావసిద్ధంగా తనకొడుకు ఎంతదుర్మార్గుడుగా వుంటాడో - అంతకంటె ఎక్కువ దుర్మార్గుడని అతనితలంపు. కోడలినగ లెక్కడన్నా ఉడాయించుకు పోతాడేమోనని

సందేహాభయాలు కల్గాయి. హాస్టలుకు పంపటం మంచిదను కున్నాడు. ఈ వార్త తెలియగానే వెళ్ళాలని శాస్త్ర చిందు లేశాడు కమలాచరణ్. కాని మళ్లీ ఏదో ఆలోచించుకొని హాస్టలు కెళ్ళాడు. విజన్ రాకపూర్వంకూడ అనేకసార్లు హాస్టలుకు పంపాలని ప్లానులు వేశారు. కాని అతని మనసు పట్టు అన్ని ప్లానుల్నీ వమ్ము చేసింది. భార్య దృష్టిలో ఎందుకూ పనికిరాని వెధవనై పోతానేమోనన్న భయమే ఈసారి హాస్టలు కెళ్ళటానికి ప్రధానకారణం.

# 13

హాస్టల్లో మొదటిరోజు ఏదోవిధంగా గడిపాడు కమలా చరణ్. పొద్దున పడుకున్నాడు. మళ్ళీ పొద్దుగూకినప్పుడే కళ్లు తెరచాడు. ఇవ్వాళ నవాబుగారు, మీర్జాగార్ల మధ్య కోడిపిట్టల పందెమని మర్నాడు ఉదయం స్మరణకొచ్చింది. 'అరేరే. ఏం మొనగాడు జోడు! వాటి పట్టు - విడుపులు తప్పక చూడతగినవిగా వుంటాయి. పట్నమంతా విరగబడి వచ్చినా ఆశ్చర్యమేమీ లేదు. పట్నంలోని ఆబాలగోపాలం పందెంచూచి ఆనందించడమూ? మరి నేనేమో ఇక్కడ హాస్టల్లో పడి మురిగిపోవడమూ? మరి ఇదేనువ్వా జీవితమను కున్నారా లేక తమాషా అనుకున్నారా?" ఇలా ఆలోచించి తటాలున లేచాడు. మరుక్షణంలో పందేల మైదానంలో ఉన్నాడు.

ఇవ్వాళ పందేల దగ్గరవున్న జనానికంతులేదు. పెద్ద తిరణాలలాఉంది. పాకీవాళ్ళు నీళ్ళు చల్లుతున్నారు బీడీ, కిళ్ళీ, మిఠాయి మొదలైన దుకాణాలు చక్కగా పెట్టుకు కూర్చున్నారు దుకాణదారులు. పట్నంలోని కుర్ర పందెగాళ్లంతా తమచేతులమీదనో లేక మల్లెపూడలు చుట్టబడిన పుల్లలమీదనో తమ కౌజుపిట్టల్నీ, బుల్ బుల్ పక్షుల్నీ కూర్చోబెట్టుకుని మైదానమంతా కలియతిరుగుతున్నారు. ఇక్కడికి కమలాచరణుని మిత్రుల కేంకొరత? వట్టిచేతులతో ఉండడం చూచి "ఏరా రాజా! ఇవ్వాళేదో కొత్తవింతగా వుందే. పిట్టలన్నీ ఏమయ్యాయేమిటి?" అని ప్రతివాడూ ప్రశ్నించేవాడే. ఇంతలో సైయద్, మజీద్, హామీద్ వగైరా ప్రియమిత్రులందరూ సిపాతో తూలుతూ - తుమ్ముతూ, గప్పుగప్పుమని సిగరెట్ల పొగ వదలుకుంటూవచ్చి ప్రత్యక్షమయ్యారు. కమలాచరణుని చూడగానే అమాంతంగా వెళ్ళి అందరూ ఒక్కసారి వాటేసుకున్నారు

మజీద్:-ఏరా మిత్రమా! ఇవ్వాళెక్కడ మాయమైపోయావురా? ఖురాన్‌తోడు. మీ ఇంటిచుట్టూ తిరగలేక చచ్చిపోయాననుకో.

రామసే:-ఓరి పిచ్చిదద్దమ్మా, ఇప్పుడు బైటకొచ్చే రోజులా ఏమిటిరా? ఆనందరాత్రులు కదోయ్. వాడికళ్ళుచూస్తే తెలియడంలా. చూడు మత్తెక్కినట్టుగా వున్నాయి.

చందూ:-ఇంద్రభోగంరాబాబూ, ఆ అప్సరసగారు ఇంట్లోకి పాదంపెట్టారు. మళ్ళీ వీధిముఖం చూస్తే ఒట్టు. ఎప్పుడన్నా

చూడు, ఆ గదిలోనే వుంటాడు. సరేలే, సిరోజులు భోగ మంతా వెళ్ళబోయరా.

కమలా:-ఇంద్రభోగంలాగానే వుందిరా నా పని ఇప్పుడు. మూడురోజు లయిందిరా ఆ బోర్డింగులోకి తగలబెట్టి దాని కంటె జైలే మెరుగ్గా వుంటుందేమో.

మజీద్:-నిజమేనా! దేవుడుతోడు!

కమలా:-ఔనురా, దైవసాక్షిగా చెబుతున్నా. మొన్నటి నుంచి నే అనుభవిస్తున్న యమయాతనల సంగతి అడిగేవు? ఇవ్వాళ అందరికళ్ళలో దుమ్ముకొట్టి చల్లగా తప్పించుకు బైటపడ్డా.

రామనే:-భలేగా తప్పుకొచ్చావురా. ఆ మీసాలపోతు సూపరిండెంటు చిందులు తొక్కుతుండొచ్చు.

కమలా:-ఓరేయ్! ఇలాంటి పందెం చూడకుండ ఆ వెధవ పుస్తకాల్లో కూర్చుని మెదడు పాడుచేసుకునేవా డెవ్వడురా ఇక్కడ.

సైయద్:-ఒరేయ్! ఇవ్వాళొక్కనాడు తప్పించుకురాగానే సరా ఏమిటిరా? బోర్డింగులో ఉండటమంటే నిజంగా యాతనేరా. అటునువ్వు రోజూ ఎలాగూరాలేవు. ఇటు చూస్తే మరి రోజూ ఏదోఒకటి వుండనే వుంటుంది- క్రొత్త ప్రదేశా లను షికార్లో, విహారాలో ఏదోఒకటి వుంటుంది. రేపు లాల్ డిగ్గీ గ్గా, ఎల్లుండి పరేడ్ మైదానంలో, అవిల్లుండి తెప్పల మీద ఈదటం - ఎన్నని లెక్కపెట్టి చెప్పను. అసలు నువ్వు వెళ్లటమే పొరపాటై పోయిందనుకో.

కమలా:-ఆరు నూరైనాసరే, రేపు గాలిపటాల పోటీలు తప్పక చూచి తీర్తా.

సైయద్:-మరి తెప్పల తిరణాలో. అది చూడలేకపోతే అస లేమీ చూడలేదన్నమాటే.

ప్రొద్దు వాలిపోయింది. మిత్రులదగ్గర శెలవు తీసుకుని ఖిన్న మనస్కుడై బోర్డింగు వేపుకు నడచాడు. మనస్సులో దొంగలా ఏదోకూర్చొనిఉంది. గేటుదగ్గర కెళ్ళి తొంగి చూస్తున్నాడు. సూపరిండెంటుగారు గనక లేకపోతే గభాలున వెళ్ళి గదిలో దూరాలని ఆలోచన. చూస్తే ఆయనా గేటువేపుకే వస్తున్నాడు. కంగారు పడకుండా చంగునవెళ్ళి గదిలో ప్రవేశించాడు "ఇప్పటిదాకా ఎక్కడున్నావు?" అని ప్రశ్నించాడు సూపరిండెంటు.

"ఏదో శాస్త్రపనుండి బైటికెళ్ళానండీ"

"ఇది బైటికెళ్ళే వేళకాదు."

నా కీ విషయం తెలియదు. ఇకముందీసంగతి దృష్టిలో వుంచుకుంటాను.

రాత్రి మంచమెక్కగానే ఆలోచనలు ప్రారంభ మయ్యాయి —"సరే! ఇవ్వాళ కేదో గండంగడిచింది. కాని రేపటి సంగతేమిటి? రేపుకూడ గడిస్తే అప్పు డసుకో వాలి. కాదు మరచిపోయా, ఎల్లుండికూడ కళ్ళల్లో కారం కొట్ట గల్గాలి. రేపటిదృశ్యం చూడతగింది. గాలిపటాలు చుక్కలు చూస్తుంటాయి. గొప్పగా మెలికలూ, పల్టీలూ కొట్టేస్తారు." ఇదే మనస్సులో పెట్టుకుని నిద్రపోయాడు. మర్నాడు చీకటి ముఖానే లేచి మాయమైపోయాడు. లాల్ డిగ్గీదగ్గర

ఎదురుచూస్తూ నిలబడివుంది మిత్రబృందం. కనపడగానే ఎగిరి ఒక్క గంతు వేసింది. సెబాష్ అని వీపుతట్టింది.

కొంచెంసేపు గాలిపటాల తెంపుళ్ళ-పందాలుచూస్తూ నిలబడ్డాడు కమలాచరణ్. తర్వాత నేనుమాత్రం నా గాలి పటమెందుకు తీసుకురాకూడదూ? నా హస్తలాఘవమూ రవ్వంత చూపిస్తే ఎంత బాగుండును? అని పెరపెరలాడింది. ఇదిచూచి 'తప్పకుండ తీసుకురారా, పందెంకూడ కాచి మరీ వేద్దాంరా; డబ్బు కావాలంటే నే యిస్తానులే. ఇక ఆలస్యం చేయకు; ఇప్పుడే ఇంటికి ఎవ్వడినన్నా పంపించు." అని బాగా పురెక్కించాడు మజీద్. తన పురిత్రాటితో అన్నిటినీ త్రెంపివేయగలనని బాగా ఆత్మవిశ్వాసముంది. వెంటనే మని షినిపంపాడు. వెళ్ళినవాడు వట్టిచేతులతోనే తిరిగి వస్తూండ టంచూచి దేహం ఉడికిపోయింది! హంటరు తీసుకుని గబ గబా ఇంటికి పరుగెత్తాడు. వెళ్ళివెళ్ళడంతోనే నౌకర్లందర్నీ వరసగా చర్మం చిట్లేటట్లు ఫెళ్ళుఫెళ్ళు మనిపించాడు. పాపం కూర్చుని హుక్కా త్రాగుతున్నారు. హఠాత్తుగా నేరమేమీ లేకుండా వీపుపై హంటరు పడేటప్పటికి 'బాబో' 'నాయనో' అంటూ బిగ్గరగా ఏడ్వసాగారు. పేటంతా వాళ్ళ ఏడ్పులతో ప్రతిధ్వనించింది. ఎందుకు కొడుతున్నాడో, చేసిన తప్పేమిటో ఎవ్వడికీ అర్థం కావడంలా. బైట నౌకర్లను ఈ విధంగా మర్యాదచేసి చరాచరా లోపలికెళ్ళాడు. అక్కడ తనగది దశచూస్తే మండుతున్న క్రోధాగ్ని మరింత ప్రజ్వరిల్లింది. గాలిపటాలన్నీ చింపివేయబడివున్నాయి. రింగులూ, చక్రాలూ విరగగొట్టి ఉన్నాయి. పురిత్రాటి ఉండంతా చిక్కుపడివుంది.

ఏకో ఒక గొప్ప ఆపదవచ్చి ఈ మహాయావనయోధుని (పురిత్రాడు) నాశనంచేసి పోయినట్టుగా. ఇదంతా తప్పక అమ్మచేసిన పనేనని నిశ్చయించుకున్నాడు. కోపతాపాలతో గబగబా తల్లివద్ద కెళ్ళాడు గొంతంతా చించుకుంటూ "ఏమే అమ్మా! నా ప్రాణాలు తీయటానికే ఆఖరుకు నిశ్చయించుకు కూర్చున్నావా ఏమిటి? మూడురోజులనాడు త్రైలుకుపంపావు. ఐనా నీ కసితీరలా; నీ మనస్సుకు శాంతికల్గలా. అందుకని ఇప్పుడు నే ఆడుకునే వస్తువులన్నీ నాశనంచేసి కూర్చున్నావు. ఇలాచేస్తే మీ కొచ్చేదేముంది ?

ప్రేమ:-(విస్మయంతో) నే నేమిటీ నీ వస్తువులు పాడుచేయటమేమిటిరా! రామరామ అసలు నేను అంటుకోనన్నా అంటుకోలేదే. ఏం జరిగిందిరా ?

కమలా:-అబద్ధాలు చెప్పితే నోట్లో పురుగులు పడ్తాయట. నువ్వు అంటుకోకపోతే నా గదిలోకెళ్ళి ఇంతపని చేయటాని కింకెవ్వడికి దమ్ముగ్గలున్నాయి ? ఈ వెధవవస్తువులుకూడ చూచి ఓర్వలేకుండా వున్నావన్న మాటేగా ?

ప్రేమ:-దైవసాక్షి, నీ గదిలో కడుగు పెట్టలేదురా. పద, నమువు ఏమేం పాడైపోయాయో చూపించు

ఇలా అని గదిలోకెళ్ళింది ప్రేమవతి. కోపంతో మూతిముడుచుకుని వాకిట్లో నుంచొన్నాడు కమలాచరణ్. ఇంతలో విరజన్ గదిలోంచి బైటకొచ్చింది మాధవి. అతని చేతికేదో చీటీ అందించి వెళ్ళిపోయింది. అందులో " నేరం

చేసింది నేను. కనుక శిక్షార్హురాలనూ నేనే. కాన మీ ఇష్టం వచ్చిన శిక్ష విధించండి." అని వ్రాయబడివుంది.

ఆ చీటీ చూడగానే తడిసిన పిల్లిలా ముడుచుకు పోయాడు కమలాచరణ్. చడీచప్పుడు కాకుండ మెల్లగా జారుకున్నాడు. వెక్కి వెక్కి ఏడుస్తున్న నౌకర్లను తిట్టిపోస్తోంది తల్లి. అలా తిట్టవద్దని చెప్పాడు కొడుకు. గదిలోకెళ్ళి మిగిలినవికూడ చించి అవతల పారేశాడు. రింగులన్నీ ముక్కలు చేశాడు. దారానికి అగ్గిపుల్లగీసి అంటించాడు. తల్లికిదంతా అయోమయంగా ఉంది. కారణమేమిటో బోధ, పడటంలా. ఈ వస్తువులకోసమేగదా ఇంతకు రెండు నిమిషాలు ముందు ప్రపంచమంతా తనదే నన్నట్టు వ్యవహరించింది. మరి ఇంత లోనే ఇంత బద్ధశత్రువు కావడానికి కారణమేమిటి ? కోపంలో అలా చేస్తున్నాడేమో అని అనుకుంది తల్లి. వెళ్ళి ఎంతో బ్రతిమాలింది. అతని ముఖంలో మాత్రం కోపమనే దెక్కడా కన్పించడంలా. "నాకేం కోపం లేదమ్మా. ఇకెన్నడూ వాటి జోలికి పోనని ప్రతిజ్ఞ చేస్తున్నా. ఈ వెధవ వస్తువులకోసం మీతో దెబ్బలాడినందుకు సిగ్గుపడుతున్నా." అన్నాడు గంభీరంగా.

గదిలో ఒక్కడే కూర్చొనిఉన్నాడు. ఆలోచనలొచ్చి ముట్టడేశాయి. "ఈ రకంగా గాలిపటా లెగరవేస్తూ తిరగడం ఆవిడ కిష్టంలేదన్నదాంట్లో సందేహమేమీలేదు. ఈపనులంటే ఎంతోఅసహ్యంగా వుంది. లేకపోతే ఇంత దుస్సాహసానికి దిగదు. ఒకసారి కలుసుకునే సౌభాగ్యం కల్గితే బాగుండును. మనస్సులో వున్నదేమిటో చెప్పమని అడు

గుతా. కాని ఏ ముఖం పెట్టుకుని ఎదుటికి వెళ్తాను? అసలే మూర్ఖాచార్యుణ్ణి. దానికి తోడు తన ఆచార్యత్వమూ మిత్రులతో కలిసి ప్రదర్శించా. ఆరాత్రి కన్నంసంగతి ఆమెకు తెలియకుండా వుండదు. తల ఎత్తుకు మాట్లాడే అర్హతకూడ లేకుండా చేసుకున్నా. కనుక ఈ పీడంతా దేనికి? నా ముఖమూ చూపించొద్దు, ఆవిడ ముఖమూ చూడొద్దు. ఇదే సర్వోత్తమ ఉపాయం. లేదా ఏదోరకంగా కష్టపడి శాస్త్ర విద్యన్నా సంపాదించితీరాలి. అయ్యో! ఎంత అందకత్తె! స్త్రీకాదు, అప్సరస. నాపట్ల ప్రేమగా ఉండేరోజు వస్తుందా? ఎంత చక్కటి అరుణాధరములు! ఎంత మృదువుగావున్నాయో కాని హృదయంమాత్రం పాషాణం. దయాదాక్షిణ్యా మనే దెక్కడా లేదనుకుంటా. "మీ యిష్టమొచ్చిన శిక్ష విధించండి" అని వ్రాసింది. నా ముఖం, నేనేం శిక్ష విధించను? దొరికితే వక్షస్థలాన హత్తుకోవాలని ఇక్కడ చస్తుంటే శిక్ష విధించాలట శిక్ష. సరే, ఇక ఈ రోజునుండి ఈ వెధవపనులన్నీ మాని శ్రద్ధగా చదువుకోవాలి. "ఈ రకంగా ఆలోచిస్తూ లేచాడు. పావురాల గూటివద్ద కెళ్ళి పావురాలన్నిటినీ పైకి వదిలేశాడు. వందలజోళ్ళు ఒకటికిమించిన జోడు ఇంకొకటి. నభోమండలంలో ఎగిరితే నక్షత్రాల్లా కన్పడుతుంటాయి. ప్రొద్దున ఎగిరితే మళ్లీ సాయంత్రందాకా దిగేమాటే తలవరాదు. ఒక్కొక్కజోడు చూచి ఉవ్విళ్లూరి పోతుంటారు పట్నంలోని పావురాల రాయిళ్ళంతా. జీవితపర్యంతం పాలేరుతనం చేయటానికైనా వెనుదీయరు. కానీ నిమిషమాత్రంలో అన్నిటినీ వదలకొట్టాడు. ఖాళీకాగానే గూటికి నిప్పంటించమని

నౌకర్లను ఆజ్ఞాపించాడు. పైకప్పుకూడ కూలద్రోయమన్నాడు లేకపోతే మళ్లీవచ్చి దానిమీద వ్రాలతాయి. ఇటు పావురాల బెడద వదలించుకుని అటు కౌజుపిట్టలు, బుల్‌బుల్ పక్షులూ వున్నచోటి కెళ్ళాడు. వాటికీ కారాగారంనుండి శాశ్వత విముక్తి కల్గింది.

బైట భాగోత మిలాఉంది. లోపలమాస్తే ప్రేమవతి రొమ్ములు బాదుకుంటోంది — "ఏమిటో అర్థం కావడంలా? మనస్సులో ఏం నిర్ణయించుకున్నాడో? ఏమైపోతాడో నా చిట్టిబాబు" వెంటనే కోడల్ని పిలిచి "చిట్టీ! అబ్బాయి కేదో విధంగా సర్దిచెప్పు. ఏం ఆలోచించుకున్నాడో తెలియడంలా" అని ఏడ్వసాగింది. ఆయన మనస్సులో ఇంకేదో వుందని వ్రజరాణికి అనుమానంగానే ఉంది. లేకపోతే ఇంత కోపందేనికి? దుర్జనుడు, దురాచారి, దుశ్చరిత్రుడే ఐనా అతనిలో ఇంకో మంచి లక్షణంకూడ ఉంది. ఏ భార్యా ఉపేక్షించలేని సల్లక్షణమది. అదేమంటే వ్రజరాణిపట్ల అతని కెంతో గాఢానురాగం వుంది. దీని పరిచయమూ యిదాకదా లభించింది రహస్యంగా. ఆ కారణంగానే వ్రజరాణి ఇంత గర్వంగా వుంటోంది. వెంటనే ఏదో వ్రాసి పంపింది. అందులో.

"ప్రాణేశ్వరా!

ఈ కోపతాపా లెవ్వరిమీద? గాలి పటాలు రెండో మూడో గదిలో వుంటే నేనే చించిపారేశాను. అందుకే నా ఈ పనులన్నీ. ఈ కాస్త భాగ్యానికే ఇంత ఉగ్రరూపం

దాలుస్తారని తెలియును. లేకపోతే అలాచేసి వుండేవాన్ని కాదు. జరిగి పోవలసినదేదో జరిగిపోయింది. ఇది ప్రథమ తప్పుగా భావించి క్షమించ ప్రార్థన."

ఇట్లు,
మీ అర్థాంగి
వ్ర జ రా ణి.

ఈ వుత్తరం చూచి విశ్వసామ్రాజ్యం లభించిం దన్నట్టుగా ఆనంద భరితుడయ్యాడు. సమాధానం వ్రాయాలనుకున్నాడు. కాని కలం ఎదురు తిరిగింది. ముందుకు నడవనే నడవటంలా. ఏమని సంబోధించాలో, ఏం వ్రాయాలో, ఎలా ప్రారంభించాలో, ఎలాముగించాలో తోచడంలా. భావగర్భితంగా ఉత్తరం వ్రాయాలని అభిలాషగా ఉంది. కాని రాసేదెలా? తలకాయలో మెదడనే దేమన్నా పనిచేస్తేగా. తన నిరక్షరత, మూర్ఖతలు చూచుకుని గుండె చెరువుకావడం ఇదే మొదటిసారి. ఎంత ఆపినా అశ్రుప్రవాహం ఆగడంలా. ఎవ్వడన్నా చూచి పోతాడేమోనన్న సిగ్గుతో గదిలోకెళ్ళి తలుపులు బిగించుకు కూర్చున్నాడు,

సాయంత్రం నాల్గుగంటలకు ముంషీ శ్యామాచరణ్ కోర్టునుండి ఇంటికొచ్చాడు. అన్నిటికంటె ముందు అతనిదృష్టి తగలబడుతున్న తుక్కుపోగు మీదికి పోయింది. ఈ మంట లేమిటిరా?" అని ప్రశ్నించాడు నౌకర్లను, విస్మయుంగా.

"బాబుగారూ! పావురాలగూటికి నిప్పంటించాం"

ముంషీ:- (గద్దించి) ఇది తగల బెట్టడంచేసికిరా? ఇక పావురాలెక్కడ వుంటాయోయ్?

నౌకరు:- గూళ్ళన్నీ శుభ్రంగా తగలబెట్టుమని చినబాబు గారి ఆజ్ఞ.

మున్షీ:- పావురాలేమయ్యాయి ?

నౌకరు:- ఒక్కటికూడ మిగలకుండ అన్నిటిని విడిచిపెట్టే శారు, గాలిపటాలూ చించిపారేశారు. దారానికి నిప్పంటిం చారు, చాలా నష్టం కల్గచేశారు.

ఇలాచెప్పి తమ్మికొట్టినందుకు ప్రతీకారంచేశామను కున్నారు పాపం నౌకర్లు. ఇంతనష్టం చూచి కొడుకును తప్పక చీవాట్లు పెడ్తారని ఊహించారు. కాని ఈ వార్తవినగానే స్తంభించిపోయాడు డిప్టీ. ఆ పక్షులంటే ప్రాణాలర్పిస్తుం టాడు. మరి ఇవ్వాళ ఇంత గొప్ప మార్పెందుకు వచ్చింది ? ఇందులో రహస్యమేమిటో తప్పకఉంది." అని ఆలోచించి "అబ్బాయినొకసారి ఇలా రమ్మనమని చెప్పండి." అన్నాడు నౌకర్లతో.

"హుజూర్ ! లోపల గడేసుకొని గదిలో కూర్చు న్నారు. బ్రద్దలయ్యేటట్లు కొట్టినా తలుపు తీయడంలేదు." అన్నాడు వెళ్ళిన నౌకరు తిరిగొచ్చి.

ఈ మాట చెవిలో పడేటప్పటికి నిలువునా నీరై పోయాడు మున్షీ. పిల్లవాడు విషంత్రాగాడేమోనని సందే హంకల్గింది. ఇవ్వాళ ఉదయం కోర్టులో విషపాన సంబంధ మైన కేసులో తీర్పుచెప్పి వచ్చాడు. నిల్చున్నవాడు నిల్చు న్నట్టుగానే పరుగెత్తికెళ్ళి తలుపుమీద శక్తికొలదీ ఒకతన్ను తన్నాడు. "అబ్బాయీ! ఒరేయ్ నాన్నా!" అని మాత్రమే అనగలిగాడు.

తండ్రిగారి గొంతు గుర్తుపట్టాడు కమలాచరణ్. గబ గబా లేచి తలుపు తీసాడు కన్నీళ్లుతుడుచుకుంటూ. కాని ఛీఛీలుగాని చీవాట్లూ-చెప్పుదెబ్బలుగాని ఏమీ బహూకరించలేదు. పైపెచ్చు కుమారుని కౌగిలించుకుని "ఓరేయ్! బాబూ! నన్ను చంపినంతబట్టురా, ఏం తిన్నావో చెప్పరా" అని కంగారుగా అడిగాడు. ఈ కంగారంతా చూస్తే ఎంతో ఆశ్చర్యం కల్గింది కొడుక్కి. ఈ ప్రశ్న అంతరార్థమేమిటో తెలుసుకోవాలన్న అభీష్టంతో తండ్రి ముఖంకేసి చూచాడు. ఆయన కళ్లు చెమ్మగిల్లిఉన్నాయి. తప్పక ఏదో కొంప మునిగి పోయే పని జరిగిందని నమ్మకం కల్గింది. వెంటనే పోయి డాక్టరుగార్ని తీసుకురా. వెంటబెట్టుకు తీసుకురమ్మన్నారని చెప్పు. అన్నాడు నౌకరుతో.

ఈ కంగారుకు కారణమేమిటో ఇప్పటికి కాస్త అర్థమయింది కుర్రవాడికి. చంగున వెళ్ళి తండ్రిని కౌగిలించుకున్నాడు. "మీరు భ్రమపడుతున్నారు. మిమ్మల్ని చంపినంత ఒట్టు నాన్నా! నేనేమీ ప్రమాదస్థితిలో లేను." అని అన్నాడు.

కాని డిప్టీగారి మనస్సుకు శాంతి కల్గలా. తనకేదో కల్లిబొల్లి కబుర్లుచెప్పి ఆలస్యం చేయటానికి ఎత్తులు వేస్తున్నాడని అభిప్రాయపడ్డాడు. "ఇదిగో అబ్బాయీ! నన్ను వదలిపెట్టు. వెళ్ళి పెట్టెలోంచి మాదుసీసా ఒకటి తీసుకొస్తా. ఇలాంటి దుర్బుద్ధితో హాస్టలు కెళ్తున్నావని నాకేం తెలుసు." అన్నాడు దీనంగా.

కమలా :- దేవునితోడు; నాకేం ప్రమాదంలేదు. ఇంత

నామోషీ గలవాడ్నైతే ఇంత తెలివితక్కువ మొద్దు నెందుకయ్యేవాణ్ని. అనవసరంగా డాక్టరును పిలిపిస్తున్నారు.
మున్షీ:-(కొద్దిగానమ్మి) ఐతే మరి తలుపు బిగించు కెందుకు కూర్చున్నావు?
కమలా:-లోపలనుండి ఏదో ఉత్తర మొకటివచ్చింది. దానికి జవాబు రాస్తూ కూర్చున్నా.
మున్షీ:-మరి పావురాలు, కౌజులు వగైరాలన్నీ ఎందుకు విడిచిపెట్టావు?
కమలా:-నిశ్చింతంగా చదువుకోవాలని. ఈ వెధవగొడవల్లోన్నే టైంఅంతా వృథాగా గడచిపోతుంది. అంచేత ఇవ్వాళ వీటికి స్వస్తిచెప్పా. ఇంక ఎంత శ్రద్ధగా చదువుతానో మీరే స్వయంగా చూస్తారుగా.

ఇన్ని ప్రశ్న లనంతరం ఇప్పటికి డిప్టీగారి మనస్సు కాస్త కుదటపడింది. లోపలికెళ్ళితే ప్రేమవతి ద్వారా జరిగిన రామాయణ మంతా సాకల్యంగా తెలిసింది. కోపంవచ్చి మీ అబ్బాయిగారి ఆటవస్తువులన్నీ తీసికెళ్ళి తుంగలోతొక్కివచ్చింది మీ కోడలు, అని చెప్పగానే ఫక్కున నవ్వాడు. కుమారుని ఆమోద ప్రమోద సర్వనాశన రహస్యం పూర్తిగా అర్థంకాగానే "ఈ అమ్మాయి ఈ దొరగారిని సరైనదారిలో పెట్టి మరి వూరుకుంటుందన్న సూచనలు స్పష్టంగా కానవస్తున్నాయి" అన్నాడు.

## 14

అత్తవారింటి కెళ్ళిపోయింది వ్రజరాణి. ఆమె గడప దాటడంతోనే ఇల్లంతా చిలుక ఎగిరిపోయిన పంజరంలా

శూన్యంగా వుంది. ఆమె ఈ గృహానికి దీపంలా, ఈ శరీరానికి ప్రాణంలా కన్పడుతుండేది. అదే ఇల్లు, కాని ఎటుచూచినా కాంతి హీనత్వమే దృగ్గోచరమవుతోంది. ఇంట్లో లోగడ వున్నవాళ్ళే ఇప్పుడూ వుంటున్నారు; కాని ఈ ముఖాల్లో ఆ వెనుకటి కళలేదు; నేత్రాల్లో ఆ వెనుకటి జ్యోతి లేదు. ఉద్యానవనమూ అదే, కాని ఇప్పటి ఋతువు గ్రీష్మ ఋతువు. విరజన్ వెళ్లిన నెలరోజులకు మున్షీ సంజీవనలాల్ తీర్థయాత్రలకెళ్ళిపోయాడు. ఆస్తి - పాస్తుల భారమంతా ప్రతాపుని నెత్తినపెట్టి పోయాడు. ఒక మృగచర్మం, ఒక భగవద్గీత, మరికొన్ని భక్తి సంబంధమైన గ్రంథాలుమాత్రమే వెంటతీసుకెళ్ళాడు.

ప్రతాపచంద్రుని ప్రేమాకాంక్ష అత్యంత ప్రబలమైనది. కాని దాంతోపాటు నిగ్రహశక్తి ఉంది. గృహంలో ప్రతివస్తువూ విరజనుని స్ఫురింపచేస్తూంటుంది. 'ఆవిడగనక తన అర్ధాంగియైవుండి వున్నట్లయితే తన జీవితం ఎంతహాయిగా వుండేదోకదా' అన్న ఆలోచన మనస్సులోంచి ఒక్కనిమిషంకూడ వైతొలగిపోవడంలేదు. ఐనా ఆ భావం పదేపదే కల్గకుండ వుండేందుకు శతవిధాల ప్రయత్నిస్తున్నాడు. కాని నిష్ప్రయోజనం. పుస్తకం ముందేసుకు కూర్చుంటాడు, కాని తెరచిన పుస్తకం తెరచినట్టుగానే ఉంటుంది. ధ్యాసంతా ఎక్కడోవుంటుంది. అన్నందగ్గర కూర్చుంటాడు. విరజనుని రూపం కళ్ళఎదుట ప్రత్యక్షమవుతుంది. ప్రేమవాసనలను నిగ్రహిస్తూ నిగ్రహిస్తూ జీర్ణరోగిలాతయారయ్యాడు. ప్రేయుల దశ విచిత్రంగా వుంటుంది. అభిలాషలు నెరవేరినా నెరవేరక

పోయినా, ప్రియురాండ్రను ప్రత్యక్షంగా సందర్శించే అవకాశం లభించినా లభించకపోయినా, మనస్సులో మాత్రం వాళ్ళతో కలుసుకుని ఆనందం అనుభవిస్తుంటారు. భావజగత్తులో వాళ్ళతో ప్రలాపిస్తుంటారు. ఈ రకమైన భావాలు ఎంతో మానసికతృప్తిని కలుగచేస్తుంటాయి. కాని ఈభావ ప్రపంచంలోకూడ తిరగకుండ, తన ప్రియసఖి రూపలావణ్యాలు ధ్యానించకుండ ఏశక్తన్నావచ్చి అడ్డుతగిలితే అలాంటి దురదృష్టప్రియుల కిక గతేమిటి? ఇలాంటి దురదృష్టవంతుల్లో ప్రతాప్ ఒకడు. అభిలాషగావుంటే అలాంటి సుఖప్రద భావామృతం జూరగలడు. భావప్రపంచంలో స్వేచ్ఛగా విహరించగలడు. కాని విరజనుని మనస్సులో సైతం మరోభావంతో చూడడం ఇష్టంలేదు. అంత పవిత్రంగా వుండడమే చాలా కష్టమైనపని. అతని కలాంటి శిక్షణ ఇవ్వబడింది. అలాంటి నీతినియమాలు బోధించబడ్డాయి. అటువంటి సత్పురుషుల సాంగత్యవాతావరణంలో పెరిగాడు. అతని దృష్టిలో భావం, ఆచరణ రెండూఒకేతూకంగలవి. రెండూ పవిత్రంగావుండాలి. గతంలో అనేకసార్లు 'సోదరీ' అని సంబోధించిన విరజనుని, ఇప్పుడూ సోదరిగానే భావిస్తున్న విరజనుని ధ్యానావస్థలో సైతం అన్యథా ఎలా భావించగలడు? దుర్భావనల కెంతదూరంగా వుండాలని ప్రయత్నిస్తున్నాగానీ చిత్తవికార ప్రవాహంలో కొట్టుకుపోతూనే వుంటున్నాడు. మున్షీ సంజీవన లాల్‌గారు వున్నకాలంలో నిత్యం కొంతసేపు ఆధ్యాత్మిక చర్చలలో గడుపుతుండేవాడు. దానివల్ల ఆత్మకెంతోబలం

లభిస్తుండేది. కాని అతని గృహపరిత్యాగంతో అలాంటి సదవ కాశమూ లేకుండాపోయింది.

పుత్రు డీవిధంగా విచారంగా వుండడంచూచి సుహాము కెంతో కష్టంగా వుంటోంది. ఒకరోజున— "ఒరేబాబూ! నీ కిక్కడ చదువుకోటాని కిష్టంగా లేకపోతే ప్రయాగవెళ్లి చదువుకో. అక్కడవ్నా మనస్సు కుదురుగా వుంటుందేమో" అంది. ఈ భావమే అతనికీ ఎన్నోసార్లు కల్గింది. కాని తాను వెళ్లిపోతే ఇంటిదగ్గర అమ్మ ఒక్కతె ఉండవలసివస్తుంది. ఈ భయంతో ఆ ఆలోచనే విరమించుకున్నాడు. ఇప్పుడు స్వయంగా అమ్మ నోటినుండే ఈ ప్రతిపాదన వచ్చేటప్పటికి తప్పక వెళ్లాలని నిశ్చయించుకున్నాడు అందుకు తగిన సన్నాహాలుచేయ ప్రారంభించాడు. వెళ్ళేరోజు నిర్ణయించబడింది. ఇప్పుడెప్పుడు చూచినా తల్లిబిడ్డకు నీతులు బోధిస్తూవుంటుంది "బిడ్డా! పరదేశం వెళ్తున్నావు. అక్క డెవ్వరితోనూ దెబ్బలాడవద్దు. అలాంటి స్వభావం నీకు లేకపోయినప్పటికీ చెబుతున్నా. పరదేశంలో జాగ్రత్తగా మెలగాలి. వేళకు భోంచేయడం, వేళకు నిద్రపోవడం మొదలగు విషయాల్లో అజాగ్రత్తగా వుండరాదు. నీకో చెడ్డ అలవాటుంది. శీతాకాలంలో ప్రొద్దుగూకగానే మంచమెక్కుతావు. తర్వాత ఎవ్వ డెంత లేపినా లేవవు. ఈ అలవాటే పరదేశంలోకూడ వుంటే రాత్రిళ్లు రోజూ ఉపవాసంతోనే గడుస్తుంది. పగలు కాస్తేపు నిద్రపో. కాని పగటి పూట నీకంటికసలు నిద్దేరాదయ్యె." ఆమెకు తీరికగా ఉన్నప్పుడల్లా ఈ విధమైన బోధనలుచేస్తూ ఉంటోంది.

కడకు ప్రతీక్షిస్తున్న ప్రయాణం రోజు వచ్చేసింది. ఉదయం పదిగంటలకు బండి బయలుదేరుతుంది. ప్రజరాణి నొకసారి చూచివస్తే బాగుండును పరదేశం వెళ్తున్నా. మళ్ళీ ఎన్నాళ్ళకొస్తానో, మళ్లీ ఎప్పుడు చూస్తానో ఎవ్వడి కెరుక." అన్న ఆలోచనతో మనస్సుకు కాస్త కౌతూహలం కల్గింది. వెళ్లి తల్లికీవిషయం చెప్పాడు. ఆమె ఎంతో సంతో షించింది. వెంటనే ఒక పళ్ళెంలో మిఠాయి ఉండలూ, కాజాలూ, రెండు మూడు రకాల మురబ్బాలూ పెట్టింది. లల్లూ వెంట వెళ్లిరావే అని పళ్లెం రధియాం చేతికిచ్చింది. ప్రతాప్ క్షౌరం చేయించుకుని స్నానం చేశాడు. కొత్తబట్టలు వేసుకున్నాడు. విరజన్‌గారింటికి బయలుదేరాడు. కాని ఒకొక్క అడుగు ముందుకు వేసినకొద్దీ గుండెదడ ఎక్కువై పోతోంది. రకరకాల భావాలు ముంచెత్తుకొస్తున్నాయి. విరజన్ ఏమనుకుంటుందో తెలియదు. వెళ్లి నాలుగు నెల లయింది. ప్రత్యేకంగా నాకొక ఉత్తరమన్నా రాయలేదు. అలాంటప్పుడు నేవెళ్లినా పెద్దగా మురిసిపోయేదేమీ ఉండదు. ఏమిటీ తెలివితక్కువ పని? అసలు నాఆలోచనెందు కుంటుంది! చచ్చినా చూచి కంటతడి పెట్టదు. ఇక్క డున్నప్పటి సంగతి వేరు. అక్కడికెళ్లిన తర్వాత జ్ఞాపకముండే వాడెవ్వడు? అసలేం ఆలోచించుకుని ఈ రకంగా ముస్తాబై బయలుదేరానూ? ఇదిచూచి తప్పక సందేహిస్తుంది. లాలా గారు తన షోకు చూపించటానికి దయచేశారు. అని అను కుంటుందేమో." ఈ రకమైన ఎడతెగని ఆలోచనలతో ముందుకు సాగిపోతున్నాడు.

శ్యామాచరణ్‌గారి ఇల్లు కనుచూపుమేరలో కొచ్చింది. కమలాచరణ్ ఆరుబైట పచార్లు చేస్తున్నాడు. అతను కంటి కగపడగానే పోలీసును చూచి భయపడే దొంగమాదిరిగా భయపడ్తున్నాడు ప్రతాప్. తక్షణం ఒక ఇంటిచాటును తప్పు కున్నాడు. "నీ వొక్కదానివే వెళ్ళి ఇవన్నీయిచ్చిరా. నా కింకా బజారులో అర్జంటుపనులున్నాయి. తిరిగి వెళ్ళేటప్పుడు వస్తా." అని అన్నాడు రథియాతో. ఇలా అని బజారుకేసి బయలు దేరాడు. కానిసరిగా పదిఅడుగులన్నా వెళ్లాడో లేదో వెంటనే వెనక్కితిరిగి రథియాను పిలిచి "బహుశ నేను రావ డంలో ఆలస్యం కావచ్చు. బండి వేళమించి పోతుంది. అంచేత వాళ్ళింటికిరాను. అంతగా అడిగితే ఈ వుత్తరం ఇవ్వు." అన్నాడు. వెంటనే జేబులోంచి పెన్సిలూ కాగితమూ తీసి ఏదో రాసి యిచ్చాడు. ఆ వుత్తరం అతని మానసిక స్థితిని చక్కగా తెలియజేసే వుత్తరం.

"ఇవ్వాళ ప్రయాగ వెళ్తున్నా. ఇక అక్కడేఉండి చదువుకుంటా. తొందరలో మీ యింటికొచ్చి నిన్నుకలుసు కొని వెళ్ల లేకపోయాను. బ్రతికుంటే మళ్ళీ ఎప్పుడన్నావచ్చి చూస్తా. తరచు క్షేమ సమాచారాలు తెలియచేస్తూ ఉండ వలసింది.

ఇట్లు
ప్ర తా ప్.

ఈ వుత్తరమిచ్చి ప్రతాప్ వెళ్ళిపోయాడు. రథియా నెమ్మదిగా విరజన్ ఇంటికి చేరుకుంది. దాన్నిచూడగానే పరు గున వచ్చింది విరజన్. కన్నవారింటి క్షేమ సమాచారాలు

అడిగిన అనంతరం "నాన్నగారిదగ్గరనుండి ఉత్తరాలేమన్నా వచ్చాయూ?" అని ప్రశ్నించింది.

రధియా:—ఇక్కడనుంచి వెళ్లాడు. అంతే మళ్లీ ఉత్తరమూ లేదు—గిత్తరమూలేదు.

విరజన్:—పిన్ని బాగావుందా?

రధియా:—లల్లూ ప్రయాగ వెళ్తున్నాడు. అంచేత కాస్తవిచారంగా ఉంటోంది.

విరజన్:—(ఉలిక్కిపడి) లల్లూ ప్రయాగ వెళ్తున్నాడా!

రధియా:—ఔను. పరదేశం వెళ్ళటం మంచిదికాదని మేమంతా చెప్పాం. కాని ఎవ్వరిమాటా వినలా.

విరజన్:—ప్రయాణ మెప్పుడు?

రధియా:—ఇవ్వాళే. పదిగంటల బండికి. మిమ్మల్ని చూచి పోదామని బయలుదేరాడు. తీరా వాకిట్లోదాకా వచ్చినవాడే తిరిగిపోయాడు.

విరజన్:—వాకిట్లోదాకావచ్చి తిరిగి పోవడమేమిటి? అప్పుడక్కడ ఎవ్వరూ లేరావమిటి?

రధియా:—అబ్బె! నామతి పాడుగానూ; వాకిట్లో కెక్కడొచ్చాడు? బజారులోంచే తిరిగిపోయాడు.

విరజన్:—కారణమేమిటో చెప్పలేదా?

రధియా:—కారణమూలేదు గీరణమూలేదు. బండివేళ మించిపోతోంది. వెళ్ళిపోతున్నా" అనిమాత్రమే చెప్పాడు.

ప్రజరాణి గడియారంకేసి చూచింది. ఎనిమిది కాబోతోంది. అత్తవద్ద కెళ్ళి "అత్తయ్యా! లల్లూ ఇవ్వాళ ప్రయాగ వెళ్ళి పోతున్నాడట. మీ రనుజ్ఞ ఇస్తే వెళ్ళ చూచివస్తా.

మళ్ళీ ఎన్నాళ్ళకు కన్పడుతాడో ఎవ్వరికి తెలుసు. నన్ను చూడాలని వచ్చి రోడ్డుమీదనుండే తిరిగిపోయాడని రధియా చెప్పింది.

ప్రేమ :- ఇంతవరకు తలన్నా దువ్వుకోలేదు. బొట్టు పెట్టుకొని బట్టలు విడువలేదు. కాని వెళ్తాననిమాత్రం చెబుతున్నావా ?

విరజన్ :- అత్తయ్యా ! ఇవ్వాళ కొకరోజు ఇవన్నీ అలాగే ఉండనీయండి. తల దువ్వించుకుంటూ కూర్చుంటే పది ఇక్కడే అయిపోతుంది.

ప్రేమ :- సరే, అయితే వెళ్ళు. కాని సాయంత్రం తిరిగిరా. బండి కట్టించుకెళ్లు. సువామగారికి నా అభివందనాలు తెలియచేయ్.

విరజన్ బట్టలు కట్టుకుంది. బండి తయారు చేయించమని చెప్పిరమ్మని మాధవీని బైటకంపించింది. ఇంతలో ఏదో స్ఫురించి "ఉత్తరమేమీ ఇవ్వలేదా ?" అని ప్రశ్నించింది రధియాను.

ఉత్తరం తీసియిచ్చింది రధియా. ఎంతో హర్షంతో అందుకుంది విరజన్. కాని చూడగానే ముఖం వెలవెలపోయింది. ఆలోచిస్తోంది- "వాకిట్లోదాకా వచ్చి తిరిగిపోవటానికి కారణమేమిటి ? కాదు ఉత్తరంవ్రాశాడు. మరి అదీ ఏదో బరికేసినట్లుగానూ, అస్పష్టంగానూ వ్రాశాడే ! అంత ముంచుకుపోయే తొందరేంవచ్చింది ? బండికి అమ్మేసుపోయామాఏమిటి ? పదిగంటలబండి తప్పిపోతే ఇంకోబండి కెళ్లవచ్చు. ప్రొద్దుగూకులూ - ఐదారుబండ్లన్నా వెళ్తు

టాయి. అదీగాక నన్ను చూచిపోవటానికి రెండుగంటల ఆలస్యంకూడ సహించలేకపోయాడా? తప్పక ఇందులో ఏదో రహస్యంఉంది. నావల్లేమైనా తప్పు జరిగిందా? తటాలున వెనకటి విషయమొకటి గుర్తుకొచ్చింది. "ఎప్పుడో ఒకనాడు ఎంతో వ్యాకులతతో ప్రతాప్‌వద్దకెళ్లింది. ఆ సమయంలో "లల్లూ! నేనెలా వుండగలను?" అన్నమాట నోట్లోంచి జారిపోయింది. ఆ పరిస్థితిలో అతనివద్ద కెళ్లి ఉండడం భావ్యంకాదని తర్వాత ఎన్నోసార్లు అభిప్రాయపడింది. లల్లూ దృష్టిలో పతితనయ్యానని అనుకుంది. ఇప్పుడతని హృదయంలో నాపట్ల ప్రేమాభిమానాలు లేవు. అని అనుకుంటూ ఒక శీతల నిట్టూర్పువిడిచి చతికిలపడింది. బండి కట్టవద్దనీ, ప్రయాణం మానుకున్నాననీ బండివానితో చెప్పమని మాధవితో అంది.

## 15

ఒక హిందూ పతివ్రతాస్త్రీ ఆదర్శ కర్తవ్యాల విషయంలో అత్తవారింటికి రాకపూర్వం ఒక నిశ్చితాభిప్రాయమేదీ లేదు వ్రజరాణికి. అదీగాక స్వగృహంలో భర్తృసంబంధమైన చర్చలూ ఎన్నడూ జరిగేవికావు. స్త్రీలకు సంబంధించిన పుస్తకాలు మాత్రం కొన్ని చదివింది. కాని వాటి వల్ల ఒక చిరంతన ప్రభావమేమీ పడలేదు. నేను వివాహితను. ఇక ఇది నా ఇల్లుకాదు. నేనిక్కడనుంచి వెళ్లిపోవలసినదాని నే." అన్న సంగతే అసలు దృష్టిలో లేదు.

అత్తవారింటికొచ్చింది. ప్రతి క్షణమూ భర్తను కళ్ళ ఎదుట చూస్తోంది. క్రమంగా చిత్త-వృత్తుల్లో మార్పు

రాసాగింది. ‘ నే నెవ్వరిని ? నా కర్తవ్యమేమిటి ? నా ధర్మమేమిటి ? నా విధులేవి ? వాటినెలా నిర్వర్తించాలి? ” అన్న విషయాలు బోధపడసాగాయి. గతించిన విషయాలు స్వప్న సదృశంగా కన్పడుతున్నాయి. ‘గతంలో తానొక పొరపాటు చేసింది. అది చెరిగేమచ్చ కాదు.” అని వెనకటి ఘటన జ్ఞప్తి కొచ్చినప్పుడల్లా సిగ్గుతో తలవంచుకుంటుంది. తన్నుతానే తిరస్కరించుకుంటుంది. “ లల్లూ ఎదుటకెలా వెళ్ళగల్గాను ” అన్నమాట ఎంతో ఆశ్చర్యం కలుగచేస్తుంటుంది. ఈ సంఘటనను ఏదో ఒక స్వప్నంగా భావించి ఎగరగొట్టేయాలని అప్పుడప్పుడు ప్రయత్నంచేస్తుంది. అలాంటిసమయంలో లల్లూ సౌజన్యపూర్ణచిత్రం ఎదుటికొస్తుంది. మనఃపూర్వకంగా అతన్ని ఆశీర్వదిస్తుంది. కాని ఇవ్వాళ ప్రతాపచంద్రుని నీచ ప్రవర్తన చూచి ఆ భావమంతా మాయమైపోయింది. ‘ఆ వెనకటి విషయం అతనింకా మరచిపోలేదు. నన్నొక నీచురాలునిగా చూస్తున్నాడు. కడకు నా ముఖంకూడచూడ్డాని కిష్టంలేదు.” అని ఆలోచించినపుడు క్రోధావేశాలతో తన్ను మరచిపోయింది. ప్రతాపంటే అసహ్యం కల్గింది. అతనిపట్ల మనస్సులో కుళ్ళు ఏర్పడింది. అతనిపట్ల తన హృదయంలో దాగివున్న ప్రేమాదరణాలు క్షణంలో జలబుద్బుదములవలె నీటిలో కలిసిపోయాయి. స్త్రీల మనస్సుపై ఘటనలప్రభావం తొందరగా పడుతుంది. ‘ఈ వ్యక్తికోసం నా అస్తిత్వం సైతం ధూళిలో కల్పటానికి సర్వదాసిద్ధంగావున్నా. కాని ఆ వ్యక్తియే నా యీ చిన్నతనంచేష్ట నొకదానిని క్షమించలేక పోయాడా ? అతని హృద

యం ఇంత సంకుచితమైనదా ?" అన్న భావం విరజనుని హృదయంలో ముల్లులా కలకవేస్తోంది.

ఈ రోజునుండీ విరజనులోని జీవకళ క్రమేణ క్షీణించిపోసాగింది. చిత్తం పైపైదో బరువులా అనుభవం కాసాగింది. "ప్రతాప్ నన్ను మరచిపోయాడు. నే నంటే రవ్వంతకూడ అభిమానంలేదు. అలాంటప్పుడు అతన్ని గురించి నేనుమాత్రం ఇంతగా కుళ్లి కుళ్లి చావడం దేనికి ? అతనికోసం ప్రాణాలు తీసుకుంటే లాభమేముంది ? కుక్క కాటుకు చెప్పుదెబ్బన్నారు పెద్దలు. నన్ను చూడగోరనప్పుడు నేనుమాత్రం ఎందుకు చూడాలి ? నన్ను అసహ్యించుకొంటున్నపుడు నేనుమాత్రం అతన్నెందు కసహ్యించుకోకూడదు ? తప్పక అసహ్యించుకుంటా. తప్పక అతనిముఖం చూడను. నేనూవెళ్ళి కలుసుకోను." ఈ రకమైన భావాలు కలిగినపుడు తనమీదనే విసుక్కొంటుంది. పని లేదన్నట్టుగా ప్రతినిమిషమూ అతన్ని గురించే ఆలోచించడం దేనికి? ఇక అతన్ని తలవనుకూడ తలవను అని సంకల్పించు కుంటుంది. కాని కాస్సేపటిలో ఈ వైరాగ్యమంతా అంతులేకుండా మాయమైపోతుంది.

ఆ భావాలే మళ్లీ కలవరపెట్ట సాగుతున్నాయి. అందుకని తన హృదయసంతాపాగ్నిని చల్లార్చుకోటానికి ఉపాయాలు వెదకసాగింది. తన భర్తను యదార్థంగా ప్రేమించడమే; ఆ ప్రేమకు నిదర్శనాలు చూపించడమే ఉత్తమ ఉపాయంగా కనపడింది. రెండు నిమిషాలు ఎడమైతే దెప్పిపొడుస్తుంది. తనవద్ద వున్న డబ్బంతా యిచ్చి గడియారమూ. బంగారపు గొలుసూ కొనుక్కోమని చెప్పింది. అసలు అక్క

క్లేదంటే ముఖం వ్రేలాడేసుకుని కూర్చుంది. కమలాచరణ్ అసలే దాసానుదాసుడై ఉన్నాడు. ఇక ఈ ప్రేమ ప్రసంగాలూ ప్రేమ కార్యకలాపాలూ చూచి తన సర్వస్వం విరజనే నన్నట్టుగా వ్యవహరించసాగాడు. మిత్రులు ఇది విని. వేనోళ్ల ప్రశంసించారు. తమకలాంటి స్త్రీరత్నం లభించనందుకు తమ అదృష్టాన్ని నిందించుకున్నారు. ఆహా! ఏం భార్య! అడగా పెట్టకుండానే డబ్బు తీసుకొచ్చి స్వయంగా ఇస్తుంది. ఇటు మాసంగతో? జేబుల్లో డబ్బు గుంజుకోటానికి పట్టే కుస్త్రీలతో చచ్చిపోతుంటాం. మొగుడు దగ్గర ఒక దమ్మిడీవున్నాసరే, లేకపోయినాసరే, వాళ్ల కోర్కెలు మాత్రం తప్పక నెరవేర్చితీరవలసిందే. లేకపోతే మహా ప్రళయం జరిగిపోయిందన్నమాటే. ఒరేయ్! మిత్రమా! మా గోడంతని వర్ణించమోయ్? ఎప్పుడన్నా ఒక్క తమలపాకు కిళ్లీకోసం మొఖంవాచి గదిలోకెళ్లామా అంటే అప్పుడూ నాల్గు వినకుండ బైటకొచ్చే నోము నోయలేదు కదా. నీభార్యవంటి భార్యనే మాకు దేవుడుప్రసాదించుగాక.

ఇదంతా యదార్థమే. ఉభయులూ పరస్పరం ఎంతో ప్రేమగా వుంటున్నమాట వాస్తవమే. కాని ప్రేయసీ ప్రియుల సమ్మేళనం వల్ల కలిగే ఆనందసంతోషాల లక్షణం ఒక్కటీ విరజన్ ముఖంలో కానరాదు. పైపెచ్చు నానాటికి చిక్కి క్షీణించిపోతోంది. చిక్కిపోవటానికి కారణమేమిటో చెప్పమని నానాబట్లు పెట్టి మరీ అడుగుతాడు భర్త. ఆమెను సంతోషపెట్టటాన్కి చేయగల్గిన ఉపాయాలన్నీ చేస్తుంటాడు. మిత్రులను సలహా అడుగుతాడు. కాని అన్నీ బూడిదలో

పోసిన పన్నీరు చందన్నై పోతున్నాయి. "నాకేమీ జబ్బు లేదు. ఆరోగ్యంగానే వున్నాను" అని ముసిముసిగా నవ్వుతూ సమాధానం చెబుతుంది. కాని దూలంమీద పైపైన ఎన్నిరంగులుపూసినా, ఎంతవార్నిషుపట్టించినా లాభమేముంది? లోపల తొలుస్తున్న పురుగు చస్తుందా? పట్టేది, మరింత బోలు చేస్తుంది. "ప్రతాప్ నన్ను మరచిపోయాడు. అతని దృష్టిలో పతనమై పోయాను." అన్న భావం కంటకంలా హృదయాన్ని బాధిస్తోంది ఆ కారణంగానే పరిస్థితి నానాటికీ విషమించి పోసాగింది. కడకు మంచం మీదనుంచికూడ లేవలేని స్థితి ఏర్పడింది డాక్టర్ల మందుసీసాలు దిగసాగాయి.

అక్కడ ప్రయాగలో ప్రతాపచంద్రుని మనస్సు బాగా లీనమై పోయింది. వ్యాయామం అంటే సర్దా మొదటి నుంచీవుంది. ప్రయాగలో దీని ప్రచారం ఎక్కువ. మానసిక అలసటను తేలికపరచుకోవాలంటే శారీరకశ్రమకు మించిన ఉత్తమోపాయం మరొకటిలేదు. చీకటితోనే లేచివ్యాయామం చేస్తాడు సాయంత్రం క్రికెట్, ఫుట్‌బాల్ మొదలైన ఆటలు ఆడ్తాడు, రాత్రి ఎనిమిది, తొమ్మిది గంటల ప్రొద్దు పోయే వరకూ తోటలో షికార్లుచేస్తాడు. ఇంత పరిశ్రమానంతరం మంచంమీద నడుం వాలిస్తే మళ్ళీ ప్రొద్దు పొడిచిన తర్వాతనే లేవడం. ఆరు మాసాల్లోనే క్రికెట్, ఫుట్‌బాల్ టీములకు కెప్టెన్ అయ్యాడు. పట్నమంతా మనకుమీద వ్రేలువేసుకునే టటువంటి రెండు మూడు మేచ్‌లు ఆడాడు.

ఇవ్వాళ క్రికెట్‌మేచ్. అలీగఢ్ టీముతో పోటీ. భారతదేశమంతటా గొప్పగొప్ప టీములన్నిటినీ ఓడించి,

జయభేరి మ్రోగించుకుంటూ ప్రయాగవచ్చిందీటీము. వాళ్లకు తమ విజయంలో అణుమాత్రమైనా సందేహంలేదు. ఇటు ప్రయాగవాళ్లూ నిరాశగాలేరు. వాళ్ళంతా ప్రతాప్‌మీద ఆశలు పెట్టుకు కూర్చున్నారు. ఒక్క అరగంటైనా నిల దొక్కుకుని ఆడితేచాలు, 'రన్సు'కు కొరతేమీ వుండదు. ఇంతసేపే బంతివేయవలసి వచ్చిందా అంటే కన్నుమూసుకుని వాళ్ళదే విజయమని చెప్పొచ్చు." ఇటువంటి ఆటగాళ్లతో ఇదివరకెన్నడూ ఆడివుండలేదు ఏమవుతుందో అని గుండెలు కొట్టుకుంటున్నాయి. సరిగ్గా పదిగంటలకు ఆట ప్రారంభ మయింది. మొదట అలీగఢ్ వాళ్లు ఆడారు, రెండూ రెండు న్నర గంటలు తమ ప్రావీణ్యమంతా, తమ ఆటతనమంతా అద్భుతంగా ప్రదర్శించారు. ఒంటిగంటకు వాళ్ల ఆట సమాప్త మయింది. మొత్తం నాల్గువందలు రన్సుచేశారు. ఇప్పుడు ప్రయాగ టీము వంతువచ్చింది. ఇప్పటికే కాళ్లూ చేతులు వాచిపోయి వున్నాయి. పరాజయం తథ్యమనుకున్నారు. విజ యంమాట దేవుడెరుగు, అసలు సరిసమానం కావడమూ గగనమే. ఇన్ని రన్సు చేసేనాథు డెవ్వడు? ఒక్క ప్రతాప్ వల్ల ఇదంతా సాధ్యమా? మొదటి ఆటగాడు బర్రిలో కొచ్చాడు. మూడో బంతిలోనే శెలవు పుచ్చుకన్నాడు. రెండోవాడు దిగాడు ఒక్క ఐదుసార్లు ఆడేటప్పటికే బ్రహ్మ ప్రళయమయింది. మూడో ఆయన మొదటి బంతిలోనే బల్ల అక్కడపెట్టి వెళ్ళిపోయాడు. నాల్గో మహాశయుడు రెండు మూడు 'హిట్సు' కొట్టాడు. కాని ఒక్కటీ సరిగా తగల్లా. ఐదోవాడు తన కాలేజీలో మంచి ఆటగాడని ప్రఖ్యాతి చెంది

నవాడు. కాని ఇక్కడ అతగాడి పప్పులేమీ ఉడకలా. కర్ర పట్టుకున్నాడో లేదో అవుటైకూర్చున్నాడు. ఇప్పుడిక ప్రతాప్ వంతు వచ్చింది మత్తగజంలా అడుగులు వేసుకుంటూ, బ్యాట్ త్రిప్పుకుంటూ ఫీల్డులోకి ప్రవేశించాడు. ఉభయపక్షాలు కరతాళధ్వని చేశాయి. ప్రయాగవాళ్ల స్థితిచూస్తే జాలి వేస్తోంది. అందరిదృష్టీ ప్రతాప్‌మీదనే. అందరిగుండెల్లోనూ రైళ్ళు పరుగెత్తుతున్నాయి. నలువేపులా నిశ్శబ్దంగా ఉంది. ప్రతాపుకు విజయం చేకూరుగాక అని కొందరు దూరంగా కూర్చుని దేవుని ప్రార్థించుతున్నారు. దేవుళ్లూ, దేవతలూ, అంతా స్మరణకొస్తున్నారు. మొదటిబంతి వచ్చింది. ఖాళీగా పోనిచ్చాడు ప్రతాప్. ప్రయాగవాళ్ళ గుండెలుగుభేలుమన్నాయి. రెండోబంతివచ్చింది. అదీ ఖాళీగాపోయింది. ఈసారి ప్రయాగ వాళ్ళగుండెలు జారిపోయాయి. ఎందరో గొడుగులు సంభాళించుకుని ఇంటిముఖం పట్టారు. మూడోబంతి వచ్చింది. ఏదో టపాకాయ ప్రేలినట్టుగా శబ్దం వినవచ్చింది. రివ్వుమంటూ వడగాలి మాదిరిగా ఆకాశమండలాన్ని భేదించుకుంటూ వెళ్లి ‘ హిట్ ’ చేసే ఆటగాడికి వందగజాల అవతల పడింది. చప్పట్లతో దశదిశలు మార్మోగాయి. ఎండిపోతున్న మాగాణిలో వర్షం చినుకులు పడ్డట్లు. వెళ్లే వాళ్లు ఆగిపోయారు. నిరాశల్లో ఆశాంకురం అంకురించింది. నాల్గోబంతి వచ్చింది. దాని పూర్వం బంతికన్న పదిగజాలు అవతలికెళ్లి పడింది. ఫీల్డర్ కంగు తిన్నాడు. హిట్ వద్దవాడికి సహాయపడ్డాడు. ఐదోబంతి వచ్చింది. కొడితే కట్‌మీదికెళ్లి పడింది. ఇంతలో ‘ ఓవర్ ’ అయిపోయింది. బౌలర్ మారాడు. కొత్తబౌలర్ పట్టి

కసాయివాడు. ప్రమాదంగా బంతివిసురుతాడు. కాని వాడి మొదటిబంతే ఆకాశానికెళ్ళి సూర్యమండలాన్ని తాకివచ్చింది. ఇక తర్వాత ప్రతాపుని బాటుకీ బంతికీ మధ్య చక్కటి స్నేహం కుదిరిందా అన్నట్టుగా వుంది. బంతివస్తుంది. కాని నలుదిశలకూ - ఒకసారి తూర్పుగా, రెండోసారి పడమరగా, మూడోసారి దక్షిణంగా, నాల్గో సారి ఉత్తరంగా - వెళ్ళిపోతుంది. పరుగెత్తలేక ఫీల్డర్లకు చాలివస్తోంది. ప్రయాగవాళ్ళ ఉత్సాహానికంతులేదు. ఎగిరెగిరి గంతులేస్తున్నారు. చప్పట్ల మోతతో నభోమండలం ప్రతిధ్వనిస్తోంది. టోపీలూ, హాట్లూ గాలిలో పల్టీలు కొడుతున్నాయి. ఒకడు డబ్బులుతీసి విరజిమ్మి పారేస్తే ఇంకొకడు మెడలోని బంగారం గొలుసు తీసి విసరి అవతల పారేశాడు. ప్రతిపక్షం అసూయతో క్రుంగిపోతోంది ఉక్రోషంతో నోటికొచ్చినట్టుగా ప్రేలుతోంది. ఒకసారి ఫీల్డు మార్చుకుంటే మరోసారి బౌలర్నను మార్చుకుంటోంది. కాని వాళ్ళ క్రీడా-కౌశలమూ, చాకచక్యమూ అంతా బూడిదలో పోసిన పన్నీరు లాగుంది, సరిగ్గా రెండుగంటలసేపు టపాకాయలు, బాంబులు, ప్రేల్చుతున్నట్టుగా ఆడాడుప్రతాప్. పిల్లలు చందమామ కోసం ఎగిరెగిరి అర్రులు చాపినట్టుగా బంతికోసం అర్రులు చాపి ఎగురు తున్నాడు ఫీల్డరు. రన్సు సంఖ్య మూడువందలకు దేకింది. ప్రతిపక్షానికి బేజారెత్తిపోయింది. ఆ గుండెదడ వర్ణించ శక్యంకాదు. ఒక్క-బంతీ తిన్నగా రావడంలేదు. ఇంకో యాభై రన్సు అయ్యాయి.

అప్పుడు కాస్తవిశ్రాంతి ఇవ్వవలసిందని ఎంపైరును అడిగాడు. ఫీల్డులోంచి బయలుదేరి వస్తుంటే వేలాదిజనం

ఎదురుగా పరుగెత్తారు ఒకడు విడిచి ఇంకొకడు భుజాలమీద చంకల్లో కెత్తుకోసాగారు. ఫీల్డంతా ఉరుకులు, పరుగులతో నానా గల్లంతుగా ఉంది. వందల గొడుగులూ, కర్రలూ టోపీలూ, చెప్పలూ వాయుమండలంలో వీరవిహారం చేస్తున్నాయి. తామూ ఉల్లాసం పట్టలేక పోతున్నట్టుగా. సరిగ్గా ఆ సమయంలో టెలిగ్రాం బంట్రోతొకడు సైకెలుమీద వస్తున్నట్టు కన్పడ్డాడు. సమీపించి "ఇందులో" ప్రతాపచంద్రుడెవ్వరు?" అని అడిగాడు. ఉలిక్కిపడుతూ అతనికేసి చూచాడు ప్రతాప్. టెలిగ్రాం చేతికందిచ్చాడు బంట్రోతు. విప్పిచూడిగానే జీవచ్ఛవంలా అయ్యాడు. దీర్ఘంగా నిట్టూర్పు విడిచి కుర్చీకి చేరబడిపోయాడు. "మిత్రులారా! ఇప్పుడిక 'మేచ్' జయాపజయాలభారం మీ భుజాలమీదవుంది. నా కర్తవ్యమేదో నేను నిర్వర్తించా, ఈ ఎక్స్‌ప్రెస్సు బండిలోనే ఇంటికెళ్లి పోతున్నా" అన్నాడు గద్గద కంఠంతో.

ఇలా అని బోర్డింగు హౌవుస్ వేపుకు చరచరా వెళ్లి పోయాడు. "ఏమిటి? ఏమిటి?" అని వందలగొంతు లొకేసారి అరిచాయి. ప్రేక్షకుల ముఖాలు హఠాత్తుగా కళాకాంతులు తప్పిపోయాయి. 'ఏమిటి' అన్నదానికి సమాధానం చెప్పేఅంత వ్యవధిలేదు. తక్షణం జట్కా చేయించుకుని స్టేషనుకువెళ్లాడు. దారిపొడుగునా మనస్సులో రకరకాల భావాలూ, తర్క - వితర్కాలూ చెలరేగుతూనేఉన్నాయి. వచ్చేటప్పుడు చెప్పకుండా వచ్చినందుకు తన్ను నిందించుకుంటున్నాడు. "ఇప్పుడు చూచే అదృష్టముందో లేదోకదా? అలాంటి దురదృష్టం దేవుడు కలుగచేయకుండుగాక. అటువంటి

దేమైనా సంభవిస్తే ముఖానికి మసిపూసుకుని దేనిలో నన్నా పడి చచ్చిపోతా "ఇలా ఆలోచించి ఎన్నోసార్లు కంటతడి పెట్టాను, రాత్రి తొమ్మిది గంటలకు బండి బెనారస్ చేరింది. బండి దిగి తిన్నగా ముందు శ్యామాచరణ్ గారింటికి బయలు దేరాను. మనస్సులోని చింత కళ్ళల్లో కన్పడుతోంది. గుండెల్లో దడదడా రావం వినవస్తోంది. డిప్టీగారు నతమస్తకుడై కుర్చీలో కూర్చొనివున్నాడు. డాక్టరుకోసం వెళ్ళటానికి సిద్ధంగా నిలబడివున్నాడు కమలాచరణ్. ప్రతాపుని చూడగానే గభాలునవచ్చి కౌగలించుకున్నాడు. డిప్టీగారూ ఆలింగనం చేసుకుని అలాహాబాద్ నుండి ఇదేనా రావడం ?" అని ప్రశ్నించాడు.

ప్రతాప్:-ఔనండీ విరజన్‌కు చాలా సుస్తీగావుందని అమ్మ దగ్గరనుండి టెలిగ్రాం వచ్చింది. ఏమన్నా కులాసాగావుందా?

శ్యామా:-ఏంచెప్పను ? ఇటు రెండుమూడు నెలలయింది. ఆరోజు కారోజు క్షీణించిపోతోంది. ఎన్నోమందులు వాడిచూచాం. కాని వృథా. మరి ఈశ్వరుడేంచేయనున్నాడో తెలియదు. క్షయ అంటున్నాడు డాక్టరు. కాదు హృదయ దౌర్బల్యం అంటారు ఆయుర్వేదవైద్యులు.

ప్రతాపచంద్రుని శుభాగమన వార్త చెవినపడింది. ఆ క్షణంనుండి విరజన్ హృదయంలో ఆశ - భయాల మధ్య పరుగు ప్రారంభమయింది. "ఇంటికొచ్చి వుంటాడు. పిన్ని అక్కడకు వెళ్ళి చూచిరమ్మని బలవంతాన పంపించి వుంటుంది." అని ఒకసారి ఆలోచిస్తుంది. "ఏమో ! నా జబ్బుసంగతి తెలిసి తిన్నగా ఇక్కడికే వచ్చాడేమో, కాదుకాదు. నాపట్ల అంత

ప్రేమకూడానా? ఔను, చచ్చేదేదో చావనేచస్తుందిగా. వెళ్లి చూడలేదన్న లోకనింద దేనికని వచ్చివుంటాడు. లేక పోతే నే చస్తేనేం? బ్రతికితే అతనికేం పట్టింది? ఇవ్వాళ నేనూ బాగానే అడుగుతా. ఏమిటీవెర్రి! మాటలవల్ల ప్రయోజనమేమిటి? పలుకే బంగారమన్నట్టుగా మూతి ముడుచుకు కూర్చుంటే నేనే నేమిటి అంత తక్కువ తిన్నది? ఔను క్షేమంగానే ఉన్నా. మీరూ అలాగే ఉండాలని ప్రార్థన' అని ఒక్కమాటతో సరిపెట్టా ఏమిటది! ఈ మాసిపోయిన చీరెతో వుండడందేనికి? తన సుఖదుఃఖాల పట్ల సానుభూతిలేని వ్యక్తి ఎదుట ఇలాంటి వేషం వేసుకోవడం వల్ల ప్రయోజనమేముంటుంది? మా ఇంటికి అతిథిలా, వచ్చాడు. నేనూ ఆతిథ్యమిచ్చే దానిలా వ్యవహరిస్తాను." అని ఇంకోసారి ఆలోచిస్తుంది. మానవుడెంత చంచలచిత్తుడు! తన అకృపద్వారా తన్నీస్థితికి తెచ్చిన వ్యక్తిని ఉడికించ టానికి ఇలాంటి ఉపాయాలు ఆలోచిస్తోంది విరజన్.

ఉదయం పది గంటలవేళ, మాధవి కూర్చుని విసరు తోంది. ఏమూలచూచినా మందులసీసాలే కన్పడుతున్నాయి. మంచంమీద పడుకునిఉంది విరజన్. ఈ రకమైన ఆలోచ నల్లో మునిగితేలుతున్న సమయంలో లోపలికొచ్చాడు ప్రతాప్. ఉలిక్కిపడిలేచి "అమ్మగారూ! లేచికూర్చోండి. ప్రతాప్‌వచ్చాడు." అంది మాధవి. గభాలున లేచికూర్చుంది విరజన్. మంచందిగి కూర్చోబోయింది. కాని బలహీనత కారణంగా నేలమీద పడిపోబోయింది. గభాలున పట్టుకు న్నాడు ప్రతాప్. మళ్ళీ మంచంమీద నెమ్మదిగా పడుకుండ

పెట్టాడు. "అయ్యో! ఎంతలో ఎంతమార్పు! ఈ విరజనే కొన్ని నెలల పూర్వం రూప-లావణ్యాలకు మూర్తిలావుంది. ముఖంలో కాంతి, నేత్రాల్లో హాసం వాసంచేస్తుండేవి. పలుకులు కోకిలగానంలా వుండేవి. చిరునవ్వు ఆకర్షణీయంగా వుండేది. ఆ విరజనే నేడు అస్థి - చర్మావశిష్టంగా వుంది. గుర్తు పట్టడమే కష్టంగాఉంది. ప్రతాపుని నేత్రాలు అశ్రు వర్షం కుండపోతగా కురిపించాయి. క్షేమసమాచారాలు అడగాలనుకున్నాడు కాని నోటినుండి "విరజన్ !" అన్న మాటొక్కటిమాత్రమే వెలువడి ఆగిపోయింది. మనోగతభావాలు పరీక్షించటానికి ప్రేమ - నేత్రాలు గీటురాయి విరజన్ కన్నెత్తిచూచింది, ప్రతాపుని అశ్రుబిందువులు ఆవిడహృదయంలో పేరుకొనివున్న కల్మషమంతా శుభ్రంగా కడిగివేశాయి.

భావియుద్ధం, దాని స్వరూపం, ఎత్తుగడలు మొదలైన వాటినిగురించి సైన్యాధిపతి ముందుగానే ఆలోచించుకు కూర్చుంటాడు. కాని శత్రువు దండెత్తి నెత్తిమీదికి రాగానే వేసుకున్న ప్లానులూ, ఆలోచించుకున్న ఎత్తుగడలూ అన్నీ గుండెలు జారిపోవడంతో మరచిపోతాడు. అలాగేవుంది విరజన్ పరిస్థితీనీ. ప్రతాప్ ఎదుటికి రావడంతోనే ఇంతకుముందు ఆలోచించిన ప్లానులన్నీ మరచిపోయింది. ప్రతాప్ దుఃఖిస్తూ వుండడంచూచి ముందు తన దుఃఖమంతా మరచిపోయింది. మంచంమీదనుండి లేచి చీరెకొంగుతో కన్నీళ్లు తుడువసాగింది. దోషారూఢుడైన ప్రతాప్ ఇప్పుడు క్షమార్హుడుగాఉన్నాడు. తన్నింతో కృశింపజేసుకుని చివర కిటిస్థితికి తెచ్చుకున్న విర

జన్ ఇప్పుడు భోరున ఏడుస్తోంది. "ఇల్లూ! ఊరుకో. ఏడ్వకు దేవుడితోడు, నేను ఆరోగ్యంగానే ఉన్నా." అని సముదా యిస్తోంది-అనారోగ్యంగా వుండటం తన నేరమన్నట్టుగా. స్త్రీలలో సంవేదన శీలత్వమెంత సున్నితంగా వుంటుందో కదా! ప్రతాపుడేదో కాస్త సంకోచించాడు. ఆ సామాన్య సంకోచమే విరజనుని ప్రాణంమీదికి తెచ్చిపెట్టింది. జీవితంపట్ల ఉపేక్షాభావం కల్గచేసింది. అనేక నెలలనుండి హృదయాన్ని దహింపుతోంది. ఈర్ష్యాగ్ని; రక్తమాంసాలు పీల్చి పిప్పి చేస్తోంది హృదయసంతాపం, కాని అదే కొన్ని అశ్రుకణా లతో చల్లారి పోయింది. గొప్ప గొప్ప డాక్టర్లకూ, వైద్యు లకూ సాధ్యంకాని రోగం నాల్గు జలబిందువులు ఇట్టేకుదర్చి వేశాయి. ఇవి జల బిందువులా లేక అమృత బిందువులా?

ప్రతాప్ ధైర్యం తెచ్చుకుని "విరజన్! ఇంతటిదుస్థితికి ఎందుకు తెచ్చిపెట్టుకున్నావు?" అని ప్రశ్నించాడు దీనంగా.

విరజన్:- (నవ్వి) నేనుకాదు తెచ్చిపెట్టుకుంది. దీనికంతకూ నువ్వే కారణం.

ప్రతాప్:- అమ్మదగ్గరనుంచి టెలిగ్రాం వచ్చింది. లేకపోతే కబురుకూడ తెలిసేదికాదేమో.

విరజన్:-అవసరమేముంది? ఎవ్వరిని మరచిపోదామని ప్రయోగ దయచేశావో ఆ వ్యక్తి చావు - బ్రతుకులతో నీ కేమిటి సంబంధం?

ప్రతాప్:- కబుర్లకేంలే. కాని పరాయి వాళ్ళకు ఉత్తరాలు వ్రాయాల్సిన అవసరమేముంది?

విరజన్:- ఇంతదూరాన్నుండి కష్టపడివస్తావనీ, ఉత్తరాలకు సమాధానం వ్రాస్తావనీ ఇక్కడనమ్మిందెవ్వరు? గుమ్మంలోకొచ్చి వెనక్కి తిరిగి పోయే మనిషిక, ముఖం చూస్తేనే పాపమని భావించి తిరిగిపోయే మనిషికి ఉత్తరాలువ్రాస్తే ఏమిటి ప్రయోజనం?

ప్రతాప్:- ఆ విధంగా తిరిగి పోయినందుకు ఎంతగా బాధపడ్డానో అది నాకే తెలుసు. మరి నువ్వో ఆరోజువరకూ ఒక్క ఉత్తరమన్నా వ్రాసిన పాపానపోలేదుగా. అంచేత వీడసలు నీ దృష్టిలోనే లేకుండా పోయివుంటాడని అభిప్రాయపడ్డా.

విరజన్:- నువ్వు చెప్పే మాటలు నిజంకాదని నేను నమ్మివుంటే ఇవన్నీ కల్పిత గాథలని అనేసి వుండేదాన్ని.

ప్రతాప్:- నీ యిష్టమొచ్చినట్టుగా అనుకో. గాని ఇప్పుడెలా వుందో సరిగా చెప్పు. ముఖమంతా పాలిపోయింది. చూచి నేనసలు గుర్తుపట్టలేక పోయాను.

విజరన్:- రోగమిక త్వరగా నయమవుతుంది. తగిన ఔషధం లభించిందిగా.

ఆ మాటల అంతరార్థం గ్రహించాడు ప్రతాప్. "అయ్యో! పాపం! నా రవ్వంత పొరపాటు ఎంత ప్రళయానికి దారితీసింది!" చాలాసేపు ఏవేవో బోధిస్తూ కూర్చున్నాడు. తిరిగి ఇంటికి బయలుదేరేటప్పుడు చూస్తే విరజన్ ముఖం కళకళలాడుతోంది. 'లల్లూ తన్ను మరవలేదు. తనపట్ల అతని ఆదరాభిమానాలు సడలలేదు.' అని నమ్మకం కల్గింది. ఎన్నో నెలలనుండి కలకవేస్తూ బాధిస్తున్న కంటకం తీసివేయ బడింది. ఒక్క వారం రోజుల్లోనే ముఖవర్చస్సు

పూర్తిగా మారిపోయింది. బంగారుఛాయవచ్చింది. ఎన్నడూ జబ్బుపడ నేలేదన్నట్టుగా.

# 16

జబ్బు స్థితిలో ఉన్నంతవరకూ తనను ఎవ్వరు మందు లిస్తున్నారో, తన్ను చూడ్డాని కెవ్వరు వస్తున్నారో రోగి కంతుపట్టదు. స్వయంగా తానే రోగంతో సతమతమై పోతు న్నప్పుడు లోకుల గొడవ ఏంపట్టించుకుంటుంది? కాని ఆ స్థితి లోంచి బైటపడిన అనంతరం తనకు పరిచర్యలు చేసిన వాళ్లూ, వాళ్ళు తనకోసం పడిన పాట్లూ అన్నీ దృష్టిలో కొస్తాయి. అప్పుడు వాళ్ళపట్ల హృదయంలో ఆదరాభి మానాలూ, శ్రద్ధాభక్తులూ పెంపొందుతాయి. వ్రజరాణీ సరిగ్గా ఇదే స్థితిలోఉంది. తాను కష్టదశలో వున్నప్పుడు కమలాచరణ్ పడ్డపాట్లూ, పొందిన వ్యాకులతా వ్యగ్రతలూ ఆమె దృష్టిలోకి రాలేదు. మొదటినుంచీ అతని సేవా-సత్కా రాల విషయంలో ఏలోటూ రానివ్వడం లేదు. కాని ఇదంతా లోకవ్యవహార దృష్ట్యానేగాని యదార్థప్రేమతో మాత్రం కాదు. జబ్బు అనంతరం దృక్పథంలోకూడ మార్పువచ్చింది. కమలాచరణుని శ్రమ, సేవ జ్ఞప్తికొచ్చాయి. ఈ అపార ఉపకారానికి ప్రత్యుపకారం ఏంచేయునా అని అహర్నిశం ఆలోచించసాగింది. "సేవా శుశ్రూషలద్వారా సుఖపెట్టడం నా విద్యుక్తధర్మం. కాని సుఖపెట్టడంమాట అటుంచి ఆయ నను మరింత శ్రమ కల్గచేయటానికే ఉద్యుక్తురాలనయ్యా. ఇంత నిష్కల్మష భావంతో ఆయనేమో ప్రేమించడమూనూ!

ఈశ్వరుని ఎదుట ఏం సంజాయిషీ చెప్పగలను? యదార్థ ప్రేమ - పద్మం తరచు కృపా- ప్రభాకరోదయంతో వికసిస్తూ వుంటుంది. రూపయువ్వనాలూ, సంపదధికారాలూ, స్వాభావిక సౌజన్యమూ మొదలైనవన్నీ ప్రేమ - విత్తనం నాటలేక కాళ్లు ఆరచాపిన చోట ఉపకారతంత్రం చక్కగా పనిచేస్తుంది. యథార్థసేవా శుశ్రూషలతో ద్రవించని వజ్ర - కఠోరహృదయం బహుశా ఉండదు.

కమలా వ్రజరాణులమధ్య అనురాగం దినదిన ప్రవర్థమానమవుతోంది. ఒకడు ప్రేమకు దాసుడైతే రెండోది కర్తవ్యానికి దాసురాలు. వ్రజరాణి నోట్లోంచి మాటరావడమే ఆలస్యం, వెంటనే పూర్తిచేయకుండా వుండడం అసంభవం. అతని బుద్ధిఅంతా ఆ ప్రయత్నాల్లోనే లగ్నమైపోతోంది. చదువనేది తల్లిదండ్రులను మభ్య పెట్టటాని కొక సాకుమాత్రమే. సదా భావ-వైఖర్లు గమనిస్తూవుంటాడు. ఏపనిచేస్తే ఆవిడకు సంతోషంగా వుంటుందో అది జాగ్రత్తగా పరిశీలిస్తుంటాడు. అటువంటి దెట్టిదైనా చేయటానికి సర్వదా నడుం బిగించుకుని తయారవుతాడు. ఒకరోజు సంగతి. తోటలోంచి పువ్వులు తెస్తోంది మాధవి. అతని కంటపడింది. అత్యంత సామాన్య పూలతోట. ఇంటి వెనకప్రక్క నెక్కడో అజలేకుండా ఉంది. ఎవ్వడికీ ఆ తోట విషయం పట్టిచచ్చేది కాదు. అంచేత మున్నాటవనై రోజులూ మాడిపోయే వుండేవి. పువ్వులంటే ప్రాణాలు తీసుకుంటుంది వ్రజరాణి. పూలతోట స్థితిచూచి మొక్కలకు అప్పుడప్పుడు కాసినినీళ్లుపోస్తూ ఉండవలసిందని మాధవితో చెప్పింది. తర్వాత క్రమక్రమంగా

తోట బాగుపడింది. కొద్దిరోజుల్లో పువ్వులు పూయసాగాయి కమలా చరణునికి మాత్రి మీసంకేతం చాలు. శక్తంతా ధారపోసి దాన్ని బాగుచేయాలని సంకల్పించుకున్నాడు. మంచి ఆరితేరిన ఇద్దరు నౌకర్లను పెట్టాడు. రకరకాల, సుందర సుందర పూలమొక్కలు నాటించాడు. రకరకాల గడ్డి వేళ్ళు పాతించాడు. భిన్నభిన్నతీగెలూ పాదులూ కుంప ట్లలో అలంకరించాడు. చక్కటి మడులూ, అందమైనగట్లూ పెట్టించాడు. స్థానస్థానంలో తీగెలు పైకి ఎక్కించబడ్డాయి. ఎప్పుడుచూచినా పుస్తకమొకటి చేత్తో పట్టుకుని తోటలోనే తిరుగుతుంటాడు కమలాచరణ్. తోట అలంకారం విష యంలో తోటమాలులకు చక్కటి సలహాలూ, సూచనలూ ఇస్తుంటాడు. ఈ శ్రమంతా పాపం భార్యావినోదంకోసమే. ఇలాంటి ప్రేమ - భర్తని గారడీమంత్రం ఎవ్వరిమీద పని చేయదు? ఒకరోజున "ఇదిగో నావెంటరా తోట చూపి స్తాను" అన్నాడు. వ్రజరాణి వెంటవెళ్ళింది.

చంద్రోదయమయింది. ఆ పండు వెన్నెలలో ఆకులూ, పువ్వులూ - తీగెలూ అన్నీ అత్యంత శోభాయమానంగా కన్పడుతున్నాయి. మందమందంగా మలయమారుతం వీస్తోంది. గుండుమల్లె, మంచిమల్లె పుష్పాల సువాసన గప్పు గప్పు మంటోంది. అలాంటి సమయంలో పట్టుచీరకట్టి, తోట మధ్య షికారు చేస్తోంది వ్రజరాణి. ఆవిడముఖ - వికాసం చూచి పుష్పాలు.సిగ్గుపడుతున్నాయి. పూలరాణిలా కనపడుతోంది. " నేటికి నా శ్రమ ఫలించింది." అన్నాడు కమలా చరణ్.

కుంకుమలో ఎఱ్ఱటి బుక్కాయిపొడి నిండివున్న విధంగానే ప్రజరాణి నేత్రాల్లో ప్రేమ - రసం నిండివుంది. ముసి ముసిగా నవ్వు పూసుకుంది. పెదవిమాత్రం ఆడించలేదు.

కమలా:- ప్రపంచంలో నావంటి అదృష్టవంతుడింకెవ్వడూ లేకపోవచ్చు!

ప్రజ:- నాకంటెకూడానా?

ప్రేమోన్మాదంలో కన్నూ మిన్నూ గానకుండా వున్నాడు కమలాచరణ్. వెంటనే విరజనుని ఆలింగనం చేసుకున్నాడు. కొన్నాళ్ళవరకూ ఇదొక నిత్యనియమంగా ఉంది. ఈ మధ్యలో మనోవినోదార్థం మరో నూతన సామాగ్రి లభించింది. మంచి మంచి ఫొటోల 'ఆల్బమ్' ఒకటి విరజనుకు పంపాడు రాధాచరణ్. అందులో చంద్రావతి ఫొటోలు చాలా వున్నాయి. అందులో ఒకదాంట్లో కూర్చుని చేగకు మాటలు నేర్పుతోంది. ఇంకోదాంట్లో ఉత్తరాలు వ్రాస్తోంది. మరో ఫొటోలో పురుషవేషంలో ఉంది. ఫొటోగ్రాఫీ ఆర్టులో గొప్ప నిపుణుడు రాధాచరణ్. విరజన్ కెంతో నచ్చిందీ ఆల్బమ్. ఇంక చూడవలసిన పనేముంది? ఫొటోగ్రాఫీ నేర్చుకోవాలన్న పిచ్చి పుట్టింది కమలాబాబుకు. విరజన్ ఫొటో తానెన్నడు తీయగలనా అన్న ఆదుర్దా నిద్రపోనివ్వడంలా. కెమెరా - తత్సంబంధమైన సామాన్లూ పంపమని వెంటనే వుత్తరమొకటి గీసిపారేశాడు. అన్నగారికి ప్రాక్టీసు ప్రారంభమయింది. బడికని ఇంటిదగ్గరనుంచి బయలుదేర్తాడు. కాని దారిలో ఒక పారసీ ఫొటోగ్రాఫర్ షాపులోకెళ్ళి పీఠం వేస్తాడు. ఈ రకంగా మూడు నాల్గు మాసాలు కఠోర పరి

శ్రమచేశాడు. ఫలితమూ దక్కింది. ఆర్టులో ఆరితేరాడు. ఇంతవరకు ఇ ట్లో ఎవ్వరికీ తెలియను. "పగలంతా ఎక్కడ వుంటున్నారు? శెలవురోజునా దర్శనం దుర్లభంగానే వుంటోంది." అని ఎన్నోసార్లు అడిగింది కూడ విరజన్. కాని 'ఆఁ, ఊఁ' లతో దాటవేసుకు పోయేవాడు కమలాచరణ్.

ఒకరోజున కమలాచరణ్ ఏదో పనిమీద గ్రామాంతరం వెళ్లాడు. ప్రత్తాపుకు వుత్తరం వ్రాయాలని బుద్ధి పుట్టింది ప్రజరాణికి. పెట్టె తెరచింది. ఉత్తరం రాయటానికి కాగిత మేమీ దొరకలా. "వెళ్ళి మీ తమ్ముడిగారి డెస్కులోంచి కాగిత మొకటి తీసుకురావే అని చెప్పి మాధవిని పంపింది. అది చరచరా వెళ్ళి డెస్కుమీద తెరచివున్న అల్బమ్‌పట్టు కొచ్చింది. తెచ్చి "అమ్మగారూ! ఇదిగో ఈ బొమ్మల పుస్తకం కన్పడితే పట్టుకొచ్చా" అంది

ఎంతో ఉత్సాహంతో, కుతూహలంతో అందుకుంది విరజన్. మొదటి పేజీ తెరచింది చూడగానే సంభ్రమంతో స్తంభించి పోయింది. అది తన ఫొటోయే. దుప్పటి కప్పుకుని మంచంమీద నిద్రావస్థలో పడిఉంది. కేశములు ముఖంపై చెదరివున్నాయి. అధరాగ్రములపై మృదుమధుర మంద హాసం ప్రతిభాసిస్తోంది. ఏదో మనోభిలషిత స్వప్నం చూస్తున్నట్టుగా. ఫొటో క్రింద వ్రాయబడిఉంది— "ప్రేమ - స్వప్నం" విరజన్ ఆశ్చర్యానికి కంతులేదు. 'ఇలాంటి నా ఫొటో ఎలాతీయించాడు? ఎవ్వరిచేత తీయించాడు? ఏ ఫొటోగ్రాఫరు నైనా గదిలోకి తీసుకొచ్చాడా? కాదు కాదు అలాంటి పనిచేస్తాడా? ఒకవేళతానే స్వయంగా తీశాడేమో

అబ్బురమేముంది? ఇటు అనేక మాసాలనుండి కష్టపడి కృషి చేస్తున్నారుగా. ఆయానే గనక స్వయంగా అలాంటి ఫొటో తీసివుంటే నిజంగా ప్రశంసా పాత్రుడే రెండో కాగితం తిరగేసింది. అందులోనూ ఆమె ఫొటోయేవుంది. 'ఒక చీర కట్టింది తలమీద ముసుగు వేసింది. కాని సగం తలమీద మాత్రమే. తోటలో షికార్లు చేస్తోంది దాని క్రింద "ఉద్యాన భ్రమణం" అని వ్రాయబడిఉంది మూడో కాగితం త్రిప్పింది అదీ తన ఫొటోయే. పూతోటలో కూర్చుని పూలదండ గుచ్చుతోంది. ఈ ఫొటో అందంలో ఆ రెంటినీ తలదన్నివుంది. ఎందుచేతంటే చిత్రకారుడు ఇందులో ఎంతో నేర్పుగా ప్రాకృతిక రంగులు దిద్దాడు. ఈ ఫొటో క్రింద "సర్వసుందరీ తోటమాలినీ" అని చక్కటి దస్తూరితో వ్రాయబడిఉంది. ఒకనాడు తాను పువ్వులు గుచ్చుతోంది. అదే సమయంలో ముసిముసిగా నవ్వుకుంటూ చిల్లకంప పొదలోనుండి బైటకొచ్చాడు. ఆ విషయం ఇప్పుడీ ఫొటో చూడగానే స్మరణకొచ్చింది. 'తప్పక ఆరోజునే ఇది తీసివుంటాడు' అని అనుకుంది. నాల్గో కాగితం త్రిప్పిచూచింది. పరమమనోహర దృశ్యమొకటి కన్నులకింపుగా కనపడింది. నిర్మలజలంతో నిండి, తరంగాలతో అలరారుతున్న సరోవరం. దాని కిరుప్రక్కల కనుచూపు మేరవరకు గులాబిమొక్కల వరుసలు విరాజల్లుతున్నాయి. వాటి కోమల సుగంధపుష్పాలు వాయువీవెనలతో ఉయ్యాల లూగుతున్నాయి. పచ్చని ఆకాశంలో ఎర్రిచుక్కలు వ్రేలాడగట్టిందా ప్రకృతి అన్నట్టుగా. ఏదో

ఒక ఇంగ్లీషు ఫొటోను నకలు చేసినట్టుగా ఉంది. తతిమ్మా పేజీలన్నీ ఇంకా తెల్లగానే ఉన్నాయి.

తన ఫొటోలన్నీ మళ్ళీ ఒకసారి తిరగేసి చూచింది విరజన్. ప్రతి రమణీమణికి తన సౌందర్యం చూచుకుంటే ఒక రకమైన గర్వమూ, ఆనందమూ కలుగుతుంటాయి. వెంటనే కంటికగపడకుండా అల్బమ్‌ను దాచి వేసింది. సాయంత్రం వచ్చి డెస్కుమీదచూస్తే అల్బమ్ లేదు. నిలువునా నీరై పోయాడు కమలాచరణ్. ఆఫొటోలన్నీ ఎన్నో నెలల కఠోర పరిశ్రమఫలితం. దాన్నే ఉపహారంగా బహూకరించి విరజన్ హృదయాన్ని మరింత చూరగొనాలని గంపెడంత ఆశతో కూర్చుని ఉన్నాడు. ఎంతో విచార పడ్డాడు. వర్ణించ వీల్లేనంతగా బాధపడ్డాడు. లోపలికెళ్ళి విరజనుని అడిగాడు. 'రామ రామ' నాకేం తెలుసు అంది ఆ ఇల్లాలు. ఒళ్ళంతా చీమలు ప్రాకినట్టుగాఉంది. కంగారుపడి పోతున్నాడు. మిత్రులెవ్వరన్నా తీసుకుపోయారేమోనని కంగారుగా వాళ్ల దగ్గరకు పరుగెత్తాడు. అక్కడా దెప్పి పొడుపులు మినహా మరేమీ చేజిక్కలేదు. ఇప్పుడిక పూర్తిగా ఆశవదలుకుని దిగాలుపడి కూర్చున్నాడు. తర్వాత సాయంత్రానికి అంతు తెలిసింది. స్వయంగా విరజనే వచ్చి చెప్పింది. ఈరకంగా కాలం ఆనందంగా గడచిపోతోంది ప్రేమ – రంగంలో ఒకరికంటె ఒకరు మించివుండాలని పోటీలుపడ్తున్నారు. కాని ఉభయుల ప్రేమ దృక్పథంలో తేడాఉంది. ప్రేమోన్మాదంలో తన్ను మైమరచి తిరుగుతున్నాడు కమలాచరణ్. తభిన్నంగా కర్తవ్య పునాదు

లపై ప్రేమ-భవనం నిర్మించుకుపోతోంది విరజన్ వాస్తవంగా ఇది ఆనందమయ కర్తవ్యం.

ఇంకో మూడేళ్లు గడిచాయి. ఈ మూడు సంవత్సరాల కాలం ఆ దంపతుల సుఖమయ జీవితంలో సర్వోత్తమ శుభ సమయం. నాలుగో వత్సరం ఆపదలను నాందికాలం సుఖ సంపదలకు కొరతలేని వాళ్లెందరోవున్నారు ప్రపంచంలో. వీరిజీవితం నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఉంది కాని హత భాగ్యులకూ కొరతలేదీ జగత్తులో. వాళ్ల సుఖసౌఖ్యాలు పిడుగులా ఒక్కసారి తళుక్కుమని మెరసి కాలగర్భంలో లీనమై పోతుంటాయి. అటువంటి వారిలో వ్రజరాణికూడ ఒకర్తె. శీతగాలి ప్రచండంగా వీస్తోంది. బావుల్లోని నీరుసైతం మంచు గడ్డలా పేరుకుపోయే చలి వేస్తోంది అలాంటి సమయంలో కలరా వచ్చి తన ప్రతాపమంతా ప్రదర్శిస్తోంది వేలాది ప్రాణులు దానికి బలైపోతున్నారు. ఒకరోజున తీవ్రంగా జ్వరంవచ్చింది. గజ్జల్లో బిళ్ళకట్టితే చాలు; తర్వాత రోగి వెళ్ళిపోతాడు. బిళ్ల కట్టడమంటే మృత్యుసందేశ మన్న మాటే. తర్వాత ఎంతమంది వైద్యులొచ్చినా, డాక్టర్లొచ్చినా చేయగలిగిందేమీ వుండడంలా. ఎన్నిగృహాల దీపాలు ఆరిపోయాయో అంతులేదు. ఎందరో బాలబాలికలు అనాథులై పోయారు. వేలాది నారీమణులు వితంతువులయ్యారు, ఎవ్వరి కెటు సందుదొరికితే అటు పారిపోతున్నారు. ఎవ్వరికివారే యమునాతీరే లాగుంది, ఒకడికి సహాయ పడేవాడు కానీ, కాస్త ఓపికతో ధైర్యం చెప్పేవాడు కానీ వెదకినా కానరావడంలేదు. ఎక్కడచూచిన -

సందుల్లో, గొందుల్లో, వీధుల్లో - శవాలు గుట్టలుగుట్టలుగా పడి నాసికాపుటాలను బ్రద్దలుకొట్టేస్తున్నాయి. పట్నంలో కొట్లన్నీ మూతపడ్డాయి. ఇళ్ళకు తాళాలు బిగించారు ఎటుజూచినా బజార్లలో ధూళిమాత్రం ఎగురుతోంది ఎప్పుడన్నా ఏ మహానుభావుడన్నా ఏదో అత్యంత అవసర ముండి ఇంట్లోంచి బైటకు పాదంపెడితే అంగలార్చుకుంటూ నడుస్తాను. యమదూతలు వెన్నంటి తరుముకొస్తున్నట్టుగా. బస్తీ అంతా దిబ్బేసుకుపోయి జిల్లేళ్లు మొలిచాయి. కాపరం ఎత్తివేయకుండా అక్కడే వున్నవారిం కెవ్వరన్నా వున్నారా అంటే ఇద్దరే ఇద్దరున్నారు. ఒకటి స్మశానం, రెండు గోరీల దొడ్డి. దొంగలకూ, పండుగగాఉంది. మిట్టమధ్యాహ్నం తాళాలు పగలగొట్టుతున్నారు. సూర్యభగవానుని కళ్ళఎదుట కన్నాలు పడేవి. ఆ దారుణగాధ వర్ణించ బ్రహ్మకైనా శక్యంకాదేమో.

శ్యామాచరణ్ మంచి ధైర్యంగల మనిషి. తన ఇంటి చుట్టూ వున్న పేటలన్నీ లేచిపోయాయి. ఆయన అప్పుడూ ఇల్లు వదలిపెట్టి పోలేదు. కాని గుర్రం రౌతుచచ్చిపోవడంతో ఇంట్లో గందరగోళం ప్రారంభమయ్యాయి. పల్లెటూరికి తరలి పోవాలని సన్నాహాలు ప్రారంభమయ్యాయి. ఆ జిల్లాలోనే కొన్ని జమిందారీ గ్రామాల కొన్నాడు మున్షీజీ. పెన్షను కాలంలో అక్కడకు వెళ్ళి కాపరం పెట్టాలని సంకల్పం. 'మధుగ్రామ్' అనేవూళ్లో మంచి ఇల్లొకటి కట్టించాడు.కూడ కాశీవదలి ఆగ్రా వెళ్లి చావడం ఇష్టంలేదు. విరజనుకి ప్రయాణ వార్త తెలిసినప్పుడు పరమానందభరితురాలయింది. గ్రామ్య

జీవిత సుందరదృశ్యాలు కళ్ళఎదుట తిరగ సాగాయి. పచ్చ పచ్చగా చిగిర్చిన చెట్లూ; సస్యశ్యామల మైన పొలాలూ; దుప్పుల దుముకులూ; పక్షుల కలవరాలూ ప్రత్యక్షంగా కనపడసాగాయి. ఈ మనోహర దృశ్యాలశోభ చూడ్డానికి మనస్సు తహతహలాడిపోతోంది కమలాచరణుడూ అస్త్ర శస్త్రాలన్నీ సరిచేసుకుంటున్నాడు కాని హఠాత్తుగా తండ్రిగారి పిలుపొచ్చింది. ప్రయాగ వెళ్ళటానికి సిద్ధం కమ్మని చావు కబురు చల్లగా చెప్పాడు. అక్కడ ప్రతాప్ వుండనేవున్నాడు. చేదోడు వాదోడుగా వుంటాడు. పల్లెటూళ్లోఉండి జీవితం వృధాచేసుకుంటే లాభంలేదు." అని బోధింపబడింది. ఈనాల్గు వాక్యాలూ వినేటప్పటికి కమలాచరణుని గుండెలు గుభేలు మన్నాయి. ఆనజ్జీవాలు క్రుంగిపోయాయి. నే వెళ్ళనని స్పష్టంగా చెప్పాడు. ఏమేమో చాలాసేపు చెప్పాడు తండ్రి. కాని ససేమన్నాడు కొడుకు. చివరకు "నీకు ఇంతకూ చదువు కునే గీతలేదురా తెలిసివుండీ దెబ్బలాడడం నాదేశుద్ధతప్పు" అని వూరుకున్నాడు.

ఈ మాటలు వ్రజరాణి చెవినిపడ్డాయి. భరించరాని దుఃఖంకల్గింది. భర్తగారికీ చదువుసంధ్యలకూ ఆరుంపాతిక అని తెలుసు. ఈ అయిష్టత అప్పుడప్పుడు కష్టంగా ఉండకపోగా పైపెచ్చు ఇవ్వాళ బడికెళ్ళకుండా ఇక్కడే వుంటే బాగుం డునుగదా అనీ అనిపించేది. అతని ప్రేమలొలికే పలుకులు కర్ణేంద్రియానికి సోకితే ఎంతో హాయిగా వుండేది. కాని ప్రయాగ వెళ్ల నిరాకరించాడనీ, తండ్రిగారెంతచెప్పినా వినలే దన్న సంగతి తెలిసినప్పుడు విపరీతంగా బాధపడింది. కారణం

తానన్నా కొన్నాళ్లు ఓపికపట్టి ఒంటరిగా వుండగలరు, కాని కన్నతండ్రిమాట పుత్రుడు జవదాటడం సహించలేదు. "మీ తమ్ముణ్ణి పిలుచుకురా" అని మాధవిని పంపింది కాని కూర్చున్నచోటునుంచి కదలకూడదని ఒట్టు పెట్టుకున్నట్టుగా కూర్చున్నాడు. "లోపలికెళ్ళితే తప్పక ప్రయాగ వెళ్ళమని చెబుతుంది. నాదుర్దశేమిటో ఆవిడకేం ఎరుక. కబుర్లుమాత్రం కమ్మగా చెబుతుంది. కాని ప్రేమ-పరీక్షాసమయం ఆసన్నమైనపుడు మాత్రం కర్తవ్యం, నీతి, ధర్మం అనేవాటి మాటున ముఖం దాచుకుంటుంది. వాస్తవమేమంటే స్త్రీలలో ప్రేమ వాసన కూడ ఉండదు."

మాధవి వెళ్లి చాలాసేపయింది. కాని కమలాచరణ్ గదిలోంచి కదల్లా. అప్పుడు తానే స్వయంగా వెళ్ళి "ఇవ్వాళ ఇంట్లో కడుగుపెట్టకూడదని ఒట్టు పెట్టుకోలేదుగదా? ఎదురు చూస్తూచూస్తూ కళ్లుకూడ వాచిపోయాయి" అంది.

కమలా:-లోపలికి రావడానికి భయంగాఉంది.

విరజన్:-అలాగైతే లేవండి, నే వెంటవస్తా. ఇప్పుడన్నా భయంపోయిందా?

కమలా:-ప్రయాగ వెళ్లమని అజ్ఞాపించబడ్డాను.

విరజన్:-నేనూ వెంటవస్తున్నాగా.

ఇలాఅని అతనికేసి కన్నెత్తిచూచింది, భర్తగారు ఓడిపోయాడు. ఈ మోహినీ నేత్రాల అశ్రుబిందువులు చూస్తే ఎవ్వడి హృదయం కరగదు? ఆమెను కౌగిలించుకుని "నీవే జయిస్తావని నాకు ముందే తెలుసు. అందుకే లోపలికి రానన్నా" అన్నాడు. తెల్లవార్లూ ప్రేమ - వియోగ కబు

గ్లతో గడిపేశారు నేత్రాలు పరస్పరం పదేపదే కలుసుకుం టున్నాయి మళ్లీ కలుసుకో బోతున్నట్లుగా ఇదే కడసారి కలియిక అని ఎవ్వడు కలగన్నాడు? కమలాచరణునిదర్శించే సౌభాగ్యం తిరిగి వ్రజరాణికి ఎండమావులే అయ్యాయి.

# 17

## కమలాచరణ్ పేర విరజన్ జాబులు

మధుగ్రామ్.

### 1

ప్రియతమా,

ప్రేమ పత్రం అందింది. శిరసావహించి నేత్రాల కద్దు కొన్నాను. ఇలాంటి ఉత్తరాలు వ్రాయకండి. ఇటువంటివి చూస్తే హృదయం విదీర్ణమై పోతోంటుంది. నేను వ్రాస్తే మాత్రం నష్టమేమీలేదు. ఇక్కడేమీ తోచుబడిగాక మన స్సంతా వ్యాకులపడుతోంది. ఏమేంవిన్నా. ఏంచూస్తున్నా? మాసిపోయిన. పడిపోయిన పూరికొంపలు, మట్టిగోడలు, ఇళ్ళముందే చెత్తా - చెదారం, పెద్దపెద్ద పెంటపోగు గుట్టలు బురదపూసుకున్న బర్రెలు, గాలికి పడిపోయే బక్కచిక్కిన ఆవులు మొదలైనవి చూస్తుంటే తక్షణం ప్రయాణమై ఎక్కడి కన్నా వెళ్లిపోవా లనిపిస్తుంటుంది. ఇక మనుష్యుల సంగతి. వాళ్ల పరిస్థితి ఇంతకంటె అధ్వాన్నంగా, శోకమయంగాఉంది. వాళ్ళకంటె అస్థిపంజరాలే మెరుగేమో. ఆపదలకుమూర్తులు దారిద్ర్యానికి ప్రతిరూపాలు. ఎవ్వడి ఒంటిమీదచూచినా

చితికిపోయిన గుడ్డలే కానవస్తాయి. ఎంత దౌర్భాగ్యాలు. రాత్రింబవళ్లు చెమటోడ్చి పనిచేస్తారు. కాని ఒక్కవాడూ పొట్టనిండ అన్నందొరకదు. మన ఇంటివెనక ఒక గొయ్యి ఉంది. ఒకరోజున మాధవీ ఆడుకుంటోంది. కాస్త కాలుజారింది వెంటనే గోతిలోవెళ్లి కూర్చుంది. అందులో స్నానం చేయటానికి నిత్యం దెయ్యాలు వస్తూవుంటాయని ఇక్కడకింవదంతి. అకారణంగానే దారినపోయేవాళ్ళను కదలిస్తుంటాయట. అదేవిధంగా ఇంటిముందు పెద్ద రావిచెట్టొకటి ఉంది అది భూతాలకు అవాసస్థానమట. రావిచెట్టుమీది భూతాలకూ గోతిలోని దెయ్యాలకూ దగ్గర సంబంధంకలదట గొయ్యంటే అంతగా భయంలేదుగాని, రావిచెట్టు అంటేమాత్రం వూరంతాగజగజ లాడిపోతుంటుంది. ప్రొద్దుగూంకితేచాలు. ఆదారిన నడచే నాథుడే వుండడు. ఇక పిల్లలూ, స్త్రీల విషయం చెప్పనే అవసరంలేదు. అటుకేసి అసలు కన్నే ఎత్తిచూడరు. నిజం, అప్పుడప్పుడు ఒకరిద్దరు మగవాళ్లుమాత్రం వెళ్తుంటారు. కానివాళ్ళప్రాణాలు గుప్పిట్లోపెట్టుకునే. ఈరెండూ అనికృష్ట జీవులకు కేంద్రస్థానాలు. ఇవిగాక వందలకొలది దెయ్యాలూ, భూతాలూ వుండే ప్రదేశాలు ఇంకెన్నో వున్నాయట. ఊరందరికీ కనపడుతుంటాయి. వీటి స్వభావం ప్రజలకు బాగా అర్థమయింది. అందులో ఒకభూతమట, నెత్తినఎక్కితే మళ్లీ నెలలపర్యంతం దిగనేదిగదట. ఇంకొకటట, అది పాపం తగ్గ పూజలుచేస్తే రెండు మూడు రోజుల్లోనే శెలవుపుచ్చుకుంటుందట. ఇవన్నీ ప్రత్యక్షంగాచూచిన విషయాలన్నట్టుగా కబుర్లు చెప్పుకుంటూ ఉంటారు గ్రామస్థులు. అన్నం పెట్టమని,

నీళ్ళు ఇవ్వమనీకూడ వస్తూవుంటాయని వినికిడి. కొంగ ఈకెల వంటి తెల్లటి చీరెలు కట్టుకు ట్టాయట. ముక్కుతో మాట్లాడు తాయట కొద్దికొద్దిగా. నిజం, ఆ జాతిలో నగల ఆచారం మాత్రంచాలా తక్కువట. చక్కగా శృంగారించు కుని, రంగురంగుల చీరెలు కట్టుకుని ఒంటరిగా పోయే స్త్రీల మీదనే ముఖ్యంగా దండయాత్ర చేస్తుంటాయట. పుష్ప సువాసనలంటే ఎంతో ఇష్టమట. అంచేత ఏ ఆడదీ, ఏ బాల బాలికా రాత్రిపూట పక్కలో పువ్వులు పెట్టుకు పడుకోవ డమంటే గగనకుసుమ మన్నమాట.

భూత - ప్రేతాల గౌరవమర్యాదలను గురించి కూడ చక్కటి అంచనాలు వేశారు. ఒక సన్యాసి భూతంఉంది. అతను నల్లటి కంబళి కప్పుకుంటాడు. పాముకోళ్లు వేసుకుంటాడు. సరిగ్గా రాత్రి పన్నెండు గంటలప్పుడు బయలుదేర్తాడు. ఊరు చుట్టూ తిరిగొస్తుంటాడు. దారి తప్పిన వాళ్ళకు దారి చూపు తుంటాడు. ఏడాదికొక నాడు పూజలు చేస్తారు. ఇప్పుడు అతని గణన భూతాలలోగాదు, దేవతల్లో. ఎటువంటి ఆపదైనా సరే గ్రామ పొలిమేరలోకి అడుగు పెట్టనివ్వడు. దీనికి పూర్తిగా విరుద్ధంగా చాకలిమడేలు భూతమొకటిఉంది. అదంటే వూరం దరికీ అల్పాచమానం అవుతుంటుంది. ఒక చెట్టుమీద నివాసం. దీపాలు వెలిగించిన తర్వాత ఆ చెట్టుప్రక్కగా గనక ఎవ్వ డన్నా నడచాడాఅంటే వాడిక ప్రాణాలతో వచ్చేపనిలేదు. కాని విచిత్రమేమంటే, ఆ మడేలయ్యను సాగనంపాలంటే రెండుముంతలు కల్లుచాలు. అతని భక్తులు మంగళవారం పూట ఆ చెట్టుమొదట్లో గంజాయి-చరస్సూ పెట్టివస్తుంటారు.

ఒకలాలాగారు ( కాయస్థవంశస్థుడు ) భూతమైకూర్చున్నాడు. ఈ మహాశయుడు కరణమట. నానాబాధలు పెడ్తుంటే చివరకు ప్రాణం విసిగెత్తి రైతులు యమధామమంపారట. అబ్బో! దీనిపట్టు జిగటపట్టు. పట్టే ప్రాణంతీసి మరీ వదలుతుంది. ఇక్కడ ఏకరణమూ ఒక సంవత్సరంకంటె ఎక్కువ బ్రతకడు. గ్రామానికి అనతిదూరంలో వటవృక్షమొకటిఉంది. దాని మీద సాహెబుగారు వుంటున్నారట. పాపం అతను మాత్రం ఎవ్వరిజోలికీరాడు. ఒకసంగతి. గురువారంనాడు పూజలు చేయకపోతే మాత్రం పిల్లల్ని పట్టుకుని బాధిస్తుంటాడు.

ఏంమూర్ఖత! ఏం మిథ్యాభక్తి! గ్రామస్థుల హృదయాల్లో ఇలాంటిమూఢనమ్మకాలు గట్టిగా పాతుకుపోయాయి పిల్లవాడికి కాస్త తలనొప్పి వస్తేచాలు. వెంటనే భూతాలకు మొక్కులు, ముడుపులూ ప్రారంభమయ్యాయన్నమాటే. పంటరాసిలో భూతానికివాటా, వివాహం - కార్యం ఇత్యాది శుభకార్యాల్లో వాటా. ఇంత ఏల భూతంలేనిచోటూ, అంటూ లేదు. ఈ గ్రామంలో దేవుడూ లేడు; దేవత లేదు. అంతటా భూతాలదే సామ్రాజ్యం. యమధర్మరాజుగారికిక్కడ ఏమీపనిలేదు. భూతాలే యమదూతలపని చేస్తుంటాయి. ఈమూఢ విశ్వాసాలను పోగొట్టే విధమేమిటో గదా?

ఇట్లు, మీప్రియ
విరజన్.

2

మధుగ్రామ్.

ప్రియా!

బహు దినానంతరం మీ ప్రేమ - లేఖ అందింది.

ఉత్తరాలు వ్రాయటానికి నిజంగా తీరిక లేదా ? ఈ జాబుమాత్రం ఏం వ్రాశారు, వ్రాశా ననిపించారు. ఇక్కడ ఇలాంటి అలవాటు లేదే. మరి అక్కడికి కెళ్ళగానే మరో రకంగా మారి పోయారా ఏమిటి ? ఇక్కడనుంచి వెళ్ళి రెండు మాసాలపైన కావచ్చింది. ఈ మధ్యలో శెలవులు - చిన్నవో పెద్దవో అనేకం వచ్చాయి. కాని మీ దర్శనం లేదు. చేతులుజోడించి మరీ వ్రాస్తున్నా - హోలీ పండుగ శెలవులకు తప్పక దయ చేయండి. ఈసారిగనక తహతహలాడించారా. బ్రతికున్నంత కాలంచెప్పిళ్ళు తప్పవని గుర్తుంచుకోండి

ఇక్కడ వాసంచూస్తే మరో ప్రపంచంలో కొచ్చినట్టుగా అనుభవమవుతోంది. రాత్రి నిద్రపోతున్నా. అకస్మాత్తుగా "హీహీహీ, హుహుహూ" అని ఏదో కోలాహలం వినవచ్చింది. త్రుళ్ళి పడిలేచి కూర్చున్నా. విచారిస్తే పిల్లలుకొందరు ఇంటింటికీ తిరిగి పిడకలూ, పుల్లలూ ప్రోగుచేస్తోన్నారని తెలిసింది. హోలీ మాతకిదంతా ఆహారం ఈ తల తోకలేని ఉత్పాతం ప్రారంభమయిందా అంటే కట్టెపుల్లలన్నీ మాయమైపోయాయన్నమాటే. ఈ వానరమూకను వారించగల శక్తి - సామర్థ్యా లెవ్వరికీ లేవు. ఎవడో వెట్టివాడట. పాపం వాడి పాకకాస్తా వూడదీసుకు అంతులేకుండ ఎత్తుకుపోయారు. ఐదారు జతల ఎడ్లకు చక్కగా సరిపోయేపాకఅది. ఎన్నాళ్ళనుంచో దానిమీదకన్నేసి కూర్చున్నారు హోలీవాళ్లు. సందు దొరగ్గానే ఎత్తుకుపోయారు. ఎవ్వరో కూర్మి కులస్థుడట. అతని పూరి గుడిసె తెల్లవారేటప్పటికి మాయమైపోయింది. ఇక పిడకలెన్ని అదృశ్యమై పోయాయో లెక్కించి చెప్పటం

దుష్కరం. పుల్లలన్నీ ఇళ్ళల్లో దాచుకుంటున్నారు గ్రామస్థులంతా. మీ నాన్నగారు పేళ్ళ కోసమని ఒక చెట్టు కొన్నారు. అదీ ఇవ్వాళ హోలీమాత గర్భంలో కెళ్ళి శరణుజొచ్చింది. రెండుమూడు ఇళ్ళల్లో తలుపుచెక్కలు సైతం పూడదీసుకు పోయారు. వాకిట్లో నిద్రపోతున్నాడు కరణం మహాశయుడు. ఎత్తిబోర్లగా పడేసి మంచం కాస్త ఎత్తుకు కాలికొద్దీ దూసుకున్నారు ఎటుచూచినా కట్టెపుల్లల లూటీగాఉంది. హోలీమాత నోట్లో ఒకసారి పడిపోయిన వస్తువును తిరిగి తీసుకోవడం మహాపాపం. "ఇదిగో నా సంగతి తెలుసా; ఏం చేస్తానో చూడండి; పట్టా నెంబర్లన్నీ అబద్ధమని రాసేస్తా; శిస్తులసలు కట్టనేలేదని లెక్కలు చూపిస్తా" అని కరణం చిందులు తొక్కాడు. కాని ఎవ్వడికీ చీమ కుట్టలా. ఏది దొరికితే అది ఎత్తుకుపోవడం ఇక్కడసలు రివాజేనట. ఎవ్వడు ఎవ్వణ్ణి తోడురమ్మనమని పిలుస్తాడు? ఈ డొచ్చిన కొడుకు తండ్రిచూడకుండ తనవస్తువులే స్వయంగా ఎత్తించి పంపుతాడట్టే. అలాచేయక పోతే తనసొసైటీలో తలెత్తుకు తిరగడం కష్టమవుతుంది.

పొలాలుపండి కోతకు సిద్ధంగాఉన్నాయి. కాని కోయటానికింకా రెండువారాల ఆలస్యముంది. నా గదిగుమ్మంలో నిలబడి చూస్తే కొన్నిమైళ్ళ వరకూ ఆ రమణీయ దృశ్యం కనపడుతుంటుంది. గోధుమ యవ్వల పంటపొలాలగట్లప్రక్కన కేసరీ, అరుణరంగు పుష్పాల పంక్తి అత్యంత రమణీయంగా కనపడుతుంటుంది. నలుదిక్కులా తచ్చరలాడుతుంటాయి రామచిలుకలు.

ఇక్కడ మాధవి చాలామంది స్నేహితురాండ్రను సంపాదించింది మాన ఇంటిప్రక్కన ఒక గొల్లవాడున్నాడు. పేరు రాధ. గత సంవత్సరం కలరావచ్చి తలిదండ్రులు కాలధర్మం చెందారు. తర్వాత కుటుంబభారమంతా ఇతని నెత్తి మీదనే పడింది. అతనిభార్య తులసీ. తరచు మన ఇంటి కొస్తూపోతూ వుంటుంది. అందచందాలు వర్ణించ సాధ్యం కాదు. మంచి గుణవతురాలుకూడ. ఎన్నిగంటలు మాట్లాడినా తనివితీరదు, ఆ అమ్మాయితో అక్కయ్య వరుస కల్పించి మాధవి రేపు వాళ్ళ బొమ్మలపెళ్ళిళ్ళు. తులసీది పెళ్లికూతురు. మాధవిది పెళ్ళికొడుకు. కటిక దరిద్రురాలు. ఐనా ముఖారవిందంలో విచారమనేదెక్కడా కంచుకాగడా పెట్టి వెదకినా కానరాదు. పిడకలు అమ్మి రెండురూపాయలు కూడ బెట్టిందట ఒక రూపాయేమో కట్నంక్రిందా, రెండోదేమో పెళ్ళిపెద్దలకు సత్కారాల క్రిందా ఖర్చు చేస్తుందట. బొమ్మల అలంకారాభూషణాల భారమంతా రాధ నెత్తిన వేసింది. ఆహా! ఎంత సరళ, సంతోషమయ జీవితం.

చాలు. ఇక శెలవు. నిరర్థకమాటల్లో మీ అమూల్య సమయం వృధాపుచ్చా. క్షమించండి. మీకు జాబురాయటానికి కూర్చుంటే కలం ఆపినా ఆగదు. వ్రాయవలసిన విషయాలు ఇంకా చాలా వున్నాయి ప్రతాపచంద్రునికి నా నమస్కారములు తెలియచేయండి.

ఇట్లు మీప్రియ, విరజన్.

ప్రియా! 3

మీ ప్రేమ జాబుచేరింది. హృదయానికి హత్తుకు

న్నాను. బలే! దొంగిలించడమూ పైగా డబాయించడమూనా! స్వయంగా రాకుండా కూర్చున్నారు. పైగా ఆ నేరమంతా నా నెత్తిన రుద్దుతున్నారా? మీ దర్శనార్థం నా మనస్సెంత తహతహ లాడిపోతోందో మీ కేం తెలుసు? అది నా మనస్సుకే ఎరుక. ఈ తహతహ క్రమంగా వ్యాకులత రూపం ధరిస్తోంది. అప్పుడప్పుడు స్పృహ తప్పిపోతూంటోంది. ఈ దశ ప్రారంభమై ఎన్నాళ్లో కాలేదు. అక్కడకు వెళ్ళినతర్వాత నన్నీ విధంగా డ్రిల్లు చేయిస్తారని ఇక్కడనుంచి బయలుదేరే టప్పుడు తెలియదు. సరే మంచిది. మీరే సత్యహరిశ్చంద్రులూ, నేనే అబద్ధాలకోరనీ అని అనుకోండి. నా జాబులు రెండూ మీకు నచ్చినందుకు నాకెంతో సంతోషం కల్గింది. కాని ప్రతాపునికి చూపించటం అనవసరమనుకుంటా ఆ రెండూ ఏదో అజాగ్రత్తగా వ్రాసినటువంటివి. తప్పు లనేకం ఉండొచ్చు. వాటిని విలువగా ప్రతాప్ చూచివుంటాడని నాకు నమ్మకం లేదు. నిజంగా అమూల్యమైనవని భావించు తున్న పక్షంలో వాటి నాధారంగా తీసుకుని గ్రామజీవితం పై వ్యాసమొకటి వ్రాయగల్గితే నన్ను పరమ సౌభాగ్యరాలునిగా భావించుకుంటా.

నిన్న ఇక్కడ అమ్మవారిపూజ జరిగింది. నాగళ్ళు, తిరగళ్ళు, పొయ్యిలూ అన్నీ బందు. అమ్మవారి ఆజ్ఞ అదే. మరి ఆవిడ ఆజ్ఞ నుల్లంఘించగల దమ్ము లెవ్వడికున్నాయి? హుక్కా త్రాగటం ఆపుచేయబడింది. సంవత్సరం మొత్తం మీద శెలవుదినంగా పరిగణింపబడే రోజు ఇదొక్కటే. హోలీ - దీపావళి మొదలైన పండుగ రోజుల్లోనూ నిత్య

కార్యకలాపాలన్నీ జరుగుతూనే ఉంటాయి. పూజా సమయంలో మేకపోతును బలిఇచ్చారు. యజ్ఞం జరిగింది. అందరికీ సత్తూ (శనగలూ యవ్వలూ వేయించి చేసిన పిండి) పెట్టారు. ఇక ఆ వూళ్ళోకి ప్లేగు అడుగుపెట్టదని ఆబాలగోపాలానికి గట్టి నమ్మకం. ఈ వినోదమంతా చూచి చూచి నిద్రపోయా. షుమారు రాత్రి పన్నెండు గంటలవేళ దీటీలు వెలిగించారు. కేకలు బొబ్బలు పెట్టుకుంటూ వందలమంది బయలుదేరారు గ్రామంచుట్టూ ప్రదక్షిణం చేశారు. ఈ సరిహద్దు దాటి అమ్మవారు రాలేదని దీని తాత్పర్యం. ప్రదక్షిణానంతరం కొందరు ప్రక్కవూరి పొలిమేరలోకెళ్ళారు. కొద్దిగా పువ్వులూ, అక్షతలు, తమలపాకులు, లవంగాలూ మొదలైనవి అక్కడ పెట్టారు. అంటే తమ గ్రామ విపదలన్ని ఆ గ్రామం నెత్తినపెట్టి వచ్చారన్నమాట. తమపని పూర్తిచేసుకుని వాళ్ళంతా అక్కడనుంచి బయలుదేరారు. ఇంతలో ఆ వూరు వాస్తవ్యులకు ఈ రహస్యం తెలిసింది. పసికర్రలూ, బాణాకర్రలూ చేబూని వందలమంది విప్పమంటూ వచ్చిపడ్డారు. ఉభయపక్షాలూ తారసిల్లాయి. రక్తం కళ్ళచూచుకున్నారు. ప్రస్తుతంలో వూళ్ళో చాలామంది గాయాలతో మూల్గుతున్నారు.

నిన్న మిగిలిన రివాజులు ఇవ్వాళ ఉదయం పూర్తి చేశారు. ఆ రివాజును ఇక్కడ "పెనం వేయటం" (కఢాయీ దేనా) అంటారు. నా గదికెదురుగానే గాడిపొయ్యి ఒకటి త్రవ్వారు. పాలతోనిండిన ఇనపగుండెగొకటి పొయ్యిమీద పెట్టారు. కాశీఅనే పేరుగల "భర్" కులస్థుడొకడున్నాడు.

ఒంటినిండా విభూతిరాసుకుని వచ్చాడు. పోయ్యిముందు పట్టా లమీద ఆసీనులయ్యారు గ్రామస్థులంతా. శంఖారావం చేశాడు. గుండెగచుట్టూ పువ్వులూ, పూదండలూ వెద చల్లాడు. గుండెగలో పాలపొంగు వచ్చింది. గభాలున లేచి నిలబడ్డాడు కాశీ. "జయ్ కాళీ" అంటూ చలచలమని కాగే గుండెగలోకి ఒకదూకుదూకాడు. ప్రాణాలతో మాత్రం రాడని అభిప్రాయపడ్డా. కాని ఆశ్చర్యం! ఐదునిమిషాల అనంతరం కాశీ మళ్ళీ ఒక్కఎగురెగిరాడు. చూస్తే బైట నేలమీదవున్నాడు. రవ్వంతకూడ ప్రమాదం కల్గలా. జనులు దండలువేసారు. చేతులుజోడించి "మహాప్రభూ! ఈ సంవత్సరం పాడిపంటలెలా వుంటాయి? వర్షాల పరిస్థితేమిటి? జబ్బులు గొడవేమిటి? ఊరంతా సలక్షణంగా వుంటుందా? బెల్లంధర ఎలావుంటుంది? ఇత్యాది ప్రశ్నలవర్షం కురిపించారు. ఈప్రశ్నలన్నిటికీ స్పష్టం గానూ, కాని కొంచెంమార్మికంగానూ, సమాధానంచెప్పాడు. ఆతర్వాత సభ ముగిసింది. ఈ రకంగా ప్రతిసంవత్సరమూ జరుగుతోంటుందని చెప్పగా విన్నా. అతని భవిష్యవాణీ అంతా అక్షరాలా జరుగుతుంటుంది. ఎప్పుడన్నా ఒకటీ అరా అబద్ధమైతే దాన్నెంతో చాకచక్యంతో సమర్థించి చెప్తాడు. అతను గొప్ప దివ్యదృష్టిగల మనిషి. ఊళ్లో ఎక్కడన్నా దొంగతనం జరిగితే దాని పుట్టుపూర్వోత్తరాలన్నీ చెప్పేస్తాడు. తక్కువ కులస్థుడైనా గ్రామంలో మంచి గౌరవముంది. ఈ భక్తి - పూజలకు పురస్కారరూపేణ కల్లూ - సారాయీ మినహా ఇంకేమీ ముట్టుకోడు. వస్తువులు దొంగిలించినవాడి పేరు చెప్పించుకోండి; ఒకబుడ్డి ఎర్రనీళ్లు సమర్పించండి.

కోర్టులో మీదావావుంది. దానిలో విజయంకోసం కాశీ అనుష్టానం చేస్తున్నాడు. ఇంకేమీ అవసరంలా. ఒకగ్లాసు సురా విలువడబ్బులు మీవి కాదనుకోండి

హోలీ సమీపించింది. ఒకవారం రోజులుంది. నా హృదయకమలం ఇప్పుడెలా వికసిస్తోన్నదో? మనస్సులో సుఖప్రద చక్కిలిగింత పెట్టినట్టుగా ఉంది నయనాలు భవదీయ దర్శనార్థం ఆతురపడిపోతున్నాయి. ఈవారం కాస్త కష్టంగా గడుస్తుంది. సరే తర్వాతైనా ప్రియుని తనివితీర చూచుకునే సౌభాగ్యం కల్గుతుందిగా.

ఇట్లు
విరజన్.

4

మధుగ్రామ్.

ప్రియా,

మీరు పాషాణహృదయులు; మొండిశిఖండులు; వాత్సల్యశూన్యులు; నిర్దయులు, నిష్కరుణులు; అసత్యసంధులు. మీకింకా ఏమేంతిట్లు నడ్డించమంటారు? ఏమేం శాపనార్థాలు పెట్టమంటారు? ఇప్పుడుగనక ఎదుట ఉన్నట్లయితే అప్పుడు చెప్పేదాన్ని. మీ ఈవజ్రహృదయతత్వమేమిటో అంతు కనుక్కొని ఉండేదాన్ని. మీరు పచ్చిమోసగాండ్రు అని నొక్కి నొక్కి మళ్ళీ అంటున్నా. ఏంచేస్తారో చేయండి. అంతగా రావడానికి ఇష్టంలేకపోతే అక్కడే శిలేసుకు పోని ఉండండి. కాదు, నా ప్రాణం తీయాలని కోర్కెగావుంటే తప్పక కోర్కె తీర్చుకోండి. ఏడ్పించాలని అభిలాషగావుంటే ఏడ్పించండి. ఇంత

దేనికి? మీకేదిఇష్టంగావుంటే అదల్లా చేయండి. కాని ఒక విషయం, మరి నే నెందుకు ఏడ్వాలి? ఎందుకు మొత్తుకోవాలి? ఆ ఏడ్పు పాడుగాను. రావాలంటే రెండుగంటలన్నా సరిగ్గాపట్టదే. వెళ్లి ఒక్కసారి చూచివస్తే బాగుంటుందిగదా అన్నమాటే లేదాయె. మరి అలాంటప్పుడు ఏడ్వాలనీ, ఏడ్చి ఏడ్చి ప్రాణాలు తీసుకోవాలని నాకేం పట్టింది?

ఉత్తరం ముక్కలు ముక్కలుగా చించి దూరంగా పారేయాలనీ, మళ్ళీ మీతో అసలు మాట్లాడనే మాట్లాడకూడదన్నంతకోపం వస్తోంది ఎన్నో ఆశలు పెట్టుకు కూర్చున్నా. అన్నీ గంగలో కల్పాను. "హోలీ! హోలీ!" అన్న ముక్క ఎవ్వడి నోటినుంచైనా వస్తేచాలు, నా హృదయంలో చక్కిలిగింత పెట్టినట్టుగా అనుభవమయ్యేది. కాని విచారం! ఆ హోలీ ఏనాడో గడచిపోయింది. మరి నా నిరాశమాత్రం ఇంకా అలాగే వుండిపోయింది. మొదట్లో, 'హోలీ' అన్నపదం చెవుల్లో కొస్తేచాలు. ఎంతో పరమానందంగా ఉండేది కాని ఇప్పుడు విచారంగా వుంటోంది. ఎవ్వడి అదృష్టంవాడిది గ్రామంలో కూటికీ - గుడ్డకూ గడవని వాళ్లుకూడ ఎందరో గోచిగుడ్డలతోనే చక్కగా పండగ చేసుకున్నారు. రంగులు పోసుకున్నారు. ఎంతో ఆనందంగా హోలీ ఆటలు ఆడుకున్నారు. ఇక నాబోటి అభాగ్యురాలు వుంది. తెల్లటిచీరెకట్టి మంచంపట్టెకు కరచుకుని పడుకుంది. ఆ చీరెమీద ఒక్క ఎర్రటిరంగు బొట్టన్నా పడితే ఒట్టు. ఆ రంగులూ, ఆ గులాములూ ఎలావుంటుందో ముట్టుకోనన్నా ముట్టుకోలేదని ఒట్టుపెట్టుకు చెబుతున్నా. అత్తరు కలిపిన

రంగుపొడీ, పన్నీరుచల్లిన గులాముా, నేర్పుగా కట్టిన తాంబూలాలూ అన్నీ మీా రాతిగుండెను పడి ఏడుస్తున్నాయి. మాధవీ వచ్చి ప్రాణం తీయగా తీయగా ఒకచిన్న ఎఱ్ఱటి బొట్టుమాత్రం ముఖాన మండపెట్టించుకున్నా. సరే, ఈ నేరారోపణలన్నీ నేటితో సరి. మళ్ళీ ఇలాంటి నేరారోపణ మేదన్నా నోట్లోంచి వచ్చిందా, ఈసారి నాలుక తెగ్గోసి మరీ మాట్లాడుతా.

మొన్న సాయంత్రంనుంచే వూళ్లో సందడి ప్రారంభమయింది యువకులు కొందరు పోగయ్యారు, డప్పొకటి తీసుకున్నారు. అశ్లీల గీతాలు పాడుకుంటూ గడపగడపకూ తిరగసాగారు. ఈ రోజున ఈ వూళ్లో ఇన్ని పాడుకూతలు వినవలసి వస్తుందని ఎరుగను సిగ్గుతో తలకాయ వంచుకునే ఆ కూతలు నదురూ బెదురూ లేకుండ నోట్లోంచి జలజల రాలుతున్నాయి చెట్టునుంచి పండ్లు రాలినట్టుగా. లజ్జా సంకోచం అనేవి మచ్చుకూడ లేవు. తండ్రి కొడుకు ఎదుట, కొడుకు తండ్రి ఎదుట బాహాటంగా అశ్లీలపదాలు వాగుతాడు. 'ఇవ్వాళ హోలీ; ఇవ్వాళ హోలీ' అని బిగ్గరగా అంటాడు కోడలితో మామ. కోడలేమో విని తలవంచుకుని ముసిముసిగా నవ్వుకుంటుంది. ఊరందర్నీ తలదన్నిన మహాపురుషుడొకాయన వెలిసాడు. ఆయన కరణం. చిత్తుగా డోస్ వేసాడు. మాసిపోయిన టోపీ ఒకటి పెట్టుకున్నాడు. ఈ యువకుల జట్టులోకొచ్చి చేరాడు. సొంతకోడళ్లూ, కూతుళ్లూ కూడ అతని బూతుకూతల ప్రచండవాయువునుండి తప్పించుకోలేకపోయారు. తిట్లు తినండి. నవ్వులు ఒలికించండి. లేక

రవ్వంతన్నా నొసలు విరిచినట్టు కనపడిందా అంటే ఇదే వ్వతో "ముహర్రమ్" ముస్లింలపండుగ రోజున పుట్టినట్టున్నదేరా అని గభాలున అనేశారన్నమాట. బలే ఆచారం లెండి!

రాత్రి షుమారు మూడుగంటలు కావచ్చింది. ఈ గుంపు 'హోలీమాత' వద్దకు చేరుకుంది. పిల్లలంతా అగ్ని-క్రీడల్లో నిమగ్నులైఉన్నారు. కొందరు స్త్రీలతో కలిసి నేనూ వెళ్ళా. ఒక ప్రక్కన కూర్చుని స్త్రీలు హోలీగీతాలు పాడుతున్నారు. ఎట్టకేలకు హోలికా దహనసమయం ఆసన్నమయింది. నిప్పంటించారు. గప్పుమని మంటలు లేచాయి. ఆకాశమండలమంతా సువర్ణవర్ణంగా మారిపోయింది. ఆ వెలుగులో దూరదూరపు చెట్లుసైతం స్పష్టంగా కనపడసాగాయి. తర్వాత ఆ అగ్నిగుండం చుట్టూమూగి "హోలీమాతకు జై" అని మిన్నుముట్టేట్టు అరుస్తూ చిందులు త్రొక్కసాగారు. అందరి చేతుల్లోనూ గోధుమ-యవ్వలకంకులు ఉన్నాయి. అవన్నీ ఈ అగ్ని-దేవునికి సమర్పించారు.

ఇప్పుడు అగ్నిజ్వాలలు మరింత ప్రజ్వరిల్లాయి. కొంచెం ఎడంగా నిల్చొని 'కబీర్' గీతం పాడసాగారు. ఒక అరగంట వరకు ఈ కార్యక్రమం కొనసాగింది కొయ్యదుంగల కణుపులు చిట్లి 'టపాకాయలు మాదిరిగా ప్రేలుతున్నాయి. ఈ ప్రేలుడు ధ్వనులు విని పశువులు కట్టుకొయ్యలు పూడబెరుక్కొని పోవటానికి గుంజుకొంటూ బిగ్గరగా అరుస్తున్నాయి – "ఈ సంవత్సరం 'హోలీ – మంటలు పైకి వంకరగా పోతున్నాయి. శుభలక్షణం కాదు; మంటలు తిన్నగా

వెళ్లితే ఏడాదంతా సుఖంగా గడుస్తుందని గుర్తు. లేక పోతే కష్టపరంపరల కంతువుండదని అర్థం." అని అంది విచారంగా తులసీ. కాస్సేపటికి మంటలు తగ్గుముఖం పట్టాయి. వేడీ తగ్గ సాగింది. అప్పుడు హోలికాగుండం సమీపించి జాగ్రత్తగా పరిశీలించుతున్నారు కొందరు ఏకోపోయిన వస్తువును వెదకుతున్నట్టుగా ఇంతలో "వసంతం రోజున హోలికాగ్నికి శ్రీ గణేశ్ చేయబడుతుంది ఆరోజున ఒక ఆముదం మొక్క నాటుతారు. దాన్ని పుల్లలు-పిడకలతో పైకల్లా కప్పుతారు. అదే ఇప్పుడు వెదకుతున్నారు. దాన్ని గనక ఒకే దెబ్బతో దూరంగా వెళ్లి పడేటట్టు ఎవ్వడన్నా కొట్టగల్గితే వాడు అందరిలో గొప్ప వీరుడుగా పరిగణించబడ్తాడు." అని చెప్పింది తులసీ. మెల్లి అడుగులు వేసుకుంటూ అందరికంటెముందు కరణం వచ్చాడు. కాని పదిగజాల దూరాన్నుండే తిరిగి పోయాడు. తర్వాతచేత్తో కర్రఒకటి పుచ్చుకుని ధైర్యసాహసాలతో ముందుకొచ్చాడురాధ. నిప్పులోదూరి గట్టిగా ఒక దెబ్బకొట్టాడు. టటాలున వెళ్ళి అవతల పడింది ఆముదం మొక్క ఆ విరిగిపోయిన తుంపులుమీాద విరుచుకు పడ్డారు జనంఅంతా. గుండంలోని బూడిద తీసుకుని ముఖాన బొట్లు పెట్టుకున్నారు. ఆ రకంగా పెట్టుకోవడం శుభమని నమ్మకం.

హోలికా గుండందగ్గర తంతు పూర్తిఅయింది. అప్పుడు ఈ మగగుంపు అంతా అమ్మవారి అరుగుముఖంగా బయులుదేరింది. ఈ మాటవల్ల అమ్మవారి శంఖుస్థాపనం ఈ వూళ్లో చేశారుకాబోలు అని అర్థం చేసుకోకండి. ఇవ్వాళ ఓట్లు తినడమంటే ఆవిడకూ ఇష్టమే. చిన్నా-పెద్దా అంతా

ఒక్కుమ్మడిగా నోటికొచ్చిన అశ్లీలములన్నీ సర్దాగా అనేస్తారు. కొద్దిరోజుల క్రితం ఈ అమ్మవారినే పాదాలకుమొక్కి మరీ పూజించారు. ఈ రోజుల్లో దేవుని తిట్టడమొక పెద్ద తప్పుగా భావించరు గ్రామస్థులు. ఇందులో అతిశయోక్తేమీ లేదు. ఇక కన్నతల్లుల్ని, తోబుట్టువుల్ని తిట్టడమనేది అంతి సామాన్యవిషయం.

తెల్లవారగానే వంటబ్రాహ్మణ్ని పిలిపించారు లాలాగారు. "ఇవ్వాళ షుమారు రెండు శేర్లు "భంగు" తయారు చేయించండి. రెండు రకాలుగా వుండాలి. ఒకటి కారం, రెండు తీపి, అని ఆజ్ఞాపించారు. వంటమనిషి వెంటనే వెళ్లి చాలామంది మనుష్యుల్ని పట్టుకొచ్చాడు. భంగు నూరడం ప్రారంభమయింది. తట్టనిండా మట్టిగ్లాసులు తెప్పించి వరుసగా పేర్పించబడ్డాయి. ఆ రెండురకాల భంగూ రెండు కడవల్లో నిండాపోసి అక్కడ వుంచబడింది. తర్వాత సంగతి ఇక అడిగేరు? మూడు నాల్గు గంటలు ఇచ్చేవాళ్లు ఇస్తుంటే త్రాగేవాళ్ళు త్రాగుతున్నారు. కాస్త రుచిచూచిన వాడల్లా ప్రశంసలవర్షం కురిపించేవాడు. గంగిరెద్దులా తలకాయలెగరవేస్తూ "పంతులూ! ఏంరుచిగా చేశావయ్యా" అని వంటమనిషినుద్దేశించి అనేవాళ్ళు. ఇక పంతులూ ఉబ్బిపోయి అలా పొగడినవాడికల్లా మళ్లీ ఒక గ్లాసుడుపోసి "ఇదిగో! ఇది కారంభంగు. ఇదీకాస్త రుచిచూడు. ఏమిటలాచూస్తావు? శుభ్రంగా మరొకటి పుచ్చుకునేదానికి! హోలీరోజు రోజూ వస్తుందా, మరినేనూ రోజురోజూ భంగుచేసి యిస్తానా? అనిఅనేవాడు. దీనికి జవాబుగా తనకెవ్వరన్నా సంజీవినీ

మూలిక ప్రసాదించారా అన్నట్టుగా అతనికేసి చూసే వాడు త్రాగేరైతు. తర్వాత ఒకటికి బదులు మూడు నాలు గ్లాసులు గటగట ఎగరగొట్టేసేవాడు కరణంగారి అల్లుడు ముందీ జగదంబా ప్రసాద్ గారు అత్తవారింటి కొచ్చిఉన్నారు. వీరు కోర్టులో గుమాస్తా. వీరికెన్ని గ్లాసులిచ్చాడో వంట మనిషి అంతులేదు. త్రాగి పాపం ఒళ్ళు తెలియక చిందులు, త్రొక్కుతూ తందనాలాడటం ప్రారంభించాడు. ఊరంతటికీ సరసాలాడటానికి మంచి మసాలా దొరికింది. ఒకరైతు లేచి గభాలున ముందుకొచ్చాడు. "ఇక్కడకొచ్చి కూర్చున్నా వేంటే? చాల్లే ఇకపద ఇంటికెళ్ళి తొందరగా వంటచెయ్యి. ఇప్పుడే వస్తున్నా." అన్నాడు చిరుమోముతో. కూర్చున్న వాళ్ళంతా ఒక్కసారి ఫక్కున నవ్వారు. తర్వాత నిషాలో మునిగి, భుజాన్నొక కర్రపెట్టుకుని ముందుకొచ్చాడు కాశీభర్. సభాసదులందరికేసీ కృత్రిమ క్రోధంగా చూచి "ఓ పంతులయ్యా! మా కొత్తకోడలితో సరసాలాడటం నీకు తగనివని" అని గర్జిస్తూ అన్నాడు. ఇలా గర్జించి గభాలున వెళ్ళి ఆ అత్తింటి అల్లుణ్ణి కౌగలించుకున్నాడు.

జగదంబా ప్రసాద్ పొట్టిమనిషి. అటుగుంజుకొన్నాడు ఇటు గుంజుకొన్నాడు. ఏ మేమిటో గొణుక్కొన్నాడు; సణుక్కొన్నాడు. కాని మొర ఆలకించే నాథుడేడీ? ఒకడు ప్రియోక్తులాడితే ఇంకొకడు వెళ్ళి ఆలింగనం చేస్తుంటాడు. మధ్యాహ్నందాకా ఇదే తంతంటే నమ్మండి. ఇప్పటిదాకా కూర్చునే ఉంది తులసీ. దాన్ని ఉద్దేశించి "ఇవ్వాళ మా ఇంటిదగ్గర నీకు విందు. ఇద్దరమూ జతగా భోంచేద్దాం"

అన్నా. ఇలా అనీ అనడంతోనే రెండు పళ్ళేల్లో వడ్డించి తీసు కొచ్చింది వంటమనిషి. ఇప్పుడూ కిటికీ వేపుకే తిరిగి నిలబడి ఉంది తులసీ. ఆవిడ చెయ్యిపట్టుకునిలాగా. చూస్తే దాని ప్రియచతుర్ద్వయం ముత్యాల కణాలు వెదజల్లుతోంది. వెం టనే కౌగిట చేరుకుని "సఖి! అబద్ధం చెప్పితేనా ఒట్టు. ఎందు కేడుస్తున్నావో చెప్పు. నా దగ్గర దాపరికమేమిటి?" అని అడిగా. దానిమీాదట మరింత ఏడ్వసాగింది. ఎంతగానో పట్టుపట్టిన మీాదట నాకేసిచూస్తూ "అక్కా! ఇవ్వాళ చీకటి ముఖాన్నే ఆయన్ని పట్టుకెళ్లారు. ఏం జరిగిందో, ఎలా గున్నారో తెలియదు." అని వెక్కి వెక్కి ఏడ్చింది. రాధతండ్రి ఎప్పుడో కొంతఅప్పు తెచ్చుకున్నాడట. ఇంతవరకూ అందులో ఒక్కదమ్మిడీకూడ జమపెట్టలేదు. సబ్ జైలుకు పంపితే డబ్బు వసూలు కావచ్చునను కొన్నాడు రుణదాత. రాధ ఎన్నాళ్ల నుండో తప్పించుకుతిరుగుతున్నాడు. ఇవ్వాళ వాళ్లకుమంచి అవకాశం చిక్కింది తాముచేయదలచింది చేసి పారేశారు. అయ్యో! ఇంతకూ అంతా కల్పితే ఇరవైరూపాయలే. నాకే కనక ఈ సంగతి తెలిసివుంటే పండగ పూట ఇలాంటి పని జరగనిచ్చేదాన్ని కాదు. రహస్యంగా వంటమనిషి చేతికి ఆ సొమ్ము ఇచ్చి వెంటనే రాధను విడిపించుకు రమ్మని పంపించా.

ఆసమయంలో మన వాకిటిముందు పట్టాఒకటిపరిచారు లాలాగారు మధ్యలో తివాచీమీాద ఆసీనులైవున్నారు. రైతులు ఒకొక్కరే వచ్చి కూర్చుంటున్నారు. మోకాళ్ళ పైకి పంచెలుకట్టారు. కొందరికిమాత్రమే చొక్కాలున్నాయి. తతిమ్మావాళ్ళంతా దిగంబరదేహులే. కొందరు టోపీలతో,

మరికొందరు బోసితలలతో ఉన్నారు. గులాంమాత్రం అందరి ఒంటిమీదా కనపడుతోంది. వాళ్ళ శ్యామల దేహచ్ఛాయపై ఎంతో శోభాయమానంగా ఉంది. వచ్చిన ప్రతివ్యక్తీ ముందు లాలాగారి చరణసన్నిధిని కొద్దిగా గులాం ఉంచేవాడు. లాలా గారు తమ పళ్ళెంలోంచి కొద్దిగా గులాంతీసి అతని ముఖాన రాచేవారు. తర్వాత ఏదో ఒక పరిహాసం మాట వదలే వారు చిరునవ్వుతో. దాంతో అతనికి ఏడుతరాలు తరించి పోయినట్లుగా ఉండేది. వినయ పూర్వకంగా నమస్కరించి నిరు పేదవానికి రత్న-రాశి లభించిన విధంగా సంతోషంతో వెళ్లి తన స్థానంలో కూర్చునేవాడు. ఈ మూర్ఖ రైతుల సరసన కూర్చుని లాలాగా రీవిధంగా సరససల్లాపాలు ఆడ్తారని నేను కలలోకూడ అనుకోలా. ఈ మధ్యలో కాశీ 'భర్' అరు దెంచాడు. చేతిలో ఒక చిన్న గిన్నె ఉంది. దానినిండా గులాం ఉంది. అందరిమాదిరిగా లాలాగారి చరణ సన్నిధిని గులాం ఉంచలేదు. గుప్పెటనిండా గులాం తీసుకున్నాడు. ఎంతో దుస్సాహసంతో ఆయన ముఖానికేసి గట్టిగారుద్దాడు. అది చూస్తే నాకు ఒళ్లు జలదరించింది. లాలాగారు కోపగించు కుంటారేమోనని భయంవేసింది. కాని అలాంటిదేమీ జరక్క పోగా పైగా ఎంతో ఆనందించాడు. ఆయనా బొట్టుపెట్టలా ఇంత తీసుకుని కాశీ ముఖమంతా పులిమి వదలిపెట్టాడు. 'నిజంగా నువ్వు వీరుడవురా. మా అందరికీ నాయకుడుగా వుండతగిన వాడవోయ్." అన్న భావంతో మిత్రబృందమంతా అతనికేసి చూసింది. ఈ రకంగా ఒకొక్కడు చొప్పున రెండుమూడు వందలమంది వచ్చిచేరారు. అప్పుడు హఠా

త్మగా "ఇవ్వాళైకక్కడా రాధ జాడలేదే? ఎక్కడికి కెళ్లాడేమిటి? ఇంటికెళ్లి కనుక్కురండి" అన్నారు లాలాగారు. తన యోగ్యత ప్రదర్శించటాని కిది మంచి అదననుకొన్నాడు జగదంబా ప్రసాద్. వెంటనే అందుకుని— "హుజూర్! అతను 'ఎ' ఆక్టు, పదమూడో నెంబరు సెక్షను ప్రకారం అరెస్టు చేయబడ్డాడు. రామదీన్ పాండేగారు వారంటు జారీచేయించారు." అని అన్నాడు. అదృష్టవశాత్తు రామదీన్ పాండే కూడ ఆ సమయానికక్కడే వున్నాడు. అసహ్యాభావంతో అతనికేసి చూచి "ఏమయ్యా! పాండేగారూ! ఈ దరిద్రుణ్ణి జైలుకంపితే మీ ఇల్లు నిండిపోతుందా ఏమిటి? ఆమాత్రం మానవత్వ సజ్జనతలు లేకుండాపోయాయా? ఇవ్వాళ హోలి పండుగగదా. ఇలాంటిరోజున పెళ్లాం బిడ్డలదగ్గర వుండకుండా దూరం చేయటానికి నీ మనస్సెలా ఒప్పుకుందయ్యా! నిజం చెబుతున్నా, నేనే గనక రాధస్థానంలో వుంటేనా, నాకీ రోజులు చూపించిన మహాశయుని కొన్నాళ్ళు మంచం పట్టుకుని దేకులాడేటట్టు చేయడం నా ప్రథమ కర్తవ్యంగా భావించుతా. ఇంత గొప్ప షాహుకారులై ఉండి, ఒక దిక్కులేని నిరుపేద పక్షినింత పనిచేసినందుకు సిగ్గు కల్గడంలా. ఇంత లోభితనంతో ఉండటంకంటె ఎందులోనన్నా పడి చావడం అత్యుత్తమం" అన్నాడు లాలాగారు ఆయనకు నిజంగా కోపంవచ్చింది. రామదీన్ సిగ్గుతో క్రుంగిపోయాడు. బుద్ధి కాస్తా బుగ్గిపాలయింది. అసలు పెదవి ఆడిస్తే ఒట్టు. కుయిక్కుమనకుండా కోర్టుముఖంగా వెళ్లిపోయాడు. రైతులంతా అతని కేసి చురచుర చూచారు. లాలాగా రేమన్నా అంటారేమో

నని భయంగా ఉంది. లేకపోతేనా పాండేగారి ఎముకలన్నీ అక్కడే విరిగిపడి వుండేవి.

తదనంతరం పాటల నంబరొచ్చింది. అందరికీ నిషా ఎక్కేవుంది. ఆపైన లాలాగారి సానుభూతి పూర్ణవాక్యాలు మరింత ఉత్సాహాన్ని రేకెత్తించాయి శక్తివంచన లేకుండా పాటలు పాడసాగారు. ఇదిగో పగిలిపోయాయి, అదిగో పగిలి పోయాయి' అన్నంత మోతగా మ్రోగుతున్నాయి మృదంగాలు మళ్లీ రెండోసారి భంగు వేసుకున్నాడు జగదంబా ప్రసాద్. కొంత ఏమో స్వయంగా అతనికే హుషారు కలిగింది. మరికొంత ఏమో ఇతరులు రెచ్చగొట్టారు. ఇక చూడండి. మధ్య సభలో నిల్చొని నృత్యం మొదలెట్టాడు. చొక్కా, టోపీ, పంచె కట్టుకున్న మీసాలరాయుడు నృత్యం చేయగా చూడటం నే నిదే మొదటిసారి. అరగంటసేపు కోతిలా పిప్పి గంతులేశాడు. చివరకు నిషా శ్రుతి మించి నేలకొరగ వేసింది. తర్వాత ఇంకో గొల్లవాడు లేచాడు. అటు స్త్రీలలోంచి ఒక గొల్లపడుచు లేచివచ్చింది. ఇద్దరూ నడిబజారులో కెళ్ళి నృత్యం చేయసాగారు. ఇద్దరూ చురుకైన వాళ్లూ, మంచి వయస్సులో వున్నవాళ్లూనూ. వాళ్ళ నడుం వంపులు ఎంతో విలక్షణంగా ఉన్నాయి. హావ - భావాలు, అవయవాలన్నీ వంకరటింకరలుగా త్రిప్పడం చూస్తే చాలా ఆశ్చర్యం కల్గేది. నిజంగా ఎంతో అభ్యాస - శ్రమలతో కూడినపని.

ఈనాట్యం ఇలా జరుగుతూ నేఉంది. ఇంతిలో పొడు గాటి కర్రలు భుజాన పెట్టుకుని ఎదురుగా ఎవ్వరో చాలా మంది [illegible] కన్పడింది. వాళ్ళదగ్గర డప్పులూ ఉన్నాయి.

కొంతమంది చేతుల్లో తాళాలూ, తప్పెట్లూ ఉన్నాయి. పాటలు పాడుకుంటూ వచ్చి మన ఇంటిముందు ఆగారు. హఠాత్తుగా ఇద్దరు ముగ్గురు కలిసి ఆకాశం భేదించే ట్టుగా అరరరర అని అరచారు. ఇల్లంతా దద్దరిల్లిపోయింది. లాలా గారు బైటికెళ్ళారు. నీటితీరువా కట్టేరోజున ఈ గ్రామస్థులతో దెబ్బలాడిన వూరువాళ్ళేవీళ్ళు. లాలాగార్ని చూడగానే గబ గబావచ్చి గులాం చల్లి ముఖానరంగుపూశారు. ఆయన ప్రత్యుత్తరమిచ్చారు. తర్వాత అంతా అరుగులమీద కూర్చు న్నారు. ఏలకులు, లవంగాలూ, తమలపాకులూ ఇవ్వ బడ్డాయి. తర్వాత పాటలు పాడారు. మన గ్రామస్థులూ ప్రేమతో రంగులుచల్లారు. చల్లించుకున్నారూనూ. శెలవు పుచ్చుకుని వెళ్ళబోయే సమయంలో ఈ గీతం పాడారు—

"సదా ఆనందరహో, ఏహిద్వారే మోహన్ ఖేలేహోలీ" (సదా ఆనందంగావుండాలి. ఈ వాకిట్లో కృష్ణుడు హోలీ ఆడాలి)

ఎంత చక్కటిపాట! రసభావాలు ఇమిడివున్నట్టుగా ప్రతీకను యింది. హోలి భావం ఎంతసామాన్య సంక్షిప్త వాక్యంలో పూర్ణరూపేణ వ్యక్తీకరించబడింది ఇప్పుడెప్పుడూ ఈ గీతం పాడ్తుంటాను. ఎంతో ఆనందంగా వుంటుంది. పర స్పరంస్నేహ-సద్భావాలు పెంపొందించుకొనేనిమిత్తం హోలీ పండుగ ఏర్పాటు చేయబడింది. కొద్దిరోజుల క్రితం కర్రలు పుచ్చుకు బుర్ర రామకీర్తనం చేసుకున్నవాళ్ళీవిధంగా ఒకరి గ్రామం ఇంకొకరు వెళ్ళ ప్రేమతో కలుసుకోవడం సామాన్య విషయంకాదు. కాని ఇది హోలీ పండుగరోజు ఇవ్వాళొక్క

రోజు ఎవ్వరికీ ఎవ్వరితోనూ వైరంలేదు. నేడు ప్రేమానురాగాల స్వరాజ్యం, ఇవ్వాళటి రోజున నెత్తిన గుడ్డవేసుకుని విచారంగావుండే వారెవ్వరూలేరు. ఒకవేళ వుంటే అది ప్రవాసీపురుషుని భార్యయో, లేక యువతీ వితంతువో అయి వుండాలి. ఇక తతిమ్మావాళ్లందరికి ఆనందవసంతం.

సాయంత్రం గ్రామంలోని స్త్రీలంతా మనఇంటికి హోలీ ఆడ్డాని కొచ్చారు. వాళ్లందర్నీ చక్కగా మర్యాదచేసి కూర్చోబెట్టింది అత్తయ్య. అందరూ రంగులు చల్లుకున్నారు. అనంతరం తాంబూలాలు పంచిపెట్టారు. భయంవేసి నే గది లోంచి బైటికడుగు పెట్టలా. ఈ రకంగా బ్రతికి బైటపడ్డాను. మాధవీ మధ్యాహ్నంనుంచే మాయమైపోయింది. దాని సంగతి ఇప్పుడు గుర్తుకొచ్చింది. ఊళ్లో హోలీ ఆడ్డానికెళ్ళిం దేమోననుకున్నా. కాని ఈ అమ్మలక్కల్లో ఎక్కడా కన్పించలా తులసీ ఇంకా కిటికీ వేపుకే చూస్తూ అలాగే కూర్చొని ఉంది. దీపాలుపెట్టే వేళయింది, హఠాత్తుగాలేచింది. వచ్చి నాకాళ్లు పట్టుకుని భోరున ఏడ్వసాగింది. కిటికీలోంచి చూచా. ముందు వంటవాడూ, అతని వెనక రాధ. తర్వాత రామదీన్ పాండే నడచి వస్తున్నట్టుగా కన్పడ్డారు. ఊళ్లో జనమూ చాలా మంది వెంటవున్నారు. రాధముఖం వాడిపోయివుంది. అతనిరాకవార్త తెలిసింది. వెంటనే బైటకొచ్చారు లాలా గారు. వెళ్ళి ఎంతో ప్రేమతో కౌగిలించుకున్నారు తన పుత్రుని కౌగిలించుకొన్నట్టుగా. రాధ శోకాలుపెట్టి ఏడుస్తు న్నాడు. తులసీకి ఇక దుఃఖం ఆగలా. గబగబా మెట్లుదిగివెళ్లి లాలాగారి కాళ్లపై పడింది. ఆయనెంతో ప్రేమతో లేచి

కూర్చోబెట్టారు. నా నేత్రాలూ నావశం తప్పిపోయాయి. జలజలమని జలబిందువులు రాల్చాయి. గ్రామస్థులూనూ చాలా మందికి కళ్లు చెమ్మగిల్లాయి. అత్యంత కరుణాపూర్ణ దృశ్యం. ఇంతవరకెన్నడూ లాలాగారి కళ్లల్లో కన్నీటిబిందు లెలా వుంటాయో చూచి ఎరుగను. ఆయన కళ్లూ అశ్రు - కణాలు రాల్చాయి. రామదీన్‌పాండే తలవంచుకుని నిల్చొని ఉన్నాడు గోహత్యచేసినట్టుగా. "నా పైకం ముట్టింది. కాని ఇదిపెట్టి తులసీ కొక ఆవును కొనిపెట్టాలని కోర్కెగావుంది" అన్నాడు రామదీన్.

తులసీ రాధ లిద్దరూ తమ ఇంటికి వేంచేసారు. కాని కొద్ది నిమిషాలకే మాధవి చెయ్యిపట్టుకుని నవ్వుకుంటూ తిరిగొచ్చింది తులసీ. "ఇప్పుడుదాకా ఎక్కడుందో ఈ బిడ గారిని కాస్త అడగండి." అంది.

నేను:- ఎక్కడున్నావే? మధ్యాహ్నంనుండీ కనపడకుండ పోయావు.

మాధవీ:-ఇక్కడే వున్నానుగా.

నేను:-ఇక్క డెక్కడున్నావు? మధ్యాహ్నంనుండి చూడ లేను. ఎందుకుగాని నిజంచెప్పు. నే నేమీ కోప్పడనులే.

మాధవి:-తులసీగా రింటికెళ్లాను.

నేను:-తులసీ ఏమో ఇక్కడే కూర్చొని వుందిగా. మరి నువ్వ క్కడేం చేస్తున్నావు? గురకలుపెట్టి నిద్రపోతున్నావా?

తులసీ -(నవ్వి) నిద్రదేనికి. మేల్కొనేఉంది వంట చేస్తోంది. అంట్లుతోమి వాకిలూడుస్తోంది.

మాధవి:-నిజమే. అంట్లు తోముతున్నాను. మరి నీ నౌకర్ని కదూ!

రాధను విడిపించుకు రమ్మనమని వంటవాణ్ణి పంపాను అప్పటినుంచీ మాధవి తులసీగా రింట్లో వంటచేస్తూ కూర్చున్నదట. ఈ విషయం తర్వాత తెలిసింది. వెళ్ళి స్వయంగా తలుపుతీసింది. ఇక్కడనుంచి పిండీ, నెయ్యి, పంచదార మొదలైనవన్నీ తీసుకెళ్ళింది. పొయ్యి రాజేసింది. చక్కగా కూర్చుని పూరీలు, గారెలు, బూరెలు, పంచదారలడ్లూ అన్నీ తయారుచేస్తోంది. చేసి ఎవ్వరికీ తెలియకుండ వెళ్ళిపోవాలనుకుంది. తులసీ రాధలుచూచి ఎవ్వరి పనాఅని ఆశ్చర్యపడిపోతారుకదా అని అనుకుంది, కాని కాస్త ఆలస్యమయ్యేటప్పటికి దొంగదొరికాడు చూచారా, ఎంత సుశీల బాలో!

ఇప్పుడిక శెలవు. తప్పులు క్షమించండి. మీ దాసీని గదా. ఎలా వుంచ కోర్కగావుంటే అలాగే ఉంటాను. ఇందుతో గులాం పంపుతున్నా. మీ చరణసేవకురాలి ఉపహారం ఇది. మీకు నా ఒట్టు. మిథ్యా నాగరికత పొంగులో పడి కొట్టుకుపోతూ దీన్ని పారవేయకండి. లేనిచో నాహృదయమెంతగా బాధపడుతుందో అది అనుభవైకవేద్యం.

ఇట్లు మీ ప్రియ
విరజన్.

5

మధుగ్రామ్.

ప్రియా!

మీ లేఖ అత్యంత బాధ కల్గించింది. ఇక ఇక్కడ వుండటం కష్టం. వెంటనే అక్కడికి పిలిపించుకోండి. ఒక్క

సారి కంటినిండా చూచి మళ్లీ వెంటనే వచ్చేస్తా. నిజం చెప్పండి, అక్కడికొస్తే ఎగతాళి చేయరుకదా? ఏమో మనస్సులో ఏమనుకుంటారో ఎవ్వడికి తెలుసు? ఐనా వచ్చేదెలా? లాలాగారికి వ్రాయండి. బలే! ఓహూ! ఇదేదో కొత్తరకం పిచ్చిసవారయిందల్లే వుందే అని అనవచ్చు.

నిన్నటిసంగతి. మంచంమీద పడుకొనేవున్నా. ఇంతలో తెల్లవారిపోయింది. చల్లటిగాలి హాయిగా వీస్తోంది. స్త్రీల పాటల కంఠధ్వని చెవిలోకొచ్చి ప్రతిధ్వనించింది. స్త్రీలు కోతల కెళ్తున్నారు. తొంగిచూస్తే పన్నెండు పన్నెండు మంది కలిసి ఒక ముఠాగా వున్నారు. చేతుల్లో కొడవళ్లూ, భుజాలపై మోపులుకట్టే త్రాళ్ళు, నెత్తిన బఠానీలబుట్టలూ పెట్టుకుని ఉన్నారు. ఇప్పుడు వెళ్ళినవెళ్ళడం మళ్ళీ ప్రొద్దు నెత్తిమీద కొచ్చింతర్వాతనే తిరిగివస్తారు. కలిసి పాడుకుంటూ ఎగచికాలుగా ఒకర్నొకరు తోసుకుంటూ వెళ్తున్నారు.

మధ్యాహ్నంవరకు ఆకాశం నిర్మలంగానే ఉంది. తర్వాత హఠాత్తుగా మేఘాలు క్రమ్ముకొచ్చాయి. పెద్దగా గాలివాన వచ్చింది. వడగండ్లు పడ్డాయి. ఇంత పెద్దపెద్ద వడగండ్లు నే నిదివరకెన్నడూ చూచిఎరుగను. బంగాళాదుంపల కంటె పెద్దవిగా ఉన్నాయి. పడడంకూడ తుపాకుల్లోంచి గుళ్ళు పడటుగా పడ్డాయి. క్షణంలో నేల అనేదె కడా కన్పడకుండాపోయింది. పైన అడుగుఎత్తునపరుపు పరచినట్లుగా పేరుకుపోయాయి. ఎటు చూచినా రైతులు పరుగులు తీసుకుంటూ వస్తున్నారు. ఆవులు, మేకలు గొర్రెలు మొదలైన నోరులేని జంతువులన్నీ చెట్లచాటుకోసం

వెదక్కుంటున్నాయి. పాపం తులసీకేం ప్రమాదం కల్గిందో అని భయం వేసింది. తేరిపారచూస్తే ఆరుబైట రాధ, తులసీలూ, ఒక మోహనీఆవూ కన్పడ్డాయి. ముగ్గురూ ఈ భయంకర వడగళ్ల దెబ్బలకు గుర్రైవున్నారు. తులసీ నెత్తిన ఒక బుట్టా, రాధనెత్తిన ఒక పెద్దమూటా వున్నాయి. వాళ్ల స్థితి చూచి నాకళ్లు చెమ్మగిల్లాయి. ఎలాంటి దుస్థితికి లోనయ్యారా అని జాలివేసింది. హఠాత్తుగా పెద్దగాలివూపొకటి వచ్చింది. రాధనెత్తినవున్న మూటకాస్తా క్రిందపడిపోయింది మూటపడిపోవడం చూచి వెంటనే తననెత్తిమీది బుట్టతీసి అతని నెత్తిన బోర్లించింది. ఆ పుష్పంలాంటి శిరస్సుపై ఎన్ని వడగళ్లు పడ్డాయో దేవుడికెరుక. చేతులకు బాగా పని తగిలింది. ఒకసారి వీపుమీదికి పరుగెత్తితే ఇంకోసారి బుర్రమీదికెళ్ళి సవరిస్తోంటాయి ఇలా ఒకసెకండు కంటె ఎక్కువసేపు ఉండలేదనుకుంటా. తర్వాత రాధ పిడుగులా గభాలునవెళ్ళి మూట మళ్ళీ నెత్తికెత్తుకున్నాడు. అటు బుట్టేమో తులసీకిచ్చాడు. ఆహా! ఎంత గాఢానురాగం!

వినాశకారీ అభాగ్యదేవత చేసినదంతా వ్యర్థంచేసింది. ప్రొద్దున పాడుతూ ఆడుతూ పొలాల కెళ్లారు స్త్రీలు. కాని సాయంత్రం చూస్తే ప్రతి ఇల్లూ ఒక స్మశాన భూమిలా ఉంది. ఎందరి శిరస్సులు రక్తం చిందించాయో తెలియదు. మరెందరు గాయాలతో మూల్గుతూ పడివున్నారో అంతులేదు. నోటిదగ్గరకొచ్చిన పంటలన్నీ తుడిచిపెట్టుకుపోయాయి గింజంతా వడగళ్ళ అడుగునపడి ముక్కిపోతోంది. ఇదిచాలక పైగా జ్వరాలొచ్చిపడ్డాయి. గ్రామమంతా ఒక ఆస్పత్రిగా

వుంది. కాశీ చెప్పినదంతా యథార్థమని ఋజువయింది. హాలికాదహాన సంకరమంటల అంతరార్థం విశదమయింది. పంటలస్థితి ఇలావుంది అటు శిస్తు వసూళ్ళు ప్రారంభమయ్యాయి అబ్బ ఎన్నికష్టాలూ! శిస్తులకోసం ఛీవాట్లూ - తిట్లూ, తన్నులూ-గుద్దులూ, ఒకటేమిటి ఎన్నిరకాల సాధనాలూ ప్రయోగించబడ్తున్నాయి. దీనులపై ఈ దైవీ ప్రకోపం!

ఇట్లు, మీప్రియ
విరజన్.

6

మర్ఘుగ్రామ్.

నా ప్రాణాధిక ప్రియతమా!

పూర్తిగా పదిహేను రోజుల అనంతరమైనా విరజన్ కాస్త గుర్తుకొచ్చినందుకు పరమసంతోషం. జాబు ఎన్నోసార్లు చదువుకున్నా. అది కన్నీరు కార్పించకుండ పూరుకోవడంలేదు. అసలే ఏడ్వటం ఎక్కువ. దానికి తోడు ఇదొకటి. ఏమేం విషయాల్లో మీ దృష్టికి తీసుకురమ్మంటారు? అసలే నాది దుర్బల హృదయం. ఎప్పుడన్నా ఈ విషయాలన్నీ జ్ఞప్తికొస్తే అప్పుడు నా స్థితి అవర్ణనీయం విచిత్రమూనూ. ఏదో వేడిలా అనుభవమవుతోంటుంది. ఏదో ఒకగొప్ప దురాశాపూర్ణ ఆవేదన, నీడ పీడిస్తోంటుంది. అదిఎంతో వ్యగ్రంగా కాని మధురంగా, అత్యంత బాధాకరంగా వుంటుంది. మీరు రావడంలేదనీ, రాబోరనీ తెలుసు. ఐనా పదేపదే గుమ్మంలో కెళ్లి ఎక్కడన్నా వస్తున్నారేమోఅన్న ఆశతో నిల్చొంటూ ఉంటాను.

నిన్నసాయంత్రం ఈ వూళ్లో ఒక గొప్ప చిత్తాకర్ష ణీయమైన వింత చూచాను. ఇది చాకళ్ళనృత్యం. పది పది హేనుమంది కలిసి ఒక జట్టుగా ఏర్పడతారు. అందులో ఒక యువకుడు పొడుగాటి పరికిణీ ఒకటి దిగేస్తాడు. నడుం చుట్టూ చిరిమువ్వలు కట్టుకుంటాడు, కాళ్ళకుగజ్జెలూ, నెత్తిన ఎర్రటి టోపీ ధరిస్తాడు. అతను నృత్యం చేసినప్పుడు మృదంగం వాయించబడుతుంది. వీళ్లంతా హోలీ పండుగ మామూళ్లు అడుక్కోటానికి బయలుదేరారని విన్నా. ఈ కులం బహు మతులు వసూలు చేసుకోవడంలో అందెవేసిన చెయ్యి. మీ పనిచేసినా, లేక వాళ్ళే ఏదన్నా చేసుకున్నా మామూళ్లు ముట్టవలసిందే. నృత్యసమయంలో పాటలు పాడరు. వీళ్ల సొంత కవిత్వమే వీళ్ల పాటలు. స్త్రీవేషం వేసినవాడు మద్దెల పై చెయ్యి ఆనిస్తాడు. ఒక విరహా (గొల్లసుద్దులవంటిపాట) చరణం పాడ్తాడు. ఒక పురుషుడు ఎదురుగా వచ్చి దానికి జవాబుఇస్తాడు. తర్వాత ఉభయులూ కలిసి అప్పటి కప్పుడు 'విరహా' ఒకటి అల్లిపారేస్తారు. ఈకులంలో గొప్ప కవిత్వం చెప్పేశక్తి ఉంది. ఈ 'విరహా' లను గనక జాగ్రత్తగా పరిశీ లిస్తే అందులో ఉత్తమోత్తమ భావాలు నిండివున్నట్టు స్పష్టంగా విదితమవుతుంది. స్త్రీ వేషధారి యువకుడు ప్రప్రథ మంలో పాడిన చరణం తాత్పర్య మేమంటే – "ఓ చాకలి బిడ్డలారా! మీరిప్పుడు నిలొప్పనివున్న గుమ్మం ఎవరిది?" రెండోవాడు సమాధానం ఇచ్చాడు – "ఇప్పుడిక అక్బరు చక్రవర్తీ లేడు, భోజరాజూ లేడు; ఇప్పుడు ఉన్నదల్లా మన దొరగారొక్కరే. కాబట్టి వారినే యాచించండి" "మూడో

'విరహా' గీతంలో" యాచించేవాళ్ళకు గౌరవమర్యాదలు తక్కువ. అంచేత అసలేమీ యాచించవద్దు. చక్కగా పాడి, అందంగా ఆడి వెళ్ళిపో. ఇచ్చేదాత ఎలాగూ ఇస్తాడు." అన్న భావం ఇమిడిఉంది. ఈ విధంగా రెండుగంటలనుంచి పాడుతున్నారు ఆ చరణాలు, ఆ పదాలు అన్నీ అప్రయత్నంగా, అనాయాసంగా వెలువడుతుంటాయి. బహుశ మీరు నమ్మకపోవచ్చు. కాని ఆ ఆశుకవిత్వధోరణిచూస్తే ఆశ్చర్యం కల్గుతుంది. బహుశ విశ్రాంతిగా కూర్చుని చెప్పుకునే కబుర్లైనా ఇంత తేలిగ్గా, ఇంతత్వరగా నోట్లోంచి రావేమో. త్రాగుడుకు పేరుగన్నకులం. కల్లు-సారాయి అంటే మంచినీళ్ల ప్రాయంగా త్రాగుతుంది. పెళ్లిలో మద్యం, కార్యంలో మద్యం, కుల తప్పుల విచారణలో మద్యం, పూజా పునస్కారాల్లో మద్యం, చివరకు బహుమతులూ మద్యంకోసమే. ఉతికినకూలి సబ్బులు అడిగినా "ఇవ్వాళ ఒకముంతకైనా బొత్తిగాడబ్బుల్లేవు దొరగారూ" అని అడుగుతారు. వెళ్ళబోయే సమయంలో బేషూచాకలి పాడిన 'విరహా' కావ్యాలంకారంతో నిండిఉంది.

"గంగాజలంలా మీ కుటుంబం వర్ధిల్లాలి, మామిడి పూతలా మీ బిడ్డలు ఆయురారోగ్యాలతో అభివృద్ధి చెందాలి ఇంటి ఇల్లాలు పసుపుకుంకంతో సదా శోభిల్లాలి గరిక దుబ్బులా" ఎంత విచిత్ర, అద్భుతకవిత్వం ?

ఇట్లు, విరజన్.
మధుగ్రామ్.

7

ప్రియా,

ఒకవారం రోజులవరకూ మౌనంగా కూర్చున్నందుకు

క్షమించ ప్రార్థన. ఈ వారంలో బొత్తిగా తీరిక లేదు. మాధవి జబ్బుపడింది. మొదట ఎన్నో క్వినైన్ మాత్రలు ఇచ్చాం. కాని సుగుణమేమీ కన్పడలా పైగా మరింత విషమించింది. అప్పుడు గత్యంతరం లేక దిహాలూరాయ్ వైద్యుని పిలిపించాం. షుమారు ముప్పై ఏళ్ళ వయస్సుంటుంది చెప్పులుతొడుగడు. ఒక తలగుడ్డ, భుజం మీద అంగోస్త్రం, చేతిలో దుడ్డుకర్ర. ఇవే వేషభూషలు. వాకిట్లో కొచ్చి కూర్చున్నారు. పెద్ద జమీందారట. కాని ఒంటిమీద చొక్కా గుడ్డన్నా లేదు. తన శరీర రక్షణ - పోషణల గురించి జాగ్రత్తలు తీసుకునేటంత అవకాశమే లభించదట. ఈ తాలూకాలో ఏడెనిమిది కోసుల దూరంలోవున్న ప్రజలందరికీ అతనిపట్ల ఎంతో నమ్మకముంది. వాళ్ళ కింకో వైద్యుడూ తెలియదు. డాక్టరూ తెలియదు. వాళ్ళకు తెలిసిందల్లా దిహాలూరాయ్ ఒక్కడే కబురందగానే వచ్చి వాకిట్లో ప్రత్యక్షమయ్యాడు. డాక్టరమాదిరిగా బల్లా, కార్లూ తీసుకురమ్మనమని - వాళ్ళ సమయం వృధాకాకుండ గలందులకు-అడగడు. కబురందితే చాలు ఇంటిముందుకొచ్చి వాలతాడు. మూగనోముపట్టి కూర్చుంటాడు. ఇక రోగిని చూడ్డానికి ఇట్లోకి అడుగిడితే మహాచురుగ్గా వెళ్తాడు-గదిలో విషవాయువుచిండివున్న దన్నట్టుగా. రోగనిదానం, ఔషధోపచారం అంతా రెండు నిమిషాలపని. దిహాలూరాయ్ డాక్టరు కాదు. కాని అతనివల్ల ఆరోగ్యలాభం పొందిన రోగులు వేనకు వేలున్నారు. దయార్ద్రహృదయుడు. సహాయసానుభూతులకు సాక్షాత్ మూర్తి స్వరూపుడు. అతన్ని చూస్తేనే రోగం సగం నయమై పోయినట్టుంటుంది. మందులూ చాలా అందుబాటు

లోనూ, అతిచౌకగానూ వుంటాయి. రాగిదమ్మిడీ లేకుండ మణుగులకు మణుగులు తెచ్చుకోవచ్చుననీ చెప్పినా అతిశయోక్తి కాదు. మూడురోజుల్లోనే లేచి తిరగసాగింది మాధవి. నిజంగా ఆ వైద్యుని మందులో గారడీవుంది.

ఇక్కడ ప్రస్తుతం కాబూలీవాళ్ళ ఉపద్రవం మితిమీరి పోయివుంది. వీళ్లు శీతకాలంలో బట్టలు అరువుకిస్తారు. చైత్రంలో డబ్బు వసూలుచేసుకుంటారు. అప్పుడిక ఏ వంకలూ చెల్లవు. తిట్లూ, చీవాట్లూ, బెదరింపులూ, దెబ్బలాటలూ ఒకటేమిటి అన్నిటికీ దిగుతారు. ఊళ్లో ఇద్దరి ముగ్గుర్ని చచ్చేటట్టుకొట్టారు. రాధకూడ కొద్దిగా బట్టలుపుచ్చుకున్నాడట. డబ్బుకోసం వాకిట్లోచేరి బూతుల పంచాంగం విప్పారు. భయమేసి తలుపులు బిగించుకుంది తులసీ. ఈ రకంగా పని జరక్కపోవడంచూచి కట్టుకొయ్యను ఒక నల్లఆవు కట్టేసివుంటే వూడదీసుకుపోతున్నారు. ఇంతలో రాధ దూరానవస్తున్నట్టు కన్పడ్డాడు. వచ్చీ రావడంతోనే శక్తికొలదీ కర్రతో ఒకటి జబురుకున్నాడు. మణికట్టు విరిగి వ్రేలాడిపోయింది. అప్పుడిక వాళ్లకు సింహ మెక్కింది. కవాయుదు చేసుకుంటూ, తొడలుకొట్టుకుంటూ పైపైకి రాసాగారు. రాధా ప్రాణానికి తెగించి కూర్చున్నాడు ఆ దుష్టత్రయాన్ని మళ్లీ ఎందుకు పనికి రాకుండేటట్టు మర్దనచేసాడు. ఇంతలో ఎక్కడనుంచో కాశీ 'ధర్' వూడిపడ్డాడు. అతనూ ఒకడి పనిపట్టించాడు. దిహాలూరాయకు కాబూలీవాళ్ళంటే తగని అసహ్యం. అప్పుడప్పుడు "వీళ్ళ రూపాయలెన్ని ఎగగొట్టించానో; ఎంతమందిని మరమ్మతు చేయించానో అంతులేదు." అని సగర్వంగా

చెబుతుండేవారు. ఈ గల్లంతు విని ఆయనా వచ్చాను. తర్వాత ఇక వందల కర్రలుదిగాయి. వాళ్ళంతా ఆ కాబూలీ వాళ్ల భరతం బాగా పట్టించారు. జలుబునీళ్లు కాసినీ వద లించారు. మళ్ళీ ఇటుకేసి వస్తారన్న నమ్మకంలేదు.

ఇప్పుడు మే నెల గడచిపోయింది. ఇంకా శెలవు లివ్వ లేదా. అహర్నిశం మీ రాకకోసం ఎదురుచూస్తున్నా. పట్నంలో జబ్బులు తగ్గిపోయాయి. మేమందరమూ త్వర లో నే ఇక్కడనుంచి వెళ్ళిపోతాం. విచారం! ఈ గ్రామం చూచే అదృష్టం మీకు లేదుకదా.

ఇట్లు మీ ప్రియ,

విరజన్.

# 18

ప్రతాప్ ప్రయాగ-కాలేజీలో చదువు ప్రారంభించప్పుడే మూడేళ్లు దాటిపోయాయి. ఈ కాలంలో గురుజనుల తోటి విద్యార్థుల ఆదరాభిమానాలు చక్కగా చూరగొన్నాడు. కాలేజీ జీవితంలో ప్రతాప్ పాల్గొనని కార్యక్రమంగానీ, అందులో అతని ప్రతిభ ప్రదర్శితం గాకపోవడంగానీ ఏదీ, ఎన్నాడూ లేదు. అతనంటే ప్రొఫెసర్లకు చచ్చినంత అభి మానం. ఏకైకనాయకుడని విద్యార్థులకుగర్వం. ఆటపాటల్లో అందెవేసినచెయ్యి. హస్త-నైపుణ్యం ప్రశంసనీయం. చూస్తేనే తనివితీరుతుంది. ఇక ఉపన్యాసరంగంలో అతని వాక్చాతుర్యం తార్కికపద్ధతి, సూక్ష్మదర్శిత్వం వగైరాలన్నీ స్వయం సిద్ధ

ప్రమాణాలు. కాలేజీలో మిత్ర-మండలొకటి స్థాపించబడింది. నగరంలోని సామాన్య నాగరికులూ, కాలేజీ ప్రొఫెసర్లూ, విద్యార్థులూ అందరూ దానిలో సభ్యులు. ఈ సంఘంలో మహోజ్వల చంద్రుడు ప్రతాప్. ఇందులో జాతీయ, సాంఘిక సమస్యలపై చర్చలు జరుగుతుంటాయి. ప్రతాపుని ఉపన్యాసాలు మహాప్రతిభావంతంగాను, తర్క పూర్ణంగానూ వుండేవి. అతని భావాలు, అనుసంధానపూర్ణ యుక్తులూ చూచి ప్రొఫెసర్లుసైతం ముక్కుమీద వ్రేలువేసుకునేవాళ్లు ఈ రకంగా ఉపన్యాస-క్రీడారంగాలు రెండింటిలోనూ గొప్పపేరు-ప్రఖ్యాతులు సంపాదించాడు. సామాన్యదుస్తులతో ఉపన్యాసవేదికపై కెక్కగానే ప్రేక్షకుల దృష్టిఅంతా అతనిమీదికే పరుగెత్తుకుపోయేది హృదయసాగరంలో ఉత్సాహ-ఔత్సుక్య తరంగాలు తరంగితమయ్యేవి. అతని వాక్పటిమ, నిర్దేశం, శ్రుతిమధుర ఉచ్చారణ, హావభావాలు మొదలైనవన్నీ ఎంతో ప్రభావ ప్రపూరితంగా వుండేవి. శారదాంబే స్వయంగావచ్చి జిహ్వాగ్రంపై ఆసీనురాలైనట్లుగా వేదికపై ఉపన్యసించినంతసేపూ ప్రేక్షకులంతా మోహినీ మంత్రానికి వశీభూతులై వున్నట్లుగా కూర్చొని ఉండేవాళ్ళు. అతని ఉపన్యాసంలోని ప్రతిపదమూ, ప్రతివాక్యమూ హృదయాంతరాళంలో కెళ్ళి గుచ్చుకుంటూ ఉండేవి. ప్రేక్షకుల నోటినుండి "సెబాస్, బలే-వహ్వా" అన్న పదాలు అప్రయత్నంగా, అనాయాసంగా వెలువడుతుండేవి. అతని ధారా ప్రవాహిక వచనామృత రసాస్వాదన నిమిత్తం అనేకమంది వచ్చేవాళ్లు అతని పదజాలంలో, ఉచ్చారణలో స్వతహాగా ఏదో గారడీఉంది. సాహిత్య చరిత్రలంటే ఆసక్తి

మోడు. జాతుల వికాసావనతులూ, అందుకు కారణాలూ మొదలైన వాటినిగురించి తరచుగా అధ్యయనం చేస్తుండే వాడు. ప్రేక్షకుల ప్రశంసలే అతని అభివృద్ధికీ, శ్రమకూ కారణం. ఆ ప్రశంసలనే తన కఠోర పరిశ్రమ - అధ్యవసాయాలకు బహుమానములుగా భావిస్తుండేవాడు. అతని ఉత్సాహ పరిశ్రములుచూచి ఈ మొక్క భవిష్యత్తులో ఎలాంటిపూవులు పూచికాయలు కాస్తుందో చక్కగా అంచనా వేయవచ్చు. ఇంతవరకు తన భావిజీవిత రూపురేఖలగురించి ఆలోచించిన పాపానపోలేదు ప్రతాప్. అనేకభావాలూ, అనేక ఆలోచనలూ, వచ్చి కాలగర్భంలో లీనమై పోతుండేవి. ఒకప్పుడు ప్రొఫెసరైతే బాగుండుననీ, మంచి పుస్తకాలు వ్రాయవచ్చుననీ అనుకుంటాడు. ఇంకొకప్పుడు ప్లీడరునైతే బాగుండునని ఆలోచిస్తాడు. మరొకప్పుడు స్కాలర్‌షిప్‌లభిస్తే ఐ.సి.యస్. చదివి సివిల్‌సర్వీస్ ఉద్యోగం చేయాలని కలలు గంటుంటాడు. ఒక్కమాటలో చెప్పాలంటే ఇద మిత్థం అని ఏదీ నిర్ణయించుకోలేక పోతున్నాడు.

కాని కేవలం పుస్తకాలూ, ఉపన్యాసాల సరిహద్దుల్లోనే కూపమండూకముల్లావుండే విద్యార్థులవంటి విద్యార్థి కాదు ప్రతాప్. తన కాలంలో తన విద్యాబుద్ధుల్లో కొంత భాగం ప్రజాసేవకై వినియోగిస్తూవుంటాడు. ప్రకృతివంటి ఔదార్యాన్ని, దయ, కరుణ మొదలైన సద్గుణాలు నేర్చుకున్నాడు. ప్రజాసామాన్యంతో కలిసి మెలిసి తిరగడం, ప్రజల మేలుకై పనిచేయడం మొదలైన లక్షణాలు తండ్రి నుండి పొందాడు. అతనిలో ఎలాంటి ఉత్సాహంవుందో అది

ఈ కార్యకలాపాల్లోనే పూర్తిగా రుజువవుతుండేది. తరచు సాయంకాలమప్పుడు ముసుగులు బద్దలయ్యే చెముకంపుకొట్టే 'కీటగంజ్' 'కటరా' పేటల్లో తిరుగుతుండేవాడు. ఈ పేటల్లో అధిక సంఖ్యాకులు హరిజనులు. ఎవరి క్రీనీడ చూచి సవర్ణహిందువులు అనుడదూరంగా పోతుంటాడో అలాంటి వాళ్ళ సరసన మంచంమీద కూర్చుని కబుర్లు చెబుతుంటాడు ప్రతాప్. అందువల్లనే ఆ పేటల్లోని వాళ్ళంతా అతనంటే ప్రాణాలర్పిస్తూంటారు. పోనురిపోతుతనం సుఖ - సౌఖ్యా లనుభవించాలనే వాంఛ ఈ రెండు అవలక్షణాలూ ప్రతాపునిలో మచ్చుకైనా లేవు. ఇతను అనాథుడు అని తెలిస్తేచాలు వెంటనే సహాయం చేయటానికి సిద్ధం. గుడిసెలలో కుక్కి మంచాలపై మూల్గే రోగుల కాళ్ళదగ్గర కూర్చుని ఎన్నిరోజులు కంటిమీద కూనిక లేకుండా గడిపాడో చెప్పటం కష్టం. ఈ ఆశయంతోనే ప్రజాసేవ నిమిత్తం ఒక సంఘంకూడ స్థాపించాడు. రెండూ రెండున్నర సంవత్సరాల అత్యల్పవ్యవధిలోనే ఈ సంఘమెంతో సేవచేసింది. ఫలితం ప్రయాగవాసులకు దానిపట్ల ప్రేమానురాగాలు ఏర్పడ్డాయి

ప్రయాగ వెళ్ళినప్పుడు కమలాచరణ్ని ఎంతగానో మర్యాదచేశాడు ప్రతాప్ అతని మనస్సులోని ఈర్ష్యాద్వేషాగ్నిని పూర్తిగా చల్లార్చివేసింది కాలచక్రం. విరజన్‌కు జబ్బుగావుందని వార్తఅందగానే బెనారస్ వెళ్ళాడు, అతను కంటపడగానే ఆవిడ స్థితిలో గొప్పమార్పువచ్చింది. ఆవిడ హృదయంలో తనకున్న స్థానం ఇంకా కమలాచరణుడు సంపాదించలేదు. అని ఆనాటినుంచీ ఒకనమ్మకం ఏర్పడింది. ద్వేషా

గ్నిని చల్లార్చటానికి ఈ భావమే చాలు. ఇంతేగాక సుశీల మరణానికి తానే కారకుడ నన్న భావంకూడ హృదయంలో ఇంకోమూల పట్టుకు ఏడ్పిస్తోంది. మరణాసన్న సమయంలో కన్నీరు కారుస్తూ తన తప్పులు క్షమించమని ప్రార్థించింది సుశీల. ఈ పాపపరిహారార్థం ప్రాయశ్చిత్తం తప్పక చేసుకుంటానని ఆ ఘడియలోనే దృఢంగా నిశ్చయించుకున్నాడు. కమలాచరణునికి ఆదర - సత్కారాలు చేస్తున్నాడు. విద్యాబుద్ధులు గరపుతున్నాడు. చదువుసంధ్యల్లో సహాయపడుతున్నాడు. ఈ రూపంలో నైనా కొంతవరకు తన ప్రాయశ్చిత్తం పూర్తి చేసుకునే అవకాశం లభించింది. అన్నగారి యెడ తమ్ముడు వ్యవహరించిన విధంగా అతని యెడ వ్యవహరించేవాడు. తన జైలులో కొంతభాగం అతని పనుల్లో తోడ్పడటానికి వినియోగించేవాడు. ఎంతో సులభ శైలిలో పాఠాలు చెబుతుండేవాడు. అతని బోధనాపద్ధతులు విద్యార్థులపట్ల అభిరుచిని కలుగచేస్తుండేవి.

ఈ రకంగా ఎన్నోవిధాల తోడ్పడుతున్నాడు ప్రతాప్. ఐనా కమలాచరణునికెక్కడ పెద్దగా తోచడంలేదు. హాస్టలు మొత్తంలో అతని స్వభావానికి అనుకూలుడైన వ్యక్తి ఒక్కడూ లేడు. మరి ఎవ్వరిదగ్గర తన మనోభావాలువెల్లడిస్తాడు? నిజం, ప్రతాపునివద్ద సిస్సంకోచభావంతో మెలగుతూఉన్నా, మనస్సులో వున్న విషయాలన్నీ స్పష్టంగా వెల్లడించేవాడుకాదు. ఈ ఏకాకితనంలో ఎప్పుడన్నా మనస్సు మరింత చికాకుపడితే అత్తమీద కోపం దుత్తమీద చూపినట్టుగా తన చికాకంతా ప్రజరాణిపై దూషణలవర్షం కురిపించడంలో

చూపించేవాడు. "దాని మూలంగానే నా కీనాడిన్ని కడగండ్లు వచ్చాయి. దానికసలు నామీద ప్రేమ లేనేలేదు. రాతి - కూతల ప్రేమకూడ ఒక ప్రేమయేనా? దానికోసం నే బలైపోయినాసరే, కాని దాని ప్రేమమాత్రం ఆ చిలుక పలుకులూ, ఆ కలంగీతలూ దాటిమాత్రం ఇవతలకు అడుగు పెట్టదు. జాలీగీలీ ఎరుగని పాషాణమూర్తి ఎదుట మొత్తుకుంటే, శిరస్సు పగలగొట్టుకుంటే మాత్రం ప్రయోజనమేమిటి?" ఈ రకమైన ఆలోచనలు వెర్రితలలువేసి కడకు విరజన్‌కు జాబులు వ్రాయకుండా వుండేవరకు పోయాయి. పాపం ఆవిడేమో తన జాబుల్లో తన గుండెకాయ తీసి అక్కడ పెడ్తోంటుంది. ఇతగాడుమాత్రం జవాబుగా రెండు ముక్కలన్నా గీసివేసిన పాపానపోడు. ఒకవేళ అంతగా ఎప్పుడన్నా వ్రాస్తే, మనస్సుకు బాధ కల్గించేవిధంగా, వికటంగా వ్రాస్తాడు. కామెర్లరోగికి అంతా పచ్చగానే వున్నట్లు అతనికిప్పుడు విరజనుని ప్రతివాక్యంలోనూ, ప్రతి వ్యవహారంలోనూ ఆవిడ ప్రేమ - శూన్యతే కానవస్తోంది. నిజం, పైకి కానరాకుండా అడుగున మరుగుపడివున్న విషయాలు కొన్నివున్నాయి. అందులో ఒకటి విరజవని అనురాగ పూర్ణవాక్యాలు, రెండు ఎడబాటై ప్రయాగ పోతున్న సమయంలో జలబిందువులు చిందించిన మత్త జలజ నయనాలు; మూడు సదా జాబులు వ్రాస్తూవుండమని ప్రార్ధిస్తూ ఆడించిన కోమల హస్తాలు. ఇవిగనక స్మరణకు వస్తూవున్నట్లయితే కొంత ఆత్మ సంతృప్తి కల్గటాని కవకాశ ముండేదేమో. కాని ఇలాంటిసమయాల్లో మానవుని స్మరణశక్తి దగాచేస్తోంటుంది.

[illegible]; ఎలాగైతే చివరకు శోధించి శోధించి తన కాలాన్ని గడిపేందుకొక నూతనపద్ధతి కనుగొన్నాడు కమలాచరణ్. కాస్త ప్రపంచజ్ఞానం కలిగినప్పటినుంచీ సౌందర్యం - నాటికలో విహరించే వ్యసనమొకటి అబ్బింది. సౌందర్యోపాసన అతని నైజగుణంగా తయారయింది. నిత్యజీవితంలో శరీరపోషణకు అవసరమైన అన్న పానీయాల్లో సౌందర్యోపాసనకూడ ఒకటిగా అంతర్భాగమై పోయింది. హాస్టలుకు ఆనుకుని ఒక శ్రేష్టిగారి పూలతోటొకటి వుంది. దానికొక తోటమాలి ఉన్నాడు. అతనికి ఈడొచ్చిన కూతురొకతె వుంది. పేరు సరయూదేవి. పెద్ద అందకత్తె ఏమీ కాదు. ఐనా అందచందాలెవ్వడికి కావాలి? కమలాచరణుకి కావలసిందల్లా మనోవినోద సామాగ్రి. ఆడది ఎలావున్నా ఇబ్బంది లేదు కాస్త పసుపు పిల్లలాగుంటే చాలు, అతని తోచుబడికి తగిన మసాలా దొరికిందన్నమాటే. అతను నెమ్మదిగా తోటమాలి కూతురుపై పాచికలు వేయ ప్రారంభించాడు. సిన్మా సాయంవేళల తోటలో కొయ్యబల్లలపై కూర్చోవడం పిచ్చాట్లుకొట్టడం మొదలెట్టాడు తోటి విద్యార్థులంతా వ్యాయామం చేస్తూంటే కమలాచరణ్ తోటలోకి చేరి పొంచి పొంచి తొంగితొంగి చూపులతో కాలం గడుపుతుండేవాడు. కాలక్రమేణా సరయూదేవితో మాటలు కలిశాయి. మంచి పరిచయమూ ఏర్పడింది. ఆ పిల్ల దగ్గర పూలమాలలు కొనేవాడు. ఖరీదుకు నాల్గురెట్లు డబ్బులిచ్చేవాడు. పండగ మామూళ్ళు అందరి దగ్గరకంటె కమలాచరణ్ దగ్గరే ఎక్కువ ముడుతుండేవి తోటమాలికి. చివరకు సరయూ

దేవిపై వేచిన పాచికపారింది. ఆతని ప్రేమవలలో చిక్కుకు పోయింది కటిక చీకటి తెరచాటున రెండు మూడుసార్లు దర్శన - స్పర్శలూ జరిగిపోయాయి.

ఒక రోజున సాయంత్రం అటు విద్యార్థులంతా షికారు వెళ్లారు. ఇటు కమలాచరణ్ ఒంటరిగా తోటలో కెళ్ళి షికారు కొడుతున్నాడు. ఉండుండి తోటమాలి గుడిసెలోకి తొంగి తొంగి చూచేవాడు. గుడిసెలోంచి హఠాత్తుగా సరయూ దేవి లోపలికి రమ్మనమని సైగచేసింది. ఇంకేం, వాయువేగం తో వెళ్ళి గుడిసెలో దూరాడు. కమలాచరణ్ బహూక రించిన మల్లుచీరె కట్టింది తోటమాలికూతురు. బెనారస్ నుంచి అతను తెచ్చిన అత్తరున్నూనె రాచింది ఆ బాబుగారే కుట్టించిన అద్దకంగుడ్డ జాకెటు తొడిగింది. ఇవ్వాళ సరయూ దేవి అతని కళ్లకు భూలోక అప్సరసలా కనపడుతోంది. లేక పోతే కమలాచరణ్ వంటి శ్రీమంతుని బిడ్డ తోటమాలి కూతురుకోసం ఇంతగా ప్రాణాలెందుకు విడుస్తాడు? మంచం మధ్య ఆసనంవేసి కూర్చున్నాడు. సరయూదేవి కులుకులు - తళుకులు, టక్కులు - టమారాలూ రెప్ప వాల్చకుండా కామోద్రేకదృష్టితో చూస్తున్నాడు. ఆ సమయంలో అంద చందాల్లో విరజకు కేమీ తీసిపోయినట్టుగా కన్పడడంలా. ఔను, రంగంలో కాస్త తేడా వున్న మాట వాస్తవమే. కాని అదొక గొప్ప తేడాలో లెక్క-కాదు. సరయూదేవి ప్రేమ నిష్కళంకంగా, ఉత్సాహ పూర్ణంగా కన్పడుతోంది. ఎంచే తంటే, 'బెనారస్ వెళ్ళిపోతున్నా' అని ఎప్పుడన్నా ఆషా మాషీగా అన్నా సరే, కడివెడు కన్నీళ్ళు కారుస్తుంది. 'నన్ను

కూడ వెంటతీసుకుపొండి" అని వలపులు కురిపిస్తూ మారాం చేస్తుంది. "మీరులేకపోతే ఉండలేను బాబు" అని అనేది దిగాలుగా. ఈ ప్రేమ తీవ్రత, ఈ ఉత్సాహ బాహుళ్యం ఎక్కడ? విరజనుని ప్రేమశూన్య సేవాశుశ్రూషలు, నిర్దయతాపూర్ణ అభ్యర్థనలు ఎక్కడ?

కమలాబాబు కన్నులారా, తనివితీరా సరయూదేవి నింకా సరిగ్గా చూడనన్నా చూడలేదు. ఇంతలో హఠాత్తుగా తోటమాలివచ్చి తలుపు తట్టాడు. ఇంకేముంది, నిలువున కోసినా నెత్తురుబొట్టు లేకుండాపోయింది. కాళ్లూ గడ్డంపట్టు కుని "ఎక్కడికి పోను? ఎటుపోను?" అని అన్నాడు తోట మాలి కన్యను తత్తరగొంటూ. దాని వివేకబుద్ధి అంతకు ముందే బండపారిపోయింది; మరదేం సలహాఇస్తుంది? నోట్లోంచి మాట కూడ రాలేదు కంగారులో. ఈసారి డబడబామని తలుపు కొట్టాడు తోటమాలి. పాపం, ఏంచేస్తుంది, తప్పదు; జడుస్తూ జడుస్తూవెళ్లి మెల్లగా తలుపు తెరచింది. ఊపిరిబిగ పట్టుకుని, అవయవాలన్నీ ముద్దగాచేసి ఒకమూల నిల్చొని ఉన్నాడు కమలాచరణ్.

కమలాచరణ్ గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి కత్తిక్రింది బలిపోతుగుండెల్లా. ప్రాణానికి ఆశలొదలుకున్నాడు. యదార్థ భక్తి - ప్రేమలతో స్మరించుతున్నాడుదేవుని. ఈ సారి గనక గండం గడిస్తే ఇకఎన్నడూ ఇలాంటిపనిచేయను 'మహాప్రభో' అని చెంపలు వేసుకుంటూ మొరపెట్టు కుంటున్నాడు.

ఇంతలో తోటమాలి దృష్టి అటుపోయింది. మొదట

శాస్త్రి ఖంగారుపడ్డాడు. కాని తర్వాత చల్లగా దగ్గరకొచ్చి "ఆ నుంచున్న దెవ్వరు? ఎవ్వడురా వీడు?" అని ప్రశ్నించాడు

ఈ మాట వినీవినడంతోనే ఎగిరి ఒక గంతువేసి గుడిసెలోంచి బైటపడ్డాడు. గేటువేపుకు చావు పరుగులు తీశాడు. బాణాకర్ర ఒకటి తీసుకుని "పట్టుకోండి. పట్టుకోండి పారిపోతాడేమో జాగ్రత్త" అని అరచుకుంటూ వెంబడించాడు తోటమాలి. వీళ్లిద్దరూ మరెవ్వరో కారు. వెనక తోటమాలికి బహుమతులు, పండగ మామూళ్లూ ఇచ్చే కమలాచరణే ఈ కమలాచరణ్ అవి అందుకుంటూ హుజూర్ హుజూర్ (చిత్తం చిత్తం) అని అతివినయ విధేయలతో మాట్లాడే తోటమాలే ఈ తోటమాలి ఆ కమలాచరణుడే ఇప్పుడు ప్రాణాలు గుప్పిటపట్టుకుని ఆ తోటమాలి ఎదుట ఈ రకంగా కాలికి బుద్ధిచెప్తూవున్నాడు. పాపమనే దొంక అగ్నిగుండం. అందులో మాన-మర్యాదలూ, పరువు-ప్రతిష్టలూ, ధైర్యసాహసాలూ అన్నీ క్షణమాత్రంలో భస్మమై పోతుంటాయి.

చెట్లూ - తీగెలూ చాటుచేసుకుని పరుగులు తీస్తూపోయి గేటు అవతల పడ్డాడు కమలాచరణ్, రోడ్డుమీద జట్కా-బండొకటి పోతోంది. గభాలున అందులోకెక్కి కూర్చున్నాడు. విపరీతమైన చాలితో డస్సిపోయి బండికమ్ములపైన పడిపోయాడు. చివరకు గేటుదాకన్నా రాలేదు తోటమాలి. ఐనా వచ్చేపోయే వాళ్ళందర్నీ బిత్తరబిత్తరగా చూచేవాడు కమలాబాబు - ప్రపంచమంతా శత్రుమయంగానే వున్నట్టుగా. దురదృష్టవశాత్తు మరోవిచిత్ర సంఘటన జరిగింది.

స్టేషనుకుపోయి ఆ గుండెదడతో గభాలున బండి అయితే ఎక్కికూర్చున్నాడు. కాని టిక్కెట్టు సంగతి మరచిపోయాడు. ఎక్కడికి పోతున్నాడో అసలే అంతులేదు. అన్నిటికన్న ముందు అతనికి కావలసిందల్లా ఏదోవిధంగా ఆ నగరాన్ని విడిచి పోవటమే తర్వాత ఎక్కడికన్నా పోనీ. కొంతదూరం పోయింది బండి. ఎవ్వడో ఒక తెల్లదొర లాంతరొకటి పుచ్చుకొని వస్తున్నట్టుగా కనిపించాడు. వెంట పోలీసు కానిస్టేబిలుకూడ ఒకడున్నాడు. ప్రయాణీకుల టిక్కెట్లు తనిఖీ చేస్తూ వస్తున్నారు. ఎవ్వడో పోలీసు ఉద్యోగనుకున్నాడు కమలాబాబు. ఇంకేముంది, కాళ్లూ చేతులూ బండపారిపో సాగాయి భయంతో. గుండెదడ ఎక్కువయింది. ఇతర పెట్టెల్లో టిక్కెట్లు తనిఖీ జరుగుతున్నంతసేపూ ఏదోరకంగా పళ్ళబిగువున కూర్చున్నాడు. కాని తనుకూర్చున్న పెట్టె తలుపు ఎప్పుడైతే తెరవబడిందో ఇక అప్పుడు అతని స్థితి ఎలావుందో చెప్పటం కష్టం. కాళ్లూ చేతులూ స్తంభించి పోయాయి, కళ్ళకు చీకటి క్రమ్మింది. ఆ ఖంగారులో రెండో వేపున తలుపు తెరచాడు, పోయేపోయే బండిలోంచి బైటికి దూకాడు. ఈ విధంగా దూకటం చూచి అతనెవ్వడో గొప్ప గజదొంగై వుంటాడని అభిప్రాయపడ్డారు. ఆ ఇద్దరు ఉద్యోగస్థులు. పట్టుకుంటే బహుమతులు లభించటమే గాక జీతపురాళ్లూ పెరుగుతాయని తలిచారు. పట్టరాని సంతోషంతో వెంటనే ఎర్రదీపం చూపించారు. బండి ఆగి పోయింది. గార్డు, సిపాయి, తెల్లదొర మరికొందరు కలిసి బండిదిగి వచ్చారు. లాంతర్లు తీసుకుని నలుదిశల వెదక

సాగారు. "ఇకవాడి ఎముకముక్క కూడ దొరకదు. పక్కా గజదొంగ" అన్నాడందులో ఒక పెద్దమనిషి. "ఓస్! ఇదొక లెక్కా ? వాళ్ళకసాధ్యమైందేమీలేదు ఈ ప్రపంచంలో. వాళ్ళకసలు కాళికాదేవి ప్రసన్నం వుంటుంది." అన్నాడింకో మహాశయుడు. కాని గార్డుమాత్రం పాచిపీడుగలా ముందుకు పోతూనే ఉన్నాడు. జీతం పెరుగుతుందనే ఆశ ముందుకు నెట్టుకుపోతోంది. ఎట్టకేలకు అతను దూకినచోటికి చేరు కున్నారు. ఒక గోతికేసి వ్రేలుపెట్టి చూపిస్తూ "అటు చూడండి; అక్కడేదో తెల్లగా కన్పిస్తోంది. ఎవ్వడో మని షిలాగున్నట్టున్నాడు." అన్నాడు సిపాయి. తక్కినవాళ్లూ జాగ్రత్తగా పరిశీలించిచూచారు. తప్పక ఆ గజదొంగే ఇక్కడ నక్కి కూర్చున్నాడని నమ్మకంగా అనుకున్నారు. పోయి నాల్గువేపులా చుట్టేయండి. పారిపోనీయకండి. కాస్త జాగ్ర త్తగా వుండాలి దొంగలసలు ప్రాణమంటె లెక్కచేయరు." అని తమలోతాము కూడబలుక్కున్నారు. పిస్తోలు సంభా ళించుకున్నాడు గార్డు లాఠీ సరిచేసుకున్నాడు సిపాయి. ఎక్క డన్నా ఖర్మం చాలక మీదొచ్చిపడితే కాలికిబుద్ధి చెప్పటానికి వీలుగా వుంటుందని ముందుగానే కాళ్ళచెప్పులు చేతబట్టుకు నిల్చొన్నారు కొందరు. దొంగదగ్గరకెవ్వడెళ్తాడు? దూరంగా వుండే కొడ్దాం అని రాళ్లు చేతపట్టుకు నిల్చొన్నారు ఇద్దరు మొనగాళ్లు ఔనుమరి ప్రాణమంటె ఎవ్వడికిచేదు ? తీరా దగ్గరకెళ్లి చూస్తే అక్కడ గజదొంగాలేడు, కన్నందొంగా లేడు. తద్విపరీతంగా ఒకనాగరికుని రూపురేఖలుగలవాడూ, సుందరాంగుడూ, బలిష్టకాయుడూ అయిన యువకుడొకడు

నేలమీద బోర్లగాపడి వున్నాడు ముక్కు-చెవులనుండి రక్తం కారుతోంది ఎడతెగని ధారతో.

ఇక్కడ కమలాచరణుని శ్వాస శాశ్వతంగా ఆగి పోయింది. అక్కడ విరజన్ ఒక భయంకర దుస్స్వప్నంచూచి త్రుళ్ళిపడిలేచింది. విరజన్ పసుపు - కుంకం తనపొట్టన పెట్టుకుంది మహాతల్లి సరయూదేవి.

# 19

ప్రపంచంలో భర్తకుమించిన ప్రియతమ వస్తువేదీలేదు సౌభాగ్యంగల స్త్రీకి. భర్త జీవితమేతనజీవితం, భర్త మృత్యువే తన మృత్యువు. తనసుఖదుఃఖాలూ, పాపాలూ, తనసర్వ్వాలూ పుణ్యాలూ అన్నీ పతిదేవుని ప్రసన్నతకొరకే. తన సమస్త శృంగార సౌందర్యాలూ, ఆ భూషణ అలంకారాలూ అతన్ని రంజింపచేయుటానికే, తన పసుపుకుంకమే, తన మంగళ సూత్రమే. తన ఐదోతనమే జీవితం పసుపు - కుంకం పోవడమే ఆమె జీవితాంతం.

కమలాచరణుని ఆకస్మిక మరణం ప్రజరాణికి స్వామరణంకన్న తక్కువ విషయమేమీ కాదు. ఆమె జీవిత ఆశాభిలాషలన్నీ బూడిదపాలై పోయాయి ఏమేం కలలుకన్నది? చివరకేం జరిగింది? మృత భర్తస్వరూపం ప్రతిక్షణమూ కళ్ళ ఎదుట తిరుగుతూనే వుంటోంది ఎప్పుడన్నా ఒక్క క్షణం పాటు కళ్లు కూర్పాట్లుతో మూసుకుంటే భర్త స్వరూపం ప్రత్యక్షంగా కలలో కన్పించేది.

అప్పుడప్పుడు ఒకానొక్క వ్యక్తిమీదనో లేక కుటుంబంమీదనో భౌతిక కృపాదృష్టి ప్రత్యేకంగా ప్రసరిస్తోంటుంది. కమలాచరణ్ చనిపోయాడు, ఆ శోకాగ్ని ఇంకా సరిగ్గా ఆరనన్నా ఆరలేదు. ఇంతలో తండ్రి శ్యామాచరణ్‌గారి వంతువచ్చింది. కొమ్మలు నరికినందువల్ల చెట్టు ఎండి రాలిపోలేదు. కన్నుకుట్టింది. ఈసారి మొదలుకే ఎసరు పెట్టాడు దుర్ధయివం. రామదీన్‌పాండే గొప్ప ఆత్మాభిమానీ, గర్వపోతూనూ. డిప్టీగారు 'మఝుగ్రామ్' లో ఉన్నంత వరకూ కుక్కిన పేనులా పడివున్నాడు. కాని అక్కడనుంచి మకాం ఎత్తివేసి పట్టణానికి వెళ్ళిపోయిన మరుక్షణం నుండే అతను నిరంకుశ ఏకచ్ఛత్రాధిపతియై కూర్చున్నాడు. ఊళ్ళో 'నా' అన్నవాడెవ్వడూ లేడు. అంతా పగే. క్రిందటి హోలీ పండుగ రోజున ఊరంతా తన్ను చూచిన చూపులూ, చేసిన గౌరవమర్యాదలూ అతని హృదయాంతరాళంలో వాడి ముళ్ళులా గుచ్చుకుంటూనే వున్నాయి. మఝుగ్రామం ఉన్న పరగణాలో సబ్ ఇన్‌స్పెక్టరు గొప్ప తాంత్రికుడు. లంచాలు దిగమ్రింగటంలో ఆరితేరిన చెయ్యి. వేలకువేలు గుటుక్కుమన్నా 'బేవ్' మని త్రేపన్నా తేపకుండ జీర్ణం చేసుకోగలిగిన దిట్ట. కేసులు బనాయించి అబద్ధపు సాక్ష్యాలతో వాటిని రుజువుచేయటంలో ముందు అతనిపేరే చెప్పాలి. తల్చుకుంటే దారిన పోయే దానయ్యనైనా ఇట్టే ఇరికించగలడు. తర్వాత మళ్ళీ శిక్ష పడకుండ తప్పించుకుపోవాలంటే ఇక వాడి తాత ముత్తాతలు దిగొచ్చినా సాధ్యంకాదు. వాడి కుయుక్తులు, చేష్టలు అన్నీ సుపరిచితములే అధికారివర్గానికి.

కాని వాడి తెలివి తేటలముందు ఎవ్వడి పప్పులూ ఉడకడం లేదు. ఈ మహావైక్యానే కలుసుకున్నాడు రామదీన్ పాండే. తన హృదయబాధను ముందు అడిగాడు. ఈ కలియిక అనంతరం ఒకవారం రోజులకు 'మర్ఘుగ్రామం'లో బందిపోటు పడింది. పట్నంనుంచి వస్తున్నాడొక కోమటాయన. చీకటి పడటంతో ఆ రాత్రి ఆ వూళ్ళో గ్రామమోతాదు ఇంటివద్ద మజిలీ వేశాడు. బందిపోటు దొంగలు కని పెట్టారు. మళ్ళీ పాపం అతన్ని ఇంటిముఖం చూడనివ్వ లేదు. ఉదయం విచారణకు దయచేశాడు సబ్ ఇన్‌స్పెక్టరు. ఊరందర్నీ ఒకే త్రాటిన బంధించి స్టేషనుకు తోలుకుపోయాడు.

అదృష్టవశాత్తు ఆ కేసు శ్యామాచరణ్ కోర్టుకెళ్ళింది. ఆయనకు దీని పుట్టుపూర్వోత్తరాలన్నీ అంతకు పూర్వమే తెలుసు. ఎన్నాళ్ళనుంచో ఆయన కళ్ళల్లో మెదలుతున్నాడు ఈ సబ్ ఇన్‌స్పెక్టరు. ఇంకేం? ఈకకు ఈక తోకకు తోకలాగి వదలి పెట్టాడు. దాంతో అసగాడి బ్రతుకూ - బండారమూ అంతా బైటపడింది. ఆరుమాసాలు జరిగింది విచారణ అట్టహాసంగా. తాను చేయగలిగిన ఉపాయాలన్నీ చేశాడు గవర్నమెంటు ప్లీడరు. కాని ఇంటిగుట్టు ఇంటియజమానికి తెలియకుండ ఎలావుండగలదు ? ఫలితం, అభియుక్తులందర్నీ నిర్దోషులుగా వదలి పెట్టేశాడు డిప్టీ. ఇటు కేసు ఎగిరిపోయింది. అటు ఆ సాయంత్రమే వుద్యోగంలోంచి బర్తరఫ్ చేయబడ్డాడు సబ్ ఇన్‌స్పెక్టరు.

తీర్పు వినిపించి సాయంకాలం తిన్నగా ఇంటికెళ్ళాడు డిప్టీ. ఇంతలో శుభచింతక మిత్రుడొకాయన వేంచేసి " ఏమం

డోయ్! ఆ సబ్ ఇన్‌స్పెక్టరుగాడినొక కంట కనిపెడ్తూఉండండి. ఇవ్వాళ వాడికోప - తాపాల కంతులేకుండావుంది. ఇంతకు పూర్వంకూడ ఇద్దరుముగ్గురు అధికార్లకు అపాయం కలగ చేశాడు. సందుదొరికితే మిమ్మల్నీ తప్పక దెబ్బకొడ్తాడు." అని హితోపదేశంచేశాడు. అతను చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు డిప్టీ. తర్వాత ఆ మిత్రుడికి కృతజ్ఞ తాభివందనాలు తెలియ చేశాడు చిరు నవ్వుతో. కాని స్వీయ రక్షణార్థం తగు జాగ్ర త్తలు మాత్రం తీసుకోలేదు. దాన్నొక పిరికితనంగా భావిం చాడు ఇంకోరోజున రాధవచ్చి 'దొరా! నేను మీ వెంట వుంటాను" అని వినయపూర్వకంగాచెప్పాడు. కాశీ 'భర్' కూడ ఎంతో ప్రాధేయపడ్డాడు తన్ను వెంటవుంచుకోవలసిం దని. కాని ఎవ్వరిమాటా ఖాతిరు చేయలేదు.డిప్టీ, యథా ప్రకారం తనపని తాను చేసుకు పోతున్నాడు.

జాలిమ్‌ఖాన్ చొళ్ళువాగుడుగాడు కాదు. బ్రతుకాశ వదలుకుని మరీ డిప్టీ వెంటపడ్డాడు. ఒకరోజున షికారుకెళ్లి ఇంటికి తిరిగొస్తున్నాడు డిప్టీ. దారిలో శివపురంవద్ద కొచ్చే టప్పటికి రాత్రి చాలా ప్రొద్దుపోయింది. అచ్చట పిచ్చి ఆస్పత్రివద్ద ఏదో కన్ను చెదరిచూచి బండి గుర్రం హఠా త్తుగా ఆగిపోయింది. వెంటనే చెట్టుచాటునుండి రయ్‌మంటూ పిస్తోలు గుండొకటి ఢాంఢాం అని ప్రతిధ్వనించింది. శ్యామా చరణ్ వక్షస్థలం చీల్చుకుంటూపోయి అవతలపడింది. పిచ్చి ఆస్పత్రి బంట్రోతులంతా చంగున పరుగెత్తుకొచ్చారు. నేర స్తుడు పట్టుబడ్డాడు. బండివాడు వాణ్ణి అడుగుదీసి అడుగు వేయ కుండ ఆపుచేశాడు. చూస్తే జాలిమ్‌ఖాన్.

ఈ దుర్ఘటనతో శ్యామాచరణ్ కుటుంబం పూర్తిగా దెబ్బతినిపోయింది. అసలు సర్వనాశనమే అయిందని చెప్పాలి. ప్రేమవతి మంచి సుశీల స్త్రీ. ముఖం ఎప్పుడుచూచినా కిల కిల లాడుతోంటుంది. ఐనా ఈదుర్ఘటన లన్నింటి మూలంగా ఆవిడ స్వభావాచరణల్లో హఠాత్తుగా గొప్ప మార్పువచ్చింది. ప్రతిదానికీ విరజన్‌మీద విరుచుకు పడుతూఉంటోంది. సూటీ పోటీ మాటలతో హతమార్చుతోంటోంది. మూలిగే నక్క పై తాటికాయ పడ్డట్లుగా, ఈ విపత్తుల కన్నింటికీ మూలం ఈ కోడలే. అనో భ్రమకల్గింది. ఇవన్నీ ఈ దౌర్భాగ్యురాలే వెంట మోసుకొచ్చింది, ఇది గడపతొక్కిననాటినుంచే ఇల్లంతా ఇలా మంగళమైపోవ ప్రారంభమయింది. దీనికి సుదుంది. గీత మంచిది కాదు విరజన్ ముఖంమీదనే ఎన్నో సార్లు "నీ అందచందాలూ, నీ నున్నటిదేహమూ చూచి మోసపోయానే, మరి నీ పాదాలింతపాడువని నేనేమన్నా కలగన్నానా?" అని అనేసింది కూడ. ఈ మాటలు విని విరజన్ హృదయం తరుక్కుపోయేది. ఔను కాని కాలంలో శ్రుతి మధురవాక్కులెందుకు వినపడ్తాయి? ఇరవైనాల్గు గంటలూ దహించే సంతాపాగ్ని శోకాశ్రు బిందువుల ప్రవాహానికీ అడ్డను వస్తోంటుంది ఎందుకు రాదు? ఎవ్వడన్నా గోడు ఆలకించేనాథుడో, లేక శుభ చింతకుడో ఎదురుగా కన పడినప్పుడే ఆ బిందువులూ బయలుదేరి వస్తుంటాయి.

ఒకరోజున గదిలోకూర్చునికూర్చుని ప్రాణం విసుగెత్తి కాస్సేపటు పూలతోటలో కెళ్లింది "ఆహా! ఈ ఉద్యాన వనంలో ఎలాంటి ఎలాంటి ఆనందమైన రోజులు గడచాయో

గదా! దీనిలోని ప్రతిమొక్కా మృతజీవుల నిస్సీమ ప్రేమకొక స్మృతిచిహ్నం. ఈ ఆకులూ - పూవులూ చూచి మనో మయూరం నృత్యంచేసిన రోజులూ ఒకరోజున గడిచాయి. సురభితసమీరం చిత్తాన్నింతో ఆహ్లాదపరచిన రోజులూ ఉన్నాయి. ఈ స్థలంలోనే అనేక సంధ్యావేళలు ప్రేమాలాపాల్లో గడచిపోయాయి. ఆ సమయంలో పూలమొగ్గలు తమ సుకుమార అధరాలతో స్వాగతమిస్తుండేవి. కాని, విచారం! అలాంటివాటి మస్తకాలే నేడు వాలిపోయి అధరాలు మూతబడి ఉన్నాయి! "సర్వసుందరమాలినీ" పూలహారాలు గుచ్చుతూ కూర్చున్న ప్రదేశం ఇదికాదా? ఈ ప్రదేశంలోనే ఒకరోజున స్వాశయన నిస్పృత ముత్యాలతో కూడ హారం గుచ్చవలసివుంటుందని పాపం ఆ అమాయక మాలినికేం తెలుసు? ఈ భావజగత్తులో విచరిస్తూ విచరిస్తూ ఆవిడ దృష్టి ఒకసారి హఠాత్తుగా కమలాచరణ్ నవ్వుకుంటూ బయటికొచ్చిన పొదవేపుకు మరలింది. ఆకు అల్లల్లాడటం, అతని దుస్తుల తళుకు - బెళుకులూ చూస్తున్నదన్నట్టుగా. ఆ సమయంలో అతని ముఖారవిందంలో మంద మంద హాసం ప్రస్ఫుటితమవుతున్నట్టు గోచరించేది. గంగానదిలో మునిగి పోతున్న సూర్యుని పసుపుపచ్చ, తేజోవిహీన కిరణాలు ప్రతి బింబిస్తున్నట్టుగా. ఇంతలో అకస్మాత్తుగా వచ్చిపడింది అత్త. ప్రేమమతి. "షికార్లకొక వేళా - పాళా ఏమీలేదా ఏమిటి? షికార్లంటే అంతసర్దాగావుందా?" అని అంది పుల్లవిరుపుగా.

లేచి నిలబడింది విరజన్. "అమ్మా! నారాయణమూర్తే

కాలరాచిన వ్యక్తిని మరింత కాలరాయగల్గిన వారెవ్వరు?" అంది ఏడుస్తూ.

ఆరోజు కారోజుకీ ప్రేమవతికి చికాకు ఎక్కువై పోసాగింది. చివరకు ఒకమాసంలోపలే ఉన్నసామానంతా అయిన కాడికి తెగనమ్ముకొని అక్కడనుండి మకాంలేపి "మధుగ్రామ్" వెళ్ళిపోయింది ప్రజరాణి. వొంటతీసుకుపోలేని ఆకీడముఖం చూస్తేనే అసహ్యం కల్గుతోంది. ఈ విశాల భవనంలో ప్రజరాణి ఒక్కర్తే ఉండిపోయింది. కాస్త చేదోడు - వాదోడుగా వుండేవాళ్లల్లో మాధవి ఒక్కటే మిగిలిపోయింది. ప్రజరాణి కష్టాలు తన కన్నకూతురివిగానే భావించి ఎంతోవిచార పడుతుండేదిసువామ. కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ ఎన్నిరోజులు గడిపిందో తెలియదు. చాలా రోజులవరకు నిత్యం విరజన్ ఇంటికెళ్లి కాస్త ధైర్యంచెప్పి వస్తుండేది. ఒక్కతే వుండేదాని కన్న తన ఇంటికొచ్చి ఉంటే బాగుండునని మనస్సులో అనుకుంది. అనేకసార్లు పిలుచుకు రావటానికి వెళ్ళిందికూడ. కాని విరజన్ సమ్మతించలేదు. "మామగారు చనిపోయి ఇంకా పట్టుమని మూడు నెలలన్నా కాలేదు. ఇంతలోనే ఇల్లు పాడుపడిపోతే, అదిగో, చూడండి, మామగారు చావగానే అత్త-కోడలు కీచులాడుకుని ఇల్లు పాడుపెట్టి ఎవరిదారిని వాళ్ళు పోయారని లోకు లనిపోతారు. లోకులు కాకులవంటి వాళ్ళు ఏమన్నా విమర్శించొచ్చు" అని లోకభీతి కల్గింది. ఈ మొండిపట్టు చివరకు సువామ మనస్సుకుకూడ కష్టం కల్గించింది.

అక్కడ 'మర్ఘుగ్రామ్'లో ప్రేమవతి దుండగాలు మితిమీరి పోయాయి. కౌలుదార్లను నోటికొచ్చిన కూతల్లా కూసేస్తుంది. నౌకర్లను చెప్పుదెబ్బలతో సత్కరిస్తోంది. కరణాన్ని బూడిదెత్తి ఆడిపోస్తుంది గొల్లబోయుడు రాధకున్న ఒకేఒక ఆవును అడగకుండంగా తోలుకొచ్చి కట్టేసుకుంది. కడకు ఊరంతా ఇదెక్కడి రాకాసిముండరా అని గజగజ లాడిపోసాగింది. వేగలేక చివర కొకనాడు వెళ్ళి రాధాచరణునిదగ్గర మొరపెట్టుకున్నారు. ఇదంతా "అమ్మకు మతిచెడింది దీనికంతకూ మూలం కుటుంబ పరిస్థితులు. ఇప్పుడామె మనస్సు నేదోవిధంగా ఆహ్లాదపర్చటమే తక్షణ కర్తవ్యం" అని అభిప్రాయపడ్డాడు. అమ్మనద్దకెళ్ళి కొంతకాలం ఉండవలసిందని చెల్లెలు సేవతి కొకవుత్తరం వెంటనే వ్రాశాడు. ఆ సమయంలో సేవతి చంటి బిడ్డతల్లి చంద్రునివంటి బాలుడు భర్త రెండు మాసాలు శెలవుతీసుకుని దర్భాంగా నుండి ఇంటి కొచ్చాడు. అక్కడ రాజాగారి దగ్గర ప్రయివేటు శక్రటరీగా వుంటున్నాడు. అలాంటప్పుడు ఎలా వెళ్తుంది సేవతి? ఇదిగో అదిగో అంటూనే నెలలకు నెలలు గడచిపోయాయి. ఒకసారి బిడ్డకు సుస్తీగావుంటే ఇంకోసారి అత్తగారు మూతి ముడుచుకు కూర్చునేది. మరోసారి మంచిరోజు కుదిరేదికాదు. ఎట్టకేలకు ఆరుమాసాలు సాముచేస్తే కాస్త అవకాశం చిక్కింది. అదీ ఎన్నో విన్నపాలతో.

కాని ఆమె వచ్చినందువల్ల ప్రేమవతిలో పెద్దగా మార్పేమీ కల్గలా. వచ్చినపుడు ఆచారం ప్రకారం కూతుర్ని కౌగిలించుకుని ఏడ్వానుకూడ ఏడ్వలేదు. ఇక మనుమడికేసి

కన్నెత్తిచూచిన పాపానపోలేదు. ఆవిడ హృదయమిప్పుడు మమకారానురాగాలకు అతీతం. చెరుకు ముక్కలోంచి రసం పిండుకున్న తర్వాత పట్టిపిప్పి మిగులుతుంది. అదే విధంగా ప్రేమానురాగ శూన్యహృదయ వ్యక్తి కేవలమొక అస్థి - చర్మాలగూడుగా మాత్రమే మిగిలిఉంటాడు. దేవుళ్లు దెయ్యాల పేరెత్తితేనే అరికాలిమంట తలకెక్కేది ప్రేమవతికి. 'మధుగ్రామ్'లో శ్రీకృష్ణ జన్మాష్టమి అట్టహాసంగా జరిగింది. ఆనాడు వూరంతా ఉపవాసముంది. వ్రతంఉన్నారు అమ్మలక్కలు చందాలు వేసుకుని నృత్యం ఏర్పాటు చేయాలని అందరికీ అభిలాషగా ఉంది. అందుకు సన్నాహ సమారోహాలూ ప్రారంభమయ్యాయి. కాని వూరందరి దొక దారైతే ఉలిపికట్టదొక దారట. సరిగ్గా కృష్ణుడు జన్మించిన ఘడియలో స్వగృహంలోవున్న కృష్ణ విగ్రహం తీసుకెళ్లి పొలంలో పారేసివచ్చింది భక్తురాలు ప్రేమవతి. ఆశ్చర్యం! ఏకాదశీ - ద్వాదశీ వ్రతాలు అటుగంటిపోయాయి. దేవుళ్ళ దేవర్ల పూజలు సోదెలో కూడా లేవు. ఆ ప్రేమవతి ఇప్పుడా వెనకటి ప్రేమవతియే కాదు.

ఏదోరకంగా రెండుమాసాలు ఈడ్చుకొచ్చింది సేవతి. మనస్సు కంగారు పడిపోతుండేది, తోచుబడికి సాధనాలేమీ లేవు. ఎరిగినవాళ్లుగాని, స్నేహితురాండ్రుగాని, ఎవ్వరూ లేరు. వెనక విరజన్ ఇక్కడ కొన్నాళ్లున్నప్పుడు తులసీని స్నేహం చేసుకుంది. మరి సేవతి అలాంటి కల్పుగొట్టు స్వభావురాలు కాదు. కాస్త గర్వమెక్కువ. అలాంటి తక్కువ కులస్థుల స్త్రీలతో స్నేహ - సంబంధాలు పెట్టుకోవడ మంటే

అసహ్యం. తనుపరువు - ప్రతిష్టలకు భంగకరమని భావం. ఎన్నోసార్లు వచ్చింది పాపం తులసీ కాని సరిగ్గా మాట్లాడక పోయేసరికి అసలు రాక పోకతే విరమించుకుంది.

మూడు మాసాలు గడిచాయి. ఒకరోజున ప్రొద్దెక్కే వరకూ మంచం మీదనుంచి లేవలేదు సేవతి. ఆ రాత్రి భర్త గారేవేవో మాటలు అని మనస్సంతా చీకాకు పరచాడు. నిద్రమేల్కొని కళ్లువిప్పి చూచేసరికి ఆశ్చర్యకర దృశ్య మొకటి కన్పించింది. తల్లి ప్రేమవతి తన మనుమణ్ణి ఒడిలో కూర్చోపెట్టుకుని ముద్దులాడుతోంది; ఒకసారి కళ్ళకద్దుకుంటే ఇంకోసారి రొమ్మునకు చేర్చుకుంటోంది. ఎదురుగా కుంపటి మీద హల్వా తయారవుతోంది. వేడివేడిహల్వా ఎప్పుడు తింటామా లేక అసలు ఆ పొయ్యిమీది మూకుడులోకేవెళ్లి కూర్చుందామా అన్నంత ఆరాటంతో వేలుపెట్టి చూపిస్తూ ఎగిరెగిరిపడుతున్నాడు. ఇన్నాళ్లే వాడి ముఖారవిందం అరవిం దంలా వికసించివుంది. ప్రేమవతి నీరస హృదయంలో ప్రేమానురాగాలు పునరావాసం చేసుకున్నాయిలే అని వాడి సూక్ష్మబుద్ధి బహుశ గ్రహించివుండొచ్చు మంచం మీదనే కూర్చొని ముకుళితలోచనాలతో ఇదంతాచూస్తోంది సేవతి కలగంటున్నట్టుగా. ఇంతలో 'లేవేచిట్టీ! ఎంత ప్రొద్దె క్కిందోచూచావా?" అంది ప్రేమవతి ఎంతో ముద్దుగా.

సేవతి దేహం గగుర్పొడిచింది, కళ్లు ఆనందబాష్పాలు రాల్చాయి. ఎన్నాళ్లకో ఇన్నాళ్ళ తల్లి నోటినుండి ఇలాంటి ప్రియవాక్కులువింది వెంటనేలేచింది. వెళ్ళి అమ్మను కౌగి లించుకుని విలపించసాగింది. తల్లికి దుఃఖం ఆగలా. కన్నీరు

ధారలుగట్టింది దాంతో ఎండిపోయిన చెట్టు తిరిగి చిగిర్చింది. ఉభయులూ కాస్సేపు ఏడ్చుకున్న అనంతరం "సిత్రో. ఇవ్వాళ నాయీమాటలు వింటూంటే నీ కెంతో ఆశ్చర్యంగా వుండొచ్చు. నిజం తల్లీ; నీకలావుండడంలో ఆశ్చర్యమేమీ లేదు. కాని ఒకటిమాత్రం మరచిపోకు. ఒక్క నీటిబొట్టుకూడ లేకుండ ఒట్టిపోయాయి నా నేత్రాలు. మరి అలాంటప్పుడు నాకేడ్పుఎలారాగలదు ? హృదయం బండబారి పాషాణంలా తయారయింది. మరి ప్రేమానురాగాల్ని ఎక్కడ నుంచి అరువుతీసుకు రమ్మంటావు? ఇదంతా కాలమహాత్యం. కన్నీటి బిందువులుంటే అవి కాసినీ ఆయనతో నేవెళ్ళిపోయాయి. ఇక ప్రేమానురాగాల విషయమంటావా, అవీ ఆ బిడ్డతోనే పోయాయి. అయితే మరీరోజున ఈ రెండు కన్నీటిబిందువులు ఏమూలనుంచి వూడిపడ్డాయో నాకు తెలియదు. తల్లీ! నా తప్పులొప్పులుగా భావించి నాయందు కరుణించు." అంది ప్రేమవతి.

ఇలా అంటూఅంటూనే నేత్రాలు మూసుకుపోసా గాఢ ఖాగానుపడిపోయింది సేవతి. మంచంవేసి పడుకోబెట్టి విసరసాగింది. ఆరోజు లగాయతు ప్రేమవతిస్థితిలో గొప్ప మార్పు వచ్చింది. ఎప్పుడుచూచినా ఏడుస్తూనే వుంటుంది. పిల్లవాణ్ణి విడిచి ఒక్క క్షణంకూడ ఉండలేదు. నౌకర్లతో, పరిచారికలతో మాట్లాడితే పలుకులు తేనెలొలుక తుంటాయి. తిరిగి పూర్వం సుశీల ప్రేమవతిగానే మారి పోయింది. హృదయపటం మీదినుండి ఒక తెరలాంటిదేదో లేచిపోయిందన్నట్టుగా ప్రతీతమయ్యేది. చలికాలంలో మంచు

విపరీతంగా కురిస్తే నదీనదజలాలు పేరుకుపోతాయి. అందు లోనివసించే జలచరజంతువులు ఆమంచుపొరల అడుగున అణగి పడివుంటాయి ఎక్కడి పడవలక్కడే నిలబడిపోతాయి. మందమంద ప్రవాహగమనమూ, రజతవర్ణాలతో అలరారే ఆ ప్రాణసంజీవనీ జలస్రోత స్వరూపం రవ్వంత కూడ అగు పించను ఆ మంచుపొరలచాటున కమ్మటినిద్రలో బధ్ధకంగా పడివుంటుంది. కాని గ్రీష్మఋతువులో మళ్ళీ ఆ మంచు గడ్డలన్నీ కరగిపోతాయి. రజతరంగు నదీజలం తనపైనుంచి మంచుపొరల్ని ఎత్తివేసుకుంటుంది. అణగిమణగివున్న జల జంతువులన్నీ మళ్ళీ అరుదెంచుతాయి, ఆగిపోయిన పడవల తెరచాపలు మళ్ళీ రెపరెప కొట్టుకుంటాయి తటప్రాంతంలో మనుష్యులూ పశులూ గుంపులు గుంపులుగా చేరడం ప్రారంభమవుతుంది.

కాని ప్రేమవతి ఈ దశ నిలకడగా ఎన్నోరోజులుండ లేదు. ఈ ఆత్మజ్ఞానం మృత్యుసందేశంలా ప్రతీతమయింది. ఈ చిత్త ఉద్విగ్నతయే ఆవిడ నింతవరకు జీవితమనే కారా గారంలో బంధించివుంచింది. లేకపోతే ఇలాంటి ఆపదల తుఫాను దెబ్బలు ప్రేమవతివంటి సుకోమల హృదయంగల స్త్రీ ఎన్నడూ సహించగల్గేదికాదు.

వచ్చి ఒక్కసారి అమ్మనుచూచి పోవలసిందని అందరికీ టెలిగ్రాములు పంపింది సేవతి, కాని ఒక్కడూరాలేదు. భర్తకు శెలవు దొరకలేదు. విరంజన్ జబ్బుగావుంది. రాధా చరణ్ గాలిమార్పుకోసం నైనీతాల్ వెంచేసివున్నాడు. ప్రేమ వతి ప్రాణాలన్నీ కొడుకుమీదనే ఉన్నాయి. కాని తానీ సమ

యంలో రాజాలనని ఉత్తరం వ్రాశాడు. అది చూస్తూనే దీర్ఘంగా కడసారి నిట్టూర్పువిడిచి కన్నుమూసింది. పెళ్ళి మేలొక్కనే అదృష్టం అబ్బకుండా గాఢనిద్రలో మునిగి పోయింది.

## 20

మానవ హృదయం ఒక రహస్యమయ వస్తువు. ఎదుట లక్షలు కనపడుతూన్నా ఒక్కొక్కసారి అటుకేసి కన్నెత్తిచూడ చూడదు. కాని ఒక్కొక్కప్పుడు అసిద్ధంనిండి రాగిడబ్బుల కోసం కుక్కలా ఎగబడుతుంది. ఒకప్పుడు వందలాది నిరపరాధుల హత్యాకాండ చూచి 'అయ్యో! పాపం' అని ఒక జాలిమాటన్నా పెదవులుదాటి రాదు. మరొకప్పుడు మూన్నాళ్ల శిశువునుచూచి కన్నీటిధారలు కాల్వలుగట్టేట్టుగా వలవల ఏడ్చేస్తుంది. ప్రతాప - కమలాచరణులిద్దరూ సహోదరుల్లా ఎంతో స్నేహంగా వుండేవాళ్ళు. ఐనా కమలాచరణుని ఆకస్మికమరణం చూచి ఒక సహోదరునికి కల్గవలసినంత దుఃఖం కల్గలా ప్రతాపునికి. మరణవార్త చెవినిబడగానే ఉలిక్కిపడినమాట అబద్ధంకాదు. తర్వాత కొద్దిగా విచారించినమాటా నిజమే. కాని ఒక పరమమిత్రుని మరణంపట్ల కల్గవలసినంత దుఃఖంమాత్రం కల్గలా. వ్రజరాణిని పెళ్ళికి పూర్వంనుంచే తన మనిషిలా భావిస్తూవస్తున్నాడు. ఇందులో సందేహమేమీలేదు. కాని ఈ భావం ఇంకా ఒక పరిపక్వదశకు రాలేదు. అప్పుడప్పుడు అతని ఆలోచనలు ఈ మిత్ర-సంబంధాన్ని దాటిపోతుండేవి.

స్వభావసిద్ధంగా కమలాబాబుపట్ల పెద్దగా ప్రేమ ఏమీలేదు. అతని ఆదర - సత్కారాలకూ, గౌరవ - మర్యాదలకూ కారణం వేరుగాఉంది. అలాచేయడంవల్ల ప్రజరాణికి సంతోషంగా వుంటుందని కొంతా. సుశీల మరణానికి తన్నే కారకునిగా భావించుకుని అందుకుప్రాయశ్చిత్తం ఈరూపంలోనన్నా కొంతవరకు సంభవమనే భావంతోకొంతా దానికికారణం విరజన్ కాపరానికెళ్ళి పోయింది. తర్వాత కొంతకాలంవరకు ఆవిడసంగతే దృష్టిలోకి రానివ్వనిమాట యథార్థమే, కాని ఆవిడ జబ్బు వార్త తెలియగానే బెనారస్వెళ్ళాడు. అతని దర్శనమే ఆవిడకొక సంజీవనీ మూలికలా పనిచేసింది. ఆ క్షణంనుంచే 'విరజన్ హృదయంలో తనకున్న స్థానాన్ని ఇంకా కమలాచరణ్ పొందలేదు' అని ఒక గాఢనమ్మకం కల్గింది

విరజన్పేర అత్యంత కరుణాపూర్ణ శోకపూరిత జాబొకటి వ్రాశాడు ప్రతాప్. ఇటు జాబు వ్రాస్తూనూ పోతున్నాడు, అటుఆలోచింతూనూ ఉన్నాడు. "ఈ జాబుచూస్తే ఆవిడమీ దెలాంటి ప్రభావం పడ్తుంది?" సాధారణంగా సానుభూతి - సమవేదనలు ప్రేమానురాగాల రంగును మరింత గాఢ పరుస్తుంటాయి. ఈ జాబేమన్నా పనిచేస్తుందేమో! చేస్తేచేయవచ్చు, అందులో ఆశ్చర్యమేముంది? అంతేగాక అతని ధార్మికవృత్తి కొంత వికృతరూపం దాల్చింది. తత్ఫలితంగా అతని మనస్సులో ఒక మిథ్యాభావం అంకురించింది. "ఈశ్వరుడు నా ప్రేమ బూడిదపాలు గాకుండారక్షించాడు. అందుకే కమలాచరణుని నా మార్గంలోంచి తొలగించాడు -

ఇప్పుడిక విరజన్ దగ్గర నా ప్రేమ పురస్కారం నిరాటంకంగా పొందవచ్చును. ఇది ఆకాశవాణి సందేశం. అతను పోవటమే దీనికి నిదర్శనం. సదాచార, సత్యములకు ఒక కేశమాత్రమైనా వైదొలగివున్న విషయాన్ని ఆశించడం మూర్ఖత అని ప్రతాపుకు తెలుసు. కాని సదాచారసతీత్వాలకు భంగం వాటిల్లకుండా వుండాలి. వాటి సరిహద్దుల్లోనే తన కోర్కెలు ఫలించగల్గిఉండాలి. ఆ స్థితిలో విరజన్ ఎంతోకాలం తనపట్ల నిర్దాక్షిణ్యంగా వుండజాలదని అతనికొక గుడ్డి నమ్మకం వుంది.

ఒకమాసం వరకూ ఇలాంటి ఆలోచనలతో సతమతమవుతూనే వున్నాడు ప్రతాప్. ఒకదరీ, ఒడ్డూ ఏమీదొరకడంలా. చివరికొకనాడు విరజనుని ఒంటరిగా రహస్యంగా కలుసుకోవాలనికూడ ఒక గాఢమైన అభిలాష కల్గింది. విరజన్ హృదయం ఇంకా పచ్చి పుండుగానే వుంది. తగిలిన గాయాలు ఇంకా మానుపట్టలేదు. తన ఏమాటన్నా, తన ఆచరణేదన్నా తన దుర్బుద్ధిని కని పెట్టడానికి దోహదమిచ్చిందా అంటే కొంప మునిగిపోతుంది. శాశ్వతంగా ఆవిడ దృష్టిలో పరమనీచునిగా భావించబడ్డాను. ఈ సంగతి అతనికి తెలియకపోలేదు. కాని ప్రయోజనమేమిటి? ధనరాసులు కంటికగపడుతుంటే ఓపిక పట్టలేడు దొంగ. అదేవిధంగా విరజన్ ఎదురుగా కనపడుతుంటే తన్ను నిగ్రహించుకోలేకపోతున్నాడు ప్రతాప్. మానవుని ప్రారబ్ధం చాలావరకు సమయాసమయాలపై ఆధారపడివుంటుంది. సమయం దాన్ని మంచిగానూ, చెడ్డగానూ రెండువిధాలా భావిస్తోంటుంది.

కమలాచరణ్ జీవించి వున్నంతవరకూ ఇంతగా వెర్రితలలు వేయటానికి సాహసంకల్గలా ప్రతాపుని మనస్సుకు. అతని మృత్యువే ఇతనికీలాంటి అవకాశం కల్గించినట్లుగా వుంది. ఈ స్వార్థ పరత్వాహంకారం చివరకెంతవరకు పోయిందంటే విరజన్ తన్ను స్వయంగా స్మరించుతున్న దన్నట్లుగా కన్పించసాగింది. తన వ్యాకులతనుబట్టి ఆవిడవ్యాకులతను అంచనా వేస్తున్నాడు. లేదా వూహిస్తున్నాడు. చివరకు బెనారస్ వెళ్ళాలని దృఢంగా నిశ్చయించుకున్నాడు.

రాత్రి రెండు గంటలవేళ. భయంకర నీరవ - నిశ్శబ్ద వాతావరణం. పట్నం పైని గగనమండలమంతా మేఘ సమూహాను నెక్కి దుప్పటి కప్పివేసింది నిద్రాదేవి. అప్పుడప్పుడు వృక్షాల గలగల ధ్వని వినవస్తోంది. ఇళ్ళపైనా, చెట్లపైనా ఒక నల్లటి దుప్పటిలా అంటుకొని వుంది పొగ. ఆ పొగ-నలుపులో మేఘగర్భిత నక్షత్రాల్లా కన్పించుతున్నాయి రోడ్లమీద దీపాలు. బండీదిగాడు ప్రతాప్. గుండె క్రిందికీమీదికీ వూగిపోతోంది. కాళ్లు తడబడిపోతున్నాయి. పాపభీతి అనుభవం కావడం జీవితంలో ఇదే మొదటిసారి. కాని విచిత్రమేమంటే ఈ మానసికస్థితి క్షణభంగురం. కడకది ఈ దుర్గమపథం దాటి ముందుకు సాగిపోతుంది. ఎన్నడూ మద్యపానంచేయని వ్యక్తికి దానివాసనంటేనే గిట్టదు. అసహ్యమేస్తుంది. త్రాగిన మొదటిరోజున గంటల తరబడి నోరంతా చేదు చేదుగా, కంపు కంపుగా వున్నట్లు అనుభవమవుతుంది. ఇలాంటి కటికకషాయం వంటి విషపదార్థం అంటే ఇంతగా ప్రాణాలెందుకు తీసుకుంటూ ఉంటారోగదా అని ఆశ్చర్యం కల్గుతుంది. కాని అలవాటయిన

కొద్ది రోజులకే ఆ అసహ్యమంతా అతనికి చెప్పకుండానే ఎక్కడికో పోతుంది. ఆభావాలూ మటుమాయమై పోతాయి. చివరకు అంతనూ ఎర్రనీళ్ళకు దాసుడైపోతాడు. దాని పట్ల ఆసక్తి — లేదా జిహ్వాచాపల్యం మద్యంకంటె ఎన్నో రెట్లు అధిక భయంకరంగా వుంటుంది.

కటికచీకట్లో అడుగులో అడుగు వేసుకుంటూ పోతున్నాడు ప్రతాప్. పాదాలు వడిగా ముందుకు సాగడంలేదు. ఎంచేతంటే వాటికి సంకెళ్ళు బిగించింది పాపం ఇలాంటి సమయాల్లో భూమిమీద కాలానకుండా పనులు తీయించే హుషారు లక్షణం ముఖంమీద కంచుకాగడాపెట్టి వెదికినా కన్పించడంలా. నడుస్తూ నడుస్తూనే హఠాత్తుగా ఆగిపోతాడు. మళ్లీ ఏదో ఆలోచించుకుని కాలు ముందుకు వేస్తాడు. భగవంతుం జుట్టుపట్టుకుని పాపమనే గోతిలోకెలా, ఈడ్చుకుపోతున్నాడో గదా!

తలంతా ధన ధన మని బద్దలై పోతోంది, భయంతో పిక్క లుయ్యాలలూగుతున్నాయి. ఎడతెగని ఆలోచనలతో ఎలాగైతే ఒక్క గంటసేపటికి శ్యామసుందరణ్ గారి మేడవద్దకు చేరాడు. ఈనాడు గాఢాంధకారంలో ఈ భవంతి భీతిగొల్పుతోంది పాపం అనే పిశాచం ఎదురుగా నిలబడి వున్నదన్నట్టుగా. తిరిగి వచ్చినదారిన వెళ్ళిపోవడం మంచిదా లేక లోపలి కెళ్ళడం మంచిదా అని ఒక అరగంట సేపు ఆలోచిస్తూ నిల్చొన్నాడు. "ఖర్మం నాలుక ఎప్పుడన్నా చూచాడా అంటే కొంప మునిగిపోయింది. నన్నీ రాత్రి వేళచూచి ఏమనుకుంటుందో మనస్సులో నిరంజన్? నాయీ

ప్రవర్తన ఆవిడదృష్టిలో శాశ్వతంగా గౌరవ - మర్యాదలు లేకుండా చేయదుకదా ?" కాని ఆ పాప - పిశాచం ముందు ఈ సందేహాల ఆటలేమీ సాగడంలేదు. ఇంద్రియాలకు దాసుడుగా వున్నప్పుడు మనుష్యుడికి మంచి - చెడ్డల జ్ఞానం గాడిదలకాయటాని కెళ్ళుతుంటుంది. ధైర్యంచెప్పాడు మనస్సుకు. గుండె నిబ్బరం చేసుకున్నాడు. ఇలాంటి పిరికి తనం చూచి తన్ను 'ఛీ! ఛీ!' అని దూషించుకున్నాడు. ఆ పిమ్మట ఇంటివెనక్కి వెళ్లాడు. తోటగోడ దూకి తోటలో ప్రవేశించాడు. తోటలోంచి ఇంట్లో కెళ్ళటానికి ఒక చిన్న వాకిలి ఉంది. అదృష్టవశాత్తు అది ఈ సమయంలో తెరచి వుంది. దీన్నొక శుభశకునంలా భావించుకొన్నాడు. కాని నిజంగా అది నరక - ద్వారం. లోని కెళ్తుంటే కాళ్ళు గజగజ వణకిపోతున్నాయి. హృదయగతి వేగం తన స్వాభావికగతికి ఎన్నోరెట్లు మించిపోయింది. హృదయం బ్రద్దలు చేసుకుని ఎగిరిపోతుందా అన్నట్టుగావుంది. ఉక్కిరిబిక్కిరై పోతున్నాడు. ధర్మం తనశక్తి అంతా ధారపోసింది కాని ప్రచండ మనో వేగాన్ని ఆపలేకపోయింది. గుమ్మందాటి లోపలికడుగు పెట్టాడు. దొడ్లో తులసీ మొక్క అరుగు ఒకటివుంది. దాని వద్ద దొంగలా నిలబడి ఆలోచించ సాగాడు. "విరజనని కలుసుకునే ఉపాయమేమిటి? తలుపులన్నీ మూసివున్నాయ్. అయితే ఆవిడకూడా ఇక్కడనుంచి వెళ్లిపోయిందా ఏమిటీ ఖర్మం ?" హఠాత్తుగా ఒక తలుపు సందులోంచి మిణుకు మిణుకుమని దీపంకాంతి కాస్త కంటికగపడింది. ఆ వెల్తు

రాస్తున్నప్పుడు వెళ్లాడు చడీచప్పుడు కాకుండా. అక్కడ నిల్చొని ఆ [illegible]దృశ్యాన్ని తిలకిస్తున్నాడు.

విరజన్ ఒక తెల్లచీరె కట్టింది. జుట్టంతా విరబోసు కొనివుంది. చేతిలో కలంవుంది. నేలమీద ఆసీనురాలైవుంది. గోడకేసి పదేపదే ఏదో చూస్తుంది. మళ్లీ తలవంచుకొని ఏదో రాస్తుంది. ఎవ్వరైనా కవిసార్వభౌముడు భావసాగరంలోంచి రత్నాలు పైకి తీస్తున్నట్టుగా. ఒక్కొక్కసారి దంతాలమధ్య కలం పెట్టుకుని కూర్చుంటుంది. కాస్సేపేదో ఆలోచిస్తుంది. మళ్ళీ కలంఎత్తి రాస్తుంది. తర్వాత మళ్ళీ కాస్సేపు గోడకేసి దృష్టి నిగిడ్చి చూస్తుంది, ఈ దృశ్యమంతా ఎంతోసేపు చూచాడు ఊపిరిబిగియపట్టి ప్రతాప్. మనస్సు మాటిమాటికీ ఎదురుదెబ్బకొడుతోంది. కాని ఆక్రియ ధర్మానికి అంతిమకోట. ఈసారి ధర్మం - సత్యం - పరాజయం చెందట మంటే అర్థం హృద్ధామంలో పిశాచం ప్రవేశించి తిష్టవేసు కోవడమన్నమాట. ఆ పాపపంకిల గుండంలో పడకుండా కాపాడింది నిస్సారధర్మం అందులో గనక పడిపోయివున్నట్లయితే మళ్ళీ చచ్చేదాకా ఒడ్డునపడే అదృష్టం లభించేది కాదు. కాదు, కాదు. ఆ పాపపంకిల గుండంలో పడకుండ రక్షించింది ధర్మం కాదు, లజ్జాదుష్పరిణామాలభీతి. ఒక్కొక్కప్పుడు మన సద్భావ సత్ప్రవర్తనలు పరాజితమై పోతుంటాయి. అప్పుడు లజ్జా - దుష్పరిణామాలభీతియే కర్తవ్యపథంనుండి వైదొలగి పోకుండా అడ్డుకుంటూవుంటుంది. విరజన్ దేహం పూర్తిగా పాలిపోయింది. కాని హృదయపవిత్రత, భావోచ్ఛ్రితలను వ్యక్తపరిచే తేజఃపుంజం పాలిపోలేదు, ముఖమండలంలోని

ఉజ్వలత, దృష్టిలోని పవిత్రతలో ఒక రకమైన అగ్ని ప్రజ్వరిల్లుతోంది. ఆ జ్వాలలే ప్రతాపుని దుశ్చేష్టల్ని క్షణమాత్రంలో భస్మీభూతం చేసిపారేశాయి. జ్ఞానోదయమయింది. తన ఆత్మికపతనం పట్ల ఎంతగా సిగ్గుపడ్డాడంటే భరించలేక అక్కడే పరితపించసాగాడు.

అతని మనఃస్థలిలో ఇంద్రియము లంకురింపచేసిన నికృష్ట వికారాలన్నిటిని చీకటిని వెలుగు పారద్రోలినట్టుగా పారద్రోలింది ఈ దృశ్యం. విరజన్ కాళ్ళపైబడి తన అపరాధం క్షమించమని వేడుకోవాలనిపించింది. ఒక మహాత్ముని సన్నిధి కెళ్ళినపుడు సహజంగా మన మనోదశ ఎలావుంటుందో అలాగే ప్రతాపుని స్థితీవుంది. స్వతహాగా ప్రాయశ్చిత్త భావాంకురాలు ఉద్భవించాయి. వచ్చినదారినే వెనక్కి తిరిగాడు. వాయువేగంతో వాటికలో కొచ్చాడు. ఒక్క ఎగురెగిరి ప్రహరీగోడదూకి అవతలపడ్డాడు. ఎవ్వడో వెంట తరుముకొస్తున్నట్టుగా.

అరుణోదయం కాబోతోంది. నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి. బర్రుబర్రుమని తిరుగలినాదం చెవుల్లో కొచ్చి గింగురుమంటోంది. కాళ్లుపిసుక్కుంటున్నాడు ప్రతాప్. వచ్చేపోయే వాళ్ళ దృష్టిపడకుండా జాగ్రత్తలు తీసుకుంటున్నాడు. నెమ్మదిగా గంగానదీ ముఖంగా సాగిపోతున్నాడు. అప్రయత్నంగా చెయ్యి నెత్తిమీది కెళ్లింది. తడుముకుంటే టోపీ లేదు. జేబు చూచుకున్నాడు. గడియారంలేదు. గుండె గుభేలుమంది. "అమ్మయ్యో!" అని హృదయవిదీర్ణ కరుణాపూర్ణధ్వని ఒకటి పెదవులుదాటి బైటకొచ్చింది.

క్షణమాత్రంలోనే మానవుని జీవితమంతా తల్లక్రిందులు తారుమారు చేసే ఘటనలు అప్పుడప్పుడు ఘటిల్లుతుంటాయి. ఒకొక్కప్పుడు తల్లిదండ్రులు ఒక్క చురచురచూపు కుమారుని యశోశిఖరాగ్రంపైకి తీసుకెళ్ళి ఆశీనుణ్ణిచేసి పారేస్తుంది. మరొకప్పుడు భర్త జ్ఞానచక్షు కవాటాలను తెరచివేస్తుంది భార్య నీతివాక్యమొకటే తన సహచరుల దృష్టిలో గౌరవ-మర్యాదలు కోల్పోయి జగత్తుకు భారస్వరూపంగా జీవించటానికి ఎన్నడూ అంగీకరించలేదు స్వాభిమాన శీలవ్యక్తి. మానవజీవితంలో ఇలాంటి శుభఘడియలు ఈశ్వర వరప్రసాదములనే చెప్పవచ్చు. ప్రతాపుని జీవితంలోకూడ ఇలాంటి శుభముహూర్తమే ఆసన్నమైంది. సంకీర్ణ సందుగొందుల్లో గుండా గంగానది ఒడ్డుచేరి కూర్చున్న సమయమే ఆ శుభ సమయం. శోకలజ్జా విహ్వలుడై అశ్రుధారలు అవిశ్రాంతంగా ప్రవహింపచేస్తున్న సమయమే ఆ శుభముహూర్త ఘడియలు. అతన్నెంత అధోగతికి, ఎటువంటి అధఃపతనానికి తీసుకెళ్లాలో అంతవరకు తీసుకుపోవడంలో మనోవికారచేష్టలు నిర్దాక్షిణ్యంగా పనిచేశాయి. కాని ఈ నిర్దాక్షిణ్యమే అతనిపాలిట కృపాల సద్గురువు హెచ్చరికగా రుజువయింది సమయాసమయాలను బట్టి విషమూ అమృతంలా పనిచేస్తుందన్న విషయం జగద్విదితమే గదా.

మందంగా రాజుతున్న నిప్పును భగ్గుభగ్గుమని మంటలెగయునట్లు చేయటంలో సహాయపడుతుంటాయి గాలి విసుర్లు. అదేవిధంగా హృదయాంతరాళంలో [illegible] పడిఉన్న ఉత్సాహ [illegible] చాల [illegible] బాహాటంగా ప్రకటిస్తా [illegible]

అవసరం. స్వదుఃఖానుభవం. అన్యులకష్టాల అవలోకనం వైరాగ్యానికి సత్సంగం, అధ్యయనం, మననం మొదలగువాటి కూడ సంభవంకాని వైరాగ్యానికి – తరచు దారితీస్తుంటాయి. నిస్వార్థ పవిత్రజీవితం గడపాలన్న ఆ కాంక్ష బాల్యంనుండీ వుంది ప్రతాపుని మనస్సులో, సంవత్సరాలకు సంవత్సరాలు గడచినా పూర్తికాని కార్యాన్ని ఈ మనోవికారం ఎదురుదెబ్బ ఒక్కక్షణంలో పూర్తిచేసి పారేసింది. సామాన్య పరిస్థితుల్లో దేశసేవ ప్రధాన జీవిత లక్ష్యంగా వుండేదికాదు. కాని ఈ ఎదురుదెబ్బ – ఈ హెచ్చరిక దేశసేవనే జీవిత పరమావధిగా చేసింది తల్లిహృదయాభిలాష ఫలించే సామగ్రివిశేషం ప్రాదుర్భూతమయింది. ఈ ఘటనలగర్భంలో ఏదైనా అజ్ఞాత ప్రేరకశక్తి దాగివుందో ఏమో? చెప్పగల ప్రతిభాశాలి ఎవ్వడు?

## 21

అటుముంషీసంజీవనలాల్ తీర్థయాత్రలకెళ్ళిపోయాడు. మరి ప్రతాపేమో ప్రయాగ చదువుకోటానికెళ్ళాడు. ఇటు సువామ జీవిత దృక్పథంలో బ్రహ్మాండమైన మార్పువచ్చింది. కంట్రాక్టు బిజినెస్‌లో దిగింది కాదు అదే జీవితం, జీవితమే అదన్నట్టుగా అందులో మునిగిపోయింది. కూర్చొని తెల్లవార్లూ ఇటుకలు, రాళ్లు సున్నం, అడుసుగోడల్లోనే సతమతమవుతుంటుంది. దమ్మిడీలతోసహా జమా–ఖర్చులు జాగ్రత్తగా పరిశీలిస్తుంది. అప్పుడప్పుడు స్వయంగా దగ్గరనిల్చొని కూలీలచే పని చేయిస్తుంది. వాళ్ళుచేసినపనిని జాగ్రత్తగా తనిఖీచేస్తుంది. ఈ కార్యకలా

పాల్లో పూర్తిగా తల్లీనమై పోయింది. వీటిముందు దానధర్మాలూ, వ్రతనియమాలూ, పూజా పునస్కారాలూ అన్నీ అడుగున పడిపోయాయి. వాటిపట్ల శ్రద్ధా - భక్తులూ అడుగంటి పోయాయి. ఆదాయం మాత్రం మూడుపువ్వులూ ఆరుకాయల్లా పెరుగుతోంది. కాని వ్యయం మాత్రం ఎక్కడిగొంగళి అక్కడే వున్నదన్నట్టుగా వుంది. ఒక్క రాగిదమ్మిడీ కూడ జారిపోనీయదు. దీని కంతకూ మూలకారణం తన కొడుకు సంపన్నుడు కావాలనీ జీవితమంతా హాయిగా జీవించాలనీ అన్న వుద్దేశ్యమే.

ప్రతిభాసంపన్నుడైన పుత్రుడు కలిగినందుకు సువామకేతో గర్వంగా వుంది. అతని జీవితవిధానంచూచి స్వపుత్రేషణావరం ఫలించి తీరుకుండని దృఢవిశ్వాసం ఏర్పడింది. కాలేజీ ప్రొఫెసర్లనూ, ప్రిన్సిపాలునూ అప్పుడప్పుడు కలుసుకుని ప్రతాపచంద్రుని విషయం రహస్యంగా తెలుసుకుంటూ వుండేది. వారిచ్చే సలహాలూ, హెచ్చరికలూ జాగ్రత్తగా అవగాహన చేసుకోటానికి ప్రయత్నం చేస్తూవుండేది. అపనొక శ్రుతి మధుర కథతో సమానంగా వుండేది. అకస్మాత్తుగా ప్రతాప్ ప్రయాగనుండి అంతర్ధాన మైపోయినట్టుగా వైరు వచ్చింది. ఇలాంటి మానసిక దశలో ఇలాంటి వార్త రావడం పిడుగుతో సమానం. గుండెగుభేలుమంది. ఒక శీతల నిట్టూర్పు విడిచి నెత్తిపట్టుకు చతికిల పడింది. మూడోరోజు వచ్చేసరికి పుత్రుని పుస్తకాలూ, బట్టలూ, తదితర సామాన్లూ కూడ వచ్చిచేరాయి- గోరుచుట్టుపై రోకటిపోటులా.

ప్రేమవతి మరణవార్త చేరింది. వెంటనే ప్రాణనాథ్ పాట్నా నుండీ, రాధాచరణ్ నైనీతాల్ నుండి పయనమయ్యారు. ప్రాణముండగా వచ్చి వున్నట్లయితే ఆఖరి చూపులంది వుండేవి. కాని చనిపోయిన తర్వాత రావడంతో ఆఖరుకు మృతకళేబరమన్నా చూచే అదృష్టం లేకుండాపోయింది. దహనక్రియలు గొప్ప అట్టహాసంగా జరుపబడ్డాయి ఆ తర్వాత తిరిగి మురాదాబాద్ వెళ్ళిపోయాడు రాధాచరణ్. పాట్నా వెళ్ళే ఆలోచనలో వున్నాడు ప్రాణనాథ్. కాని తీరా ఇక్కడిదాకా వచ్చి విరజనుని చూడకుండా వెళ్ళిపోవడం బాగుండదు. లేకపోతే పాపం ఎంతో బాధపడుతుంది. దిక్కూ మొక్కూ లేని అనాథపక్షిగా భావించి విడిచి వదలి పెట్టారుగదా "అని తలంచి కుమిలిపోతుంది." అనే వాదనలతో ప్రయాణానికడ్డం వచ్చింది సేవతి.

ఈ శిథిల గృహంలోకి సేవతిశుభాగమనం పుష్పాల్లో సుగంధగమనంలా కనపడింది. ఒకవారం రోజులపాటు మళ్ళీ వెనకటి సుదినాలు తిరిగివచ్చాయా అన్నట్టుగా ప్రతీత మయింది. విరజన్ ప్రసన్నత కంతులేదు. కాని సంతాపానికీ కొరతలేదు. సేవతి పుత్రుని చంకనెత్తుకుని ఎంతగానో ముద్దులాడింది మాధవి. ఇట్లో ముందు భాగంలోని హాలు ఎన్నాళ్ళనుంచో పాడుపడివుంది. ఇప్పుడుదానికీకాస్త అదృష్టం పట్టింది. పాడుపడిన గృహమందిరానికి కాస్త దీపారాధన భాగ్యమబ్బింది.

ప్రేమవతి 'మధుగ్రామ్' వెళ్ళినప్పటినుంచీ ఆగృహంలో విరజన్ ఒక్కతే వుంటోంది. ఔను, మాధవీ ఇక్కడే

వుండిపోయింది. ఇంతదనుక ఎక్కడో మరుగుపడివున్న కళా ఖండాలను బైటికి లాక్కొచ్చాయి. హృదయావేదన మానసిక దుఃఖావేశాలు. కావ్యరచనాభ్యాసం ఆరంభమయింది. రచన యథార్థభావనల ప్రతిబింబం. ఆ భావనలు సుఖదుఃఖాల్లోదేనికైనా సంబంధించి వుండొచ్చు. సుఖదుఃఖాలు స్వానుభవజన్యాలు. ప్రస్తుతం తెల్లవార్లూ కూర్చుని స్వగత భావముత్యాలతో స్వభాషలో హారాలు గుచ్చుతూవుంటోంది విరజన్. ప్రతిపదమూ కరుణారసంతో, వైరాగ్యభావంతో నిండివుంటుంది మిత్రబృందం భూరిప్రశంసలూ, కావ్యమర్మజ్ఞుల ధన్యవాదాలూ తరచు రచయితల్లో ఉత్సాహాన్ని రేకెత్తించుతుంటాయి. కాని విరజన్ అలాంటివాళ్ళలో గణనీయం కాదు. స్వీయదుఃఖగాథను స్వీయమనస్సుకే వినిపించుకుంటూ వుంటుంది.

సేవతివచ్చి అప్పుడే రెండుమూడు రోజులైపోయాయి. ఒకరోజున "ఏమిటి వదినా! ఎప్పుడుచూచినా ఏదో పరధ్యాసలో వున్నట్లుగా కన్పడుతుంటావు విచారంగ కూడ వున్నట్టుగా కనిపించుతోంటోంది. ఎందుకలా వుంటున్నావో నాకు చెప్పవూ?" అని అడిగింది సేవతి. ఈ మాటలు విని సిగ్గుపడింది విరజన్. "ఏమీలేదు, ఊరికేనే మనస్సు అలావుంటోంది." అని ఏదో సర్ది చెప్ప ప్రయత్నించింది. కాని సేవతి "నేనుఒప్పునోను" అంది. చంగునవెళ్ళి ఆవిడపెట్టెలోంచి కావ్యరత్నాలు వున్న పుస్తకం పట్టుకొచ్చింది. గత్యంతరం లేక తన నూతనగీతాలు చదివి వినిపించసాగింది. నోట్లోనుంచి మొదటిచరణం వెలువడడంతోనే సేవతి దేహం

గగుర్పొడిచింది. పద్యం పూర్తయ్యేవరకూ మైమరచికూర్చుంది. ప్రాణనాథుని సంగీతం ఆమెలో కావ్య-రసాస్వాదన బీజాలు నాటింది. వింటూవుంటే మాటిమాటికి కన్నీటి బిందువులుచింది చెక్కిళ్లపై పడుతుండేవి. విరజన్ ఆగిపోయినప్పుడు ఒక రక మైన తన్మయ వాతావరణం వ్యాపించివుండేది. ఇంకేదో మనో హరరాగం మిగిలిపోయి వున్నదన్నట్లుగా. వదినగారి మెడలో చెయ్యివేసి కౌగిలించుకుంది సేవతి. తర్వాత ఆమె నక్కడే వదలి అంగలార్చుకుంటూ భర్త-ప్రాణనాథుని వద్దకెళ్లి వ్రాలింది. ఏదైనా కొత్త ఆటవస్తువు పొందినపుడు పిల్లవాడు సంతోషం పట్టలేక దాన్ని చూపించాలని తన స్నేహితుల వద్దకు పరుగెత్తుకు పోయినట్లుగా. ఆ సమయంలో శలవు దరఖాస్తు వ్రాస్తున్నాడు ప్రాణనాథ్. "మా అమ్మకు సీరి యస్‌గా వుంది. అందువల్ల వెంటనేవచ్చి హాజరు కాలేక పోయాను. ఇంకో వారంరోజులు శెలవు గ్రాంటు చేస్తారని ఆశించుతున్నా." సేవతిని చూచి దరఖాస్తు కాగితం దాచేస్తూ పైకి ముసిముసిగా నవ్వాడు. మానవు డెలాంటి ధూర్త శిఖా మణి! తనకుతన్నే మోసగించడంలోకూడ వెను కంజ వేయడు.

సేపతి:-ఇదిగో! కాస్త లోపలికిరండి. విరజన్ వదిన వ్రాసిన గీతాలు వినిపించుతా. పరమానంద భరితులైపోతారు.

ప్రాణ:-సరే మంచిదేగా. ఓహో ఆపిడగారి కిప్పుడు కావ్య శవనాభిలాష పుట్టిందా ఏమిటి? ఔనులే, ఆవిడ వదినగారూ 'తుమ్‌తో శ్యామ్ బడే బేఖబర్ హోఁ' అని కోకిల స్వరంతో పాడుతుండే వారుగా!

సేవతి:- తర్వాత పల్కరించుకోవచ్చు. గాని ముందు కాస్త వచ్చి వినిపోమరూ, ఆమె కవనం చూస్తే నా కమితాశ్చర్యం కల్గుతోంది;
ప్రాణ :- పరేపద, ఉత్తరమొకటి వ్రాసి వచ్చేస్తున్నా.
సేవతి :- ఇదిగో అందుకే మిమ్మల్ని చూస్తే ఒళ్లు మండి. పోర్యోది వచ్చానా అంటె ఉత్తరం-గిత్తరం చించి అవతల పారేస్తా.

ప్రాణనాథుని ఎలాగైతే బలవంతాన లాక్కొచ్చి కూర్చోపెట్టింది సేవతి. "విరజన్ ఏదో వ్రాసివుంటుంది అదే వినిపించాలని ఇంత ఉబలాట పడుతుంటుందిలే. అని అనుకుని బయలుదేరాడు ప్రాణనాథ్. కాని లోపలికొచ్చి కూర్చున్నాడు తన భావగర్భిత రచన "ప్రేమోన్మాదినీ" చదివి వినిపించ సాగింది విరజన్. సంగీత విశారదుని కళ్లు తెరచుకున్నాయి. గీతమేం గీతం! హృదయ సంతాపమొక జల ప్రవాహం; ప్రేమ-రహస్యమొక గాథ. ఇటు చెవులు నిక్కపొడుచుకొని ఆలకిస్తున్నాడు; అటు తన్మయత్వంతో క్రిందికీ మీదికీ ఊయ్యాలలూగిపోతోంది దేహమంతా. ఒక్కొక్క పదప్రయోగం, ఒక్కొక్క భావగర్భిత వాక్యంపట్ల పరమానంద భరితుడై పోతున్నాడు. ఇదివరకెందరో కవులరచనలు, కవీశ్వరుల కావ్యాలూ, కవిసార్వభౌముల మహాకావ్యాలూ చదివేడు. కాని వాటన్నిటిలోనూ ఈ ఉత్కృష్టభావం, ఈ నూతనపోకడ, ఈ భావగాంభీర్యం ఎక్కడా కన్పించలేదు. సూర్యోదయానికి పూర్వం మలయమారుతం చల్లగా, హాయిగా వీస్తూపోతుంది. మొగ్గలు వికసిస్తాయి. కుసుమా

వళి సుగంధ - సువాసనలు వెదజల్లుతుంది. ఆకాశమండల మంతా అరుణ - రాగచ్ఛాయలతో పరివ్యాప్తమైపోతుంది. అలాంటి అరుణోదయవేళను వర్ణిస్తుంది విరజన్ తన 'ప్రేమోన్మాదినీ' గీతంలో ప్రతి పదమూ పద్యః వికసిత కుసుమ శోభతో, హిమబిందువుల శీతలత్వంతో నిండివుంది. దానికి విరజన్ కోకిల కంఠం తోడుగావడంతో పువ్వునకు తావు అబ్బినట్టుగా వుంది. ఈ గీతాల సాధనసంపత్తితోనే తన హృదయాన్ని దీపంలా దేదీప్యపరచుకుంది విరజన్. పరిహాస దృష్టితో అరుదెంచాడు ప్రాణనాథ్ మహాశయుడు. కాని లేచి వెళ్ళబోయేటప్పుడు నిర్జీవంలా, నిర్గతహృదయుడులా వున్నట్టుగా కన్పడ్డాడు. ఒకరోజు "నీ రచనలు ప్రచురించబడితే జనాదరణ పొందుతాయి" అన్నాడు వ్రజరాణితో.

"వీటిని మెచ్చుకొనేవాడు కూడ వున్నాడని నాకు నమ్మకం లేదు." అని జవాబిచ్చింది తలవంచుకుని విరజన్.

ప్రాణ :- అలాంటిదేమీకాదు. హృదయాంతరాళంలో అణుమాత్రమైనా సరే, రసికత్వమున్న ప్రతివ్యక్తీ తప్పక ఆదరించి తీర్తాడు. పుష్పసౌరభం ఆఘ్రాణించి ఆనంద పరవశులయ్యే వ్యక్తులకొరత గనక నిజంగా లేకుండా వున్నట్టయితే పక్షుల కలకలారావం, చంద్రుని మనోరమ ఉజ్వలశోభ చూచి ముగ్ధులయ్యే జనుల అభావం లేకుండా వున్నట్లయితే వాళ్లంతా నీ రచనలకు తమ హృదయాల్లో తప్పక స్థానమిచ్చి తీర్తారు.

తన కావ్యరచన విషయంలో ఇతరులు ప్రశంసలవర్షం కురిపించినపుడు, తన రచన ప్రచురించబడ నున్నప్పుడు

ప్రతి కవిహృదయంలో ఒక రకమైన చక్కిలిగింత కల్గుతుం టోంది. విరజన్ హృదయంలో కూడ ప్రాణనాథుని వాక్యాలు వినడంతో అలాంటిదే కల్గింది. పైకి 'ఎందుకులెండి, వద్దు లెండి, అని అన్నమాట వాస్తవమే. కాని 'ఆ వద్దు కద్దు'ల తీరు చూస్తే 'సరేలెండి' అన్నదాంతో సరి సమానంగా వుంది. ఆరోజుల్లో 'కమలా' అనే మంచి మాసపత్రిక ఒకటి వెలువడుతోంది ప్రయాగనుండి ఆ ప్రేమోన్మాదినీ అనే గీతం ఆ పత్రికకు పంపించాడు ప్రాణనాథుడు. దాని సంపాదకుడొక కావ్య - రసిక మహానుభావుడు. అది పంపినందుకు హృదయపూర్వకాభివందనాలు తెలియచేశాడు. పత్రికలో పచురించ బడగానే సాహిత్య - జగత్తులో గొప్ప తుఫాను చెలరేగింది. ప్రథమ రచనతోనే ఇంత ప్రసిద్ధికెక్కిన వారు బహుశ వుండరు. ఆద్యాంతం చదివేవాళ్లు పాఠకులు. ఆశ్చర్యచకితులై ఒకరి ముఖం ఒకరు చూచుకునేవాళ్ళు. కావ్య-మర్మజ్ఞుల్లో ఆ రచనగురించి అనేక వారాలవరకు ఎడ తెగని చర్చలు జరుగుతూనే వున్నాయి. కావ్యరచనా జగత్తులో నూతనంగా కాలిడిన రచయిత రచన అని చెప్పితే ఎవ్వడికీ మ్రింగుడుపడేదికాదు.

తదనంతరం ప్రతినెలా 'కమలా' పుటలు విరజన్ రచనలతో శోభిల్లసాగాయి. ప్రజాభిప్రాయం 'భారతి మహిళ' ను కవిసార్వభౌముల స్థానంలో కూర్చోబెట్టింది. 'భారతమహిళ' అనే నామం ప్రతిపిల్లవాడినోటా వినవస్తూ డేవి. 'భారతమహిళ' గారి రచనలు అభిలషించని దిన పత్రికలుగానీ వార - మాసపత్రికలుగానీ ఏమీలేవు. పత్రిక

తెరవగానే అన్నిటికంటె ముందు పాఠకుని నేత్రాలు ' భారత మహిళ ' రచనలకోసం వెతుక్కుంటూండేవి. ఔను, ఆవిడ దివ్యశక్తులు ఇప్పుడెవ్వర్నీ ఆశ్చర్యచకితుల్ని చేయటంలేదు. స్వయంగా ఆవిడ కావ్య-రచన ఆదర్శాన్ని ఉన్నత స్థానం లోకి తీసుకెళ్ళి కూర్చో బెట్టింది.

మూడేళ్ళవరకూ ' భారతమహిళ ' ఎవ్వరో ఎవ్వడికీ తెలియదు. తర్వాత ప్రాణనాథుడికే జీర్ణంకాలా. విరజన్ అంటే మంచి శ్రద్ధా - భక్తులు కల్గాయి. ఆమె జీవితచరిత్ర వ్రాయాలని అభిలాషకల్గింది. కొన్ని మాసాలనుండీ ఆ పిచ్చిలోనే పడి కొట్టుకుంటున్నాడు. నెమ్మదినెమ్మదిగా సేవతీద్వారా ఆవిడ జీవిత వృత్తాంతమంతా క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. "భారతమహిళ" అనే శీర్షికతో గొప్ప వ్యాసమొకటి వ్రాసి పత్రికల కంపించాడు. ఇంతకు పూర్వమెన్నడూ ఎలాంటి వ్యాసమూ వ్రాసినపాపాన పోలేదు ప్రాణనాథుడు. కాని శ్రద్ధా - భక్తులు అనుభవం లేని కొరతను పూర్తిచేశాయి. వ్యాసం చదువ ముచ్చటగా, విమర్శాత్మకంగా భావపూర్ణం గావుంది.

వ్యాసం ప్రచురించబడింది. వెంటనే నలుదిశలనుండి గౌరవ - పురస్కారాల వృష్టి కురియసాగింది. రాధాచరణ్ స్వయంగా ఆవిడ దర్శనార్థమే మురాదాబాద్‌నుండి పరిగెట్టుకువచ్చాడు. కమల, ఉమాదేవి చంద్రకుమారి మొదలైన వాళ్ళెందరో ఇంతవరకు విరజనుని మరచిపోయిన పాత స్నేహితురాండ్రు నిత్యం ఆవిడ దర్శనార్థం రాసాగరు. ఆత్మాభిమాన కారణంగా గొప్పగొప్ప ఉద్యోగస్థుల ఎదుటసైతం

తలవాల్చుని గౌరవనీయ పురుషులెందరో ఆవిడ దర్శనార్థం అరుదెంచుతుండేవాళ్ళు. చంద్రా స్వయంగా రాలేకపోయింది. కాని జాబుల్రాస్తూ "నీ చరణకమలములపై మస్తకమిడి కంటలతడబడి కన్నీరు కార్చాలని అభిలాషగా వుంటూ వుంటుంది" అని వ్రాసింది.

## 22

నిత్యం తగు జాగ్రత్తలతో పెంచబడుతూ, శోభాయమానంగా వుంచబడే ఉద్యానవాటికల్లో సైతం ఎన్నడూ లభించని సుగంధ - సువాసనలూ, రంగు-రూపాలూ అప్పుడప్పుడు వన - పుష్పాల్లో లభిస్తుంటాయి. నిజంగా మాధవి నిరక్షరకుక్షి, నిర్భాగ్యురాలున్నూ. కాని ఒక నారీమణిలో వుండవలసిన సమస్తసద్గుణ- సల్లక్షణాలూ ఆమెలో ఉన్నాయి. అందులో మాత్రం చిన్నచూపు చూడలేదు విధాత. నీతినియమాలూ, బాగోగులూ చక్కగా అవగాహన చేసుకుని ఆచరణలో పెట్టే శక్తివుంది. విరజన్ కాపరానికొచ్చిన కొత్తలోనే ఉభయులకూ పరిచయం ఏర్పడింది. తర్వాత క్రమంగా విరజన్ పట్ల మాధవి హృదయస్థలిలో అపార ప్రేమానురాగాల బీజాలు మొలకలెత్త ప్రారంభించాయి. వ్రజరాణి నొక దేవతా స్వరూపిణిగా భావించినా భావిస్తుండొచ్చు. విరజనని ఎన్నడూ ఎదిరించిగానీ, ఆవిడమాటకు విరుద్ధంగా నడచిగానీ ఎరుగదు. విరజనూ అలాంటి ప్రేమతోనే ఉండేది. తన దగ్గరే పడుకోబెట్టుకునేది. మంచిమంచి బట్టలు కట్టబెట్టేది. తన సరసన కూర్చోబెట్టుకుని భోజనం పెట్టేది. తన సొంత

చెల్లెలిపట్లకూడ ఇంత ప్రేమగా వుండదేమో. మనస్సుకు మనస్సుతో సంబంధముంటుంది. ప్రతాపునకు వ్రజరాణితో మనః పూర్వక సంబంధ మున్నదనుకుంటే వ్రజరాణికీ ప్రతాపునితో అలాంటి సంబంధమేవుంది. ఆవిడ అతని ప్రేమలో మునిగివుండేది. కమలాచరణునితో వివాహం స్థిరపడింది అప్పుడు ప్రతాపుడెంతగా బాధపడ్డాడో అంతకు తక్కువేమీ బాధ పడలేదు వ్రజరాణి. నిజం. లజ్జావశాత్తు ఆమె హృదయాంతర్గత భావాలు ఎన్నడో బహిర్గతంమాత్రం అవుతుండేవికావు. ప్రతాపుని పీడితహృదయాన్నేవిధంగా రంజింపచేయనా అని పెళ్ళి అనంతరం ఆవిడ ఆలోచించని రోజులేదు. "నా జీవితం హాయిగా-ఆనందంగా గడచిపోతోంది. కాని పాపం ప్రతాపుడెంత బాధపడిపోతున్నాడో, ఏవిధంగా జీవితగడియలు గడుపుతున్నాడో తెలియదుగదా," అని విచారిస్తొండేది. ఆ సమయంలో మాధవికి పదకొండోఏడు. దాని అందచందాలూ - గుణస్వభావాలూ చూడ ముచ్చటగా, ఆశ్చర్యకరంగా ఉండేవి. 'ప్రతాపుడు తన కంఠహారంగా పరిగ్రహించగల అర్హత - నా మాధవిలో లేదా ? అని ఒక ప్రశ్నాత్మకమైన ఆలోచనొకటి హఠాత్తుగా కల్గింది. ఆ గడియనుంచే మాధవి బాగోగులపట్ల ఎక్కువ శ్రద్ధవహించ ప్రారంభించింది. ప్రేమాభిమానాలు ఎక్కువయ్యాయి. "నా మాధవి పదహారు పదిహేడేళ్ళ దైనపుడు ప్రతాపుని వద్ద కెళ్తాను. మాధవి నా చెల్లెలని చేతులు జోడించి వినయపూర్వకంగా విన్నవించుతాను. ఈరోజునుంచి తన పాదసేవకురాలునిగా భావించుకోమని ఆగ్రహపూర్వకంగా చెబుతాను. అప్పుడు నామాట

తోసి రాజనగలడా ప్రతాపుడు? లేదు, లేదు, అలా ఎన్నడూ చేయడు, చేయజాలడూనూ. నేనేవెళ్ళి ఈరకంగా ప్రాధేయ పడేదానికంటే స్వయంగా పిన్నేవచ్చి మాధవిని కోడలుగా చేసుకోవాలని వుందే, ఏమంటావు? అని అంటే నిజమైన ఆనందం అప్పుడుకల్గుతుంది." ఈరకమైన వూహాప్రపంచంలో విహరిస్తూ విహరిస్తూ మనోమయూరం ఆనందంతో నాట్యం చేయసాగేది. ఈ వుద్దేశ్యం లోపలవుంచుకునే ప్రతాపుని గుణ గణాలపటం మాధవి హృదయపటలంపై గీయప్రారంభించింది. ప్రతాపునిపట్ల దాని రోమరోమమూ ప్రేమమయమై పోవా లని వ్రజరాణి ఆశయం. ప్రతాపుని గురించి చెప్పసాగితే అమె శబ్దజాలం అసాధారణంగానూ, మధురంగనూ, సరసం గానూ వుండేది క్రమక్రమంగా ప్రేమ - రస - ఆస్వాదనం ఆస్వాదించసాగింది మాధవి మానస - హంసరాజం. పాన కంలో పుడకపడింది.

అమాయక మాధవి ఆలోచిస్తూండేది- "ఆహా! ఎంత గొప్ప అదృష్టవంతురాలను! ఆ మహనీయుని పాదాలు కడిగే అర్హతకూడ నాకు లేదు. అలాంటివాడు నాకు భర్త కాబో తున్నాడు. నన్ను తన దాసీగా స్వీకరిస్తాడో లేదో? సరే అదంతా నాకనవసరం, నేనుమాత్రం ఆయన పాద-పద్మాలు విడువను. దాసీగావుంటాను. "ప్రేమ" అనేదేమన్నా ప్రపం చంలో ఆకర్షణీయవస్తువే గనక అయితే తప్పక ఆయన్ని తనవాడుగా చేసుకుంటాను." పాపం! ఈ ఆశలే ఒకనాడు అశ్రువులరూపం దాల్చి నేత్ర-ద్వారాలగుండా బైటికిపొర్లి పొంగి పోతాయని అమాయకురాలికేం ఎరుక? ఇంకా పది

పేనో ఏడన్నా నెళ్లలేదు. ఇంతలో విరజన్‌మీద ఆపదల వృష్టి కురువసాగిది. కుటుంబం సర్వనాశనమయింది. ఆ తుపాను అంతటితోనే ఆగలేదు. వాటి ప్రభావం మాధవీదేవి మీదకూడ పడింది. ఆ తుపాను విసుర్లకు ఆవిడ స్వప్నాల, పుష్ప-వనం తుడిచిపెట్టుకు పోయింది. ఇలాంటి సమయం లోనే ఒకరోజున ప్రతాపచంద్రుడు కనపడకుండా లేచి పోయాడని పిడుగువంటి వార్త వచ్చింది. తుఫానుదెబ్బలతో ఏమైనా మిగిలివుంటే అదికాస్తా ఈ కార్చిచ్చు తనపాట్టన పెట్టుకుంది.

కాని మనస్సు అనే దేదైనా పదార్థంగనకైతేమాత్రం మానసికంగా మాధవి ప్రతాపుని అర్థాంగిగా ఏనాడో అయింది తన సర్వస్వమూ - అతనికి సమర్పించింది కాని ఈ విషయం మాత్రం ప్రతాపునికి తెలియదు. నిజం ప్రపం చంలో సాటిలేని, అమూల్య వస్తువు అతనికి కానుకగా లభిం చింది. ప్రతాపుని కళ్లతోచూచే సౌభాగ్యమూ, వచనా మృతం గ్రోలే అదృష్టమూ మాధవి కొక్క-సారే లభించింది. అంతకు పూర్వమే ఆవిడ హృదయ పటలంపై విరజన్ గీచిన పటాన్ని ఈ సందర్భనం మరింత శోభాయమానంగా చేసింది, ప్రతాపుని జాడలేదు. కాని అతనిపట్ల ప్రేమానురాగాలు లేశమాత్రమైనా సడల్లేదు. పైపెచ్చు ప్రేమాగ్ని తీవ్రమ యింది దినదినం అందులోపడి కుమిలిపోతోంది. ఆ రోజు నుంచీ ఆవిడ పట్టని వ్రతంలేదు; నోయని నోములేదు; పూజిం చని దైవంలేదు. ఆయనెక్కడున్నా క్షేమంగా, సుఖంగా వుం డాలన్న అభిప్రాయంతోనే ఇదంతా చేయటం. ఈ ప్రేమ-

కల్పనలు ఆ బాలను మరింత దృఢచిత్తురాలుగా, సుశీలగా మృదు స్వభావురాలిగా తయారుచేసాయి. తన వివాహం ప్రతాపునితో జరిగిపోయిందన్న భావం గట్టిగా వేరూనింది. మాధవి పరిస్థితిచూచి ఎంతో విచారపడుతుండేది విరజన్—"అయ్యో! ఈ నిప్పు నే నంటించినదే. ఈ నవవికసిత పుష్పం ఏ అదృష్టవంతుని మెడను అలంకరించుతుందోగదా? అయ్యో! ఎంతోకష్టపడి ఈ బీజం నాటాను. క్షీర - నీరాలతో కంటిగుడ్డుగా పెంచి పోషించాను. అయితే ఈనాడు దాని పుష్పాలు ఫలించకుండా ఈరకంగా కొమ్మ -రెమ్మల మీదనే వాడి, ఎండి రాలిపోతాయా? తన దుఃఖాలుమరచి పోటానికి విరజరాణికి కావ్య - రచన గొడవన్నావుంది. కాని మాధవి కేంవుంది? హాళ్లీకి హాళ్లి సున్నకు సున్న. తనకు అపరిచితుడైన వ్యక్తిధ్యాన మొక్కటే ఆమె మిత్రుడూ ఆమె ప్రియుడూనూ. ప్రతాపు అంతర్ధానానికి కొన్నిమాసాల పూర్వం ఆయన సన్న్యాసం పుచ్చుకున్నాడని ఒకనాడు కల వచ్చింది. అది గుర్తుకొచ్చింది. ఆవిడ హృదయాంతర్గత అపార ప్రేమ బహిర్గతమయింది. ప్రతాపచంద్రుడు తప్పక సన్న్యసించాడు అని ఆకాశవాణి పలికిందా అన్నట్టుగా కన్పడింది. ఈ రోజునుండి తానూ 'తపస్వినీ' రూపందాల్చించి. సుఖ సౌఖ్యాల ఆశాభిలాషల్ని హృదయంలోంచి నెట్టివేసింది.

కూర్చొనికూర్చొని ఎప్పుడన్నా తోచుబడి కానిసమయాల్లో లేచి ప్రతాప్‌గారింటికెళ్లి కూర్చునేది మాధవి. అక్కడున్న కాసేపూ మనస్సుకెంతో శాంతిగా వుండేది. ప్రతాపుని గృహం ఒక పవిత్ర దేవాలయం మాధవికి. కొంత

కాలం సువామ - విరజనులు పరస్పరం ఎడమొఖం - పెడ మొఖంగా వున్నారు. ఆ సమయంలో అక్కడికి పెద్దగా వస్తుండేదికాదు. కాని చివరకు ప్రజరాణి పవిత్ర - ఆదర్శ మయ జీవితం ఈ గ్రంథిని విప్పింది. గంగా యమునానదుల వలె పరస్పరం ఆలింగనం చేసుకున్నారు. ఆరోజునుండి మాధవి రాకపోకలూ ఎక్కువయ్యాయి. రోజూవచ్చి సువామదగ్గర కూర్చుండేది. ఆ గృహంలో ప్రతి అంగుళం భూమీ ప్రతాపుని స్మారకచిహ్నం. ఈ లోపలి ప్రాంగణం లోనే కొయ్య గుర్రాలపై ఎక్కి స్వారీలు చేశాడు. ఈ గుండంలోనే కాగితం పడవలు నడిపాడు. ఆ నౌకలు బహుశ కాలచక్రం సుడిలోపడి అంతు లేకుండా పోయాయి. కాని ఆ కీలుగుర్రం మాత్రం ఇంకా అలాగే వుంది దాని జీర్ణ శీర్ణ అస్థిపంజరానికి ప్రాణం పోసింది మాధవి. దాన్ని తీసుకెళ్లి నీళ్లగోతి ప్రక్కన ఒక గన్నేరు చెట్టు నీడను కట్టివేసింది. ఈ గదియే ప్రతాపుని శయన గృహం. అదిప్పుడు మాధవీదేవికొక పావన దేవస్థానం. ఈ పందిరిమంచమే తన అంకశయ్యపై అనేకరోజులు ప్రతాపుని జోగొట్టింది. దాన్నిప్పుడు పుష్ప- గుచ్ఛాలతో అలంకరించు తోంది మాధవి. ఎప్పుడూ కనివిని ఎరుగనంత అందంగా ఈ గదిని అలంకరించింది. పటాల ముఖాలమీది ధూళి - తెరలు లేచిపోయాయి. లాంతరుకు మళ్ళీ వెనకటిదశ పట్టింది. మాధవీదేవి ఈ అపారభక్తి - ప్రేమలు చూచి సువామ మనస్సుకూ కొంతశాంతి గల్గింది. చింతలూ-చీకులూ అదృశ్య మయ్యాయి. తన కుమారుని పేరెత్తి ఎంతకాలమయిందో

చెప్పలేం. విరజన్‌తో ఐక్యమైతేతే ఏర్పడింది కాని ఉభయుల మధ్య ప్రతాపుని విషయం చర్చకెన్నడూ వచ్చేదికాదు. సిగ్గుతో సంకోచపడుతుండేది విరజన్. కోపతాపాలతో మూతి ముడుచుకు ఉండేది సువాసు. ఇంతలో మాధవీదేవి ప్రేమాగ్ని ప్రజ్వరిల్లింది. దానిలో అందరి సంకోచాలూ మూతిముడుపులూ భస్మీభూతమై పోయాయి. ప్రేమవిహ్వలరాలై ప్రతాపుని బాల్యజీవితం గాథలు గుచ్చిగుచ్చి అడిగేది మాధవి. ఆ ప్రేమాగ్నిముందు సువాసు రాతిగుండె కరగి నీరైపోతుండేది. కన్నీళ్ళు గిర్రున క్రమ్ముకొచ్చేవి. అప్పుడు ఒకరి ముఖం ఒకరు చూచుకుంటూ ఉభయులూ ఆపురుమనేవాళ్లు. దీపాలవేళయినా ప్రతాపుని గురించి చర్చలు మాత్రం సమాప్తమయ్యేవి కావు. ఈ స్థితిలో కూడా మాధవి మానసిక స్థితి సువాసుకు తెలియకుండా వుండటం సంభవమా? ఆమె తరచు ఆలోచిస్తుండేది— "ఈ తపస్వినీ ఈ రకంగానే ప్రేమాగ్నిజ్వాలల్లో కాలుతూ, మండుతూ ఉంటుందా? అదికూడా నిష్కామ భావంతో." ఒకనాడు 'కమలా' పత్రికప్యాకెట్టు తెరచిచూచేసరికి మొదటిపేజీలోనే ఒక ఫొటో కనపడింది. వివిధరంగులతో అలంకరింపబడివుంది. ముఖారవిందంలో తేజస్సు తొణికిసలాడుతోంది. ఎవ్వరో ఒక సన్యాసిపుంగవుని ఫొటో. అలాంటి రూపురేఖలు గలవ్యక్తిని ఎక్కడో ఒకచోట తప్పక చూచినట్లుగా స్ఫురించసాగింది. ఆలోచిస్తూ ఆలోచిస్తూ హఠాత్తుగా ఆవిడ దృష్టి ప్రతాపుని రూపురేఖలపైకి పోయింది పట్టరాని సంతోషంతో

ఒక్క-సారి ఎగిరి గంతువేసింది. "మాధవీ! కాస్త ఇలా రామ్మా" అని పిలిచింది మాధవిని.

పూలతోటలో నీళ్లు పోస్తోంది మాధవి. ప్రస్తుతం కాల క్షేపాని కీతోటయే ఒక సాధనంగావుంది. చీరంతా ముద్ద ముద్దగా తడిసివుంది. శిరోజములు చిక్కు-పడి ముఖంమీాద వ్రేలాడుతున్నాయి. లలాటంపై చెమట చుక్క-లు కారు న్నాయి. ప్రేమ-రసంతో నిండివున్నాయి నేత్రాలు. పిలుపు వినబడగానే వెంటనేవచ్చి ఎదుట హాజరయింది. "ఇలారా, నీ కొక మంచి బొమ్మచూపిస్తా ఇలారా." అంది విరజన్.

"ఎవరిబొమ్మ? ఏదీ చూడనీ."

తదేకదృష్టితో చూచింది బొమ్మను మాధవి, కళ్లు చెమ్మగిల్లాయి.

విరజ:- గుర్తు పట్టావా?

మాధ:- ఏం! ఈ రూపం కలలో ఎన్నిసార్లు చూచానో? ముఖమండలం జ్యోతికణాలను పరిస్లోంది.

విర:- ఇదిగోచూడు, అతనెవ్వరోకూడ క్రింద వ్రాయబడివుంది.

పేజీ త్రిప్పింది మాధవి. "స్వామీా బాలాజీ" అన్న శీర్షికతో వ్యాసమొకటి వ్రాయబడివుంది. కొంచెంసేపు ఇద్దరూ ఈ వ్యాసం చదివారు తన్మయంతో. తర్వాత సంభా షించుకోసాగారు.

విరజ.-ఆయన తప్పక సన్యసించి వుంటాడని నే నేనాడో గ్రహించాను.

మాధవి ముఖంకేసి చూస్తోంది. పెదవివిప్పినట్లులేదు.

విర:-అప్పటికీ ఇప్పటికీ ఎంత తేడా వుందోగదా! ముఖంలో

తేజస్సుచూడు, ఉట్టిపడుతోంది. అప్పుడింత అందంగావుండే వారుకాదు.
మాధ:-హుంహుూ,
విర:-భగవంతుడు వారి నాశీర్వదించుగాక. గొప్ప తపస్సు చేసి పుట్టాడు. (కన్నీరుకారుస్తూ) ఎంత అదృష్టం! మేమిద్దరమూ ఒకరోజున జతగా ఆడుకున్నాం. కలిసిమెలిసి ఒకేచోట వున్నాం. కాని ఇవ్వాళ ఆయన సన్యాసి, నేను వియోగిని. జ్ఞాపకమున్నానో లేదో తెలియదు. ఔను సర్వమూ వదలుకుని ప్రపంచంతో సంబంధంలేకుండా సన్యాసం స్వీకరించిన మహాత్మునికి ఇతరుల గొడవేం వుంటుంది పిన్ని కేవుత్తరం వ్రాయనప్పుడు మరి నాబోటిది ఏం జ్ఞాపకముంటుంది? మాధవీ! చిన్నప్పుడు ఆయన ఎప్పుడన్నా 'యోగి-యోగి' ఆట ఆడితే నేను మిఠాయి భిక్ష పెడ్తుండే దాన్ని.

"ఏమో మరి? ఎన్నాళ్ళకు దర్శన సౌభాగ్యం కల్గుతుందో?" అని ఏడ్చి సిగ్గుతో తలవంచుకుంది మాధవి.
విర:-ఏడ్వకు. త్వరలోనే వస్తారుగా. ప్రాణనాథుని ఈ వ్యాసం ఎంతో బాగుంది.
మాధ:-ప్రతి పదంలోనుండీ భక్తి - రసం ఉట్టిపడుతోంది.
విర :- ఆహా! ఉపన్యాసాన్ని గురించి ఎంత చక్కగా ప్రశంసించి వ్రాశాడు. చిన్నతనంలోకూడ అతని మాటలు ముద్దులుమూట గడ్తూండేవి. ఇక ఇప్పుడడగవలసిన పనేముంది? ప్రాణనాథునివంటి వ్యక్తినే ఇంతగా ప్రభావితుణ్ణిచేయగల్గిన వ్యక్తి సమస్త భూమండలంపై తన మహాత్మ్యం వ్యాపింపచేయగలడన్న దానిలో ఇసుమంతైనా సందేహంలేదు.

మాధ:- పద, పద, పిన్నివద్దకెళ్ళివద్దాం పద.
విర:- ఔను, ఆవిడసంగతే మరచిపోయాం, విని ఏమంటుందో చూద్దాం. సంతోషిస్తుందా ?
మాధ:- అసలావిడ కోర్కెయే ఇదిగా. మరెందుకు సంతోషించదు ?
విర:- చెప్పేవులేగానిపోవే, ఇలాంటివార్తవిని సంతోషించే తల్లులెవ్వరూలేరు.

ఇద్దరూ బయలుదేరారు. విరజన్ ముఖం వాడి పోయి వుంది. కాని మాధవి ప్రతిఅవయవమూ హర్షంతో తొణికిసలాడుతోంది. ఎవ్వరైనా "నీ పాదాలు ఇప్పుడు భూమి మీద ఆనకపోవటానికి కారణమేమిటి ? నీ పాలిపోయిన ముఖారవిందం ఇంతగా కళకళలాడిపోవటానికి హేతువేమిటి ? నీకు లభించిన రత్నరాసులేమిటి ? ఇప్పుడు నీ విచారమూ, నీ ఏడ్పులూ ఏ వటిలో గలిసిపోయాయి ? నీ ప్రియుడు కనిపిస్తాడన్న ఆశలేదు. నీ మీదెన్నడూ కరుణా - కటాక్షం ప్రసరింపచేయలేదు. మరిదేనికింత సంతోషం పట్టలేకుండావున్నావు?" అని ప్రశ్నిస్తే మాధవి ఏం సమాధానం ఇస్తుంది ? ఏమీ లేదు ముఖం వ్రేలాడవేస్తుంది. కంటిరెప్పలు క్రిందికివాలి. పోతాయి పుష్పభారంతో రెమ్మలు క్రిందికి వంగిపోయినట్లుగా ఔను, రెండు కన్నీటిబొట్లు రాలితే రాలొచ్చు. కాని నోరు మాత్రం విప్పలేదు.

మాధవి ప్రేమ, మైకంలో మైమరచివుంది. హృదయం ప్రేమోన్మాదంతో మునిగివుంది. ఆమె ప్రేమ బజారు వస్తువుకాదు; దేనికోసమూ అకలిగొనిలేదు ప్రేమకు బదు

లుగా ప్రేమనూ అభిలషించడంలేదు. మరి దేనికింత సంతో షం? ఇలాంటి పవిత్రమూర్తి తన హృదయమందిరంలో వెలుగొందుతున్నాడు గదాఅని గర్వపడుతోంది. ఈ గర్వమే ఆవిడ ఉన్మత్తతకు మూలం; ఈ గర్వమే ఆవిడ ప్రేమకు కానుక.

రెండో మాసంలో 'బాలాజీ' గారి మీద స్వాగత పద్యాలు వ్రాసింది విరజన్. అదొక విలక్షణ రచన. విద్వజ్జగత్తుకు విరజన్ కొత్తేమీ కాదు. చిరపరిచితురాలే. ఐనా ఆ పద్యాలు ప్రచురించ బడగానే ఆవిడ కావ్యప్రతిభాచంద్రిక మరింత ఉజ్వలంగా ప్రకాశించింది. వాయువుకన్న వేగంగా పోయే కల్పనా - పక్షి ఈసారి కావ్యాకాశంలో నక్షత్రమై ప్రకాశించింది. ప్రతి పదంలోనూ ఆకాశవాణి జ్యోతి ఇమిడి వుంది. ఈ పద్యాలు చదివిన వాళ్లందరూ 'బాలాజీ'గారికి భక్తులైపోయారు. కవి ఒక పాములవాడు. అతని బుట్టలో ఉండేది సర్పాలుగావు, హృదయాలు ఉంటూవుంటాయి.

# 23

వ్రజరాణిలో కావ్య-చంద్రుడు ఉదయించినప్పటినుంచీ ఆవిడ చుట్టూ ఎప్పుడుచూచినా స్త్రీలు తండోప తండాలుగా మూగి వుండేవాళ్ళు. పట్నంలో మహిళా సంఘాలెన్నో స్థాపించ బడ్డాయి. వాటి మంచి చెడ్డల భారమంతా విరజన్ ఒక్క-దాని మీద నేవుంది. ఇంతేగాక, ఇతరచోట్లనుండి కూడ అనేకమంది దర్శనార్థం వస్తూండేవాళ్లు. ఇక తీర్థయాత్రకు వచ్చినవాడూ ఆమెను దర్శించకుండా వెళ్ళేవాడుకాదు. ఆవిడ

గేయాల సర్వశ్రేష్ఠ సంగ్రహమొకటి ప్రచురించాడు రాజా ధర్మసింగ్. ఇది ఆమె కావ్య - కౌశాలాన్ని నలుదిశల వేనోళ్ల చాటింది. ఒక్క భారతదేశంలో నేగాక, యూరోపు, అమెరికా మొదలగు దేశాల్లోని ప్రసిద్ధ రచయితలుకూడ ముక్తకంఠంతో ప్రశంసించారు. ఆమె పుస్తకాలను తమ పుస్తక భాండాగారంలో అలంకరించుకోని రసిక హృదయులు భారతగడ్డపై బహుశా లేరేమో. విరజన్ రచనల్ని మెచ్చుకొనే వ్యక్తుల్లో బాలాజీ అగ్రగణ్యుడు. తన మహోపన్యాస వ్యాసాల్లోకూడ తరచు ఆవిడ రచనల్లోని వాక్యాలే ఉదాహరణగా ఉదహరించుతుండేవాడు. ఆ సంగ్రహంమీద "సరస్వతీ" పత్రికలో విస్తారపూర్వకంగా విమర్శకూడ ఒకటి వ్రాశాడు.

ఒకరోజున ప్రొద్దు పొడవకముందే సీత, చంద్రకుమారీ, రుక్మిణీ, రాణీలు వ్రజరాణి గారింటి కొచ్చారు. వీరందర్నీ తగు మర్యాదలతో కూర్చోబెట్టింది. ఆ సమయంలో విరజన్ ఇంట్లో లేదు. కారణం ప్రభాత సమయాన్ని కావ్య - పఠనం కోసం ప్రత్యేకించింది. ఆ సమయంలో అత్యంత అవసరమైన పనైతేనే తప్ప లేకపోతే స్నేహితులతోకూడ కలుసుకునేది కాదు. తోటలో రమణీయ నికుంజ మొకటి వుంది గులాబి పూవులు పరిమళం వెదజల్లుతున్నాయి. కమ్మటిగాలి చల్లగా హాయిగా వీస్తోంది. అక్కడే ఒక శిలాసనంపై ఆసీనురాలై కావ్యాలు వ్రాస్తూవుంటుంది విరజన్. కావ్య - సముద్రంలో నుండి విరజన్ బైటికి తీసేరత్నాలను కలం హారంలో గుచ్చుతోంటుంది. పట్న ప్రజల అగ్రహారంమీద చాలారోజుల అనంతరం ఇవ్వాళ బాలాజీగార్ని కాశీ ఆహ్వానించటానికి కలం

ఎత్తింది. బాలాజీగార్ని అప్పుడప్పుడు కాస్త వ్యాకులపరచే నగరాల్లో కాశీ ఒక్కటే. కాశీ వాసులు ఎంతకాలంనుండో ఆహ్వానిస్తున్నారు. కాని వెళ్లటానికి అవకాశం లభించడంలా. సింహాళం, రంగూనుదాకా కూడ వెళ్లివచ్చారు. కాని కాశీ రావడానికి మాత్రం తీరుబడిలేదు. కాదు, అక్కడికి వెళ్లాలన్న ఆలోచనేలేదు. ఆ నగరాన్ని తన శోక పరితా - భవనంలా భావిస్తున్నారు. అందువల్లనే కాశీకి రావలసిందని ఆహ్వానిస్తోంది విరజన్. ఈ ఆహ్వానంలో ఆయన్ని బలవంతాన లాక్కురాగల్గిన శక్తివుందని ప్రజలకునమ్మకం. ఏదైనా నూతన భావంవస్తే ప్రజరాణి చంద్రాననం తేజరిల్లి పోతోంటుంది. మాధవి ముఖమండలం ప్రసన్నతా ప్రకాశంతో మెరసిపోతోంటుంది. ఉద్యానవనంలో ఎన్నో మందారపూవులు పూచి ఉన్నాయి. రజనీ తుషార బిందువులతో కలిసి మరింత రమణీయంగా కాంతులు వెదజల్లుతున్నాయి. కాని ఈ సమయంలో ఈ రెండు పుష్పాల్లో (విరజన్ మాధవీలు) కనపడే నూతన శోభావికాసాలు చూచి అన్యపుష్పాలు లజ్జపడి పోతున్నాయి.

సరిగ్గా తొమ్మిదింటికి లోపలికొచ్చింది ప్రజరాణి. "ఇవ్వాళ ఇంతసేపున్నారేం?" అని ప్రశ్నించింది సేవతి.

విర:- సూర్యుని ఆహ్వానించటానికి కుంతీదేవి ఎంతతపస్సు చేసిందో!

సీత.- ఆ బాలాజీ మహాశయుడు పట్టి పాషాణహృదయుడులా వున్నారు. నేనైతేనా అలాంటి మహానుభావుని పల్కరించనుకూడ పల్కరించను.

రుక్మిణి:—సర్వసంగ పరిత్యాగికి ఇల్లూ - వాకిళ్లతో సంబంధ మేమిటి?

చంద్ర:—ఇక్కడకు రానీచెప్తా. ఓ సన్యాసిగారూ! ఇలాంటి ఒయ్యారా లెక్కడ నేర్చుకొన్నావయ్యా? అని ముఖంమీద అడిగేయనూ?

రుక్మిణి:—ఓ మహారాణిగారూ! నోటికొచ్చినట్లల్లా మాట్లాడటం మంచిదికాదు. సాధు - సన్యాసుల నెలా ఆదరించాలో కాస్త నేర్చుకుంటే బాగుంటుంది నాలికా లేక కత్తెరా?

చంద్ర:—లేకపోతే ఏమిటిమరి? ఓపిక పట్టడం ఎంతకాల మమ్మా? దేశాలన్నీ తిరిగి రాగలరు. కాని కాశీ మాట ఎత్తేటప్పటికే పాపంకాళ్లు నొప్పులుగా వుంటాయా!

విర:—(నవ్వి) ఇప్పడిక చాలాత్వరలోనే చూడగల్గుతావులే. ఈ నెలలో తప్పక వస్తారని నానమ్మకం.

సీత:—ఔను, అదృష్టం పండింది కదూ, మరి దర్శన మెందుకు లభించదు? ఆయనగారి జీవితచర్రిత చదివినప్పుడు ఎలా వుంటుందంటే కన్పడితే కాళ్ళు పట్టుకుని గంటలతరబడి కన్నీరు కార్చాలని బుద్ధిగా వుంటుంది.

రుక్మిణి:—ఈశ్వరు డాయనకి వరదహస్తాలు ప్రసాదించాడు. దారానగరం రాణీగారు చనిపోయిందో లేక ప్రాణం పోవటానికి సిద్ధంగావుందో. ఇంతలో బాలాజీగార్కి వర్తమానం చేరింది. ఆగమేఘాలతో వచ్చి హాజరయ్యారు. కన్నుమూసి కన్ను తెరచినంత సేపటిలో లేపి కూర్చోబెట్టారు. మా ఆయనప్పుడు అక్కడే వుంటున్నారు. ఆయనగారే చెప్పాడు, రాణీగారు వెంటనే బొడ్డులోనుండి తాళం చెవితీసి

బాలాజీగారి పాద - పద్మాల మీదవుంచి చేతులుజోడించి ఈ రోజునుండి మీరే దీనికి యజమానులు' అని అందట. అప్పుడాయన "ధన - ధాన్యాదులు నా కవసరంలేదు. మీ రాజ్యంలో కనీసం మూడువందలు గోశాలలన్నా స్థాపించండి' అని అన్నాడట నోట్లోంచిమాటరావడమే ఆలశ్యం; నేడు దారానగరంలో పాల నదులు ప్రవహిస్తున్నాయి. నిజంగా అలాంటి మహాత్ముడుగా కావటం ఎవ్వడితరం?

చంద్ర:- నవలఖా మహారాజుగారు ఎన్నాళ్ళనుండో క్షయ రోగంతో బాధపడ్తున్నారు. అదీ వారిచ్చిన మూలికల ద్వారానే పూర్తిగా నయమైపోయింది. దాన్నే మావల్ల కాదంటే మావల్ల కాదని డాక్టర్లూ, వైద్యులూ యావన్మందీ చెప్పేశారు. బాలాజీగారు వెళ్ళబోయే సమయంలో రాజుగారి భార్యవచ్చి తొమ్మిది లక్షలు చేసే ముత్యాలహారం ఒకటి సమర్పించింది. కాని ఆయన దానికేసి కన్నెత్తిచూస్తే ఒట్టు.

రాణి:- చూస్తే ఖరారు మనిషిలాగున్నాడే.

రుక్మిణి:- ఔను, నిజం! మళ్ళీచూడటం అదొకవనా? అసలు వెంటనే మెడలోనే వేసేసుకోవాల్సింది.

విర:- కాదు కాదు; తీసుకుని రాణిగారి మెడలో వేయాల్సింది. ఏమే చెల్లీ! ఏ మంటావు?

చంద్ర:- ఇక మా ఇంట్లో ఏమో 'భారత కాంగ్రెసు' సభ్యుడుగా రున్నారు. నానా అగచాట్లూపడి రెండువందల యాభై రూపాయలు పెట్టెలోదాచిపెట్టాం గాంధీ కోసమని. ఆ నాల్గుడబ్బులూ పట్టుకుపోయారు. "భారత కాంగ్రెసు'

సభ్యులు గుర్రాలమీదగాని నడవ రేమిటి?

రాణి:- నిన్న మా ఇంటిముందుగానే వూరేగింపుగా వెళ్లారు. మంచి సజ్జనుల్లా కన్పించారు.

ఇంతలో క్రొత్తపత్రిక తీసుకొనివచ్చింది సేవతి.

"క్రొత్తవార్త లేమైనా వున్నాయా?" అని ప్రశ్నించింది విరజన్.

సేవతి:-ఔను లేకేం! బాలాజీగారిప్పుడు మానిక్పురంలో వున్నాడు. ఒక గొల్లతను తన కుమార్తె పెళ్ళికి ఆహ్వానించాడు అందుకని రాత్రి బయలుదేరి మానికపురం వచ్చారు. భారత కాంగ్రెసు సభ్యులతో సహా. గొల్లకులస్థులంతా బ్రహ్మాండమైన స్వాగతమిచ్చారు. ఎన్నో గోవులను దానం చేశారు. బాలాజీ పెళ్ళికుమార్తెను ఆశీర్వదించాడు; వరుణ్ణి ప్రేమతో కౌగిలించుకున్నాడు. అప్పటికప్పుడే ఐదుగురు గొల్లలు 'భారత కాంగ్రెసు'లో సభ్యులుగా చేరారు.

విర:-చాలా మంచివార్తలు. మాధవీ! ఇవన్నీ కత్తిరించి జాగ్రత్తగా వుంచు ఇంకేమన్నా వున్నాయా?

సేవతి:-ఒక గుడి కట్టించారట పట్టణవాసులు. అక్కడ భారత కాంగ్రెసు, బ్రహ్మాండంగా ఉత్సవాలూ, సంతర్పణలూ చేసింది.

విర:- పట్టణంవాళ్ళు చాలా ఉత్సాహంగా పనిచేస్తున్నారు

చంద్ర:-ఇప్పుడిక గొల్లముండలుకూడ ముత్తైదువుల్లా ముఖాన కుంకంబొట్లు సింగారిస్తారు కాబోలు! మ్లేచ్ఛులుకూడా గుళ్లూ గోపురాలూ కట్టించుకుంటారు కాబోలు.

రుక్మిణి:-ఏం! వాళ్ళుమాత్రం మనిషిపుట్టుక పుట్టలేదా? వాళ్లనూ దేవుడే పుట్టించాడు. మరి తమ కొక్కరే నేమిటి

దేవుళ్ళనూ దెయ్యాలనూ పూజించడం గుర్తకు తీసుకుంది?
చంద్ర:-ఇక చాలించవే. మ్లేచ్ఛవెధవల్లో కమకట్టావా నన్ను? నీ మాటలు నాకేం బాగుండలేదు తల్లీ.
రుక్మిణి:-ఔనులేమరి నువ్వేమో కాస్త ఎర్ర ఎర్రగా తెల్ల తెల్లగా వున్నావు. పైన కాస్త మంచిగుడ్డలూ, నగలూ పెట్టుకున్నావు. ఇంతేగా తేడా. లేక ఇంకేమైనా వుందంటావా?
చంద్ర:-ఇక ఇదేనేమిటి తేడా? భూమ్యాకాశాలు రెండూ ఒకటే నంటావన్నమాట. ఆ రెంటినీ జతపరుస్తావా? సరే, ఇలాంటి మాటలే నాకు బాగుండవని చెప్పా. నే పుట్టిన వంశమేమిటో తెలుసా అని అసలు. కూర్మ క్షత్రియులం మేము.
రుక్మిణి:-ఔను తెలియకేం? ఒకవేళ ఇంతకుపూర్వం తెలియకపోతే ఇప్పుడన్నా తెలుసుకున్నాగా. సరే దానికేమిగానీ, మీ రాజుగారు (భర్త) ఒక మ్లేచ్ఛునికంటె ఎక్కువ బాగా మల్లయుద్ధం చేయగలడా? లేక వంకరటింకరగా ఇంత లావు తలగుడ్డలు చుట్టుకోవడం మాత్రమే తెలుసునా? ఒకమాదిరి మ్లేచ్ఛుడైనా ఆయనగార్ని తనచంకలో పెట్టి నొక్కి పారేయగలడని నాకు తెలుసు
విర:-సరే, ఇక ఇంతవరకే సరిపెట్టండి. ఎప్పుడొచ్చినా మీ రిద్దరూ అసలు దెబ్బలాటలు వెంటతీసుకునే వస్తారనుకుంటా.
సేపతి:-తండ్రీ కొడుకుల సమ్మేళన మెంతచక్కగా వుందో చూడండి. ప్రతాపునికోసమే తండ్రి శాలిగ్రాంగారు సన్యసించినట్టుగా తోస్తోంది. ఇదంతా వారి శిక్షణా ఫలితమే.
రుక్మి:-నిజం, ముమ్మాటికీ నిజం. మున్షీ శాలిగ్రాంగా రిప్పుడు

బ్రహ్మానందస్వామి పేరుతో ప్రసిద్ధికెక్కివున్నారు. ప్రతాపుని చూచినప్పుడు గుర్తుపట్టే వుండొచ్చు.

సేవతి:-పరమానంద భరితుడై వుంటాడు.

రుక్మి:-ఇదీ ఆ పరాత్పరుని ప్రేరేపణే. లేకపోతే మానసరోవరం ఏమిటి? ప్రతాపుడు వెళ్లటమేమిటి?

సేవతి:- భగవదేచ్ఛ ప్రబలమైనదన్నారు పెద్దలు.

విర:- సరే, మీరంతా మానాన్నగారి నసలు మరచేపోయినట్టున్నారు. అందరికంటేముందు నాన్నగారి దర్శన సౌభాగ్యమే హృషీకేశంలో లభించింది ప్రతాపుకు. అక్కడ వారి దగ్గర ఒక సంవత్సరంపాటు వున్నాడు. తర్వాత ఇద్దరూ కలిసి మానసరోవరం వెళ్ళారు.

రుక్మి:- నిజమే, ప్రాణనాథుని వ్యాసంలో ఈ విషయంవుంది. మున్షీ సంజీవనలాల్‌గారి దర్శనమే గనక మొదట్లో లభించి వుండక పోయినట్లయితే నేనుకూడ పాట్లకూటి సాధువుల్లోవుండి వుండేవాడినని బాలాజీగారేస్వయంగా అంటూవుండేవారట.

చంద్ర:, ఇతని ఆత్మోన్నతికై కావలసిన సామగ్రి అంతా మొదట్లోనే సమకూర్చి పెట్టాడు విధాత.

సేవతి:- మరి అందువల్లేగా ఇంత లేతప్రాయంలో ఇంత ప్రసిద్ధి పొందారు. ఇరవై ఐదేళ్లుంటాయేమో.

విర:- కాదు, ముప్ఫయోపడు. నా కంటె ఒక్క ఏడాది పెద్ద.

సేవతి:- అతని కీర్తి - ప్రఖ్యాతులు విని ఆనందపడిపోతూ ఉండొచ్చు సువామ.

రుక్మి:-ఏమో మరి నేనెప్పుడుచూచినా విచారంగానే వున్నట్టు కన్పడేది.

చంద్ర:- ఆవిడ జీవితాభిలాషలన్నీ మంటగల్సి పోయాయి. మరెందుకు విచారంగా వుండదు పాపం?

రుక్మి:- అసలావిడ కాళికాదేవిని అడిగిన వరమిదేగా.

చంద్ర:- ఐతే మరి గృహస్థుడుగా వుండి. దేశసేవ చేయటం సంభవంగాదా.

రుక్మి:- ఒక్క దేశసేవన్నమాటేమిటి? అసలు ఏ సేవా చేయటం సాధ్యం కాదు గృహస్థజీవితంలో. గృహస్థుడు కేవలం తన పెళ్లాం - బిడ్డల సేవమాత్రమే చేసుకోగలడు.

చంద్ర:- చేయాలనుకున్న వాళ్ళు ఎన్నైనా చేయగలరు. ఔను, చేయదలచని వాళ్ళకే అన్నివంకలూనూ.

ఇంకో నెల గడచింది స్వాగత - సందేశంతో బాలాజీ గారివద్దకెళ్ళింది వ్రజరాణీ గేయం. కాని ఆయన గారి ఆహ్వానం అంగీకరించాడో లేదో మాత్రం పత్రికల్లో రాలేదు. ఎదురుచూస్తూ చూస్తూ విసుగెత్తిపోయింది కాశీ పురం. బాలాజీ ఎంతవరకూ దక్షిణదిశగానే పోతున్నాడు. చివరకందరికీ నిరాశ కల్గింది. అందులో అందరికంటె ఎక్కువ నిరాశ కల్గింది వ్రజరాణికి.

బాలాజీ కాశీవస్తాడని ఎవ్వడూ కలలోనైనా ఆశించలేదు. హఠాత్తుగా ఒకనాడు ప్రాణనాథుడొచ్చి "చెల్లీ! ఇదిగో ఇక పండుగ చేసుకో, ఇవ్వాళ బాలాజీగా రొస్తున్నారు" అని చల్లటి కబురు చల్లగా చెప్పాడు.

కూర్చొని ఏదో వ్రాసుకుంటోంది విరజన్. కలం ఆగిపోయింది. మాధవీ లేచి గబగబా గుమ్మం వేపుకు పరుగెత్తబోతోంది. ఇంతలో నవ్వుతూ "ఇప్పుడప్పుడే వచ్చారా

ఏమిటి? ఇంత కంగారుపడిపోతున్నా వేమిటి? అన్నాడు ప్రాణనాథుడు మళ్ళీ.
మాధ:- మరెప్పుడూరావడం? ఇటుగుండా నే వెళ్తారుకదూ?
ప్రాణ:- ఎటుగుండా వెళ్తారో ఇంకా సరిగ్గా తెలియదు. స్వాగత సమారోహాలంటే వారికి తలనొప్పి. అంచేత నే తన రాక తేదీ నిర్ణయించి చెప్పలేము. రాజాగారివద్ద కివ్వాళ ఒక మనిషి వచ్చాడు. బాలాజీగా రొస్తున్నారు. తనకోసం ఎట్టి స్వాగత - సమారోహాలూ చేయవద్దని చెప్పిపంపారు. కాని కాశీవాళ్ళెందుకువింటారు? స్వాగతంఇస్తారు. బ్రహ్మాండమైన వూరేగింపు లేవదీస్తారు. ఈ పట్టణ చరిత్రలో ఇదివరకెన్నడూ కని విని ఎరుగనట్టివూరేగింపు, భవిష్యత్తులో చిరస్మరణీయంగా వుండే వూరేగింపు జరపాలని సన్నాహాలు చేస్తున్నారు. నాలుగు మూలలా మనుష్యులు ఏర్పాటు చేయబడ్డారు. బాలాజీగా రొస్తున్నట్టు కనపడగా నే వెంటనే పేటపేటకూ టెలిఫోనులద్వారా సమాచారం అందజేస్తారు. స్కూలు - కాలేజీ విద్యార్థులంతా యూనిఫారమ్‌లో జెండాలు పుచ్చుకుని రాకకై ఎదురుచూస్తూ బారులుతీరి నిల్చొనివున్నారు. ఇంటింట పూలవర్షం సన్నాహాలు జరుగుతున్నాయి. దుకాణా లన్నీ అందంగా అలంకరించబడుతున్నాయి. పట్నమంతా ఏదో ఒక పండగలా వుంది.
మాధ:-ఈ దారినిగనక వెళ్లితే ఇక్కడ ఆపుచేద్దాం.
ప్రాణ:-మన మింతవరకు ఏర్పాట్లేమీ చేయనేలేదయ్యే. మరేం ఆపుచేస్తాం? అదీగాక ఎటునుంచి వెళ్తారోగూడ ఇంత వరకు సరిగ్గా తెలియదయ్యే.

విర:-(ఆలోచించి) కనీసం హారతులిచ్చే ఏర్పాటన్నా చేయాలి.
ప్రాణ - ఔను, ఇక ఈ మాత్రమన్నా చేయవద్దా? బైట చాపలవీ పరిపించే ఏర్పాట్లు చేస్తాను.

బైటి ఏర్పాట్లలో మునిగిపోయాడు ప్రాణనాథుడు. పుష్పాలు కోసుకు రావడానికి వెళ్ళింది మాధవి. వెండిపళ్ళెం ఒకటి మల్లెపూవులతో ముస్తాబు చేసింది విరజన్. లోపల సామానంతా చక్కగా సర్దుతున్నారు సేవతీ - చంద్రాలు.

సంతోషంతో మాధవి పాదాలెక్కడా భూమిమీద ఆనటంలా. ఎక్కడన్నా రావడంలేదుగదా అని పదే పదే గుమ్మంలో కెళ్ళి కంగారుగా చూస్తుంది. ఎక్కడన్నా మేళం మోత వినపడుతుందేమో నని చెవులు నిక్క పొడుచుకుని వింటుంది. ఉల్లాసంతో ఉయ్యాలలూగుతోంది హృదయం. పువ్వులు ఏరుతోంది; కోస్తోంది. కాని మనస్సక్కడలేదు. చేతులన్నీ ముళ్ళమయమై పోయాయి. రక్తం వరదలుగా కారుతోంది. పూలతో పాటు ఎన్నికొమ్మలు, ఎన్ని రెమ్మలు విరిచేసిందో అంతులేదు. ఎన్నోసార్లు మొక్కలూ, కొమ్మలూ తగిలి క్రింద పడిపోయింది. ముళ్ళను చిక్కుకొని కట్టుకున్న చీరంతా తూట్లుపడిపోయింది. ఆ సమయంలో ఆవిడ స్థితి పసిపిల్లల స్థితిలావుంది.

కాని విరజన్ ముఖ - కమలం మాత్రం వాడిపోయి వుంది. పైకల్లా నీళ్ళతో నిండిన కుండ కాస్త కదలితేనే చింది పోతుంది. అదేవిధంగా వుంది విరజన్ పరిస్థితి. పాతగాథలు స్మృతిపటలంపైకి వచ్చినకొలదీ నేత్రాలనుండి జలబిందువులు చింది చింది పడుతున్నాయి. "అయ్యో! ఒకప్పుడదొక కాలం.

అతనూ నేనూ సోదర - సోదరీమణులంగా వుండేవాళ్లం; జతగా ఆడుకునేవాళ్లం; ఒకేచోట పండుకునేవాళ్లం. ఇప్పటికి పధ్నాలుగేళ్లయింది. అతని ముఖారవిందం చూచే అదృష్టం సంప్రాప్తించలా ఆ రోజుల్లో ఎప్పుడన్నా నేను రవ్వంత కన్నీరు కారిస్తే వచ్చి తుడిచేవాడు. ధైర్యంచెప్పి సంతోష పరచేవాడు. అతనికోసం ఈ నా నేత్రాలు ఎంతగా ఏడ్చాయో ఎన్ని కడవలు కన్నీరు కార్చాయో అతని కేం తెలుసు? ఈ హృదయం ఎలాంటిబాధలు పడిందో ఇతరుల కేంతెలుస్తుంది? మా రాత ఇలాంటివి చూపిస్తుందనీ, ఒకరు వియోగినీ అయితే రెండోవాడు 'సన్యాసి' అవుతాడనీ ఆనాడెవ్వడు కలగన్నాడు?

బాలాజీగారి శుభాగమన వర్తమానం బహుశ సువామ కందివుండదు' అని అకస్మాత్తుగా మాధవికి తట్టింది. వెంటనే విరజన్ వద్దకెళ్ళి "అక్కా! నేను కాస్త పిన్నిగారింటి కెళ్లివస్తా. ఆవిడ కెవ్వరన్నా చెప్పారోలేదో?" అంది.

ప్రాణనాధ్ బైటినుంచి వస్తున్నాడు, ఈ మాట చెవినిపడింది. "ఆవిడ కందరికంటె ముందు కబురందచేయ బడింది. కావలసిన ఏర్పాట్లు కూడా జరిగిపోతున్నాయి. బాలాజీగారు తిన్నగా అటుగుండానే వస్తారట ఇటుగావచ్చే కార్యక్రమం లేదట." అన్నాడు.

విర:-అలాగైతే మరి మనం వెంటనే బయలుదేరాలి.

మాధ:-హారతి పళ్లెం తీసుకురానా ?

విర:-మరి తీసుకువెళ్ళే దెవ్వరు? దాసీదాన్ని పిలుచుకురా అదరిపాటుగా చూచి (త్రుళ్లిపడి) అరే! నీ చేతులనిండా ఈ రక్తమేమిటి?

మాధ:- ఊహూ. పూలుకోస్తుంటే ముళ్ళుగుచ్చుకున్నా యేమోలే.

చంద్రా:-కొత్తచీర కట్టిన ఎకమేలేదు. అప్పుడే శుభ్రంగా చింపి అవతలపెట్టావు.

మాధ:-ఊ, చిరిగితే చిరిగిందిలే.

అనటానికైతే ఇలా అనేసింది మాధవి. కాని కళ్లల్లో నీళ్ళుగిర్రున కమ్ముకొచ్చాయి. స్వభావసిద్ధంగా చాలామంచి అమ్మాయి చంద్రావతి. కాని దేశసేవ నిమిత్తం భర్తగారు చేసేచేసే వుద్యోగానికి రాజీనామా పెట్టినప్పటినుంచీ బాలాజీ గారిపేరు తలిస్తేనే చిరాకు పడిపోతుంది. చంద్రావతికేసి చురచుర చూచింది విరజన్. తర్వాత మాధవికో "పిల్లా పెట్టెలోంచి ఇంకోచీర తీసికట్టుకో. ఇది విప్పేసిరా. రాను. బాను; ఆ చేతులు చూడు, ముళ్ళతో జల్లెడలా చేసు కొచ్చింది!

మాధ:-చాలా ఆలస్యమవుతుంది. ఇలాగేవస్తా.

విర:-ఇప్పు డప్పుడే మించుకుపోయిందేమీ లేదు. ఇంకా అరగంటకుపైగా ఆలస్యముంది.

ఇలా అని విరజన్ మాధవిచేతులు కడిగింది; తల దువ్వింది; అందమైన చీరెకట్టింది. పైన దుప్పటికప్పింది. ఆలింగనం చేసుకుని సజల నేత్రాలతో చూస్తూ "చెల్లీ! కం గారు పడొద్దు అవకాశాన్ని చేజారి పోనీయవద్దుసుమా" అంది.

"నువ్వు నా ప్రక్కనే వుండు. కాస్త సంభాళించుతూ వుండు. ఇవ్వాళ నా మనస్సుమీద నాకే నమ్మకంలేదు" అంది మాధవి చిరునవ్వుతో.

ఇవ్వాళ మాధవి ప్రేమ ఉన్మత్తతారూపం దాల్చిం దని అర్థం చేసుకుంది విరజన్. బహుశా స్వచ్ఛంద ప్రేమ కిదే పరాకాష్ట. ఔను; ఈ పిచ్చిది ఇసుకగోడలు నిర్మించు తోంది.

కొంచెం ఆగి అందరితో కలిసి విరజన్, సేవతి-చంద్రా మొదలైన వాళ్ళతో - సుహాను గారింటికి వెళ్ళింది మాధవి. అచ్చట స్వాగత - ఏర్పాట్లుచూచి ఆశ్చర్య చకితురాలై పోయింది. వాకిటిముందు చక్కటి పందిరొకటి వేశారు. అం దులో మంచిమంచి దుప్పట్లు పరిచారు. అద్దాలూ, రక రకాల పువ్వులూ - ఫోటోలూ అలంకరించారు. అభివాదన పాట వాయించబడుతోంది. పెద్దపెద్ద బుట్టలనిండా మిఠా యిలూ. పళ్ళూ - ఫలాలూ పెట్టి వుంచారు. విలువైనదుస్తులు ధరించి పట్నంలోని పెద్దలంతావచ్చి కొలువుతీర్చి స్వాగతా ర్థం కూర్చొనివున్నారు. చూద్దామన్నా ఒక్క జట్కాబండి కూడ ఎక్కడా కన్పించడంలేదు. కారణం బాలాజీగా రెప్పుడూ కాలినడకనే ప్రయాణం చేస్తుంటారట. ఎందరో చంకల్లో సంచులు తగిలించుకు నిల్చొనివున్నారు. వాటినిండా బాలాజీగార్కి బహూకరించటానికి కానుకలున్నాయి. రాజా ధర్మసింగ్‌గారి కుమార్తెలిద్దరూ మరింత శోభాయమానంగా వున్నారు. రంగురంగుల దుస్తులు వేశారు. పసుపువన్నె తల పాగాలు చుట్టారు. పట్టుగుడ్డ జెండాలు నడుంచుట్టూ తగి లించారు. బిగుల్ వాయించుతున్నారు. విరజన్ కనపడగానే ఒక్కసారి వేలాది శిరస్సులు గౌరవసూచకంగా క్రిందికి వంగాయి. ఈ లలనామణులంతా అక్కడనుంచి పెరటిలో

కెళ్ళారు. అక్కడా వసారా, గదులూ మొదలైన వన్నీ నవాగత వధువులా అలంకరించబడివున్నాయి. మంగళహారతులు పాడటానికి వందలమంది లలనామణులు కాచుకు కూర్చొనివున్నారు ఎక్కడచూచినా పువ్వులగుట్టలే. ఒక శ్వేతాంబరం ధరించింది సువామ. ఆనంద శాంతులకు ప్రతిమూర్తిలా గుమ్మంలో నిల్చొని వుంది. మాధవీ-విరజనుల్ని చూడగానే కన్నీటి-ముత్యాలు జలజల రాలి పడ్డాయి. "పిన్నీ! ఇవ్వాళ ఈ ఇంటి భాగ్యోదయమయింది" అంది విరజన్.

"బిడ్డా! ఇలాంటి సుదినం చూచే అదృష్టానికి నీవే మూలం. ఈశ్వరుడిందుకు ప్రతిఫలం ప్రసాదించుగాక" అంది సువామ గద్గదకంఠంతో.

ఒక విపద్గ్రస్థమాత కంఠంనుండి ఇలాంటి ఆశీర్వాదం వెలువడింది. ఒక విపద్గ్రస్తమాత శాపం దశరథ మహారాజుకు పుత్రశోకంలో మృత్యుదేవతాదర్శనం ప్రసాదించింది. సువామ ఆశీర్వాదం నీరు కారిపోతుందా?

ఉభయులూ ఈ విధంగా సంభాషించు కొంటున్నారు. ఇంతలో గంటలగణగణారావం, శంఖాలశబ్దాయమాననినాదం కర్ణరంధ్రాల్లో ప్రతిధ్వనించింది. "వచ్చేశారు వచ్చేశారు"అన్న జనారావంతో దశదిశలు పిక్కటిల్లాయి. మంగళగానం ప్రారంభించారు ముత్తైదువులు. హారతి పళ్ళెం పట్టుకుని రెప్పవాల్చకుండా దారికేసి చూస్తోంది మాధవి. కాస్సేపటిలోనే అద్వైతాంబరధారి నవయువక బృందం ఒకటి కంటికగపడింది. భారత కాంగ్రెసు సభ్యులు నూటయాభైమంది. గుర్రాల నధిష్టించి వస్తున్నారు. వాళ్ళవెనక అపార జనసముద్రం పొంగి

పొరలివస్తోంది. పట్నంలో ఇళ్ళదగ్గర ఒక్కపురుగు కూడా లేదు. కాలుతీసి కాలు పెట్టడం కష్టంగా వుంది భుజాలకు భుజాలు రాసుకుని పుల్లు పడిపోతున్నాయి బాలాజీగారి చంద్రముఖం మేఘాచ్ఛాదిత చంద్రోదయంలా కన్పిస్తోంది. లలాటంపై ఎర్రటితిలకం విరాజిల్లుతోంది. ఒంటిమీద కాషాయ దుప్పటొకటి వుంది.

గుమ్మం దగ్గర నిలబడివుంది సువామ. బాలాజీగారి ఆకారం కంటికగపడటమే తడవుగా మన స్థయిర్యం కోల్పోసాగింది. గుమ్మందాటి గబగబా బైటికొచ్చింది. నతమస్తకురాలై, నేత్రాలతో ముత్యాలహారం గుచ్చుకుంటూ బాలాజీగారి కెదురేగింది. ఇవ్వాళ తాను కోల్పోయిన పుత్రుని తిరిగి పొందింది. ఆ బిడ్డనెప్పుడు హృదయాన హత్తుకుందామా అని వ్యాకుల పడిపోతోంది.

ఈ రకంగా వస్తున్న సువామను చూచి ఎక్కడవాళ్ళక్కడే దిగ్భ్రాంతులై నిలబడిపోయారు. స్వర్గధామంనుండి ఏ దేవియో దిగివచ్చినట్టుగా కనపడింది. నలువేపులా నిశ్శబ్ద వాతావరణం వ్యాపించివుంది కొద్దిగా ముందుకెళ్ళి ఎదురొస్తున్న మాతృ చరణాలకు నమస్కరించాడు. అతని శిరస్సును తనహృదయానహత్తుకుంది సువామతాను.కోల్పోయిన పుత్రుడివ్వాళ తిరిగి లభించాడు. ఆవిడ నయనాలు అతనిపై ఆనంద బాష్పాలు క్రుమ్మరించుతున్నాయి.

ఈ ఉత్సాహ జనకదృశ్యంచూచి ప్రేక్షకుల హృదయాలు జాతీయ భావోన్మాదంతో తందనాలు తొక్కసాగాయి. "బాలాజీకిజై" అని యాభై వేల కంఠాలు మేఘ

గర్జనంచేశాయి. నలువేపులనుండి పుష్ప - వృష్టి వర్షించింది. "శాలిగ్రాంకీజై" అని మళ్లొకసారి మేఘం గర్జించింది. మాతృ భూమిప్రేమానురాగోన్మాదంతో ఉన్మత్తులై సువాము వేపుకు ఉరికారు. ఈ జయజయధ్వనులువిని ఉబ్బి తబ్బిబ్బైపోతోంది సువాము - నాగస్వరం విని నాగేంద్రుడు తన్ను మైమరచి పోయినట్టుగా. ఇవ్వాళ తాను కోల్పోయిన పుత్రుని తిరిగి పొందింది. ఈ అమూల్యరత్నగని లభించుటచే ఆవిడ మహా రాణీమై పోయింది. ఈ రత్నం మూలకంగానే ఇవ్వాళ ఆమె చరణ-ధూళి ప్రజల నేత్రాలకు అంజనంగా, శిరస్సులకు గంధంగా తయారై వుంది.

అపూర్వదృశ్యం. మాటిమాటికీ జయజయకారాలు మిన్నుముట్టుతున్నాయి. అక్కడ స్వర్గలోక వాసులకు భారత జాగరణ శుభసందేశాన్ని, వినిపిస్తున్నాయి. తల్లి తన కుమా రుని రొమ్మున చేర్చుకుని నిలబడివుంది. చాలాకాలానికి ఇవ్వాళ తన కోల్పోయిన పుత్రుని తిరిగి పొందింది. ఈ పుత్రుడు తన సమస్త జీవితార్జన. దశదిశలనుండి పుష్పాల జడివానకురుస్తోంది. కనకవర్షం వర్షిస్తోంది. తల్లీ - కొడుకులు ఇద్దరూ మొలలోతు పూలగుట్టల్లో మునిగివున్నారు. ఇలాంటి దృశ్యం చూచే అదృష్టం ఎవ్వరి నేత్రాల కబ్బివుంటుంది ?

బాలాజీ చెయ్యిపట్టుకుని లోపలికి బయలు దేరింది సువాము. గడపలో కడుగిడగానే మంగళహారతులు పాడింది వనితాలోకం. కనకపు పళ్ళెరంలో ధూప - దీప, పుష్పాక్షతలతో నీరాజన మిచ్చింది మాధవీదేవి. రక్త రంజిత పుష్ప

హారాన్ని మెడలో వేసింది. సజల నేత్రాలతో విరజన్ కేసి చూస్తూ నమస్కరించాడు.

బాలాజీగార్ని దర్శించాలని మాధవికెంతో అభిలాషగా వుండేది. కాని ఈ సమయంలో ఆవిడ నేత్రాలు పృథ్వీమాతను దర్శించడంలో లీనమైఉన్నాయి. బాలాజీ గారికేసి చూడనన్నా చూడలేదు. ఎంచేతంటే తన హృద్గత రహస్యభాండాన్ని ఎక్కడ బద్దలుకొడ్తాయో ఈ నయనాలు అని భయంగా వుంది. ఆ భాండంలో ప్రేమ - రసం నిండి వుంది. బాలాజీగారి దర్శన మొక్కసారి లభిస్తే అంతేచాలు నని ఇంతవరకూ వున్న అభిలాష. కాని నేడు కొత్త అభిలాషలు అంకురించాయి. కాని నెరవేరేవి మాత్రం కాదు. ఇవ్వాళ అభిలాషావనంలో కొత్తమొగ్గ ఒకటి పైకివచ్చింది. కాని వికసించి పరిమళం వెదచల్లటానికి మాత్రంకాదు. పై పెచ్చువాడి, ఎండి మట్టిలో కలిసిపోవడానికే. "ఇదిగో! ఓ అమాయకపుపిల్లా! ఇలాంటి అభిలాషాంకురాలను నీ హృదయస్థలిలో మొలకెత్తనీయవద్దుసుమా. లేకపోతే అవి నిన్ను ఏడ్పించి ఏడ్పించి హతమారుస్తాయి. నీప్రేమ కాల్పనికం; అదొక స్వప్నం. ఆ స్వప్నాలతో మాంచి పరిచయమున్న దానివే. దాని చవి బాగా చూచినదానివే ఇప్పుడే యదార్థ ప్రేమ ఎలావుంటుందో అని రుచి చూడగోర్తున్నావా?" అని ఆమెకు నచ్చ చెప్పగల్గిన నాథుడేడి?

## 24

మానవ హృదయం అభిలాషలకు క్రీడా - క్షేత్రం; కోర్కెలకు నిలయం. ఒకప్పుడు తల్లి అంకశయ్యపై ఆడు

కొంటూండేది పాపం. అప్పుడావిడ హృదయస్థలి ఒక ఇసుక ఎడారి. ఆశలూ, అభిలాషలూ లేని శూన్యహృదయం. కాని తర్వాత కొన్నాళ్ళకు మట్టితో బొమ్మరిళ్లు నిర్మించ సాగింది. అప్పుడు బొమ్మలకు పెళ్ళిళ్ళు చేయాలని అభిలాష-కలిగింది తోటిపిల్లలందరూ తమ బొమ్మలకు పెళ్ళిళ్లు చేస్తున్నారే మరి ఇక నా బొమ్మను ఎలా పెళ్ళి - పెటాకులు లేకుండా బ్రహ్మచారిణిలుగా వుంచేది? నా బొమ్మలకు నగలు చేయిస్తా; బట్టలుకుట్టిస్తా. సంబరాలు జరిపిస్తా." ఈ అభిలాష ఎన్నో నెలలవరకు మనస్సులో [illegible] వుంది. కాని ఆవిడ బొమ్మలపెళ్ళి నోము నోచుకోలేదు. ఒకరోజున మేఘాలుక్రమ్ముకొచ్చాయి. దబదబ వాన కడవలతో ఎత్తి గుమ్మరించినట్టుగా గుమ్మరించి పోయాయి. బొమ్మరిళ్ళన్నీ గంగపాలయ్యాయి. బొమ్మలకు పెళ్ళిచేయాలన్న హృదయం లోని అభిలాష హృదయంలోనే ఉండి పోయింది.

మరికొన్నాళ్లు గడిచాయి. తనతల్లి వెంట విరజన్ గారింటికి రాకపోకలు ప్రారంభమయ్యాయి. ఆవిడ మధుర సంలాపాలు ఆలకిస్తుండేది. ఎంతగానో సంబరాలు పడి పోయేది ఆమెపళ్లెం దగ్గర కూర్చుని అన్నం తినేది; ఆవిడ ఒళ్లోపడుకుని నిద్రపోయేది. అప్పుడింకో నూతనాభిలాష ఉదయించింది "నాకొక మంచి అందాలమేడా, మేడలో వెండి తలుపులూ వుంటే బాగుండును. గచ్చు ఈగవ్రాలితే జారి పడిపోయేటంత నున్నగా, శుభ్రంగా వుండాలి. విరజన్ అక్కను నా ఇంటికి ఆహ్వానిస్తా, మంచిమంచి పిండివంటలు చేయించి పెడ్తా. మెత్తటిపాన్పుపై పవ్వళింపచేస్తా. అన్ని

విధాలా సేవా శుశ్రూషలు చేస్తా." ఈ గొంతెమ్మకోర్కెల ఎన్నో ఏళ్ళవరకూ మనస్సులో ఎకచికాలాడుతూ వెక్కిరిస్తూనేవుంది. కాని ఆ బొమ్మరిళ్ళకు పట్టినగతే ఈ అద్దాల మేడకూ పట్టింది. ఆశలు నిస్పృహ-నిరాశారూపం దాల్చాయి.

కాలచక్రం మరికొన్ని చుట్లు తిరిగింది. ఇంతలో వయస్సు వచ్చింది; యౌవ్వనాంకురాలు ఉద్భవించాయి ఆమె మానస పటలంపై ప్రతాపచంద్రుని బొమ్మ గీయసాగింది విరజన్. ఆ రోజుల్లో ఇది మినహా మరో చర్చఅంటే తలకాయనొప్పిగా వుండేది. చివరకు ప్రతాపచంద్రుడికి దాసీనవాలన్న అభిలాష ప్రాదుర్భూతమయింది. పడుకుని తనలోతానే ఏదో అనుకుంటూ చెప్పుకుంటూ వుండేది. కంటికి నిద్రలేకుండా గొంతెమ్మ కోర్కెల రసాస్వాదనం ఆస్వాదిస్తోండేది. ఈ విషయాలవల్ల చిత్తంలో ఉన్మాదంలా ఏదో ఒక అజ్ఞాత వస్తువు వచ్చి ఆవరించేది. ఈ మధ్యకాలంలోనే అంతర్ధానమైపోయాడు ప్రతాప్. ఆ మట్టిబొమ్మరిళ్లవలెనే ఈ గాలిమేడలూ నేలమట్టమైనాయి. హృదయంలో ఆశాస్థానాన్ని దుఃఖ-శోకాలువచ్చి ఆక్రమించుకున్నాయి.

ఇప్పుడిక నిరాశా-నిస్పృహాలముందు ఆశలు కాలు మోపలేక అదృశ్యమైపోయాయి. ఈ నిరాశాదేవి శుభాగమనంతో ఎక్కడలేని దేవుళ్లూ-దెయ్యాలూ అన్నీ తలపుకొచ్చాయి, దేవీ దేవతల పూజలు ప్రారంభమయ్యాయి. ఉపవాసాలూ, వ్రతతప నియమాలూ చేయ మొదలిడింది. ప్రతాపు డెక్కడున్నా క్షేమంగా వుండాలని. ఈ రకంగా తన జీవితంలో అనేక సంవత్సరాలు 'తపస్విని'గా గడిపింది.

ఊహాజనిత ప్రేమోల్లాసంలో తన్ను తాను మరచివుండేది. కాని ఇవ్వాళ 'తపస్విని' వ్రతం భగ్నమైపోయింది. మనో వీధిలో కొత్త అభిలాషలు సంచరించసాగాయి. పదేళ్ల తపస్సూ క్షణమాత్రంలో ఇట్టే బూడిదలోపోసిన పన్నీరు చందమయింది. ఈ అభిలాషలుగూ ఆ బొమ్మరిళ్ళనే అనుకరిస్తాయూ ?

ఇవ్వాళ బాలాజీకి హారతియిచ్చింది. ఆ నిమిషంనుండీ కారే కన్నీళ్లు కారుతుంటే తుడిచే కన్నీళ్ళు తుడుచుకొంటోంది. మాధవి రోజంతా గడచిపోయింది. నెమ్మదినెమ్మదిగా నక్షత్రాలు ఒక్కొక్కటే బయటికొస్తున్నాయి. పగలంతా ప్రయాణంచేసి అలసటతో అస్త్రాద్రికేగాడు సూర్యభగవానుడు. పక్షిసమూహం గూళ్ళలో విశ్రాంతి తీసుకొంటోంది. కాని ఇందరు అలిసినా మాధవి నేత్రాలుమాత్రం అలవలేదు. ఎడతెగని ఆలోచనల్లో మునిగ తేలుతోంది. "అయ్యో ! ఇలా కన్నీరు మున్నీరుగా ఏడ్వటానికేనా నాజన్మ. నే నెప్పుడు నవ్వానని ఇవ్వాళ ఇంతగా ఏడ్వవలసివచ్చింది ? ఏడ్పులతో నే సగం జీవితం గడిచిపోయింది. శేష జీవితమూ ఇలాగే గడిచి పోతుందా ? ఒకరోజున నాకూ సుఖ - సౌఖ్యాలు చూచే అదృష్టం అబ్బిందిలే అని స్మరణకు తెచ్చుకుని ఆనందించే రోజు ఒక్కటీ నా జీవితంలో రాదా ? "ఇదివర కెన్నడూ ఇంతగా నిరాశ చెందలేదు, ఇంతగా వ్యాకుల పడలేదు. తన వూహాజనిత ప్రేమ - ప్రపంచంలో విహరిస్తొండేది. ఇవ్వాళ నవీన అభిలాషలు తలెత్తాయి. ఈ కన్నీటి బిందువులన్నిటికీ మూలకారణమదే. పదహారేళ్లవరకూ ఆశానిలయంగా వున్న

హృదయ మేదైనా వుంటే అనే ఇప్పుడు మాధవి భావాలను సరిగ్గా అంచనా వేయగల్గుతుంది.

సుహాస మనస్సులోనూ కొత్తకోర్కెలు ఉదయించాయి. బాలాజీ కంటికగపడనంతవరకూ ఒక్కసారి కన్పడితే చాలు, కంటినిండా చూచుకుని హృదయాగ్నిని చల్లపర్చుకుంటానని కోరుతుండేది కాని ఇవ్వాళ ఆ కోర్కె తీరగానే మళ్లీ ఏదో చూడాలని కొత్తకోర్కె పుట్టుకొచ్చింది. కాని విచారం! మాధవి బొమ్మరిళ్ళకు పట్టినగతే తనకూ పట్టటానికే ఇదీ పుట్టింది.

ఇవ్వాళ బాలాజీ, సుహాస విరజన్లు ముగ్గురూ కలిసి ప్రొద్దుపోకులగా ఏవో లోకాభిరామాయణం కబుర్లు చెప్పుకుంటూనే వున్నారు. స్వానుభవాలు వర్ణించి చెప్పాడు బాలాజీ. స్వీయ రామకథ వినిపించింది సుహాస. చెప్పటం మాత్రం బహుకొద్దిగానే చెప్పింది విరజన్. కాని వినటం మాత్రం చాలా ఎక్కువగా వింది, మున్షీసంజీవనలాల్ గారు సన్యాసం పుచ్చుకున్న సంగతి విని తల్లీ-కొడుకులిద్దరూ దుఃఖించారు. దీపాలు పెట్టే వేళకాబోతోంది. సంధ్యవార్చుకునే నిమిత్తం గంగానదికి వెళ్ళిపోయాడు బాలాజీ. వంట పనిలో మునిగిపోయింది సుహాస ఇవ్వాళ చాలా రోజుల అనంతరం ఎంతో ప్రేమతో వంటచేస్తోంది. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటున్నారు

సుహా:- అమ్మాయీ! ప్రపంచంలో నాకొడుకు మంచిపేరు-ప్రతిష్టలు గడించాలని నా హృదయం పూర్వాభిలాషగా వుండేది. నా కోర్కెను తీర్చాడు సర్వేశ్వరుడు. కన్నతండ్రికీ,

పుట్టిన వంశానికీ వన్నె తెచ్చాడు బాలాజీ. ఇవ్వాళ ఉదయం నా భర్తకు జేజేలుకొట్టడం చూచి నా హృదయం ఆనందంతో ఓలలాడిపోయింది నా కొడుకు ఈ వైరాగ్యవృత్తిని వదలి పెట్టాలన్నదొక్కటే ఇక నా అంతిమాభిలాష. దేశసేవ చేయవద్దని నేనేమీ అడ్డురావడంలా. అసలు ఇలాంటివరమే ప్రసాదించమని కాళికామహాతల్లిని అభ్యర్థించాను. కాని వాడీ విధంగా సన్యాసివేషంలో వుండటం చూస్తే నా గుండెలు వ్రయ్యలై పోతున్నాయి.

సునామమాటల అంతరార్థం గ్రహించింది విరజస్. "పిన్నీ! నన్నూ ఇదే మొదటినుంచీ పీడించుకు తింటోంది. అవకాశం లభిస్తే తప్పక్రీప్రసంగం తీసుకొస్తా.

సువా.-ఏమోమరి? అలాంటి అవకాశం లభిస్తుందో లేదో. వీడి నమ్మకమేముంది? ఎప్పుడు వెళ్ళాలని బుద్ధిపుడితే అప్పుడే వెళ్లిపోతాడు. ఒక ముల్లుకఱ్ఱ తీసుకుని అరణ్యాల్లో తిరుగు తోంటాడని విన్నాను. అదీగాక మాధవిస్థితి ఇక చూడలేను. దాన్ని చూస్తుంటే హృదయాన్నెవడో పీల్చి పిప్పిచేస్తున్న ట్టుగా వుంటోంది. ఆడవాళ్ళ నెందర్నో చూచాను. ఎందర్ని గురించో పుస్తకాల్లో చదివాను. కాని ఇలాంటి ప్రేమ ఎవ్వరి లోనూ చూడలా. పాపం సగమాయుర్దాయం ఏడ్పులతోనే గడిపేసింది. ఐనా ఒక్కనాడైనా విచారంగా వున్నట్టు కన్పించలా. ఏడుస్తూండగా ఎన్నడూ నేచూచే ఎరుగను. ఏడ్చే వాళ్ళ నేత్రాలూ, నవ్వేవాళ్ళ ముఖాలూ కనపడుతూనే వుం టాయి. అలాంటి కోడలే లభించాలని కోర్కెగా వుండేది. అదీ పూర్తిచేశాడు దేవుడు. దాన్నసలు నే కోడలుగానే

చూచుకొంటున్నాను. ఇందులో అబద్ధమేమీ లేదు. ఇవ్వాళ నుంచేకాదు, అనేక వేళ్లనుంచి.
వ్రజ:-ఇవ్వాళంతా ఏడ్పులతోనే గడిపింది. ఎంతో విచారంగా వున్నట్లు కన్పిస్తోంది.
సువా:-ఐతే ఇవ్వాళే ఆ ప్రసంగం తీసుకురా. రే పెక్కడి కన్నా ప్రయాణంకట్టి కూర్చుంటాడేమో. ఒకవేళ అలాంటిదే మన్నా జరిగితేమాత్రం మళ్లీ కొన్నియుగాలు ఏడుస్తూ కూర్చోవలసిందే.
వ్రజ:-(నవ్వి) ప్రసంగం తీసుకురావటానికైతే తీసుకువస్తా. కాని ఈ పని స్వయంగా మాధవి చేయగల్గినంత చక్కగా మరొకడు చేయలేడు.
సువా:-స్వయంగా తననోటితో ఏంచెప్పి ఏడుస్తుందిపాపం ?
వ్రజ:-నోటితో చెప్పనవసరంలా. దానికళ్ళే కథంతా వర్ణించి పారేస్తాయి.
సువా:-మరి లల్లూ తన మనస్సులో ఏమనుకుంటాడో ?
వ్రజ:- అనుకునే దేముంది? దాన్నసలు అవివాహితగా తలంచటం మీా భ్రమ. ప్రతాపచంద్రుని అర్ధాంగినిగా ఏనాడో అయింది మాధవి. ఈశ్వరుని దర్బారులో దాని వివాహం జరిగింది. లేకపోతే ప్రపంచంలో మగవాళ్ళకు కరువొచ్చిందా ఏమిటి? మాధవివంటి కన్యను పరిగ్రహించనటువంటి అభాగ్యు డెవ్వడున్నాడు? యావ్వనదశలో సగం కన్నీటిమున్నీటితోనే గడిపేసింది. ఈ ఘడియవరకూ పరపురుషుని కలలోనైన తలచి ఎరుగదు. పన్నెండేళ్ళయింది ఈ తాపసజీవితం ప్రారంభించి. పట్టు మంచంపై పడుకొని ఎరుగదు; రంగుచీరెలు

ధరించిన పాపానపోలేదు. తల దువ్వుకోనిగానీ, జుట్టుముడి వేసుకోనిగానీ ఎరుగదు. ఈ చర్యలన్నీ దేన్ని సూచిస్తున్నాయి? వివాహం జరిగినట్టుగా తెలియచేయడంలేదా? మనస్సుల కలియికనే హృదయసమ్మేళనమే యదార్థవివాహం. సిందూర తిలకం (మనలో మంగళసూత్రం మాదిరి రివాజు) బ్రహ్మముళ్లూ మొదలైనవన్నీ బాహ్యతంతులు.

సువా:- సరే, నీయిష్టం. నీకుతోచిన విధంగా చెయ్యి. కేవలం లోకనగుబాట్లంటేనే కాస్త నాకు భీతి.

రాత్రి తొమ్మిది గంటలవేళ. గగనమండలమంతా ఉజ్వల నక్షత్రాలతో మెరసిపోతోంది. ఉద్యానవాటికలో ఒంటరిగా కూర్చుని నక్షత్రాలకేసి తదేకదృష్టితో చూస్తోంది. అటు మనస్సులో ఆలోచిస్తోంది - "ఆహా! చూపులకీ నక్షత్రాలు ఎంత దేదీప్యమానంగావున్నాయి. కాని లాభమేమిటి? ఎక్కడో వున్నాయి. అక్కడికెవ్వడు వెళ్ళగలడు? నా ఆశలూ ఆ నక్షత్రాలమాదిరిగానే లేవుగదా?" హఠాత్తుగా విరజన్ వచ్చి చెయ్యిపట్టుకులాగింది. త్రుళ్ళిపడింది మాధవి.

విర:- చీకట్లో ఇక్కడేం చేస్తున్నావే?

మాధ:- ఏమీలేదు. చుక్కలు చూస్తున్నా. ఎంతచక్కగా వున్నాయంటే. కాని చేతికందని మాగ్నిపండ్లుగా.

ఈ చివరి వాక్యం విరజన్ హృదయంలో కళ్ళి బల్లెం లాగుచ్చుకుంది. కాస్త ఓపికతో ధైర్యంతో "నక్షత్రాలు లెక్కిస్తూ కూర్చునే సమయం కాదిది. ఏ అతిథినిచూచి ఇవ్వాళ చీకటి ముఖాన్నుంచి ఆనందం పట్టలేకుండావున్నావో అతనికి సత్కారాలు చేసేవిధమిదేనా?" అంది.

మాధ:-అలాంటి అతిధికి సేవా - శుశ్రూషలుచేసే అర్హత నా కెక్కడుంది ?
విర:-సరేకాని ముందు ఇక్కడనుంచిలే. తర్వాత ఆ అతిధి సేవా అర్హత లేమిటో చెప్తా.

ఇద్దరూ ఇంట్లోకి వెళ్ళారు. వంటతయారు చేసి వుంచింది సువామ. కన్నతల్లి వండినభోజనం ఎన్నాళ్ళకో ఈనాడు ప్రాప్తించింది బాలాజీకి. అత్యంత ప్రీతితో ఆరగించాడు. సువామ వడ్డిస్తూనూఉంది. అటు కన్నీళ్ళు తుడుచుకుంటూనూవుంది. భోంచేసి లేచాడు బాలాజీ. తర్వాత మాధవితో "ఇప్పుడీ మూల చేరబడి నోరూ వాయలేకుండా కూర్చున్నావెందుకే" అంది విరజన్.
మాధ:-ఇంత ప్రసాదం లభిస్తే తినిపడుకోవాలనివుంది.
విర:-మాధవీ! ఇంత బేలవై పోతున్నావెందుకు? ఇంతకాలం చేసిన తపస్సంతా ఒక్కరోజులోనే భగ్నం చేస్తావా ?

మాధవి లేచి నిలబడింది. కాని మనస్సులో నిరుత్సాహం వ్యాపించివుంది, ఒక్కొక్కప్పుడు కారుమబ్బులు క్రమ్ముకొస్తుంటాయి. భూమండలమంతా జలమయమై పోతుందా అన్నట్టుగా. కాని హఠాత్తుగా పడమరగాలి కొడ్తుంది. ఎక్కడిమేఘాలక్కడ పటాపంచలై పోతుంటాయి. ఈ సమయం మాధవి స్థితిగతులూ అలాగేవున్నాయి.

ఈ శుభఘడియ చూడాలని ఎన్నాళ్ళనుండో తహతహలాడిపోతోంది. "ఆయనగార్ని దర్శించేరోజుకూడ అదృష్టంలో వుందా? వారి వచనామృతం గ్రోలి తృప్తిపడే సుదినం నా నొసటను వ్రాసివుందా ?" ఈ శుభఘడియ కోసమే

నుంచి ఒక పవిత్రదేవస్థానంగా భావించుతున్న గది అదే. ఆ దేవాలయం విగ్రహంలేకుండా శూన్యంగా వున్నప్పుడు నిత్యమూవచ్చి అశ్రు - పత్రపుష్పతోయాలు సమర్పిస్తోండేది. కాని ఇవ్వాళ అది విగ్రహశూన్యంగా లేదు. మరెందువల్ల ఈనాడీ విధంగా మారాములతో, జంకుగొంకులతో వస్తోంది.

రాత్రి పూర్తిగా చల్లబడిపోయింది. రోడ్డుమీద గంటలధ్వని వినవస్తోంది. బాలాజీగారి శయనగృహం గడప వరకూ వెళ్ళింది మాధవీ బరువుగా అడుగులు వేసుకుంటూ. గుండెలు కొట్టుకుంటున్నాయి. లోపల పాదం పెట్టటానికి ధైర్యంచాలటంలా - ఎవ్వరో వెనకనుంచి పాదాలుపట్టుకు లాగుతున్నట్టుగా. వచ్చిన దారినే తిరిగివెళ్ళింది. నేలకు చేర బడి విలపిస్తోంది. ఆమె మనస్సు అంటోంది - "మాధవీ! ఇది చాలా లజ్జాస్పదమైన విషయం. బాలాజీగారి దాసురాలవే అగుగాక. అతనియెడ అపారప్రేమ నీకుందని అంగీకరిస్తా. కాని అంతమాత్రాన ఆయన భార్యవుకాదు. అంచేత ఈ అర్థ రాత్రివేళ అతని పడకటింటిలో వుండటం నీకు భావ్యంకాదు. నీకున్నప్రేమ నిన్ను అతనికి భార్యగా చేయజాలదు. ప్రేమ వేరు; మంగళసూత్రం వేరు. ప్రేమ ఒకచిత్త - ప్రవృత్తి; వివాహమొక పవిత్రధర్మం" అప్పుడు మాధవికొక వివాహో త్సవం గుర్తుకొచ్చింది. పందిరినిండా కూర్చున్న పెళ్లిపెద్దల ముందు వధువు హస్తం పట్టుకున్నాడు వరుడు. 'ఈ కన్యను నా గృహలక్ష్మిగా - నా మనోదేవిగా భావిస్తా. ఇందుకు ఈ సభాసదులూ, ఆకాశం, అగ్ని - దేవతలు అంతా సాక్షులు." అని అంటున్నాడు. ఆహా! ఎంతచక్కటి శుభవాక్యాలు!

ఇలాంటి వాక్యాలు వినే అదృష్టం ఏనాడైనా అబ్బుతుందా? అగ్నిదేవునీ సాక్షిగా వుంచుకోలేను. ఆకాశాన్నీ, దేవతల్నీ కూడా సాక్షులుగా చేసుకోలేను. కాని ఓ అగ్నిదేవుడా! ఓ ఆకాశనక్షత్రాల్లారా! ఓ దేవలోకవాసులారా! మాధవి తన పావన హృదయ మందిరంలో బాలాజీ పునీతమూర్తిని ఏనాడో ప్రతిష్టించుకొందని మీరంతా సాక్ష్యమివ్వాలి. కలనైన పరపురుషుని తలంచి ఎరుగ. దుర్భావనలకు తావివ్వలా. గృహంలోకి పాదంపెట్టి, ఓ అగ్నిదేవుడా! నన్ను కాల్చి పాగ వేయరాదా? ఓ ఆకాశమా! నీ అనంతచక్షువులతో ఇంట్లో కదుగిడుతుండగా నన్ను చూచివుంటే, ఊం, ఆలసించకు, ఈ క్షణంలోనే ఇంద్ర వజ్రాయుధాన్ని నామీద వేసి తుత్తునియలు చేసిపారేయి.

మాధవి కొన్ని నిమిషాలు ఈ ఎడతెగని ఆలోచనల్లో నేసతమతమవుతోంది, ఇంతలో హఠాత్తుగా "భగ్ భగ్" అనే ధ్వని కర్ణరంధ్రాల్లో కొచ్చి దూరింది. త్రుళ్ళిపడి నలుదిశలూ పరికించింది, బాలాజీగారి గదిలో ఏదో పెద్ద వెల్తురుగా వున్నట్టుంది. తలుపు సందుల్లోనుండి బైటకొచ్చి పెరటి ప్రాంగణమంతా వ్యాపించుతోంది. భయంతో స్తంభించి పోయింది మాధవి. డ్రాయరుమీది లాంతరే ఇలా మండివుంటుందని వూహించిది వాయువేగంతో వెళ్ళి బాలాజీగారి గదిలో ప్రవేశించింది. చూస్తే లాంతరు పగిలిపోయి నేలమీద పడి వుంది. నేలమీద పరచివున్న దుప్పటికి నూనె చిందిపడినందు వల్ల నిప్పంటుకుంది. దానికెదురుగా మరోప్రక్కన గురకలు పెట్టి నిద్రపోతున్నాడు బాలాజీ ఇప్పటికూడ నిద్రమేలోక

లేదు. తివాచీ చుట్టి ఒక మూలపెట్టి నిద్రించాడు. పిడుగు మెరుపులా పోయి దాన్ని అందుకొచ్చింది మాధవి. ఎత్తి ఆ మండేమంటపైన విసిరివేసింది. ఢాంమని ధ్వనివచ్చింది. ఉలిక్కిపడి లేచి కన్నువిప్పిచూశాడు. గదంతా పొగమయంగా వుంది. కిరసనాయిలు దుర్గంధం ముక్కుపుట్ట బద్దలు కొడుతోంది. కారణం అర్థమయింది. "దేవుడు రక్షించాడు. లేకపోతే గదంతా కాలిపోయేది" అన్నాడు.

మాధ:-బాలాజీ! ఈ లాంతరు బ్రద్దలైపోయింది.

బాలా:-నువ్వు సమయానికొచ్చావు

మాధ:-ఇక్కడే బైటకూర్చొని వున్నా.

బాలా:-చాలా కష్టపడ్డావు. వెళ్ళి కాస్త విశ్రాంతి తీసుకో. చాలా ప్రొద్దుపోయింది.

మాధ:-వెళ్తానులెండి. నిద్రలూ విశ్రాంతులూ రోజూ వుండనే వుంటాయిగా. కాని ఇలాంటి అవకాశం మళ్ళీమళ్ళీ వస్తుందా?

మాధవి వాక్యాలు కరుణాపూర్వంగా వున్నాయి. ఆమెకేసి తేరి పారచూశాడు బాలాజీ ఆశ్చర్యచకితుడయ్యాడు. మొదట చూచినప్పుడు నవనవలాడుతూ వికసించుతున్న మల్లెమొగ్గలా కన్పించింది. కాని ఇప్పుడుచూస్తే వాడిపోయిన పుష్పంలావుంది. ముఖంలో కళ లేదు. నేత్రాల్లో ఆనంద చంద్రికా ప్రపంచం. పాపిట్లో పునిస్త్రీ లక్షణమైనట్టి మెరిసే సింధూరబిందు కాంతి లేక అలాంటప్పుడు కుంకుమ బొట్టు కన్పించడంలా. ఒంటిమీద ఆభూషణాలంకారాలు మచ్చుకైనా కానరావడంలా! ఈ నిండు యౌవ్వనంలోనే ఈ దౌర్భాగ్యగాని పసుపు - కుంకుం ఎత్తుకుపోయి వుంటాడు బ్రహ్మ

జేవుడు" అని అభిప్రాయపడ్డాడు బాలాజీ. చింతాగ్రస్థ మోముతో "ఏం మాధవీ. నీకు వివాహమయిందికదూ?" అనిప్రశ్నించాడు.

మాధవి మనస్సులో కత్తిలా గుచ్చుకుంది. సజల నేత్రాలతో "ఔను, అయింది" అని జవాబిచ్చింది.

బాలా:- మరి నీ భర్త?

మాధ:-ఆయనగార్కి నా గొడవేమీ పట్టదు. అదీగాక ఆయనగారి పెళ్ళి నాతో జరగలా.

బాలా:-"ఏంపని చేస్తాంటాడు నీపతి?"అన్నాడు విస్మయంతో.

మాధ:-దేశసేవ.

బాలాజీ నేత్రాల ముందునుండి తెరలాంటి దేదో వైతొలగి పోయినట్టుగా కన్పించింది. మాధవీ మనోభీష్ట మేమిటో గ్రహించాడు. వెంటనే "మాధవీ! ఈ వివాహం సంపన్నమై ఎన్నాళ్ళయింది?" అని ప్రశ్నించాడు.

బాలాజీ నేత్రాలు చెమ్మగిల్లాయి. ముఖమండలంలో జాతీయ భావోన్మాదం చిందులుతొక్కింది "ఓ భారత మాతా ఇలాంటి అధఃపతన స్థితిలోకూడ నీ అంకస్థలిలో ఒక్క భావం, ఒక్క ఆశయం కోసం యావ్వనమంతా, కాదు జీవిత మంతా మందస్మితవదనంతో గడిపివేసే ఇలాంటిలలనామణులు కేళీ-క్రీడలు ఆడుకుంటున్నారు. "అయితే అలాంటి భర్తకు స్వస్తి చెప్పరాదా?" అని తిరిగి ప్రశ్నించాడు.

బాలాజీకేసి అభిమానపూర్వకంగాచూచింది మాధవీ. మళ్ళీ "స్వామీజీ! మీనోటినుండి అలాంటి పల్కులురానీయ కండి. నేను ఆర్యబాలను. గాంధారీ, సావిత్రీ మొదలైన నారీ

మణులు జన్మించిన జాతిలో నాజన్మ. ఒక్కసారి మనస్సులో స్వభర్తగా భావించుకున్న వ్యక్తిని మరణ పర్యంతం త్యజించ జాలను. నా జీవితమంతా ఈ రకంగా ఏడ్పులతో గడచి పోయినాసరే, కాని ఆ భర్తను గురించి అన్యథా భావించ జాలను. బొందిలో ప్రాణమున్నంతవరకూ వారికి ఆయురా రోగ్యాలు కల్గచేయాలనే భగవంతుని ప్రార్థించుతూంటా. ఇలాంటి త్యాగమూర్తిపట్ల ప్రేమానురాగాలు నా హృద యంలో వాసంచేస్తున్నాయి. ఇదేంతక్కువా? దీన్నే నా అదృష్టంగా, నా మంగళసూత్రంగా భావిస్తా. నా పతి దేవుని ఒకసారి ఎడంగావుండి చూచాను. ఆ స్వరూపం నేత్రాల్లో నుండి ఒక్కక్షణంపాటైనా వైదొలగిపోవడంలేదు. నేనుజబ్బు పడ్డప్పుడల్లా ఆ స్వరూపమే నాకు సేవచేసింది; నన్ను రక్షిం చింది విరహాశ్రుబిందువులు చిందించినప్పుడల్లా ఆ స్వరూపమే నన్ను ఓదార్చింది. అటువంటి పతిని ఎలా త్యజించగలను? నే నతని భార్యను. సర్వదా భార్యగా నేవుంటా నా మనః ప్రాణాలన్నీ ఆయనకే సమర్పించాను ఆయన గనక శెలవిస్తే పూలపాన్పుపైకి వెళ్ళినమాదిరిగా సంతోషంతో వెళ్ళి అగ్ని దేవుని అంకస్థలిలో ఆసీనురాలను కాగలను. వారి కార్య కలాపాల్లో దేనికైనా ఏ విధంగానైనా నా ప్రాణాలు ఉప యోగపడ్తాయనుకుంటే ప్రసన్నతాపూర్వకంగా హాజరుపెడ్తా- ఒకభక్తుడు తన ఇష్టదేవునకి పండ్లు సమర్పించినట్లుగా.

మాధవి వదనమండలం ప్రేమ - జ్యోతితో ధగధగ మెరసిపోతోంది. రామాయణమంతా విని మూగనోము పట్టి కూర్చున్నాడు బాలాజీ. ఏదో ఆలోచిస్తున్నాడు "కేవలం

నన్నే స్మరించుతూ తన జీవితపుష్పం సమర్పించిన నారీమణి." ఈ భావోదయంతో కళ్లలో కన్నీళ్ళు గిర్రున క్రమ్ము కొచ్చాయి. ఒక లలనామణి జీవితదీపం ఆర్పింది ప్రేమ. మరి అలాంటి ప్రేమకు ఒక మనుష్యమాత్రుని ధైర్య - సాహ సాలు బుగ్గిపాలు చేయటం గొప్ప కష్టమైన పనేమీకాదు. ప్రేమముందు ధైర్యం ఎందుకూ పనికిరాదు. "మాధవీ! నీబోటి నారీరత్నాలు భారతభూమికి గౌరవ స్వరూపిణులు. పరమ సౌభాగ్యశాలిని నేను. నీ ప్రేమ అనే వెలలేనివస్తువు అనాయాసంగా నాచే జిక్కింది. నా నిమిత్తం యోగినీజీవితం గడపటానికి అంగీకరించావు. కనక నేనూ ఈ వైరాగ్య - సన్యాసాలకు స్వస్తి చెప్పగలను. ఎవ్వరి నిమిత్తం నీవు నీ జీవితం మట్టిపాలుచేశావో అతను నీ నిమిత్తం ఎంత గొప్ప త్యాగమైనా చేయటానికి వెనుదీయడని గట్టిగా నమ్ము."

అందుకు మొదటినుంచీ సిద్ధమయ్యేవుంది మాధవి. వెంటనే అందుకుని "స్వామీజీ! నేను అబలను విద్యా బుద్ధులు శూన్యం. ఐనా నిజభోగవిలాసాల తలంపు ఒక్కనా డైనా కలలోకూడ రాలేదనిమాత్రం దృఢంగా, నమ్మకంగా చెప్పగలను. నా ప్రేమోద్దేశ్యం మీ చరణాల్ని లౌకికబంధ నాలతో బంధించాలని కాదు. ఒక వేళ దురదృష్టవశాత్తు అలాభావించి వుంటే (చేతులు జోడించి) దీని అంతరార్థం అర్థం చేసుకోలేదని విన్నవించుతున్నా. నేను లభించిన ప్రసాదమే నా ప్రేమోద్దేశ్యం. ఇది నాజీవితం మొత్తంలో సుదినం ఇవ్వాళ నా ప్రాణనాథుని ఎదుట నిలబడివున్నా నా వీనులతో వారి అమృతవాక్కుల్ని వింటున్నా. స్వామీజీ

ఇలాంటి శుభఘడియ చూచే సౌభాగ్యముందని నేనెన్నడూ ఆశించలా. ఈ సమయంలో గనక నా దగ్గర విశ్వ సామ్రాజ్యం వుండివుంటే సహర్షంగా మీ చరణారవిందాలకు సమర్పించి వుండేదాన్ని. చేతులుజోడించి మరీ విన్నవించుకుంటున్నా. ఈ పాద - పద్మాల సన్నిధినుండి ఇక వేరుచేయకండి. వైరాగినీ అవుతా. విభూతి రాచుకుంటా. కాని మీ చరణాలు మాత్రం విడువను. ప్రాణవల్లభా! కష్టాలెన్నో చూచా, అనుభవించా, సహించగల్గా కాని ఇప్పుడీ తాపం మాత్రం సహించలేకుండా వున్నా."

ఇలా అంటూఅంటూ మాధవి కంఠం గద్గదమైపోయింది. నయనాల నుండి ప్రేమ ఆనంద బాష్పాలు ప్రవహించాయి. ఇక అక్కడ కూర్చోలేకపోయింది. లేచి నమస్కరించింది. వెళ్ళి విరజన్‌వద్ద కూర్చుంది. కౌగిలించుకుని "ఏం మాట్లాడుకున్నారేమిటి?" అని ప్రశ్నించింది విరజన్.

మాధ:-మీ ? భిలషించింది.

విర:-నిజం! ఏమన్నారేమిటి?

మాధ.-అదిమాత్రం చెప్పను.

వ్రజరాణికి లంకిణీ బిందెల ధనం లభించినట్లుగావుంది. చాలాకాలానికి భగవంతుడు నా కోర్కె తీర్చాడు మాయింటి దగ్గరే పెళ్ళిచేస్తా" అంది.

నైరాశ్యభావంతో చిరునవ్వునవ్వింది మాధవి "నన్ను మరచిపోవుగదా?" అదివిరజన్ కంపిత కంఠస్వరంతో. నేత్రాలు వశం తప్పిపోయాయి. కన్నీటివర్షం కురుస్తోంది.

కంఠస్వరం కాస్త సంభాళించుకుని "మమ్మల్ని విడిచిపోతావు కాబోలు" అంది.

మాధ:-మిమ్మల్ని వదలి ఎక్కడికీ వెళ్ళను.

విర:-ఇక చాలించు, వూరికే గొప్పలు చెప్పకు.

మాధ:-చూస్తూ వుండు.

విర:-అన్నీ చూస్తానుగానీ, సరే ఏం చీరె కట్టుకుంటావు?

మాధ:- తెల్లటిచీరె, కొంగరెక్కలలాంటి తెల్లటిచీరె.

విర:- పెళ్లి చీరె పసుపుపచ్చగా వుంటుంది.

మాధ:- ఉంటే ఉండొచ్చు. కాని నాదిమాత్రం తెల్లగానే వుంటుంది.

విర:- చంద్రహారం నీ కెంతో అందంగావుండే నా హారం ఇస్తానులే.

మాధ:- అక్కా! హారానికి బదులు పట్టెడయివ్వవే.

విర.- ఇవేం మాటలే

మాధ:- ఏం మాటలున్నాయీ? నా సింగారానికి సంబంధించినవేగా.

విర:- నీ మాటలు అర్థంకావడంలేదు. ఇప్పుడింత విచారంగా వున్నావెందుకని? ఈ రత్నం కోసమే గదా ఇంత ఘోరాతిఘోరతపస్సూ, ఇంతి యోగాభ్యాసమూ, ఇన్ని వ్రతాలూ చేసింది. మరి ఇవ్వాళ ఆరత్నం చేజిక్కితే ఉల్లాసంగావుండని కారణమేమిటి?

మాధ:-నువ్వుచూస్తే పెళ్లిగొడవలు తెస్తున్నావామె. అందుకని నాకు భయంగా వుంది.

విర:- మరి ఆనందకర విషయమిదేగా.

మాధ:- అక్కా! నాలలాటాన ఈ ఆనందం లిఖించబడలేదు. గగనవీధిలో గూడుకట్టుకోవాలని కలలుగనే పక్షి సర్వదా చెట్టుకొమ్మలమీదనే వుంటుంది. జీవితంలో శేషసమయం అదేవిధంగా ప్రేమ-స్వప్నాలు చూస్తూ గడపాలని నిశ్చయించుకున్నా.

## 25

మర్నాడు ఉదయం స్నాన సంధ్యాదులు తీర్చుకున్నాడు బాలాజీ. రాజా ధర్మసింగు కోసం ఎదురుచూస్తున్నాడు. ఇవ్వాళ 'రాజఘాట్' వద్ద ఒక పెద్ద గోశాల శిలాన్యాస మహోత్సవం జరగబోతోంది పట్నంలోని వీధులూ, దుకాణాలూ ముసిముసిగా నవ్వుతున్నట్లుగా గోచరిస్తున్నాయి. రోడ్ల కిరుపార్శ్వముల చిన్న-పెద్ద జెండాలెన్నో రెపరెపలాడుతున్నాయి. గృహద్వారాలు పుష్ప-తోరణాలతో స్వాగతార్థం సిద్ధంగా వున్నాయి. కారణం, తన సర్వస్వమూ దేశ శ్రేయస్సు కోసం స్వాహాచేసిన ప మ దేశభక్తుని శుభాగమనం నేడు.

ప్రసన్నతాదేవి స్వసఖీ-సఖురాండ్రతో కలిసి స్వేచ్ఛా విహారం చేస్తోంది. మందమందంగా వీస్తోంది మలయానిలం. విచార-విషాదాల ఛాయలుకూడ ఎక్కడా కన్పించడంలా. ముఖ్య ప్రదేశాల్లో స్వాగత గీతం వాయించబడుతోంది. కళ్లు చెదరిపోయే దుస్తులతో భూమిమీద కాలు ఆనకుండా తిరుగుతున్నారు షోకిల్లా పురుషులు. షోడశ శృంగారాలు శృంగారించుకుని మంగళగీతాలు పాడుతోంది మహిళాలోకం, పసుపు

వన్నె తలగుడ్డలు చుట్టుకుని కిలకిల లాడుతున్నాయి బాల బాలికల జట్లు. ఏ వ్యక్తిని చూడబోయినా ప్రసన్నత ఉట్టి పడుతోంది ముఖారవిందంనుండి. కారణం, ఇవ్వాళ ఒక నిష్కళంక ప్రజాసేవకుని శుభాగమనం. తన సర్వస్వమూ దేశశ్రేయస్సు కోసం సమర్పించిన మహనీయుని శుభాగమనం.

అనుచర బృందంతో కలిసి "రాజఘాట్"కు బయలు దేరాడు బాలాజీ. ఆ సమయంలో ఉదయాద్రినుండి స్వాగత మిచ్చాడు సూర్యభగవానుడు. అతని దివ్యముఖారవిందం చూచి "భారతమాతకూజై" అని భూనభోంతరాళాలు తల్ల డిల్లేటట్టుగా ఒక్కసారి నినదించాయి వేలాదిగొంతులు. ఆ జయజయకారం వాయుమండలాన్ని భేదించుకుంటూ నభోమండలంలోకి వెళ్ళిపోయింది. గంటలు గణగణమ్రోగాయి. శంఖారావాలతో చెవులు దిబ్బళ్లు వేసుకుపోయాయి. మహోత్సవ స్వాగతరాగం గాలిలో ప్రతిధ్వనించింది. దీపం చూడగానే చుట్టూ చేరుతోంటుంది మిడతలగుంపు. అదేవిధంగా బాలాజీని చూడగానే చుట్టూవచ్చి మూగారు ప్రేక్షకులు. నూటయాభైమంది భారత కాంగ్రెసు సభ్యులు సైనికవందనం చేశారు. వాళ్ళ అందమైన యూనిఫారమూ, చంచల అశ్వాలూచూడ ముచ్చటగా వున్నాయి. ఈ సంఘంలోని ప్రతి సభ్యుడూ దేశ శ్రేయోభిలాషి ఆ సభ్యుని ప్రతిపదమూ, ప్రతి వాక్యమూ ప్రేక్షకుల హృదయాల్ని ఉత్సాహంతో ఓలలాడించుతుండేది. దానికి కిరుప్రక్కలా బారులుతీరి నిలబడి వున్నారు సభ్యులంతా. స్వాగతగీతం వాయించబడుతోంది.

పుష్పవర్షం కురుస్తోంది. ప్రతిచోట నగర నారీమణులు కనక పళ్ళెరాల్లో ధూపదీపాలూ, కర్పూరచందనాలూ, తీసుకుని హారతు లివ్వటానికి సిద్ధంగా నిల్చొనిఉన్నారు. నవాగత వధువులా దుకాణాలు అలంకరించబడివున్నాయి. ఇవ్వాళ పట్న శోభ చూస్తే సిగ్గుతో తలవంచుకొంటోంది పుష్పవనం. శ్రావణమాసంలో నీలమేఘాలు క్రమ్ముకొస్తుంటాయి; ఉండుండి మేఘగర్జనలు గుండెలు దద్దరిల్ల చేస్తుంటాయి. అదేరకంగా 'భారతమాతకూజై' అన్న ప్రజల సినాదం హృదయాల్లో ఉత్సాహ, ఉద్రేకాలు రేకెత్తించుతోంది. బాలాజీ రాగానే ఒక అత్యద్భుతదృశ్యం కంటపడింది. బాలిబాలికలు గోధుమరంగు కోట్లు తొడిగారు. పసుపువన్నె తలపాగలు చుట్టారు. చేతుల్లో ముచ్చటొచ్చే కోలాటం చిరతలు పుచ్చుకొన్నారు. దారికడ్డంగా నిలబడివున్నారు. బాలాజీగారు రావడంతోనే పదివరుసల్లో బారులుతీరి నిలబడ్డారు కోలాటం వేస్తూ మహోత్కృష్టగీతం పాడసాగారు.

"మంగళం, జయమంగళం బాలాజీ
శుభమంగళం తవాగమనం బాలాజీ"
ధన్యధన్య మీ నగరసౌభాగ్యం బాలాజీ
ధన్యధన్య మస్మత్సౌభాగ్యం బాలాజీ॥
ధన్యధన్యులీ నగరవాసులు బాలాజీ
తవచరణ-ధూళి సోకిందీ బాలాజీ ॥ మంగళం ॥

ఎలాంటి చిత్తాకర్షక దృశ్యం! గీతం సాధారణగీతమే. కాని అనేక గొంతులు కలిసి లయయుక్తంగా పాడాయి. ఎంత మనోహరంగా, ఎంత ప్రభావయుక్తంగా వున్నాయంటే

ఎక్కడిపాదాలక్కడ ఆగిపోయాయి. ఎటుచూచినా చీమ చిటుక్కుమనటంలేదు. అలాంటి వాతావరణంలో ఈ మధుర గానం నిశ్శబ్ద నిశీధ వేళలో కోకిల స్వరంలా వినపడింది. ప్రేక్షకులంతా రాతివిగ్రహాల్లా నిలబడివున్నారు "దీన భారతీయులారా! ఇలాంటి దృశ్యాలు చూచే అదృష్టం మీ కెక్కడిది? ఇప్పుడన్నా తనివితీరచూడండి. నిజం, భోగం పడుచుల నృత్య - సంగీత - వాయిద్యాలు చూచి పరమానంద భరితులై వుంటారు. వారాంగనల కేళీ- విలాసాలెన్నో దర్శించి వుంటారు. స్వేచ్ఛగా తిరిగి వుంటారు. వినోద - విహారాలూ, సైరు షికార్లూ చేసివుంటారు. కాని ఈ సమయంలో మీ రనుభవిస్తున్న యదార్థ ఆనందం, సుఖద ఉత్సాహం ఇంకే సమయంలో నన్నా పొంది వున్నారా? వారకాంతల హావ-భావాలూ, వేశ్యాంగనల సంగీత వాయిద్యాలూ ఇంద్రియ వాసనల్ని ఉద్రేకపరుస్తాయి. మీ మనో స్థయిర్యాలనూ, ఉత్సాహాన్ని మరింత బలహీనపరుస్తాయి. కాని ఇలాంటి దృశ్యాలు జాతీయత, జాతీయాభిమానమూ రేకెత్తిస్తాయి. జీవితంలో ఒక్కసారి చూచినాచాలు. దాని పునీత స్మృతి చిహ్నం మీ హృదయాల్లోంచి చెరిగిపోదు.

బాలాజీ ముఖమండలం ఆత్మానంద జ్యోతితో మెరసిపోతోంది. నేత్రాలు దేశాభిమాన కిరణాలు వెదజల్లుతున్నాయి. పచ్చగా నవనవలాడుతున్న తన చేనుచూచుకుని కర్షకుడు ఆనందంతో ఉన్మత్తుడై పోతుంటాడు. అదేవిధంగా వుంది ఇప్పుడు బాలాజీ స్థితికూడా. పాడటం పూర్తికాగానే

కొన్ని అడుగులు ముందుకేశాడు. ఇద్దరు పిల్లల్ని భుజాలపై ఎక్కించుకుని "భారతమాతకు జై" అని అన్నాడు.

నెమ్మది నెమ్మదిగా జనులు గుమికూడసాగారు. రాజ ఘాట్ వద్ద ఆకాశాన్నంటే గోశాలభవనం ఒకటి స్వాగతార్థం నిలబడివుంది. దాని ప్రాంగణమంతా మల్లు దుప్పట్లతో పరచ బడివుంది. గృహద్వారాలూ, స్తంభాలూ అన్నీ పత్రపుష్పాల తోరణాలతో శోభిల్లుతున్నాయి. గోశాలలోపల వెయ్యి ఆవులు కట్టివేసి వున్నాయి. వాటిమేత తొట్లలో స్వహస్తా లతో పొట్టూ - తెలగపిండీ వేశాడు బాలాజీ. ప్రేమతో వీపులు తట్టాడు. అందులో మరొకచోట పాలరాళ్ళతో కట్టిన ఎనిమిది పలకలుగలగొయ్యి ఒకటి వుంది. అదిపై కల్లాపాలతో నిండివుంది. కాసిని పాలు తీసుకుని కళ్ళకద్దుకుని పానం చేశాడు.

వచ్చిన ప్రజలింకా ప్రశాంతంగా సర్దుకు కూర్చోనన్నా కూర్చోలేదు. ఇంతలో కొందరు మనుష్యులు పరుగెత్తుకుంటూ వచ్చారు. వచ్చి "బదలూశాస్త్రి, సేఠ్ ఉత్తమచంద్, లాలా చమనలాల్ బైటనిలబడి అల్లరిచేస్తున్నారు. బాలాజీతో రెండే రెండు ముక్కలు మాట్లాడుకోనివ్వమని అడుగు తున్నారు. బదలూశాస్త్రి కాశీలో ప్రసిద్ధ విద్వాంసుల్లో ఒకడు. చక్కటి అర్ధచంద్రాకారం బొట్టూ, మోకాళ్ళదాకా పచ్చఉన్నిచొక్కా, పసుపుపచ్చ తలపాగ-ఇవీ అతనిదుస్తులు. ఉత్తమచంద్ - మాఖనలాలు లిద్దరూ కాశీలో గొప్పషావు కార్లు. బిరుదులకోసం లక్షలకు లక్షలు రాగిదమ్మిడీల్లా ఖర్చు పెట్టారు. గొప్పగొప్ప ఉద్యోగస్థుల, అధికార్ల అడుగులకు

మడుగులొత్తుతూ సన్మానాలు చేయటం తమ కర్తవ్యాల్లో ఒకటిగా భావించు తుంటారు. వీళ్ళకు పట్నం మొత్తంమీద పలుకుబడీ పెత్తనమూ బాగా వున్నాయి. బదలూ శాస్త్రితో శాస్త్రీయచర్చల్లో ఎవ్వడూ గెల్వలేడు. ప్రత్యేకంగా కాశీ పండాలూ, ప్రయాగ పురోహితులూ, ఈ వర్గానికి చెందిన తదితర్లూ అంతా శాస్త్రిగారి మాటమీద నెత్తురు చిందించ టానికైనా వెనుదీయరు. శాస్త్రిగారు కాశీలో హిందూమత రక్షకుడుగా, దాని ఆధార స్తంభంలా ఎంచబడుతుంటాడు. ఉత్తమచంద్-మాఖనలాలులు కూడ గొప్పమత పిచ్చగాండ్రు. బాలాజీతో శాస్త్రీయచర్చలు జరపాలని ఎన్నాళ్లనుంచో ఆరాటపడుతున్నారు. ఇవ్వాళ అలాంటి అవకాశం లభించింది. పండాలూ, ప్రయాగ పురోహితులూ అంతా కలిసి ఒక పెద్ద గుంపుతో వచ్చిచేరారు.

ఈ మహానుభావులు దయచేశారని విని బైటికరుదెం చాడు బాలాజీ. చూస్తే పరిస్థితి విషమించివుంది. ఉభయ పక్షాలూ లాఠీలు పుచ్చుకొని వున్నారు. చొక్కాలు పైకెగ దీసుకుంటూ తారసిల్లటానికి సిద్ధపడుతున్నారు. 'ఇంకా చూస్తారేమిటి? ఈ శూద్ర వెధవను తుండేలు తుండేలుగా నరికి అవతల పారేయండి. కేసుగీసు భయమేం అక్కర్లేదు. నేనున్నాగా మీమీద ఈగవ్రాలితే అప్పుడనండి" అని ఉద్రేకపరుస్తున్నాడు శాస్త్రుర్లు. "అతనంటే అంతపడి చచ్చే మొనగాళ్ళెవరో కాస్త ముందుకురండి. ఆ అభిమానమూ, ఆ గొప్పతనమూ ఏమిటో చూపిస్తా" అని గొంతు చించు కుంటున్నాడు. ఈ వరసచూచి బాలాజీ ధర్మసింగుతో

"ఈ దుర్మార్గం వదలిపెట్టమనీ, లేనిచో ఉభయులూ నష్ట పడ్తారనీ, లోకం నవ్వుతుందనీ వెళ్ళి నచ్చచెప్పండి" అని అన్నాడు.

రాజాగారి కళ్ళు చింతనిప్పల్లా వున్నాయి. "ఇతనితో మాట్లాడటమే పరువునష్టం" అని నా దృఢాభిప్రాయం. ఈ ప్రయాగ పురోహిత గుంపును చూచి కాస్త విర్రవీగుతు న్నాడు. కాని ఇవ్వాళ వాడి మాజంఅంతా అణచివేస్తా. మీమీద దెబ్బ తియ్యటానికేవచ్చారు. అంతకన్న మరో వుద్దేశ్యంలేదు. ఐనా నేనూ, నా ఇరుగురు పుత్రులూ బ్రతి కుండగామాత్రం మీకేసి దుర్బుద్ధితో తలెత్తి చూడ్డంకూడ వాళ్ల తరంకాదు. మీరు కాస్తం 'ఉం' అంటే చాలు, కన్ను మూసి కన్ను తెరచినంతలో ఈ దుర్మార్గానికి మజా చూపిస్తా"

ఈ రామకుమారుడు ఆవేశ పడుతున్నాడు. క్షత్రియ కుమారుడు ఆవేశ పడ్డప్పుడు చంపటమో, లేక చావటమో తప్ప రెండోది దృష్టిలోకి రాదు. బాలాజీ ఈ విషయం బాగా అర్థం చేసుకున్నాడు. "రాజా! దూరదృష్టిగల వ్యక్తి వైపుండి కూడ ఇలాంటిమాటలు మాట్లాడుతున్నావేమిటి? ఇలాంటి మాటల కిది తరుణంకాదు. వెళ్ళండి; మీ మనుష్యుల్ని ముందు ఆపుచేయండి. లేకపోతే వ్యవహారం ముదిరి చెడుగా పరిణమిస్తుంది.

బాలాజీ ఇలా అంటూ అంటూ మధ్యలో ఆగి పోయాడు. సముద్ర కెరటాల్లా ఉభయపక్షాలూ పడదోసు కుని ముందుకొస్తున్నారు. చేతుల్లో లాఠీలున్నాయి. కళ్లు

నిప్పులు గ్రక్కుతున్నాయి. ముఖాలు కోపోద్దీపితములై ఉన్నాయి. కనుబొమ్మలు పైకెగసివున్నాయి. చూస్తూ చూస్తూనే జనప్రవాహం ప్రయాగ పురోహిత బృందంపైకెగసివచ్చింది. లాఠీలు శిరస్సుల్ని ముద్దుకో బోతున్నాయి. ఇంతలో బాలాజీ విద్యుత్ లా చంగున ముందుకొచ్చి ఎగిరి గుర్రమొకటిఎక్కి కూర్చున్నాడు. బిగ్గరగా—

"దేశ సోదరులారా! ఏంగ్రుడ్డితనమిది? ఏంఅన్యాయమిది? నన్నే గనక తమ మిత్రుడిగా భావిస్తున్నట్లయితే వెంటనే లాఠీలు దింపండి ఒక్కఅంగుళంకూడ ముందుకు వెళ్లకండి. మీ హృదయాల్లో వీరపురుషోచిత ఆవేశ-క్రోధాలున్నందుకు నా కెంతో గర్వంగావుంది. క్రోధ మనేదొక పవిత్ర ఉద్వేగం; ఒకపావన ఉత్సాహం. కాని ఆత్మనిగ్రహం అంతకంటెకూడ ఒక పరమపునీతధర్మం. మీ క్రోధాగ్నిని శాంతింపచేయండి. ఈరకంగా ప్రాణత్యాగానికై నడుములు బిగించి తయ్యారయ్యారా? ఐతే మాతృభూమిపట్ల మీ కర్తవ్యాలన్నీ పూర్తిగా నెరవేర్చివేశారా? చేతిలో దీపమున్నా నూతిలో కాలుజారి పడిపోటానికి కుతూహలపడుతున్నారా? వీళ్ళంతా ఎవరు? మీ స్వదేశ బాంధవులు; మీ ఇద్దరిదీ ఒకటే రక్తం వాళ్ళను శత్రువులుగా భావించడం కంటె గొప్పవైరితన మింకొకటిలేదు. వాళ్లు అజ్ఞానాంధకారంలో మునిగివుంటే ఆ అంధకారాన్ని దూరంచేయటం మీ పవిత్ర కర్తవ్యం, మిమ్మల్ని దుర్భాషలాడితే తిరిగి దుర్భాషలాడకండి, దాన్నొక చెడుగా తీసుకోకండి. మీతో కయ్యానికి కాలుదువ్వుతుంటే మీరు వినయంగా ప్రవర్తించండి. వివేకశూన్యరోగికి చికిత్సచేసే వైద్యుడులా తయారుకండి. ఇది

నా ఆజ్ఞ. తద్భిన్నంగా ప్రవర్తించినవాడు దేశానికి పరమ శత్రువు”

ఈ సముచిత వాక్యాలు వినడంతో నలువేపులా శాంతి ఆవరించింది. ఎక్కడవాడక్కడే గోడమీది బొమ్మలా వుండిపోయాడు. ఈ ఒక్క వ్యక్తి వాక్కుల్లో ఈ గారడి ఎక్కడినుంచివచ్చింది? యాభై వేలమందిని. ప్రళయకాల సాగరంగా ఉప్పొంగివస్తున్న ప్రజానీకాన్ని ఒక నిపుణసారథి, తన చంచల గుర్రాలను ఆపినట్టుగా ఆపుచేశాడు. ఈ శక్తి నెవ్వరిచ్చారు? మస్తకంపై రాజముకుటంలేదే. వెంట లక్షలాది సేనావాహినిలేదే. సైన్యాధ్యక్షుడూకాడే. ఈ ప్రభావానికంతకూ మూలం అతని నిస్వార్థ సేవావ్రతమే; దేశ శ్రేయస్సుకై అతనుచేసిన ఆత్మత్యాగమే. ఇదంతా స్వజాతి స్వదేశ సేవకుని గౌరవమర్యాదల పరిణామం. బాలాజీగారి దివ్యతేజో ప్రతాపాలు చూచారు కాశీ - ప్రయాగ పండాలంతా. కంఠస్వరం విన్నారు. క్రోధం చల్లారి పోయింది. సూర్యభగవానుని శుభాగమనంతో మసకలూ, తుషార బిందువులూ అన్నీ మాయమైపోతాయి. అదేవిధంగా బాలాజీగారి రాకతో వ్యతిరేకుల గుంపు చిందరవందరై పోయింది. ఉపద్రవోద్దేశ్యంతో వచ్చినవాళ్ళలో అనేకమంది శ్రద్ధాభక్తులతో బాలాజీ చరణ - కమలములపై శిరస్సులుంచారు. ఆయన శిష్యకోటిలో చేరిపోయారు పండాల మూర్ఖత్వాన్ని దురుపయోగ పర్చుకొని తన స్వార్థం సిద్ధింప చేసుకోవాలని కుడువరాని కూళ్ళన్నీ కుడిచాడు శాస్త్రుల్లు. కానిఅంతావ్యర్థం.

ఆ సమయంలో బాలాజీగారు ఒక గొప్ప ఉపన్యాసం ఇచ్చారు. దానిలో ప్రతిపదమూ నేటివరకూడ శ్రోతల

హృదయపటలంపై చెరిగిపోకుండా వుండిపోయింది. భారతీయులకు సర్వదా దీపంలా మార్గాన్ని దర్శింపచేస్తోంటుంది. ఆయన ఉపన్యాసాలు తరచు భావగర్భితములు. కాని ఈ ఉపన్యాస మొక్కటే ఒకఎత్తు, తతిమ్మావన్నీ ఒకఎత్తు. ఇందులోవున్న ప్రతిభ, ఓజస్సు మరి దేనిలోనూ లేదు. తన వాక్చాతుర్యంతో కొద్దినిమిషాల్లో బద్ధశత్రువులుగావుండే పండాలూ, గొల్లలూ అందరూ పరస్పరం ఆలింగనం చేసుకొనేటట్లుగా చేశాడు. ఆ ఉపన్యాసం చివరివాక్యాలు -

"మీరంతా దృఢచిత్తులై కార్యసాధనకై ముందుకు సాగిపొండు అభీష్టసిద్ధి యనెడి కనక - స్తంభం ఒకరోజున తప్పక దృష్టిగోచరమై తీరుతుంది. మధ్యలో ధైర్యసాహసాలు సడలిపోనీయకండి. దృఢత్వము నేదొక మహాశక్తి. దృఢత్వం మానవుని సమస్త గుణాలకూ రాజు. దృఢత్వమే శౌర్యప్రతాపాల ప్రధాన అవయవం. కాన అలాంటి దాన్నెన్నడూ సడలిపోనీయకండి. ఈ మధ్యలో ఎన్నో కష్టాలను గురిచేయపడ్తారు. ఎన్నో పరీక్షల్లో నెగ్గవలసివుంటుంది. అడుగడుగునా నిరాశ నిస్పృహా పిశాచాల్ని ఎదుర్కొవలసి వస్తుంది. అవి మీ మార్గంలో రాతిబండల్లా అడ్డమొస్తాయి. ఇలాంటి విషమ పరిస్థితుల్లో దృఢత్వమొక్కటే మీకు శరణ్యం. అదే విశ్వసనీయ మార్గదర్శకుడు. ఒకవేళ ఏకారణంచేతనన్నా దృఢత్వంవిఫలమైపోయినా ప్రపంచంలో నీవనేదైనా చిరస్థాయిచేసిపోతుంది."

శాలాజీ ఇంటికెళ్ళి వార్తాపత్రిక తెరచాడు. ముఖం తప్పిపోయింది. గుణాపూర్ణ భావంతో ఒక చల్లటి నిట్టూర్పు విడిచాడు. అదిచూచి ధర్మసింగ్ కంగారుపడ్తూ కుశలమేకదా? అని ప్రశ్నించాడు.

బాలా:- 'సదియా'లో ఏటిఆనకట్ట తెగిపోయింది. పదివేల మంది గృహ హీనులై పోయారు.

ధర్మ - ఆఁ! అలాగా!

బాలా:- వేలమంది జలప్రవాహంలోపడి కొట్టుకుపోయారు. పట్నమంతా నీళ్ళపై తేలుతోంది. ఇంటికప్పులపై నావలు తిరుగుతున్నాయి. భారతకాంగ్రెసు సభ్యులు సహాయార్థం చేరుకున్నారు. యథాశక్తి సహాయం చేస్తున్నారు. కాని వాళ్ల సంఖ్యచాలా తక్కువ.

ధర్మ:-(కన్నీరుకారుస్తూ) ఓ జగద్బాంధవా! నువ్వే ఈ అసహాయులకు సహాయకుడవు.

బాలా:-గోపాల - గోశాల కొట్టుకుపోయింది. ఒక వెయ్యి ఆవులు జలదేవతకు బలైపోయాయి. ఎడతెగకుండా మూడు గంటలు కుండపోతగా వర్షం కురిసింది. మొత్తం ముప్పై రెండు-దుక్కులవర్షం పడింది. పట్నం ఉత్తరప్రక్కన పట్న ప్రజలంతా చేరివున్నారు. ఉండటానికి ఇల్లూలేదు; తినటానికి తిండీలేదు. గుట్టలుగుట్టలుగా శవాలు పడివున్నాయి చాలా మంది ఆకలిదప్పులతో ప్రాణాలువిడస్తున్నారు. ప్రజల ఆర్త నాదాలూ, కరుణాక్రందనాలూ చూస్తే గుండె చెరువై పోతోంది. వరదబాధితులంతా 'బాలాజీని పిలుచుకురండి బాలాజీని పిలుచుకురండి' అని చాతకపక్షిలా గోలచేస్తు న్నారు. నా రాక తమ కష్టాలు పోగొడ్తాయని వాళ్లకొ గ్రుడ్డినమ్మకం."

కొంచెంసేపు ధ్యాన నిమగ్నుడై కూర్చు తర్వాత "నేను వెంటనే బయలుదేరిపోవాలి. నేను మొంతో అవసరం. ఈ కార్యంలో తోడ్పడవలసిందిగా

యాలోని భారతకాంగ్రెసు సభ్యులకు టెలిగ్రాం ఇవ్వండి" అన్నాడు.

"శెలవిస్తే నాకూ రావాలనివుంది" అన్నాడు వినయంగా రాజా ధర్మసింగ్.

బాలా:- నే వెళ్ళినతర్వాత కబురుచేస్తా. మీ రిప్పుడప్పుడే రావలసిన అవసరమంతగా లేదనుకుంటా.

ధర్మ:- ప్రొద్దున్నే ప్రయాణమవడం మంచిది.

బాలా:- లేదులేదు. ఒక్క క్షణంకూడ ఆలస్యం చేయటానికి వీల్లేదు. అక్కడికి చేరుకునేటప్పటికి చాలా రోజులు పడ్తాయి.

కన్నుమూసి కన్ను తెరచినంతలో ఈ వార్తలు పట్నమంతా ప్రాకిపోయాయి. తెలియగానే వేలమంది బాలాజీగార్కి వీడ్కోలివ్వటానికి బయలుదేరారు; తొమ్మిదయ్యేటప్పటికల్లా పాతిక వేలమంది వచ్చి పోగయ్యారు. ఎవ్వరినోట చూచినా 'సదియా' వరదలవార్తలే. ఎవ్వణ్ణి చూడబోయినా ఆ వరద బాధితులపట్ల సానుభూతి వెల్లడించేవాడే. వందలమంది బాలాజీగారితో వెళ్ళటానికి నడుములుబిగించారు. 'సదియా' ప్రజల సహాయార్థం ఒకఫండు స్థాపించాలని గుసగుసలు జరుగుతున్నాయి.

అక్కడ ధర్మసింగుగారి గృహంలో మరోదృశ్యం కానంది. సుహాసుకు అభివందనాలు తెలియచేసే నిమిత్తం స్త్రీలంతా కలిసి ఒక సభ ఏర్పాటుచేశారు ఆ విశాల [illegible]ంతా నారీమణులతో క్రిక్కి రిసివుంది. కొంతమందితో [illegible] మొదట వ్రజరాణి ఒక మనోహర మంగళగీతం పాడింది. తర్వాత స్త్రీలంతా గోలాకారంగా చేరి పాడుకుంటూ, వాయించుకుంటూ హారతి పళ్ళేలతో సుహాస

గృహాని కెళ్ళారు. అతిథి సత్కారాలకై వేచికూర్చొనివున్నారు చంద్రా - సేవతీలు. ప్రతిమహిళను ప్రేమతో కౌగిలించుకుంది సువామ. వారికీ తనలాంటి పుత్రరత్నమే కల్గుగాక యని ఆశీర్వదించింది. అనంతరం రాణీ మంగళహారతిచ్చింది. దాంతో పాటలు ప్రారంభమయ్యాయి. ఇవ్వాళ మాధవి వదనం పుష్పంలా వికసించివుంది. నిన్నటిమాదిరిగా వాడి-ఎండి లేదు. ఆశలనేవి విషంపూటలు. ఆ ఆశలే నిన్న కన్నీరు చిందింప చేశాయి. కాని ఇవ్వాళ ఆమె మనస్సు ఆశాశూన్యమై పోయింది. అంచేతనే ముఖమండలంలో దివ్యజ్యోతి వెలుగొందుతుంటే నేత్రాల్లో వికాస - కాంతులు తొణికసలాడుతున్నాయి. నిరాశాప్రహారానికి గురియై జీవితమంతా గడిపింది. కాని ఆశాన్వితమైన తర్వాత ఒక్కరోజు దుఃఖంకూడ సహించలేకపోతోంది.

మధురమధుర రాగాలాపాలతో ప్రాసాదం ప్రతిధ్వనించింది. ఇంతలో 'సదియా' వార్త ఇక్కడికీ చేరింది "మీరంతా బాలాజీ గార్కి వీడ్కోలివ్వటానికి సిద్ధంకండి. వారీక్షణమే సదియాకు వెళ్ళబోతున్నారు." అని ధర్మసింగ్ అంటున్నట్లుగా వినపడింది.

ఈ పిడుగువంటి వార్త వినిపించగానే ప్రాసాదమంతా నిశీథనీరవతలో ఆవరించింది. కంగారుగా లేచి గుమ్మంవేపుకు అంగలార్చింది సువామ బాలాజీని ఆపుచేస్తుందా అన్నట్లు. తతిమ్మావాళ్లూ ఆమెను అనుసరించారు. "పిన్నీ! వారిని జబర్దస్తీగా సాగనంపుతారా ఏమిటి? ఆయనింకా గదిలోనే వున్నారుగా." అంది వ్రజరాణి.

"వాడి నసలు వెళ్ళనే వెళ్ళనీయను. సాగనంపేమాట దేవుడెరుగు." అంది సువామ.

వెళ్ళటం అత్యంత అవసరం.

సువా.- ...కుగానూ, అక్కడికెళ్ళితే నాకేం ఒరిగింది. నేనూ ఏమన్నా మనిషినంటారా లేదా? వాడిమీద నాకూ కాస్త అధికారం వుందంటారా లేదా?

వ్రజ:-నాతోడు, ఈ సమయంలో ఇలా అనకండి. ఆయన మీదనే ఆశలన్నీ పెట్టుకుని కొనవూపిరితో ఎదురు చూస్తున్నారు వేలాది ప్రజలు. వెళ్ళకపోతే ప్రళయమైపోతుంది.

మాతృ మమకార పాదాల క్రింద అణగిపోయాయి; మానవత్వ జాతీయతలు. కాని నచ్చచెప్పి ఆపుచేసింది వ్రజ రాణి. ఈ ఘటన జ్ఞప్తికొచ్చినప్పుడల్లా పశ్చాత్తాప పడుతుండేది సువాము. అంత ఒళ్ళు తెలియని కోపం ఎలావచ్చిందా అని ఆశ్చర్య పడుతుండేది. "విరజన్! బాలాజీకి పూలదండ ఎవ్వరు వేస్తారు?" అని ప్రశ్నించింది రాణి.

విర:-మీరే

రాణి:-మరి మీరో?

విర:-బొట్టుపెడ్తా.

రాణి:- మాధవి ఎక్కడ?

విర:- (నెమ్మదిగా) దానిజోలికి పోకండి. పాపం తనధ్యానసలో మునిగివుంది.

ఇంతలో బాలాజీ బైటికొచ్చాడు. స్త్రీలంతా అటు ... బాలాజీ తల్లి చరణాలు స్పర్శించి కళ్ళకద్దుకొన్నాడు. ...ని కౌగిలించుకుంది. ఏదో చెప్పాలనుకుంది. ...ంతో నోరురాలేదు. పూదండతీసుకుని బయలు ...కాళ్ళు తొట్రుపడిపోయాయి గంధంగిన్నె ...రాణి. కాని నేత్రాలు శ్రావణ

మానసమేఘంలా వర్షించాయి. తర్వాత వ
దేరింది. నేత్రాల్లో ప్రేమ ఆభాసిస్తోంది. ...గానం
దంలో ఓలలాడుతోంది. అపారప్రేమపూర్ణదృష్టితో ఒక్క
సారి బాలాజీకేసి చూచింది. తర్వాత తలవంచుకుని పుష్ప
హారం మెడలోవేసింది. ముఖారవిందానికి గంధం బొట్టు
పెట్టింది. ఇంతవరకు లోకసంస్కారవిధి ఒక్కటే కొరతగా
వుంది. ఇప్పుడదీ పూర్తయింది. బాలాజీ గంభీరంగా నిట్టూ
ర్చాడు. అగాధ ప్రేమ - సాగరంలో కొట్టుకుపోతున్నాడు.
ధైర్యం అనే లంగరు పెళ్ళగించుకుపోతోంది. హఠాత్తుగా
నదిలో కాలుజారినవ్యక్తిలా మాధవిపాణి పట్టుకున్నాడు.
కాని ఏ గరికపోచను ఆధారంగాచేసుకుని పట్టుకున్నాడో
స్వయంగా అదే ప్రేమ - ప్రవాహంలోపడి వేగంగా
కొట్టుకుపోతోంది. ఆయనహస్తస్పర్శతగలగానే మాధవి ఒళ్లు
జలదరించింది. రోమరోమంలో ఏదో విద్యుత్ లా ప్రసరించింది.
దేహమంతా స్వేద - కణాలు మెరవసాగాయి. గాలిఃసుర్లకు
పుష్పదళస్థిత తుషారబిందువులు చిందిభూదేవినలంకరించు
తుంటాయి. అదేవిధంగా మాధవీదేవి నేత్రాలనుండి
అశ్రుబిందువులు బాలాజీ హస్తంపై పడ్డాయి. ప్రేమోన్మత్త
నేత్రాలు స్వామీజీకి సమర్పించిన ప్రేమ - ముత్యాలు ఇవి.
నేత్రాలకూ - అశ్రువులకూ ఇంతటితోసరి.

ఆకాశమంతా చుక్కలు మెరుస్తున్నాయి. వాటి
కూర్చున్న లలనామణులు ఈ దృశ్యమంతా
న్నారు. ఇవ్వాళ ప్రాతఃకాలం ఆయన స్వాగతార్థ
జయమంగళం బాలాజీ; శుభమంగళం త
అని పాడారు. మళ్లీ ఇప్పుడు కోకిల

"మంగళం, జయమంగళం బాలాజీ
శుభమంగళం తవగమనం బాలాజీ" అని

బాలాజీగారి శుభాగమనమూ, మంగళదాయకమే. శుభ గమనమూ మంగళదాయకమే. శుభాగమన సమయంలోనూ ప్రజల నేత్రాలు అశ్రుబిందువులు చిందించాయి; మళ్లీ ఇప్పుడు శుభగమన సమయంలోనూ చిందించుతున్నాయి. నిన్న నవాగత అభ్యాగతుని స్వాగతార్థం చిందాయి. ఇవ్వాళ వీడ్కోలు వివ్వటానికి చిందుతున్నాయి. వాటిగంగ-రూపాల్లో మాత్రం తేడా ఏమీలేదు. కాని ఆ రెంటి గూఢార్థంలో ఎంత తేడావుందో!

# 26

మొదటినుంచీ వాడిపోయిన మొగ్గయే మాధవి. నిరాశ ఆమెను బుగ్గిపాలు చేసింది. ఇరవై సంవత్సరాల తపస్వినీ నేడు యోగినిగా మారిపోయింది. పాపం ఆమె జీవితము ఏంజీవితం! మనస్సులో అభిలాషలేవీ ఉద్భవించ నేలేదని చెప్పాలి ఒక వేళ ఉద్భవించినా వాటిని వికసించ నీయలేదుదురదృష్టం. ఆమె ప్రేమ ఒక అపారసముద్రం. దానిలో ఎలాంటి ప్రళయ కారీ ఆటుపోట్లు వచ్చాయంటే జీవితాభిలాషలన్నీ అడుగంటి పోయాయి. యోగినీ వేషం ధరించింది. ప్రాపంచిక బంధనాల నుండి విముక్తిపొందింది. ప్రపంచమనేది ఈఅభిలాషలకు, ఈ ఆశలకే మారుపేరు. వాటిని నైరాశ్య సాగరంలో ప్రవహింప చేసినవ్యక్తిని ప్రపంచంలో ఒకమానవునిగా భావించడంభ్రమ.

ఈ ప్రేమోన్మాదంలో ఈ ఉన్మత్తయోగినికి ఒక్క చోటవుంటే శాంతిగా వుండేదికాదు. పుష్పసౌరభంలా దేశ దేశాలా, వాడవాడలా భ్రమణం చేస్తోంటుంది. ప్రేమ - సం

దేశం వినిపిస్తూ తిరుగుతోంటుంది ఆమె స్వర్ణవర్ణంపై కాషాయరంగుచీర అత్యంత రామణీయకంగా వుంది ఈ ప్రేమ విగ్రహాన్ని చూచి ప్రజల నేత్రాలు జలబిందువులు చిందించుతు దేవి వీణమీద పాట ప్రారంభిస్తే శ్రోతృబృందం చిత్తా అనురాగ మయమై పోయేది. ప్రతిపదములోనూ ప్రేమరసం ఉట్టిపడుతుండేది.

ఉన్మత్తయోగినికి బాలాజీగారి పేరంటే అమితప్రేమ. తన గేయాల్లో తరచు ఆయనకీర్తినే కీర్తించుతుండేది. ఏనాడు యోగినీ వేషం ధరించిందో, ఏనాడు లోక లజ్జను పరిత్యజించిందో, ఆ రోజునుంచీ శారదాంబ స్వయంగావచ్చి జిహ్వాగ్రంపై నివాసంచేస్తున్నదా అన్నట్లుగా వుండేది. ఆమె సరస గేయాల శృంగారం వందలమైళ్ళనుంచికూడ ప్రజలు వస్తూండేవాళ్ళు - మురళీనాదం విని గోపికలు ఇళ్లువదలి పోయిన చందంగానే ఈ యోగినీ కంఠస్వరం వినిపించగానే శ్రోతల నదీ ప్రవాహం ఉప్పొంగివచ్చేది. ఆమె గేయాలు వినటం అంటే ఆనందరసం త్రాగట మన్నమాట.

ఈ యోగినీ ఏడుస్తోండగా గానీ, నవ్వుతుండగాగాని ఎవ్వరూచూడలేదు. ఏ విషయంలోనూ హర్ష - విషాదాలు లేవు. మరి అభిలాషా శూన్యహృదయానికి ఏడ్పులతో నవ్వులతో పనేముంది? ఆమె ఆనంద మూర్తి. దానిపై దృష్టి పడటంతోనే ప్రేక్షకుల నేత్రాలు పావన-ఆనంద రసమయమై పోతుండేవి.

సమాప్తం.

